ఆర్యభారతీ గ్రంథమాలిక — 3-వ కుసుమము.

# రాజశేఖరకవి కావ్యమీమాంస

(సాహిత్య విమర్శక గ్రంథము.)

---

అనువాదకులు

బ్ర॥ శ్రీ॥ కావ్యవ్యాకరణతీర్థులు

కంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు.

---

ప్రకాశకులు

ఆర్యభారతీ గ్రంథమాలికాధిపతులు

పరశువాకం, మద్రాసు.

---

వెల రూ 3-0-0

ఆర్యభారతి చందాదారులకును పండితులకు విద్యార్థులకు తగ్గింపు ధర రూ. 1-8-0.

సర్వస్వాతంత్ర్యములు ప్రకాశకులవి

1930-వ సం॥ ఏప్రిల్ 30-వ తేది.

---

ప్రింటర్సు:—ఆర్యభారతి ప్రెస్సు

నెం. 11 ఆరణిరంగప్ప వీధి, చాకలిపేట, మద్రాసు

ఆర్యభారతీ గ్రంథమాలిక—రాజపోషకులు:—

1. శ్రీ రాజా నాయని వేంకటరంగారావు బహద్దరు ధొరవారు.
మునగాల జమీందారులు. మునగాల ఎస్టేటు నైజాం.

2. శ్రీ విశ్వదాత కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుంగారు.
ఆంధ్రపత్రికాధిపతులు, చెన్నపురి.

3. శ్రీ బుర్రా సత్యనారాయణపంతులుగారు బి.ఏ., బి.యల్,
హైకోర్టువకీలు, మద్రాసు.

4. బ్రహ్మశ్రీ వావిళ్ల వేంకటేశ్వర శాస్త్రులుగారు,
శ్రోత్రియందార్లు, వావిళ్ల ముద్రణాలయాధికారులు, మద్రాసు.

5. శ్రీ ఘల్లెల చినవేంకటరమణయ్యపంతులుగారు. బి,ఏ., బి,యల్.
హైకోర్టువకీలు మైలాపూర్, మద్రాసు.

6 డాక్టర్ కే. యన్. కేసరి గారు.
ప్రొప్రైటరులు, కేసరికుటీరము, ఎగ్మూరు మద్రాసు.

7. ఇజ్జత్ సార్ శ్రీరాజా కందుకూరి శ్రీబాలసూర్యప్రసాదరావుగారు.
దేవిడివగైరా జమీందార్లు, విశాఖపట్నము.

8. బెల్లంకొండ రాఘవరావు గారు.
పమిడిపాడు, (గుంటూరుజిల్లా.)

పోషకులు—సహాయకులు:—

[illegible]లు గారు.
ముక్తీశ్వరం (గోదావరిజిల్లా.)

# కృతిసమర్పణము.

---

గీ. ఆదరం బున్న లేకున్న నాత్మశక్తి
నాంధ్ర దేవికిఁ గలయంత నర్పణంబు
సేయ నూఁగాఁడు నన్నలు చిన్నలకును
అంకితం బిత్తు నిద్దాని నాదరమున. ౧

గీ. తప్పులో యొప్పులో తన తరముకొలఁది
చేసినాఁ డింతమాత్రంపు సేవ నంచు
వత్సలత్వాన నెంతయో వఱలుతల్లి!
చేకొనఁ గ దమ్మ దీనిని చిత్తగించి. ౨

గీ. గుణము లిం దేవి యేనన్నఁ గొనుఁడు రాజ
శేఖరుని వంచు బుధులార! చిత్తములను
దోషరాశిని నాతలఁ ద్రోసివేయుఁ
డంచు వేఁడెద మి మ్మెప్డు నన్నలార! ౩

గీ. చేతఁగా నట్టిపనులకుఁ జెలఁగు టేల?
యుండు, లోకకొంద అన్నలు నార్యమతులు,
కార్య నిర్వాహకులుగ వార్ గడఁగువఱకు
చేయుచుందును; ఆపైనిఁ జేయ రాను. ౪

గీ. సారసారస్వతపు వీథి జాతిభేద
లింగభేదాల కింతేని లేదు చోటు,
ఎవ రిఁ కేపాటి శక్తులఁ నెసఁగుచుంద్రో
వారు వా రట్టిసేవల వఱలవలయు. ౫

# సంపాదకుని విజ్ఞప్తి

చదువరుల సన్నిధానమునకుఁ గొనివచ్చుచున్న మా యీ ఆర్యభారతీ గ్రంథమాలికయొక్క మూఁడవ కుసుమమగు నీగ్రంథము రాజశేఖరమహాకవి సంస్కృతమున రచించిన కావ్యమీమాంస యనెడి సాహిత్యవిషయక మగు విమర్శనగ్రంథము. దీనికి ఆంధ్రవివరణము చేయించి ప్రస్తుత మీ రూపమునఁ బ్రకటించుచున్నారము.

సంస్కృతగ్రంథకర్త యగు రాజశేఖర మహాకవి మిక్కిలి విఖ్యాతిఁగాంచినవాఁడు. బాలరామాయణాదులగు పెక్కులు దృశ్యశ్రవ్య గ్రంథముల నీమహాకవి రచించెను. రాజశేఖర మహాకవియొక్క గ్రంథములను గుఱించియును కాలనిర్ణయాదులను గుఱించియును నిందు గ్రంథాంతమునఁ జేర్చిన పీఠికయందు వివరించియున్నాము. చదువరు లద్దానిని జిత్తగించినచో సర్వము విశదము కాఁగలదు.

ఆంధ్రదేశమునందు గ్రంథమాలిక లనేకము గలవు. అందు కొన్ని ఈవఱకే అంతరించినవి. మిగిలినవియు గ్రొత్తగాఁ బుట్టుచున్నవియును నవలలు నాటకములు మున్నగువానినిగాని, రాజకీయ సాంఘికములకు సంబంధించిన పాశ్చాత్యభాషా గ్రంథములనుగాని, అనువదించి

## సంపాదకుని విజ్ఞప్తి.

ప్రకటించుచున్నవే కాని, అనాదినుండి అనుశ్రుతముగా వచ్చుచున్న ఆర్య విజ్ఞానమహితము లగు వాఙ్మయము సాంఘిక రాజకీయాదు లగు గ్రంథము లనవి ప్రకటించుట లేదు.

మా గ్రంథమాలికయును అనువాదగ్రంథములను ప్రకటించుదానిలోనే చేరఁగలదు. కాని ఆర్యవాఙ్మయమునండి సుప్రసిద్ధము లగు శాస్త్రీయగ్రంథములను మాత్రమే ప్రకటింపఁ దలపెట్టినది. ఇది సముచితముగాఁ దోఁచినచో నాంధ్రవాఙ్మయాభివృద్ధిఁ గోరు శ్రీమంతు లెల్లరును మాకు చేయూఁత నీయఁగోరుచున్నాము. ఈ రాజశేఖరుని కావ్యమీమాంసను బరోడా సంస్థానమువారు తొట్టతొలిసారి ముద్రించినారు. నేటికాలపు ఆంధ్రకవులు ఆంధ్ర గ్రంథకర్తలు భాషా పారిశ్రామికులు చరిత్రజ్ఞులు గమనింపఁదగిన విశేషము లనంతముగా నిండుండుటచే దీనిఁ బరివర్తించి ముద్రించినాము. కావున మా పరిశ్రమను సార్థకకుచు భారము పైవారి దని మనవి. తక్కినవివరములు చదువరులు స్వయముగానే గుర్తింపఁ గలరు; గనుక విజ్ఞప్తి నింతతో విరమించెదము.

ఏప్రెలు 30, 1930.
మద్రాసు.
పరశువాకము.

సంపాదకుఁడు
ఆర్యభారతీ గ్రంథమాలిక.
మద్రాసు.

దేహి ? సారస్వతభిక్షు ! పెట్టుఁడు !

## ఆంధ్రభాషాభిమానులకు విజ్ఞప్తి.

ఆర్యులారా !—వందనములు.

తగినంతటి శక్తి సామర్థ్యములును, వలసినంత ధనసహాయతయును లేక మా యీగ్రంథమాలిక త్వరత్వరగా ఉద్దిష్టము లగు కార్యములను నెరవేర్పఁజాలక యున్నది. ఉదారహృదయులగు తాము సహాయక పోషక రాజపోషకులుగా నే యొక్కరుగా నైనను లేదా చిట్టచివరకు చందాదారులుగా నైనను చేరి, తమ మిత్రులను అట్లే చేర్పించి మాప్రయత్నమునకుఁ తోడ్పడుఁడు. 500 మంది చందాదారులు ఉన్నచో, ఇంకను త్వరత్వరగ చౌకఁగ మాగ్రంథమాలిక గ్రంథములను ప్రకటింపఁగలదు.

ఉదారహృదయులును ఆంధ్రభాషాభివృద్ధిని గోరువారు నగు తాము ఈపాటిసాయమును చేయఁజాలరా?

పురుషవాకం, మద్రాసు. } విధేయుఁడు, పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి.

# రాజశేఖరుని కావ్యమీమాంస

# విషయసూచిక.

---

## ప్రథమాధ్యాయము.

### శాస్త్రసంగ్రహము. పేజి 1 మొదలు 7 వఱకు.

౧. శ్రీకంఠుఁడు పరమేష్ఠి వైకుంఠుఁడు మున్నగు అరువది నల్వురు శిష్యులకును కావ్యశాస్త్రోపదేశమును చేయుట, ౨. కావ్య విద్యాస్నాతకులగు సహస్రాక్షుఁడు మున్నగు దివ్యులకు కావ్యవిద్య యొక్క అష్టాదశాధికరణములను ప్రవచించుట. 3. వారు వేర్వేరుగాఁ దమతమ శాస్త్రముల రచించుట. ౪. అయ్యవి ప్రకీర్ణములు అగుటవలనను విచ్ఛిన్నతి నొందుటవలనను, ఈ గ్రంథకర్త వానిని సంగ్రహించి ప్రకృతము కావ్యమీమాంస యను నీగ్రంథమునుగా రచించుట. ౫. ఈ కావ్యమీమాంసయందలి యధ్యాయాదులను నిర్దేశించుట—మొదలగునవి.

## ద్వితీయాధ్యాయము.

### శాస్త్రనిర్దేశము. పేజి 8 మొదలు 25 వఱకు.

౧. శాస్త్రము కావ్యము ననెడి వాఙ్మయద్వైవిధ్యము. ౨. శాస్త్రములఁ బరిసంఖ్యానము చేయుట. 3 వానిలక్షణము. ౪ సూత్రాదులరూపమున వీనిని రచించుట, ౫. వృత్తియని, పద్ధతియని, భాష్యమని, సమీక్షయని, టీకయని, పంజికయని, కారికయని, వార్తికమని చెప్పంబడెడి శాస్త్రముల లక్షణములు. ౬. వానిలోని భేదములు,

౭. వాని నిర్వచనములు ౮. సాహిత్యవిద్యా నిర్వచనములు— మున్నగునవి.

## తృతీయాధ్యాయము.

### కావ్యపురుషోత్పత్తి-పేజి 26 మొదలు 44 వఱకు.

౧. సరస్వతికిఁ గల్గిన పుత్రేచ్ఛ. ౨. బ్రహ్మ వరము లిచ్చుట. ౩. సరస్వతికి కావ్యపురుషుం డుదయించుట. ౪. ఆతని ఛందస్సాద్యా గుచ్చారణము. ౫. కావ్యపురుష వర్ణనాదులు. ౬. శుక్రవాల్మీకులకు ఛందస్సాద్వాక్యమాల నుపదేశించుట. ౭. బ్రహ్మలోకమునకు వెళ్లుచు, సరస్వతి కావ్యపురుషుని నివర్తింపంజేయుటకై తద్వశీకరణమునకుఁగాను, సాహిత్యవధువును సృజించుట. ౮. కావ్యవిద్యాస్నాతకులను తత్పరితప్తవనమునకై ఆజ్ఞాపించుట. ౯. వారు ప్రాచ్యాదిదిక్కులలో సంచరింపఁగా పాంచాలాది రీతు లుత్పత్తి యగుట, ౧౦. విదర్భదేశములోని వత్సగుల్మగ్రామమున వా రిర్వురు (అనఁగా సాహిత్యవధూ కావ్యపురుషులు) పాణిగ్రహణము చేసికొనుట. ౧౧. హిమవంతమునకు పోవుట. ౧౨. గౌరీ సరస్వతుల కటఁ బ్రణమిల్లుట. ౧౩. వారు ఆవధూవరుల నాశీర్వదించి వరముల నొసంగుట. ౧౪. కవి లోక స్వర్గ నిర్మాణము. మొదలగునవి.

## చతుర్థాధ్యాయము.

### పదవాక్యవివేకము-పేజి 45 మొదలు 64 వఱకు.

౧. శాస్త్రము చే ననుశాసింపఁదగిన శిష్యులలోని భేదములు ౨. అందు దన్యర్థాబుద్ధి తక్కువ రకమువాఁ డనుట. ౩. సమాధి అభ్యాస యోగము లగు వాని వివరములు. ౪. దానివలన శక్తివికాసము గల్గునట. ౫. ప్రతిభా వ్యుత్పత్తి కర్మలు శక్తి కర్తృకము లనుట. ౬. ప్రతిభను నిర్వచించుట, ౭. ప్రతిభలోగలఁ భేదములు. ౮. అందు

కారయిత్రి అను ప్రతిభ సహజాదిభేదములచే ముత్తెఱఁగు లగుట, ౯. దానికి వ్యుత్పత్త్యాదుల వివరించుట. ౧౦. తదనుసారముగా కవులలోను ముత్తెఱఁగు లేర్పడుట. ౧౧. ముత్తెఱఁగులగు నాకవులకు పేర్లుపెట్టుట. ౧౨. వారిలక్షణములు. ౧౩. భావయిత్రీ ప్రతిభను నిర్వచించుట. ౧౪. భావకత్వము కవిత్వము-ను నివి వేర్వేఱు శక్తులనుట. ౧౫. భావకత్వముగల కవులలోఁ గల (అనఁగా భావకులలో) నాల్గుభేదముల నిర్వచించుట. ౧౬. తల్లక్షణములు ౧౭. అందభినివేశులు తఱచుగా నుందురనుట. ౧౮. భావకునిఁ గూర్చిన ప్రాచీనుల మతములఁ దెల్పు సంగ్రహ శ్లోకములు. మున్నగునవి.

## పంచమాధ్యాయము.

కావ్యపాకకల్పము-పేజి 65 మొదలు 84 వఱకు,

౧. వ్యుత్పత్తిప్రతిభల వ్యుత్పత్తులు ౨. అందలి మతభేదములు, చర్చలు. 3. శాస్త్రకవ్యాది కవిభేదములు. ౪. అందుఁగల ఎక్కువ తక్కువలఁగూర్చిన భిన్నాభిప్రాయములు. ౫. వారిస్వరూపస్వభావాదులు. ౬. కావ్యకవులలోఁ గల యెన్మిదిభేదములు. ౭. వాని వివరములు. ౮. రచనాకవి. ౯. అలంకారకవి నిరూపణము. ౧౦. ఉక్తికవులు మున్నగు వానియుదాహరణములు. ౧౧. కవుల దశావస్థలు. ౧౨. తల్లక్షణములు. ౧౩. పాకలక్షణములు. ౧౪. నవవిధపాకము లను నిరూపించుట. ౧౫. కపిత్థపాక నిర్వచనము—ఇత్యాదులు.

## షష్ఠాధ్యాయము.

పదవాక్యవివేకము-పేజి 85 మొదలు 10[illegible] వఱకు.

౧. పదముయొక్క అర్థనిర్వచనము. ౨. పదవృత్తులు. 3. సుబ్ధాతుసమాసకృత్తద్ధితవృత్తులు అనెడి పంచవృత్తులు. ౪. పదజాతము నందలి యనంతత్వము. ౫. వాక్యముయొక్క అర్థనిర్వచనము. ౬.

అందుఁగల ముత్తెఱఁగు లగు అభిధావ్యాపారములు. ౭. వానిపేరులు. ౮. తన్నిర్వచనములు నుదాహరణములు. ౯. ఏకాఖ్యాతాదివాక్యభేదములు పదునొకండింటిని నిరూపించుట. ౧౦. కావ్యస్వరూపనిరూపణము. ౧౧. కావ్యము అసదుపదేశకము గనుక నుపదేశింపరా దను వారి వాదములు. ౧౨. అందులకు కారణములు. ౧౩. తత్ఖండనము. ౧౪. అసత్యార్థము నుపదేశింపరా దనువారి వాదములు. ౧౪. అందులకు కారణములు. ౧౫. దానిఖండనము. ౧౬. అసభ్యార్థము నుపదేశింపరా దనువారి వాదములు. ౧౭. అందులకు కారణములు. ౧౮. అద్దానిఖండనము. ౧౯. శ్రుతులయందు నిట్టివి గలవని రూపించుట. ౨౦. శాస్త్రములయందును ఇట్టివి యున్నవని సమర్థించుట. ౨౧. కనుక కావ్యము లుపాదేయములే యని సిద్ధాంతీకరించుట—ఇత్యాదులు.

## సప్తమాధ్యాయము.

### పాత్రప్రతిష్ఠ-పేజి 106 మొదలు 131 వఱకు.

౧. పురాణాదిమతముల ననుసరించి, ప్రణేతృభేదమున నైన వాక్యభేదములు, ౨. స్వాయంభువాదివాక్యములు. వానియర్థములు. ౩. సారస్వతకవిమతానుసారమున పారమేశ్వరవచో నిరూపణము. ౪. దానికే దివ్యత్వాదులగు వ్యపదేశములు. ౫. అందుఁగల వైబుధాదిభేదములు, వానియుదాహరణములు. ౬. వైష్ణవవాక్యమునకు మానుషత్వాదివ్యపదేశములు. ౭. అందు రీత్యనుసారమున నేర్పడిన భేదములు. ౮. కాకువక్రోక్తులవిషయమునం జేసిన రుద్రటమతఖండనము. ౯. కాకునిరూపణము, తద్భేదములు, తదుదాహరణములు. ౧౦. కాకుపాఠప్రతిష్ఠాభేదనిరూపణములను గుఱించిన సంగ్రహశ్లోకములు. ౧౧. మగధాదులగు దేశములలోని కవుల పాఠప్రతిష్ఠను గుఱించినట్టి విషయములఁ దెలుపు ప్రాచీనుల సంగ్రహశ్లోకములు—ఇత్యాదులు.

## అష్టమాధ్యాయము.

### కావ్యార్థయోనులు - పేజి 132 మొదలు 164 వఱకు.

౧. కావ్యార్థయోను లగు పదునారువిధము లగు శ్రుతిస్మృత్యాది మూలవిద్యలు. ౨. తన్మూలకము లగు శ్రౌత స్మార్త ఐతిహాసిక పౌరాణిక మైమాంసిక సాంఖ్యీయ న్యాయ వైశేషికీయ బౌద్ధీయ లౌకాయతిక ఆర్హత శైవసిద్ధాంతీయ పాంచరాత్ర బౌద్ధసిద్ధాంతీయ నాట్యశాస్త్రీయ కామసూత్రీయ లౌకిక రచనావిషయక హస్తిశిక్షీయ రత్న పరీక్షీయ యోగశాస్త్రీయము లగు, ఉచిత, యోక్తృసంయోగ; ఉత్పాద్య వికారసంయోగ ప్రభృతు లగు కావ్యార్థయోనుల కుదాహరణములు మున్నగునవి.

## నవమాధ్యాయము.

### అర్థవ్యాప్తి - పేజి 165 మొదలు 186 వఱకు.

౧. దివ్యమానుషాదులగు నేడువిధము లగు అర్థములు. ౨. వాని భేదములు, ఉదాహరణములు. ౩. మర్త్యపాతాళీయా ద్యుదాహరణములు. ౪. సరిత్సాగరాది వర్ణన రసవత్తలు, వాని ఉదాహరణములు. ౫. వస్తు స్వరూపవిచారణ. ౬. అందలి భేదములు. ౭. వాని కుదాహరణములు. ౮. సర్వభావములలోను అవధానము ముఖ్యమై యుండుట. మొ.

## దశమాధ్యాయము.

### కవిచర్య రాజచర్య - పేజి 187 మొదలు 207 వఱకు.

౧. నామపారాయణము ధాతుపారాయణము మున్నగాగల కావ్యవిద్యలయును, కావ్యమాతృకలయును పరిగణనము ౨. ఔచిత్యము శీలనము కవికి ఆవశ్యకము అని చెప్పుట, ౩. కవినివసించు గృహము, అతని పరిచారికా పరిచారకాదులు, మిత్రులు, నిపుణులగు లేఖ

కులు మున్నగువాని స్వరూపస్వభావస్థిత్యాదులను వర్ణించుట. ౪. కవియగువాని యింటియం దుండఁదగిన భాషానియమములు. ౫. శిశునాగుఁడు, కువిందుఁడు, శాతవాహనుఁడు, సాహసాంకుఁడు, మున్నుగాఁగల ప్రాచీనులగు రాజులు తమతమ భవనములం దేర్పఱచికొనిన భాషానియమములు వివరించుట, ౬. కవియొక్క అహోరాత్రికమగు (అనఁగా పగలు రాత్రులు చేయఁదగిన) కృత్యము వివివరించుట. ౭. కవులలోఁ గల అసూర్యంపశ్యాది భేదముల పరిగణనము. ౮. వానిలక్షణములు. ౯, అందులకు నుదాహరణములం జూపుట. ౧౦. పురుషులవలెనే స్త్రీలును కవులుగాఁ గాఁగల్గుట. ౧౧. సంసిద్ధమైన కావ్యమునకు అనేకములగు ఆదర్శములను (నకళ్లు-లేక ప్రతులు_కాపీలు)సిద్ధముచేయవలసి యుండుటలు. ౧౨ ప్రస్తావసందర్భమున కవుల కావ్యములు పఠించుటకుంగల కారణములు. ౧3. రాజులయొక్క కవిసమాజములను వర్ణించుట. ౧౪. కావ్యశాస్త్రపరీక్షణములు. ౧౫. అందులకై మహానగరములందు బ్రహ్మసభలు మొ॥ చేయించుట మున్నగు సంమాన ప్రయత్నములు, ౧౬. అందు బ్రహ్మరథాది సత్కారములు, మొదలగునవి.

## ఏకాదశాధ్యాయము.

### శబ్దహరణము—పేజి 208 మొదలు 221 వఱకు.

౧. పద పాదార్థవృత్త ప్రబంధాదుల నగు అర్థహరణములు. ౨. శ్లిష్టయమకహరణములు. తద్భేదములు. 3. శబ్దహరణవిషయమున అవంతిసుందరి యభిప్రాయములు. ౪. మూఁడు పదములకు పైఁబడిన పదముల హరించుట హరణ మగునా? కాదా? యన్న చర్చ. ౫. అందలిసిద్ధాంతములు. ౬. అందుఁగల వ్యవస్థలు. ౭, స్వీకరణము హరణము అనువాని లక్షణములు. ౮ మూల్య క్రయాదులచేఁగూడ హరణములే యను సిద్ధాంతములు. ౯. దొంగిలింపని కవియే లేఁ డనుట.

౧౦. హరణము చేసినను చౌర్యము కానివిధము. ౧౧. తదనుసారకముగా ఉత్పాదకాదికవిభేదములు. ౧౨. మహాకవి లక్షణములు. ౧౩. తదుదాహరణములు—మున్నగునవి.

## ద్వాదశాధ్యాయము.

## బింబప్రతిబింబకల్పనసమీక్ష-పేజి 222 మొదలు 234 వఱకు.

౧. అర్థహరణమును గూర్చిన చర్చ, ౨. అందుఁ గల భేదములు. ౩. వానిసంఖ్య, ౪. తద్వివరములు. ౫. వాటి ననుసరించి కవులలోఁ బేర్పడు నాల్గువిధములగు భేదములు, ౬. వాని పేర్లు, ౭. ఐదవది అసాధారణ మనుట, ౮. వాని నిర్వచనములు, ౯. తదవాంతర భేదములు, ౧౦. వాని యుదాహరణములు. ౧౧. ప్రతిబింబ కల్పాదులను విభజించుటచే నేర్పడిన ముప్పదిరెండు హరణోపాయములు, ౧౨. అందలి భేదములు. ౧౩. వాని ఉదాహరణములు మొదలగునవి.

## త్రయోదశాధ్యాయము.

## అర్థహరణమున నాలేఖ్యప్రఖ్యాదిభేదములు.

## పేజి 235 మొదలు 272 వఱకు.

౧. ఆలేఖ్యప్రఖ్య తుల్యదేహితుల్య పరపురప్రవేశ సదృశములలోఁ బ్రత్యేకముగాఁగల పదునెనిమిదిభేదములు. ౨. వానిపేరులు. ౩. అందు సమక్రమాదు లగు నాలేఖ్యప్రఖ్యమునందలి భేదములు. ౪. విషయ పరివర్త ద్వంద్వవిచ్ఛిత్త్యాదు లగు తుల్యదేహితుల్యములోఁ గల నెనిమిది భేదములు. ౫. పరపురప్రవేశములోఁ గల హుండయుద్ధాది అష్టవిధభేదములు. ౬. మొత్తమున నిట్లు ముప్పదిరెండు విధములగు హరణోపాయములు. ౭. అర్థవైపరీత్యముచేఁ గల్గు తద్విరుద్ధము లగు

నిర్ధారణములు. ౮. వీని పాకోపాదాన చాతుర్యముపై కవిత్వము ఆధారపడి యున్నదని రూపించుట మొదలగునవి.

## చతుర్దశాధ్యాయము.

### జాతిద్రవ్యక్రియాసమయవ్యవస్థ.

### పేజి 2‾3 మొదలు 295 వఱకు.

౧. కవిసమయలక్షణము, ౨. స్వర్గభూమపాతాళీయ భేదములచే నేర్పడిన కవిసమయములందుఁ గల ముత్తెఱఁగులు. 3. అందు భూమకవి సమయమునఁగల జాత్యాదులగు నాల్గుభేదములు, ౪. అందు వఱల ప్రత్యేకముగా నేర్పడిన ముత్తెఱఁగు లగు భేదములు మొ.

## పంచదశాధ్యాయము.

### గుణసమయస్థాపనము- 296 మొదలు 314 వఱకు.

౧. గుణసమయములలోఁగల భేదములు. ౨. లేని గుణము లను, కూర్చుటలు, వాని యుదాహరణములు, 3. ఉన్నవానిని కూర్పక యుండుటలు, వానికి నుదాహరణములు, ౪ నియమతో నిబంధనములు, ౫ వాని యుదాహరణములు - మొదలగునవి.

## షోడశాధ్యాయము.

### స్వర్గమర్త్యపాతాళీయ కవిరహస్యస్థాపనము

### పేజి 315 మొదలు 334 వఱకు.

౧. భూమము అగు కవిసమయములవలెనే స్వర్గ్యములగు కవిసమయములు నుండు ననుట. ౨. కాని స్వర్గసంబద్ధములగు కవిసమయములలోఁ గల గల భేదములు చంద్రునకు ఐక్యకల్పన ప్రభృతుల నిరూపించుట. 3. పాతాళలోక సంబద్ధములగు కవిసమయములును పైవాని

వలెనే యుండు ననుట. ౪. కాని పైవానికి-అనఁగా స్వర్గమర్త్యలోక విషయములకును- దీనికిఁగల భేదము. నాగసర్పములకు దైత్యదానవులకు ఆభేదమును గూర్చుట ఏతత్ప్రభృతులని నిరూపించుట. ౫. ఆయాలక్షణములకు లక్ష్యములఁ జూపుట మొదలగునవి.

## సప్తదశాధ్యాయము.

### దేశవిభాగవివరణము-పేజి 335 మొదలు 373 వఱకు.

౧. కల్పనాభేదముచే నైన లోకభేదములు. ౨. భూలోకపు ద్వీపములు - సముద్రములు, ౩. జంబూద్వీపములోని వర్షములు. వర్ష పర్వతములు. ౪. భారతవర్షములోఁగల నవ (తొమ్మిది) భేదములు, ౫. సమ్రాట్చక్రవర్తి క్షేత్రముల రూపించుట, ౬. ఆర్యావర్తములోఁ గల యైదు విభాగములు, ౭. అందుఁగల దేశ, పర్వత, నదీనద వివరములు, ౮. అం దుత్పత్తి యయ్యెడి వస్తువులు, ౯. దిగ్విమర్శనము, ౧౦. తత్ప్రకారముగా జనించిన శరీరుల యాయాదేహవర్ణ ప్రభృతి నియమాదులు - కలవు.

## అష్టాదశాధ్యాయము.

### కాలవిభాగనిరూపణము-పేజి 374 మొదలు 416 వఱకు.

౧. సౌరచాంద్రమానములు, ౨. ఋతువులందలి వాయుదిగ్విచారణ. ౩. వర్షర్తుధర్మవర్ణనము. ౪. గ్రీష్మర్తుధర్మవర్ణనము. ౫. సంధి శైశవాదులగు ఋత్వవస్థల నారింటిని రూపించుట. ౬. వాని యుదాహరణములు. ౭. పుష్పముఁగల పదునారు విధములగు నుపయోగములు. ౮. అంతర్వ్యాజాదు లగు ఫలభేదములు మొదలగునవి.

---

# రాజశేఖరకవి కావ్యమీమాంస.

## శాస్త్రసంగ్రహము.

---

### ప్రథమాధ్యాయము.

[ఈ యధ్యాయమునందు వచ్చెడి విషయములు:—౧. శ్రీకంఠుఁడు పరమేష్ఠి వైకుంఠుఁడు మున్నగు అరువది నల్వురు శిష్యులకును కావ్యశాస్త్రోపదేశమును చేయుట. ౨. కావ్యవిద్యాస్నాతకులగు సహస్రాక్షుఁడు మున్నగు దివ్యులకు కావ్యవిద్యయొక్క అష్టాదశాధికరణములను ప్రవచించుట. ౩. వారు వేఱ్ఱ్వేఱుగాఁ దమతమ శాస్త్రముల రచించుట. ౪. అయ్యవి ప్రకీర్ణములు అగుటవలనను, విచ్ఛిన్నత నొందుటవలనను, ఈ గ్రంథకర్త వానిని సంగ్రహించి ప్రకృతము కావ్యమీమాంస యను నీగ్రంథమునుగా రచించుట. ౫. ఈ కావ్యమీమాంసయందలి యధ్యాయాదులు నిర్దేశించుట—మొ.]

---

1 శ్రీకంఠుఁడు పరమేష్ఠి వైకుంఠాదు లగు

---

1. మూలమునందు 'అథాఽతః కావ్యం మీమాంసిష్యామహే' అని కలదు. సూత్రరూపమున రచింపంబడిన శాస్త్రములలో నిట్లు ఉపక్రమణము చేయుట సంస్కృతమునందు ఆచారమై యున్నది. ప్రమాణమీమాంస-అనెడి న్యాయశాస్త్రమును రచించిన హేమచంద్రాచార్యుఁడు, బ్రహ్మసూత్రాదులను వ్రాసిన వ్యాసాదులును, ఈరీతిగానే 'అథ ప్రమాణమీమాంసా, అథాతో బ్రహ్మమీమాంసా'-

[1]అరువదినల్వురు శిష్యులకును దేని నుపదేశించెనో అట్టి కావ్యమును ఇటుపైని మీమాంసచేయుదుము. ఆ భగవానుఁడు-స్వయంభువునైనవాఁడు-తన యిచ్ఛామాత్రమున నావిర్భవించిన స్వశిష్యుల కిద్దాని నుపదేశించెను. ఆ శిష్యులయందు సరస్వతీపుత్రుఁడు - బృందారకులకు సైతము వంద్యుఁడు నైన కావ్యపురుషుఁడుగ నుండెను. అట్లుండిన ఆ కావ్యపురుషుని-సర్వసమయముల నెఱిఁగినవానిని-దివ్యచక్షువుతో మున్ముందు జరుగఁబోవు విషయముల నెఱుంగఁగలవానిని - భూర్భువస్స్వరము లను ముల్లోకములయందు గల జనుల విషయమై గల హితకామనతో, ప్రజాపతియగు బ్రహ్మ కావ్యవిద్యను ప్రవర్తింపఁ జేయుటకై నియమించెను.

ఆ కావ్యపురుషుఁడు కావ్యవిద్యాస్నాతకులగు నా

---

అని యిత్యాదిగా గ్రంథరచనముల సాగించి యున్నారు. ఇట్టులనే అథాఽతః సామయాచారికాన్ ధర్మాన్ వ్యాఖ్యాస్యామః - అని యిత్యాదులుగా ధర్మసూత్రాదుల రచించిన ఆపస్తంబ మహర్షులు మొన్నగువారును, చెప్పియున్నారు.

1. చతుష్షష్టయే శిష్యేభ్యః—అని మూలము. ఈ యరువదినల్వురు (అనఁగా చతుష్షష్టిశిష్యులు) బ్రహ్మ విష్ణు రుద్ర గుహ బృహస్పతి భార్గవ ప్రభృతు లని యెఱుంగఁదగును. ఇందుల కీ గ్రంథమునందే పాత్రప్రతిష్ఠ యనెడి పేరుగల యేడవ యధ్యాయమునందు—'పాంక్తాః కవయో నః పూర్వే ఇత్థంకారం కథయంతి. బ్రహ్మ విష్ణు రుద్ర గుహ బృహస్పతి భార్గవాది శిష్యేషు చతుష్షష్టా వుపదిష్టం వచః పారమేశ్వరం—అని ఆధారము కానవచ్చుచున్నయది.

దివ్యులకు పదునెన్మిది అధికరణములుగల కావ్యమీమాంసను సవిస్తరముగాఁ జెప్పెను. అపుడందు కవిరహస్యమును సహస్రాక్షుఁడు అధ్యయనము చేసెను. ఉక్తిగర్భుఁడనువాఁడు ఔక్తికమును, [1]సువర్ణనాభుఁడు రీతినిర్ణయమును, ప్రచేతాయనుఁడు ఆనుప్రాసికమును, చిత్రాంగదుఁడు యమకము లను చిత్రప్రకరణమును, శేషుఁడు శబ్దశ్లేషమును, పులస్త్యుఁడు వాస్తవమును, ఔపకాయనుఁ డౌపమ్యమును, పరాశరుఁడు అతిశయమును, ఉతథ్యుఁడు అర్థశ్లేషమును, కుబేరుఁడు ఉభయాలంకారికమును, కామదేవుఁడు వైనోదికమును, భరతుఁడు రూపకనిరూపణీయమును, నందికేశ్వరుఁడు రసాధికారికమును, ధిషణుఁడు దోషాధికరణమును, ఉపమన్యువు గుణౌపాదానికమును, [2]కుచుమారుఁడు ఔపనిషదికమును అధ్యయనముఁ జేసిరి. అటుతరువాత వారు వేర్వేరుగా తమతమ చదివిన శాస్త్రభాగములను ప్రత్యేకముగా విస్తరించి రచించిరి. ఇట్లు చేయుటం జేసి ప్రకీర్ణక

1—2. వాత్స్యాయనమహర్షి కామసూత్రములలోఁ గూడ సువర్ణనాభుని కుచమారుని పేర్కొనెను. 'సువర్ణనాభ స్సాంప్రయోగికం, ఔపనిషదికం కుచమారః' అని ఇత్యాదిగా ఆయనసూత్రములు గలవు. సువర్ణనాభ కుచమారులు కేవలము కామశాస్త్రీయములగు గ్రంథములకు మాత్రమే కాక, సాహిత్య నిబంధనములగు శాస్త్రిగ్రంథములకుఁ గూడ కర్తలే యని ఇందు మూలమున తేలుచున్నది.

మగుటచేత అనఁగా నొకదానితో నొకటి కలసికొని పోవుటచేత – ఆకావ్యమీమాంస కొంచెము (అచ్చటచ్చట) ఉచ్ఛేదము నొందెను. ఈకారణమునుబట్టి ప్రయోజకాంగవతియైన ఈ కావ్యమీమాంస, సంక్షేపింపఁబడి, మూలమునందలి యర్థమంతయు వచ్చునట్లు పరిమితాకృతి గల గ్రంథముగా, నియ్యది పదునెన్మి దధికరణములు కలదిగాఁ జేయఁబడినది.

అట్టి ఈ కావ్యమీమాంసకు ఇయ్యది [1]ప్రకరణాధి

---

1. వాత్స్యాయనుఁడు కామసూత్రములందును కౌటిల్యుఁ డర్థసూత్రములందును ప్రకరణాధికరణ సముద్దేశమును ప్రత్యేక ప్రకరణముఁగా గ్రంథాదిని వ్రాసి, తమతమకుఁగల శాస్త్రప్రణయన కారణములను ఇట్లే చెప్పికొని యున్నారు.

అందు వాత్స్యాయనుఁడు:—"ప్రజాపతి ర్హి ప్రజాః సృష్ట్వా తాసాం స్థితినిబంధనం త్రివర్గస్యసాధనం అధ్యాయానాం శతసహస్రేణ అగ్రే ప్రోవాచ. [౧. ౧. ౫.] తస్యైకదేశం స్వాయంభువో మను ర్ధర్మాధికారికం పృథక్చకార. [౧. ౧. ౬.] బృహస్పతి రర్థాధికారికం [౧. ౧. ౭.] మహాదేవానుచర శ్చ నందీ సహస్రేణ అధ్యాయానాం పృథక్కామసూత్రం ప్రోవాచ. [౧. ౧. ౮.] తదేవ తు పంచభి రధ్యాయశతై రౌద్దాలకి శ్శ్వేతకేతు స్సంచిక్షేప. [౧. ౧. ౯.] తదేవ తు పున రధ్యర్ధశతేన సాధారణ సాంప్రయోగిక కన్యాసంప్రయుక్తక భార్యాధికారిక పారదారిక వైశికౌపనిషదికైః సప్తభి రధికరణై ర్బాభ్రవ్యః పాంచాల స్సంచిక్షేప. [౧. ౧. ౧౦.] తస్య షష్ఠం వైశిక మధికరణం పాటలిపుత్రికాణాం గణికానాం నియోగా ద్దత్తకః పృథక్చకార. [౧. ౧. ౧౧.] తత్ప్రసంగా

కరణ [1]సముద్దేశము అని ఎటువంటిదనగా:—1. శాస్త్రసంగ్రహము 2. శాస్త్రనిర్దేశము 3. కావ్యపురుషుని యుత్పత్తి 4. పదవాక్యవివేకము 5. పాఠప్రతిష్ఠ 6. అర్థానుశాసనము 7. వాక్యవిధులు 8. కవివిశేషములు 9. కవిచర్య 10. రాజచర్య 11. కాకుప్రకారములు 12. శబ్దార్థహరణోపాయములు 13 కవిసమయములు 14. దేశకాలవిభాగము 15 భువనకోశము, అని ఈరీతిగా కవి

---

చ్చారాయణః సాధారణ మధికరణం పృథక్ప్రోవాచ. సువర్ణనాభస్సాంప్రయోగికం, ఘోటకముఖః కన్యాసంప్రయుక్తకం, గోనర్దీయో భార్యాధికారికం, గోణికాపుత్రః పారదారికం, కుచుమార ఔపనిషదికం, [౧. ౧. ౧౭.] ఏవం బహుభి రాచార్యై స్తచ్ఛాస్త్రం ఖండశః ప్రణీతం ఉత్సన్నకల్ప మభూత్. [౧. ౧. ౧౮.] తత్ర దత్తకాదిభిః ప్రణీతానాం శాస్త్రావయవానాం ఏకదేశత్వాత్, మహదితి చ బాభ్రవీయస్య దురధ్యేయత్వాత్, సంక్షిప్య సర్వ మర్థ మల్పేవ గ్రంథేన కామసూత్ర మిదం ప్రణీతవాన్. [౧. ౧. ౧౯.] అని చెప్పినాఁడు.[చూడుము. వాత్స్యాయనుని కామసూత్రములు.]

ఇట్టులనే కౌటిల్యుఁడును—పృథివ్యా లాభే పాలనే చ యావన్త్యర్థశాస్త్రాణి (అర్థసూత్రాణి)పూర్వాచార్యైః ప్రస్తావితాని ప్రాయశ స్తాని సంహృ త్యైక మిద మర్థశాస్త్రం కృతం—అని చెప్పికొని యున్నాఁడు. [కౌటిల్యార్థసూత్రం--వాప్రచురణము.]

1. వాత్స్యాయన కామసూత్రములందును కౌటిల్యుని అర్థసూత్రములందును ఇట్టులనే ప్రకరణాధికరణ సముద్దేశముకూడ చెప్పంబడినది. చూడుము వా. కా. సూ, తత్రాయం ప్రకరణాధికరణ సముద్దేశః [౧. ౧. ౧౯.]

రహస్య మను నీగ్రంథమునందు ప్రథమాధికరణము-అను నీ మొదలగుదాని నెఱుంగునది. ఇవి సూత్రములు. ఇఁక వీనికి వ్యాఖ్యానరూపముగా మున్ముందు చెప్పఁబోవు భాష్యమును ఉండఁగలదు.

శిష్యజనహితమునకై ఇది మాచెప్పిన 1సమాసవ్యాసవిన్యాసము. [అనఁగా సంక్షిప్త గ్రంథరూపము.] ఇయ్యది చిత్రోదాహరణములచేత గుర్వి (గొప్పది) యయ్యును, గ్రంథమునుబట్టి (అనఁగా గ్రంథసంఖ్యను బట్టి) మిక్కిలి లఘీయసి. (అనఁగా చిన్నదని భావము.)

---

1. ఇచ్చట మూలమునందున్న శ్లోకము లివి;—

శ్లో. ఇతి సూత్రాణ్యథైతేషాం వ్యాఖ్యా భాష్యం భవిష్యతి.
సమాసవ్యాసవిన్యాసః సైప శిష్యహితాయ నః.
చిత్రోదాహరణై ర్గుర్వీ గ్రంథేన తు లఘీయసీ.
ఇయంనః కావ్యమీమాంసా కావ్యవ్యుత్పత్తికారణం.

వాత్స్యాయనుని కామసూత్రములందును నిట్లే కలదు.

శ్లో. సంక్షేప మిమ ముక్త్వాఽథ విస్తరోఽతః ప్రవక్ష్యతే,
ఇష్టం హి విదుషాం లోకే సమాసవ్యాసభాషణం.

[వాత్స్య. సూ. ౧. ౧. ౨౨.]

వ్యా. ఇష్టమితి-లోకే యే శాస్త్రేఽధికృతా స్తే విద్వాంసః తేషాం సంక్షేపవిస్తరాభ్యాం శాస్త్రస్య మనసి ధారణ మిష్టం, విజ్ఞాతప్రకరణార్థక్రమత్వాత్, అసంమోహో యథాభిలషితప్రకరణార్థప్రత్యవమర్శ శ్చ స్యాత్-అని వైవాత్స్యాయనగ్రంథమునకు యశోధరుని జయమంగళవ్యాఖ్య కలదు.

ఈ మా కావ్యమీమాంస, కావ్యవ్యుత్పత్తికి కారణము అగుచున్నది. (లోకమునందు చాల గొప్ప శాస్త్రమని పేరువడసిన) మీమాంసకూడ, ఏగ్రంథమునందు వాఙ్మవముగఁ గాఁగలదో, అట్టి కావ్యమీమాంస అనే గ్రంథము ఇది. ఎవ్వఁడీ కావ్యమీమాంసను చక్కఁగా నెఱుఁగనే ఎఱుంగఁడో, వాఁడు ఒక్క మాటనైనను ఎఱుఁగనే ఎఱుఁగఁడు. అనఁగా అజ్ఞుఁడనుట. ఈవిధముగా ప్రాచీనులగు మహర్షుల విస్తరములగు మతభేదములను సంగ్రహించి కూర్చి, యాయావరీయుం డగు రాజశేఖరకవిరాజు, కవుల (వ్యుత్పత్తి)కై ఈకావ్యమీమాంస నిట్లు గ్రంథరూపమునఁ గూర్చెను.

ఇది రాజశేఖరకవిరాజకృత మగు కావ్యమీమాంస యను
కవిరహస్యమునందు ప్రథమాధికరణమున
శాస్త్రసంగ్రహ మనునది ప్రథమాధ్యాయము.



# రాజశేఖరకవి కావ్యమీమాంస.

## శాస్త్ర నిర్దేశము.

---

### ద్వితీయాధ్యాయము.

[ఈయధ్యాయమునందుఁ వచ్చెడివిషయములు:—౧. శాస్త్రము కావ్యము ననెడి వాఙ్మయద్వైవిధ్యము. ౨. శాస్త్రములఁ బరిసంఖ్యానము చేయుట. ౩. వానిలక్షణము. ౪. సూత్రాదులరూపమున వీనిని రచించుట, ౫. వృత్తియని, పద్ధతియని, భాష్యమని, సమీక్షయని, టీకయని, పంజికయని, కారికయని, వార్తికమని - చెప్పంబడెడి శాస్త్రముల లక్షణములు. ౬. వానిలోని భేదములు, ౭. వానినిర్వచనములు- ౮. సాహిత్యవిద్యా నిర్వచనము - మున్నగునవి.]

---

ఇఁక నిచ్చట వాఙ్మయము శాస్త్ర మనియుఁ, కావ్య మనియు రెండువిధములు. కావ్యములు శాస్త్రపూర్వకము లగుటవలన మున్ముందు శాస్త్రములందే, కవి యభినివిష్టుఁడు కావలయును. అప్రవర్తిత ప్రదీపులగువారు తమస్సునందు తత్త్వార్థసార్థము నధిగమింపఁజాలరు కదా! ఆశాస్త్రముకూడ రెండువిధములు; పౌరుషేయము అని అపౌరుషేయము అని. అపౌరుషేయము శ్రుతి, లేక వేదము. అయ్యది మంత్రబ్రాహ్మణ రూపమున నుండునది. యాగాది క్రియాతంత్రములను వివరించునవి మంత్ర

ములు. మంత్రములకు స్తుతినిందా వ్యాఖ్యాన వినియోగా దుల వివరించు గ్రంథభాగము బ్రాహ్మణము. ఋగ్వేదము యజుర్వేదము సామవేదము అను నీమూఁడు వేదములును త్రయి [వేదత్రయి] యనఁబడును. అథర్వణవేదము నాల్గవవేదము. ఈ వేదములలో అర్థ వ్యవస్థితము లగుపాదములు గలవి ఋక్కులు. (అనఁగా ఋగ్వేదభాగములు) ఆఋక్కులే సగీతము లగునేని సామములు. ఛందోనిబద్ధములు కానివియును, అగీతము లగునవియును, యజుస్సులు. ఋక్కులు యజుస్సులు సామములు అధర్వణములు అను నీనాల్గే (అనఁగా ఋగ్యజుస్సామాధర్వణము లను నీ నాల్గే) వేదములు. ఇతిహాస ధనుర్వేదములును గాంధర్వవేదాఽఽయుర్వేదములును ఉపవేదములు. వేదములలో నుపవేద స్వరూపమై-సార్వవర్ణికమైన - గేయవేదము (సంగీతవేదము) అయిదవదిగా ఒప్పుచుండును అని ద్రాహిణి చెప్పెను.

శిక్ష కల్పము వ్యాకరణము నిరుక్తము ఛందోవిచిత్తి జ్యోతిషము అనునివి యాఱును షడంగము లని యాంచార్యులు పల్కిరి.

అలంకారముకూడ విద్యల కొకవిధముగా నుపకారక మగుటవలన నేడవయంగ మగునని యాయావరీయుఁడు. ఆయంగ ప్రత్యంగముల పరిజ్ఞానము లేనిది వేదముయొక్క యర్థము అవగతము కాఁ జాలదు. ఎట్లందురా? చూడుఁడు:—

శ్రుతిః. 1 ద్వా సుపర్ణా సయుజా సఖాయా
సమానం వృక్షం పరిషస్వజాతే,
తయో రన్యః పిప్పలం స్వాద్వత్తి
అనశ్న న్నన్యో అభిచాకశీతి. శ్వేతాశ్వతరోపనిషత్తు (4-6).

[దీనియర్థ మిది:—ద్వా=రెండైనవియును, సుపర్ణా=పక్షితుల్యము లగుటంజేసి చక్కని రెక్కలుంగలవియును, (చేతనము లగుటంజేసి ఈ రెండును జీవాత్మ పరమాత్మ లని భావము.) సయుజా=ఎల్లప్పుడును కలిసి నవియును, సఖాయా=అన్యోన్యమ్యము మిత్రము లగునవియు, సమానం=ఒక్కటియైన వృక్షం=ఛేదనధర్మముగల శరీరమును, పరిషస్వజాతే=ఆలింగనమును చేసికొనియున్నవి. తయోః=అందులో, అన్యః=ఒక్కటియగు జీవుఁడు, పిప్పలం=శరీరజనితమగు కర్మమనెడిఫలమును, స్వాదు=రస సహితమైనదానిని, అత్తి=అనుభవించుచున్నాఁడు. అన్యః=రెండవది యగు పరమాత్మ, అనశ్నన్=భుజింపకయే, అభిచాకశీతి=ప్రకాశించు చున్నది-అని యర్థము]

---

(1) దీనిపైని శంకరభగవత్పాదులవారి భాష్య మిట్లున్నది:— ద్వేతి. ద్వౌద్వౌ విజ్ఞానపరమాత్మానౌ. సుపర్ణా. సుపర్ణౌ,=శోభనప తనౌ - శోభనగమనౌ సుపర్ణౌ. పక్షౌద్వౌ సుపర్ణౌ. సయుజా, సయుజౌ=సర్వదా సంయుక్తౌ సఖాయా, సఖాయౌ=సమానాఖ్యానౌ సమానాభివ్యక్తికారణౌ, ఏవంభూతౌ సంతౌ సమాన మేకంవృక్షం, వృక్షమివోచ్ఛేదసామాన్యా ద్వృక్షం పరిషస్వజాతే=పరిష్వక్తవంతౌ- సమాశ్రితవంతా వేతౌ, తయో రన్యోఽవిద్యాకామవాసనాశ్రయ లింగోపాధి రజ్ఞానాత్మా పిప్పలం-కర్మఫలం - సుఖదుఃఖలక్షణం, స్వాదు=అనేకవిచిత్రవేదనాస్వాదరూపం, అత్తి=ఉపభుంక్తే ఽవివే కతః, అనశ్నన్నన్యః = నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావః పరమేశ్వరః అభిచాకశీతి-సర్వమపి పశ్య న్నాస్తే:—ఇతి.

ఇది శాస్త్రోక్తి కుదాహరణము. ఇటుపైని ఒక్కొక్క యధికరణమునందును ఋక్కులును యజుస్సులును సామమును అథర్వణమును బ్రాహ్మణమును ఉదాహరించి, అటుపైని భాషను (అనఁగా సంస్కృతమును) ఉదాహరించుచు నుందుము. అందు (అనఁగా పైని చెప్పిన వేదాంగములలో) వర్ణములకు- (అక్షరములకు) ఉత్పత్తిస్థానము కరణము ప్రయత్నము మున్నగువానియొక్క మూలమున నిష్పత్తిని

శ్వేతాశ్వతరోపనిషద్దీపికయను వ్యాఖ్యానము నందు (నారాయణ విరచితము) ఇట్లు ఇయ్యది వాఖ్య చేయంబడి యున్నది—ద్వేతి. ద్వావ్ద్వే సుపర్ణాసుపర్ణాపక్షితుల్యౌ చేతనత్వా జీవపరమాత్మానౌ సయుజాసదాసంయుక్తౌ, సఖాయా పరస్పరమిత్రే సయుజావపి గురుభార్గవౌ న సఖాయౌ, 'రాహుర వ్యోః పరం వైరం గురుభార్గవయో రపి' ఇతి స్మరణాత్, సఖాయావపి శివకేశవౌ న సయుజా వి త్యుభయోపాదానం, సమాన మేకం వృక్షం-ఓవ్రశ్చ్చేదనే, ఛేదనధర్మాణం శరీరం, పరిషస్వజాతే (ష్వంజ-పరిష్వంగే ఛందసిలిడితిభూతసామాన్యే లిట్, సది ష్వంజోః పరస్యలిడితి పరస్య షత్వనిషేధః,) అన్యోజీవః పిప్పలం=శరీరవృక్షోత్థంఫలంకర్మాఖ్యం స్వాదు సరసంయథాభవత్యేవం, అత్తి=భుజ్క్తే, అనశ్నన్నభుంజానఏవ అన్యోఅభిచాకశీతి= పరమాత్మా భృశంప్రకాశతఏవ వర్తతే. కాశృదీప్తౌ యఙ్లుకి లట్.

విజ్ఞానభగవత్కృత మగు శ్వేతాశ్వతరోపనిషద్వివరణము నందు దీనిపైని ఇట్లు వ్యాఖ్య చేయంబడి యున్నది:—ద్వేతి. ద్వా=ద్వౌ ఘటాకాశమహాకాశస్థానీయౌ జీవపరమాత్మానౌ, సుపర్ణా=సుపర్ణౌ. శోభనపతనౌ శోభనగమనౌ. సయుజా-సయుజౌ = బింబప్రతిబింబభావేన సదాసంయుక్తౌ సఖాయా-సఖాయౌ=నిత్యోపకార్యోపకార

నిర్ణయించునది శిక్ష. ఉదాహరణము ఆపిశలీయశిక్ష మొదలగునవి. భిన్నభిన్నములగు ననేక శాఖలలో పఠింపఁబడిన మంత్రములకు వినియోజకమును - అనఁగా వినియోగించు తెఱఁగును-చెప్పెడి సూత్రము కల్ప మనఁబడును. యజుర్విద్య (యజుర్వేదము) మున్నగునవి ఉదాహరణములు. శబ్దములయొక్క సౌష్ఠవాదులను (అనఁగా

---

కత్వేనవర్తతే ఇతి సఖాయా - సమానాఖ్యానా - సమానాభివ్యక్తి కారణౌవా. సమానాఖ్యా-చేతనత్వాదినాసమానాఖ్యావా. సమాన మనంత సుఖానుభూతేరాత్మనోబింబప్రతిబింబభేదోపాధికత్వేన కించిజ్ఞత్వ సర్వజ్ఞత్వోపాధిత్వేన, నియమ్యనియంతృత్వోపాధికత్వేన శుద్ధ్యశుద్ధ్యుపాధికత్వేన చ సమానం=ప్రకృతిప్రాకృతంవృక్షం= ఉచ్చైరిధర్త్వాద్వ్రశ్చమధ్యాత్మాదిభేదభిన్నత్వా ద్బహుశాఖాత్వా త్పుణ్యపాపాదిబహుబీజత్వాత్సుఖదుఃఖాదిబహుబీజత్వాచ్చ వృక్షం పరిషస్వజాతే = పరివ్యక్తవంతౌ పరిగృహ్య వర్తతే, నియమ్యత్వా ద్యుపాధికత్వేన నియామకత్వాద్యుపాధికత్వేన చ, ఇమంవృక్షం పరిగృహ్య వర్తతే, తయోః కార్యకారణాధికయో ర్జీవేశ్వరయో ర్మధ్యే అన్యోన్యమాయా కాగ్యహంకారాఖ్యలింగశరీరాభి మానీ జీవః, పిప్పలం=కర్మనిష్పన్నం=సమదుఃఖలక్షణం ఫలం = స్వాదు= వివిధవిచిత్రవిషయాస్వాదనం - విషయసేవవాసనా నిమిత్తమిత్యర్థః. అత్తి=ఉపభుంక్తే. అనశ్నన్నన్యః = ప్రకృత్యాఖ్య మాయోపాధిర్బింబస్థానీయ ఈశ్వరః కాగ్యోపాధికాత్ప్రతి జీవాదన్యోఽనశ్నన్ కర్మఫల మనుపభుంజానోఽభిచాకశీతి=స్వయ మవికృత స్సన్నభితః పశ్యన్ సర్వసంసార ధర్మకార్యః స్వయంప్రకాశాఖ్యం జ్ఞప్తిమాత్ర రూపేణా స్త ఇతిచ యావత్.

సాధుత్వాదులను) చెప్పునది వ్యాకరణము. 2 శబ్దముల యర్థాదులను నిర్వచించునది నిరుక్తము. ఛందస్సులను నిరూపించునది 3 ఛందోవిచితి. గ్రహనక్షత్రాదులను గురించిన గణితము యున్నగువానిని నిరూపించునది జ్యోతిషము. అలంకారమును ముస్ముందు వివరించెదము. ఇఁకను పౌరుషేయము-అనఁగా పురుషులగు వేదవ్యాసాదులచే రచింపంబడినట్టి-శాస్త్రము అన్ననో, పురాణము. ఈపురాణమును, ఆన్వీక్షికి మీమాంస స్మృతి తంత్రము అను నవియును-ఈనాలుగు-శాస్త్రములు. ఈ నాలుగింటిలోను వేదములలోఁ జెప్పఁబడిన ఆఖ్యానము లుపనిబద్ధములై యుండునది పురాణము. పెద్దలును ఇట్టిదానినే పురాణ మనిరి:—

శ్లో. సర్గః ప్రతిసంహారః కల్పో మన్వంతరాణి వంశవిధిః
జగతో యత్ర నిబద్ధం త ద్విజ్ఞేయం పురాణ మితి.

[లోకముయొక్క సృష్టి ప్రతిసృష్టి కల్పములు

2. అభిధాన చింతామణి టీకయందు వ్యాకరణముయొక్క నిర్వచనము ఇట్లు చేయంబడి యున్నయది:—

శ్లో. ప్రకృతి ప్రత్యయోపాధినిపాతాది విభాగశః,
పదాన్వాఖ్యాన కరణం శాస్త్రం వ్యాకరణం విదుః

3. ఛందోవిచితికిఁగాను పింగళనాగుని ఛందస్సును గ్రహింపవచ్చును. కొందఱు ఛందోవిచితియను పేర-ప్రత్యేకముగా నొక గ్రంథమే కల దందురు. కొందఱు దండిమహాకవి రచించిన ఛందోవిచితియే యది యందురు. కాని దండికవి ఛందోవిచితి—ఇప్పుడు కానవచ్చుట లేదు.

మన్వంతరములును ఆయా మనువుల వంశచరిత్రములు, నెచ్చట వ్రాయఁబడి యుండునో అట్టిది పురాణ మని తెలియఁదగును. అని దీనికి-అర్థము.]

పురాణములలోని యొకవిధమగు భేదమే (అనఁగా ఇతిహాసమును ఒకరీతిగా పురాణములలో చేరినదే యని) ఇతిహాసమని కొందఱు పలికిరి. అట్టి పురాణము పరిక్రియ యనియును, పురాకల్పమనియును, రెండు తెఱఁగులు. ఇట్టులనే పెద్దలును చెప్పియున్నారు.

శ్లో॥ పరిక్రియా పురాకల్ప ఇతిహాసగతి ర్ద్విధా,
స్యా దేకనాయకా పూర్వా, ద్వితీయా బహునాయకా.

[ఇతిహాసమార్గము, పరిక్రియ యనియును పురాకల్ప మనియును రెండువిధములు. మొదటిదగు పరిక్రియ ఏకనాయకయును, రెండవది యగు పురాకల్పము బహునాయక యనియును ఎఱుఁగఁదగును.]

పైనిచెప్పిన పురాణవిషయమున రామాయణభారతము లుదాహరణములు. ఆన్వీక్షికీ స్వరూపమును విద్యావసరమునందు చెప్పెదము. వేదవాక్యములకు పెక్కులు న్యాయములతో నర్థమును వివేచనసేయునది మీమాంస. ఆ మీమాంసకూడ విధివివేచనియనియును బ్రహ్మనిదర్శిని యనియును రెండువిధములు; (అనఁగా పూర్వమీమాంస యనియు, నుత్తరమీమాంసయనియు రెండువిధములు.) శ్రుతిబోధితము లగు అర్థములను స్మరించునవి యగుటవలన స్మృతులని చెప్పఁబడినవి. అవి పదునెని

మిదియే. "ఇట్లీవిధముగా నీ పదునాలుగును విద్యాస్థానములు, అథవా నాలుగువేదములును ఆరంగములు నాలుగుశాస్త్రములు-ఇవి విద్యాస్థానములు" అని ఆచార్యులనిరి. ఇవి యన్నియును భూర్భువస్స్వరములను లోకములను మూఁడింటిని ఆక్రమించి యున్నవి. పెద్దలును ఇట్లే యనిరి:—

శ్లో. విద్యాస్థానానాం గంతు మంతం చ శక్తో
జీవే ద్వర్షాణాం యోఽపి సాంగం రహస్యం,
తస్మా త్సంక్షేపా దర్థసందోహ ఉక్తో
వ్యాస స్సంత్యక్తో గ్రంథభీరుప్రియార్థమ్.

[అర్థము:— విద్యాస్థానములను సంపూర్ణముగా చివఱదనుక చదువుటకు వేయియేండ్లు జీవించినవాఁడైనను సాంగముగా చదువఁజాలఁడు. కావుననే సంక్షేపముగా నిటు లర్థజాతము చెప్పఁబడినది. గ్రంథము పెఱుగుటచేఁ జదువ భయపడువారికొఱకై ప్రతియొక్క-విద్యాస్థానముఁగూర్చిన వివరమును విస్తరించుపని మాచే నిట్లుఁ బరిత్యజింపఁబడినది.]

సమస్త విద్యాస్థానములకును మూలస్థానమైన కావ్యము పదునైదవ విద్యాస్థానముగ నగుచున్నదని యాయావరీయుఁడనెను. ఆకావ్యములు గద్యపద్యమయము లగుటయును కవిధర్మము లగుటయును హితోపదేశము లగుటయును నిందులకు ముఖ్యములగు కారణములు. ఇట్టికావ్యము శాస్త్రముల ననుసరించుచుండును. వార్త

కామసూత్రము శిల్పిశాస్త్రములు దండనీతి యనునివి, పై వానితోఁ గూడ కలిపినచో, పదునెనిమిది విద్యాస్థానము లగు నని కొందఱు. ఆన్వీక్షికి త్రయి, వార్త దండనీతి అను నివియే విద్యలని కొందఱు. దండనీతి యొక్కటియే విద్యయని ఔశనసు లనిరి. ఏల యనఁగా - దండము కలుగునను భయమువలననే సమస్తలోకమును తమతమ ధర్మముల నడుచుచుండును. గనుక నియ్యది- దండనీతి- ఇది యొక్కటియే విద్యయని వా రనిరి.

వార్త దండనీతి అను నీ రెండే విద్యలని బార్హస్పత్యులు. వృత్తియును వినయగ్రహణము ననునివి లోకయాత్రయొక్క స్థితికి కారణములు. త్రయీవార్తా దండనీతులు మూఁడును విద్య లని మనుమార్గగాములు (మానవులు) చెప్పెదరు. కారణమేమనఁగా-వార్తాదండ నీతుల నుపదేశించునది త్రయియేకదా! ఆన్వీక్షకీత్రయీ వార్తాదండనీతులు నాలుగును విద్యలే యని కౌటిల్యుఁ డనెను. ఆన్వీక్షకిచే వివేచితమగు త్రయియే వార్తా దండ నీతులయందు సమర్థ మగుచున్నది గదా! ఐదవది 'సాహిత్యవిద్య' యని యాయావరీయుఁడు. ఆసాహిత్య విద్యయే పై నాల్గు విద్యలకును ప్రవర్తక మగుచున్నది. వీటిమూలమున ధర్మార్థముల నెఱుఁగఁగల్గుటయేదిగలదో అదియే విద్యలకుఁ గల విద్యాత్వము అనఁబడుచున్నది.

పై వానిలో త్రయి వివరించినట్లైనది. ఆన్వీక్షకి- పూర్వపక్షమని, ఉత్తరపక్షమని-ద్వివిధముగ నున్నది.

జైన బౌద్ధదర్శనములును (ఆర్హద్భదంత దర్శనములు) నాస్తికమత మగు లోకాయతమును అనునియ్యవి ఆ యాన్వీక్షికియందు పూర్వపక్షమునఁ జేరును. సాంఖ్య న్యాయ వైశేషిక శాస్త్రము లనునివి ఉత్తరపక్షమునఁ జేరును. మొత్తమున నీ యారింటిని [1]షట్తర్కము లని చెప్పెదరు వీటిలో వాదమనియును జల్పమనియును వితండమనియును మూఁడు తెఱఁగులుగా కథ[2]యుండును. మధ్యస్థులుగా నున్నవారికి నిజము నెఱిఁగించుటకై వస్తుతత్త్వమును పరామర్శించుట యెయ్యది గలదో అదియే వాద మనంబడును.

విజిగీషువునుండి తనపక్షమును నిలఁబెట్టుకొనుటకై ఛలజాతి [3] నిగ్రహాదులగు వాదస్థానములను పరిగ్రహించుట జల్పము అనఁబడును.

---

1. షట్ తర్కములు — ఆరువిధములగు తర్కశాస్త్రములు. తర్క్యంతే ప్రమీయంత ఇతి తర్కాః — అని వ్యుత్పత్తి. ఇవియే షట్ తర్కములు. శ్లో. జినం సాంఖ్యం శివం భాట్టం బౌద్ధం లోకాయతం తథా, షడేతా తర్కనామ్నోక్తాః శేషాః పాషండవృత్తయః — అని వాగ్భటానుశాసనమునఁ గలదు కనుక.

2. కథా చ వాద జల్పవితండాభేదాత్ త్రివిధా, ... తత్త్వబుభుత్సు కథా వాదః, ... ఉభయపక్షసాధనవతీ విజిగీషుకథా జల్పః, ... అన్యతర పక్షస్థాపనహీనా విజిగీషుకథా వితండా — అని సన్మిశ్రశంకరకవి రచిత మగు వాదివినోదమునందు వీనికి లక్షణములు చెప్పఁబడినవి.

3. నిగ్రహస్థానములు: — ౧ ప్రతిజ్ఞాహాని. ప్రతిజ్ఞాంతరము. 3

స్వపక్షమును పరిగ్రహింపకయే పరపక్షమును దూషించునది- అనఁగా ఖండించునట్టిది- వితండ యనఁబడును

కృషియును పశుపాలనమును వాణిజ్యమును[వ్యాపారమును] అను నీ మూఁడును వార్త యనఁబడును.4ఆన్వీక్షికీత్రయీవార్తలు అను ఈమూఁడింటియొక్క యోగక్షేములకును సాధనభూతమైనదియే దండము. ఇట్లు

---

ప్రతిజ్ఞావిరోధము, ౪ ప్రతిజ్ఞాసన్న్యాసము. ౫ హేత్వంతరము. ౬ అర్థాంతరము. ౭ నిరర్థకము. ౮ అవిజ్ఞాతార్థకము. ౯ అపార్థకము ౧౦ అప్రాప్తకాలము ౧౧ న్యూనము ౧౨ అధికము. ౧౩ పునరుక్తము. ౧౪ అననుభాషణము. ౧౫ అజ్ఞానము ౧౬ అప్రతిభ ౧౭ విక్షేపము ౧౮ మతానుజ్ఞ ౧౯ పర్యనుయోజ్యవిక్షేపణము ౨౦ నిరనుయోజ్యానుయోగము. ౨౧ అపసిద్ధాంతము ౨౨ హేత్వాభాసము -అను నీ ఇరువదిరెండును నిగ్రహస్థానము లని వాదవినోదమునఁ జెప్పఁబడినవి.

4. పదార్థముల యథాస్థితి దీనియందు అన్వీక్షణము చేయంబడును గనుక నిది ఆన్వీక్షికీ యనంబడును. దీనికే హేతువిద్య యనియుఁ బేరు గలదు.[ధర్మము అర్థము అను నీరెంటి యొక్క వ్యాపారములను (కర్మలను) ప్రవర్తింపఁజేయుటకై పుట్టినవి త్రయీవార్తలు. ప్రవృత్తములగు వానిని నివృత్తములగు వానిని రక్షణచేయుటకై దండనీతి యావశ్యకమైనది.] కనుక ఆన్వీక్షికి త్రయి ననుసరించునది యని త్రయ్యంతర్భూతమైనదియని రెండువిధములు. సాంఖ్యాదు లగు శాస్త్రములు మొదటిదానిలోను, మీమాంసాది శాస్త్రములు రెండవదానిలోను చేరు నని యందురు.

దండము అనెడి నీతిని బోధించునది గనుక దండనీతి యయ్యెను. 5 ఆదండనీతియందే లోకయాత్ర సర్వము నాయత్తమై కలదు. ఈచెప్పినవి శాస్త్రములు. అనఁగా నివి యన్నియును విద్యలు, లేక విద్యాస్థానములగు శాస్త్రములు నని యెఱుంగఁదగును. వీని క్రిందిది సామాన్య లక్షణము కాఁగలదు.

శ్లో. సరితామివ ప్రవాహాస్తుచ్ఛాః ప్రథమం యథోత్తరం విపులాః
యే శాస్త్రసమారంభా భవంతి లోకస్య తే వంద్యాః.

[నదీప్రవాహములవలె తొలుదొలుత కొద్దికొద్దిగను పిమ్మట విపులముగను ప్రవర్తిల్లునట్టి శాస్త్ర సమారంభము లెయ్యవి కలవో, అయ్యవి లోకమునకంతకు మిక్కిలి అభివంద్యములుగా నగుచున్న వని భావము.]

ఈశాస్త్రములను సూత్రములతోడ రచియించెదరు. సూత్రించుటవలననే-అనఁగా వక్తవ్యాంశములను సంక్షేపించి కూర్చుటవలననే-ఇయ్యవి సూత్రము లనఁబడెను. ఇట్లే చెప్పిరి- పెద్దలుకూడను:—

---

5. కామందకమునందు నిట్లే చెప్పబడినది—దమశబ్దము దండప్రకృతి యగు నుపాయవిశేషమునందు అర్థము చెప్పబడుచున్నది. అద్దానియందు నెలకొని యుండుటంజేసి రాజును దండ మనియే వ్యవహరించుచున్నారు. అట్టి దండము యొక్క నీతి గనుక దండనీతి యని పేరు. ప్రజలను దోషమునుండి తప్పించి గుణములయందు పొందించునది గనుక ఇది దండనీతి యనంబడును. (నా ప్రచారణము—కామందక నీతిశాస్త్రము.)

శ్లో. అల్పాక్షర మసందిగ్ధం సారవ ద్విశ్వతో ముఖం
అస్తోభ మనవద్యం చ సూత్రం సూత్రవిదో విదుః

[కొలఁదిపాటి అక్షరములు కలిగినదై-నిస్సందేహముగా నర్థమును బోధించునదై-సారవంతమై - విశ్వతోముఖమై-అనల్పమై-నిర్దుష్టమై - యుండునట్టిదియే సూత్రమని సూత్రలక్షణము నెఱింగిన పెద్దలు తెలిసికొనిరి.]

సూత్రములయొక్క సకల సారమును వివరించునట్టిది వృత్తి. సూత్రవృత్తిని వివేచనచేయునది పద్ధతి. యుక్తిప్రత్యుక్తులను నెఱపునది-అనఁగాఁ బూర్వపక్షోత్తరపక్షపూర్వకముగా భాషించుటవలననగునట్టిది-భాష్యము అనఁబడును. అంతర్భాష్యము సమీక్ష యనఁబడును. మఱియును అవాంతరార్థ విచ్ఛేదము నయ్యది కల్గియుండిన సమీక్షయనియుఁ జెప్పఁబడును. సంభవించినంతవఱకును మూలగ్రంథమునకుఁగల అర్థమును సాంతముగా వివరించునది టీక యనంబడును. అచ్చటచ్చట నర్థము గానివిషమపదములకు నర్థమును నిర్వచించునట్టిది పంజిక యనఁబడును. అర్థమును వివరించు శ్లోకరూపములగు వ్యాఖ్యానములకు కారిక లని పేరు. ఉక్తానుక్త దురుక్తములను విమర్శించునట్టిది - అనఁగా అవ్యాప్త్యతివ్యాప్త్యసంభవదోషములనుఁ బరిశీలించి తెలుపునది-వార్తికము. ఇయ్యవి శాస్త్రభేదములు.

శ్లో. భవతి ప్రథమ స్తర్థం లీనం స మభివ్యక్తం స్ఫుటీకుర్వన్,
అల్ప మనల్పం రచయ నన్నల్ప మల్పం చ శాస్త్రకవిః.

అర్థమును ప్రస్ఫుటముగా వెల్లడి చేయుచు, గూఢముగ నున్న యర్థమును గాని, చిక్కగానున్న యర్థమునుగాని స్పష్టీకరించుచు - కొలఁదివస్తువుల విస్తరించి వర్ణించుచును, విస్తృతములగు వానిని సంక్షేపించుచును కవిత్వముఁ జెప్పువాఁడు శాస్త్రకవి అనఁబడును.

శాస్త్రములోని ఏకదేశమును నిర్వర్తించునది ప్రకరణము. మఱి యధ్యాయము మొదలైనవన్నియో మధ్య మధ్య చేయఁబడునట్టి గ్రంథ విచ్ఛేదములు (భాగములు) అని యనంబడును. ఇవి పండితులచేత స్వతంత్రముగ వ్రాయంబడినవై యుండి, అపరిసంఖ్యేయములను, ప్రత్యేకించి అనాఖ్యేయములను నై యున్నవి. శబ్దార్థములను ఉన్నవాని నున్నట్టులుగ సహభావముతో ప్రవర్తిల్ల జేయునట్టి విద్య కావుననే ఇయ్యది సాహిత్యవిద్య యనఁబడినది. ఇఁకఁ దక్కిన ఉపవిద్యలన్నియో అరువదినాలుగు గలవు. ఈఅరువదినాలుగును [6]కళలని విదగ్ధుల వాదము.

6. కళలు:—ఇయ్యవి అరువదినాలుఁగు. వాత్స్యాయనుని కామసూత్రమునందు ఇవి ఇట్లు లెక్కింపఁబడినవి. ప్రకృతమిచ్చట కేవలము అరువదినాలుగు కళలయొక్క పేర్లు మాత్రమే. ఎత్తివ్రాయంబడును. వీనిని గుఱించిన వివరములకుఁ గాను నేను ప్రచురించిన వాత్స్యాయన కామసూత్రములందు చూడఁదగును. కాన నిట సంక్షిప్తములు;—

1 గీతము. 2 వాద్యము. 3 నృత్త్యము 4 ఆలేఖ్యము. 5 విశేషకచ్ఛేద్యము. 6 తండులకుసుమబలివికారములు.

అది యే[అనఁగా కళయే] కావ్యమునకు ప్రాణాధారము. దానిని మున్ముందు ఔపనిషదికాధికరణమున జెప్పెదము.

శ్లో. ఇత్యసంతోఽభియుక్తానా మత్ర సంరంభవి స్తరః
త్యక్తో విపుణధీగమ్యో గ్రంథగౌరవ కారణాత్.

[ఇట్లు యభియుక్తుల కావ్యారంభవిధానము అనంతమై యుండును. గనుక నీవిషయమైన సంరంభ విస్తరము లిచటఁ ద్యజింపఁబడినవి అయ్యది, బుద్ధిమంతులు

---

7 పుష్పాస్తరణములు. 8 దశనవసనాంగరాగములు 9 మణిభూమికాకర్మ 10 శయనరచనము 11 ఉదకవాద్యము 12 ఉదకాఘాతము 13 చిత్రయోగములు. 14 మాల్యగ్రథనవికల్పములు. 15 శేఖరకాపీడయోజనము 16 నేపథ్యప్రయోగములు. 17 కర్ణపత్రభంగములు 18 గంధద్రవ్యయుక్తి 19 భూషణయోజనము 20 ఇంద్రజాలములు 21 కుచమారయోగములు. 22 హస్తలాఘవము. 23 విచిత్రశాక యూషభక్ష్యక్రియలు. 24 పానకరసరాగాసవయోజనములు. 25 సూచీవానకర్మలు 26 సూత్రక్రీడలు 27 వీణాడమరుకవాద్యములు. 28 ప్రహేళికలు. 29 ప్రతిమాల 30 దుర్వాచకయోగములు 31 పుస్తకవాచనము 32 నాటకాఖ్యాయికాదర్శనములు. 33 కావ్యసమస్యాపూరణము. 34 పట్టికావానవేత్రవికల్పములు. 35 తెక్షుకర్మలు. 36 తక్షణములు 37 వాస్తువిద్య 38 రూప్యరత్నపరీక్షలు. 39 ధాతువాదములు 40 మణిరాగాకర జ్ఞానములు. 41 మేషకుక్కుటలావకయుద్ధ

ఊహించి యెఱుంగందగినట్టిది గావున గ్రంథగౌరవ భయమున నిచ్చట మాచే ద్యజింపఁబడినది.

విశేషాంశములు:—వామనాచార్యుఁడు కూడ కావ్యవిద్యాంగముల నిట్లు వివరించి యున్నాఁడు—సు. ౧.లోకోవిద్యా ప్రకీర్ణకం చ కావ్యాంగాని.౨లోకవృత్తం లోకః, 3 శబ్దస్మృత్యభిధాన కోశచ్ఛందోవిచితి కళా కామశాస్త్ర దండనీతిపూర్వాః విద్యాః. ౪ శబ్దస్మృతే శ్శబ్దశుద్ధిః. ౫ అభిధానకోశా త్పదార్థనిశ్చయః. ౬ ఛందోవిచితే ర్వృత్తసంశయచ్ఛేదః. ౭ కళాశాస్త్రేభ్యః కళాతత్త్వ సంవిత్. ౮ కామశాస్త్రతః కామోపచారస్య

---

విధులు.42 వృక్షాయుర్వేదయోగములు. 43 శుకసారికా ప్రలాపనము. 44 ఉత్సాదనసంవాహన కేశమర్దనాదుల నేర్పులు. 45 అక్షరముష్టికాకథనములు. 46 మ్లేచ్ఛిత వికల్పములు. 47 దేశభాషావిజ్ఞానము. 48 పుష్పశకటిక. 49 నిమిత్తజ్ఞానము. 50 యంత్రమాతృక. 51 ధారణ మాతృక. 52 సంపాఠ్యము. 53 మానసిక కావ్యరచనము. 54 అభిధానకోశము. 55 ఛందోజ్ఞానము. 56 క్రియా కల్పము. 57 ఛలితకయోగములు. 58 వస్త్రగోపనములు. 59 ద్యూతశేషములు. 60 ఆకర్షక్రీడ. 61 బాలక్రీడనకములు. 62 వైనయికవిద్యాజ్ఞానము. 63 వైజయికవిద్యాజ్ఞానము. 64 వ్యాయామికవిద్యాజ్ఞానము—అని అఱువదినాల్గు కళలకు నిట్లు పేర్లుకలవు.

౯. దండనీతే ర్నయానయయోః. ౧౦ ఇతివృత్తకుటి
లత్వాంచ తతః అని. అనఁగా లోకము విద్య ప్రకీర్ణ
కము--అను నీ మూఁడును కావ్యవిద్యాంగములు. [అందు
లోకము వాడుకనుఁబట్టి సుశబ్దాపశబ్దములు తదర్థరీతులు
నెఱుంగఁదగును.] లోకవర్తనము కావ్యవిద్యాంగము.
ఇట్టులనే శబ్దశుద్ధి అభిధానకోశము ఛందోవిచితి కళా
తత్త్వము కామశాస్త్రము దండనీతి అను నీతి, ఇవియును
కావ్యాంగము లగు విద్యలే. వీనిలో శబ్దశుద్ధి శబ్దస్మృతి
యగు వ్యాకరణశాస్త్రమునుండియు, నర్థనిశ్చయము అభి
ధాన(నిఘంటు)కోశములనుండియును, ఛందోవిచితినుండి
వృత్తసంశయాపివారణమును, కళాశాస్త్రములనుండి కళా
తత్త్వజ్ఞానమును కామశాస్త్రమునుండి కామోచారములను
దండనీతినుండి నీతి అవినీతులను, ఇతిహాసాదులనుండి ఇతి
వృత్తచమత్కారమును కవి యెఱుంగఁదగును—అని
భావము. కేవలము ఇవి మాత్రమే గాక, లక్ష్యజ్ఞత్వము
అభియోగము వృద్ధసేవావేక్షణములు ప్రతిభానము
అవధానము-అనెడి ప్రకీర్ణము (గుంపు-సముదాయము)
కూడను కావ్యవిద్యాంగములే యనియుఁ జెప్పినాఁడు.
ఈ ప్రకీర్ణకములలో ఇతరకవుల కావ్యములందు పరిచయము
కల్గించుట లక్ష్యజ్ఞత్వ మనఁబడును. గురువుల నొద్దఁ
జేరి శుశ్రూషాపూర్వకముగా కావ్యవిద్యావిషయకము
లగు విశేషములను సాంప్రదాయికము లగు ననుభవ
ములను అడిగి తెలిసికొనుట వృద్ధసేవ నాఁబడు. పదాధానో

ధరణాదులు ఆవేక్షణము[1] లనంబడును. పూర్వపుణ్యవాసనచే లబ్ధమగు కవితాబీజము ప్రతిభానము అనంబడును. మనస్సున కేకాగ్రత నలవఱచికొని తన్మయత్వముతో[2] రసోదంచితముగా వ్రాయఁగల్గుట అవధానమనఁబడును—అని వీని స్వరూపము నెఱుంగఁదగును.

ఇది రాజశేఖర కవిరాజకృత మగు కావ్యమీమాంస యను కవిరహస్యమునందు ప్రథమాధికరణమునందు శాస్త్రనిర్దేశ మనునది ద్వితీయాధ్యాయము.




1. ఇది అనేకవిధములుగా నుండును. తొలుత రచనచేయఁదగిన కథ (అంశము- ఇతివృత్తము)ను పరీక్షించుట, అందలి క్రొచ్చులకస్థలనారసి సరిచేయుట, రసవ్యక్తిఁ గూర్చి ఏవఱక యుండుట, విభావాదుల వర్ణించుటలో నాయా అలంకారము లౌచితిఁ బాటించియుండునట్లు చూచుకొనుట—ఇత్యాదు లన్నియు నిందుచేరును.

2. రసోదంచితములు కాని కవిత్వరచనలు కుకవిత్వమునఁ జేరును. కుకవిత్వ మనునది ఒకరీతిగా మృతి నొందుట వంటి దగును. కనుక నే పెద్దలన్నారు—కదా!

తెలుగు విశ్వవిద్యాలయ గ్రంథాలయం

శ్లో. నాకవిత్వ మధర్మాయ మృతయే దండనాయ చ
కుకవిత్వం పున స్సాక్షా న్మృతి మాహు ర్మనీషిణః॥ అని.

# రాజశేఖరకవి కావ్య మీమాంస.

## కావ్య పురుషోత్పత్తి

---

### తృ తీ య ధ్యా య ము.

[ఈయధ్యాయమునందు వచ్చెడి విషయములు:— ౧. సరస్వతికిఁ గల్గిన పుత్రేచ్ఛ. ౨. బ్రహ్మ వరము నిచ్చుట. ౩. సరస్వతికి కావ్యపురుషుం డుదయించుట. ౪. అతని ఛందస్వద్వాగుచ్చారణము. ౫. కావ్యపురుష వర్ణనాదులు. ౬. శుక్రవాల్మీకులకు ఛందస్వద్వాక్యముల నుపదేశించుట. ౭. బ్రహ్మలోకమునకు వెళ్లుచు సరస్వతి కావ్యపురుషుని నివర్తింపఁజేయుటకై తద్వశీకరణమునకుఁగాను, సాహిత్యవధువును సృజించుట. ౮. కావ్యవిద్యాస్నాతకులను తచ్చరిత స్తవనమునకై ఆజ్ఞాపించుట. ౯. వారు ప్రాచ్యాదిదిక్కుల సంచరింపఁగా పాంచాలాది రీతు లుత్పత్తి యగుట. ౧౦. విదర్భదేశములోని వత్సగుల్మగ్రామమున వారిద్దరు (అనఁగా సాహిత్యవధూ కావ్యపురుషులు) పాణిగ్రహణము చేసికొనుట. ౧౧. హిమవంతమునకు పోవుట. ౧౨. గౌరీ సరస్వతులకుఁ బ్రణమిల్లుట. ౧౩. వారు ఆవధూవరుల నాశీర్వదించి వరము లొసంగుట. ౧౪. కవి లోకస్వర్గ నిర్మాణము-మొ.]



ఈ చెప్పఁబోవు విధముగా గురువులనుండి పవిత్రములును ప్రాచీనములు నగు మాటలను వినియుంటిమి. ఏమి యనఁగా- బృహస్పతిని ఏదో కథా(మాటల)సందర్భమున నతని శిష్యులు - అయ్యా! మీకు గురువును సార

స్వతేయుఁడు నగు కావ్యపురుషుఁ డెట్టివాఁడు ? అని అడిగి రఁట ! అబృహస్పతి వారి కి ట్లని చెప్పెను:—

పూర్వము ఒకమాఱు హిమవత్పర్వతమునందు సర స్వతీదేవి పుత్రార్థినియై తపస్సును చేయుచుండెను. సంప్రీ తమగుచిత్తముతో బ్రహ్మదేవుఁడు ఆమెతో నీకై ఒక కొమరుని సృజించుచున్నా ననెను. పిమ్మట ఆసరస్వతి కావ్యపురుషుని కనినది. ఆకావ్యపురుషుఁడును ఆమె కెదురై నిలిచి పాదములందు బడి, ఛందోవిన్యస్తమగు స్తుతివచనము ని ట్లని రచించెను:—

శ్లో. యదేత ద్వాఙ్మయం విశ్వ మర్థమూర్త్యా వివర్తతే
సోఽస్మి కావ్యపుమా నంబ పాదౌ వందేయ తావకౌ.

[ఎవ్వనివలన నీ సమస్తమైన వాఙ్మయమును అర్థ రూపమునఁ బరిణమించుచున్నదో, అట్టి కావ్యపురుషుఁ డను నేను. ఓ యమ్మా మీ పాదములకు ప్రణమిల్లు చున్నాను—అని భావము.]

ఆమ్నాయసంచారిణియును భాషావిషయమున ఛం దోముద్రయునైన ఆఛందస్వద్వాక్యమును విని, సరస్వతీ దేవి సమ్మోదముతో నతని నంకతలమునఁ జేర్చుకొని ఇట్లు లాలించెను.

నాయనా ! సచ్ఛందస్కవాక్ప్రణేతా ! వాఙ్మయ మాతనైన నన్ను దల్లినిఁగా జేకొని సర్వోత్కృష్టుఁడ వగుచున్నావు. పుత్రునివలనఁ బరాజయము నొందుట సాక్షాత్తును రెండవదియగు పుత్రజన్మ మే—యను ప్రశస్య

తమమగు వాక్యమును పెద్ద లుదాహరించుచు నుందురు. నీకంటెఁ బూర్వులైన పండితు లెల్లరును కేవలము గద్యము నెఱింగిరే కాని, పద్యము నెఱుఁగరు. నీయాదోపజ్ఞముగ నేటినుండి ఛందోనిబద్ధములగు వాక్కులు లోకమునఁ బ్రవర్తిల్లఁ గలవు. ఆహా! కొనియాడఁ దగుదువు. శబ్దార్థములు నీకు శరీరము. సంస్కృతము ముఖము. ప్రాకృతము బాహువు. జఘనము అపభ్రంశము. పైశాచము పాదములు. మిశ్రమభాష వక్షము. కనుక సముఁడవును-ప్రసన్నుఁడవును మధురుఁడవును ఉదారుఁడవును తేజస్వివియును నైతివి. నీవాక్కు ఉక్తియుక్తమైనది. రసమే ఆత్మ. ఛందస్సులు లోమములు. ప్రశ్నోత్తరములును ప్రవల్హికలును - ఈమున్నగునవి నీకు వచఃక్రీడలు [అనఁగా నాటలుఁ బాటలు.]అగును. అనుప్రాసోపమాదులు నిన్ను వన్నెఁ బెట్టుచుండును. భవిష్యదర్థమును చెప్పెడి వేదముకూడ నిన్ను ఈవిధముగా స్తుతించుచున్నది:—

చత్వారి శృంగా త్రయో అస్య పాదా ద్వే శీర్షే సప్తహస్తాసో అస్య
త్రిధా బద్ధో వృషభో రోరవీతి మహాదేవో మర్త్యాగ్ం ఆవివేశ

* [ఋగ్వేద 3-8-3 ]

[ఈవృషభాకారుఁడగు శబ్దజన్మునకు నామాఖ్యాతోపసర్గము లను నాల్గును శృంగములు. భూతభవిష్యద్వర్తమానము లను మూఁడు కాలములును ఇతనికి పాదములు. నిత్య కార్యరూపములగు శబ్దాత్మలు రెండును

తలలు. సప్తవిభక్తులును (ఏడువిభక్తులు) చేతులు. ఉరఃకంఠ శిరము లనుస్థానములు మూఁడిటియందును బద్ధుఁడై, మహాదేవుఁ డగు శబ్దస్వరూపుఁడు మనుష్యులను ఆవేశించెను. అనఁగా - మహాదేవుఁడగు శబ్దబ్రహ్మము శాంకరిజ్ఞాప్యుఁ డగుటచేతఁ దదావిష్టునివలె నగు చున్నాఁడు - అని అర్థము]

అయినను ప్రగల్భచేష్టను ఉపసంహరించికొనుము. బాలోచితములగు చేష్టలను చేయుము" - అని పలికి కల్ప వృక్షము మొదలనున్న నొక చలువరాతితిన్నెపై అతనిని పరుండఁబెట్టి, ఆమె స్నానముచేయుటకై యాకాశ గంగకుఁ బోయెను.

అంతలో కుశలను సమిధలను తెచ్చుకొనుటకని బయలువెడలివచ్చిన ఉశనుఁడు సూర్యకిరణసంతప్తమగు నాకఱకుటెండలో నున్న ఆ (కావ్యపురుషుని) బాలుని చూచెను. 'దిక్కులేని ఈబాలుఁడు ఎవ్వరివాఁడై యుండు నో !' యని యనుకొనుచు నతనిం దనయాశ్రమమునకుఁ గొనిపోయెను. కొంచెమంత సేపటిలో చక్కఁగా నూరడింపఁబడినవాఁడై ఆ (కావ్యపురుషుఁడు) బాలుఁడు అతనితో ఛందస్వతియగు (పద్యనిబద్ధమగు) వాక్కు నిట్లని ప్రచారించెను. హఠాత్తుగ నందుల కతని నాశ్చర్యపడు నట్లు చేయుచు, నతఁడు నతనితో (ఆ శుక్రునితో) ఇట్లు పద్యబద్ధమగు వాక్కున ననియెను:—

శ్లో. యాదృగ్గాపి వ దుగ్ధేవ కవిభిర్దుగ్ధాపి రత్నవహం,
హృది న స్సన్నిధత్తాం సా సూక్తిధేను స్సరస్వతీ.

[కవులు అనెడి పాలుపితుకు వారిచేతఁ బ్రతిదిన మును అవిరతముగా పితుకఁబడుచున్నను, ఎప్పటి కప్పుడు క్రొత్తదానివలె- అనఁగా ఎప్పుడును పితుకఁబడని దాని వలె-ఎయ్యది భాసిల్లు చున్నదో, ఆ సరస్వతీ మూర్తి యగు సూక్తిధేనువు మాహృదయములందు సన్నిధానము సేయుఁగాక.]

ఆ శ్లోకమును ముందు పఠించుచు చదువ వారలకు సుమేధస్త్వము కలుగునట్లతఁడు వర ముగా ననుగ్రహించెను. నాఁడు మొదలుకొని అయుశన సుని సజ్జనులు కవియని పిల్చుచున్నారు. ఆ మర్యాద చొప్పుననే ఛందస్సద్వాక్యములఁ బ్రవర్తింపఁ జేయువారిని "కవులు కవులు" అని లోకమునఁ బిలుచునట్టి వాడుక కల్గినది. 'కబృ=వర్ణే' అనెడి కావ్యకర్మకమగు ధాతువు యొక్క రూపమే కవిశబ్దము. కావ్యమునకు ముఖ్య కారణ మగుటవలన (అనఁగాఁ గావ్యైకరూపుఁ డగుట వలనఁ) సారస్వతేయుఁడు నగు కావ్యపురుషునియందును భక్తితోడ, ఈ శబ్దమును లోకులు వాడుక చేయు చున్నారు. పిమ్మట గంగానదినుండి ఇంటికి మఱలివచ్చి నదై వాగ్దేవి, అంతకు ముందుంచిపోయిన యా స్థలము నందు తనకుమారుఁడగు కావ్యపురుషుని కానక, ఆక్రం దించెను. ఏదో సందర్భవశమున నచ్చటికి వచ్చియున్న

మునిశ్రేష్ఠుఁడు అగు వాల్మీకి, ఆపిల్లవానిఁ జూడను నెఱిఁ గించి, ఆమెకు ఉశనసుని (శుక్రాచార్యుని) యాశ్రమ మును చూపించెను. ఆమెయును వాత్సల్యముచేతనుఁ బ్రసన్నతపోధనుఁడై, పుత్రుని తనయంకపాళిఁ జేర్చి కొని, శిరమును మూర్కొని - సౌహార్దముతో శుభ కామనగల చిత్తముతో, ఆప్రాచేతస (వాల్మీకి) మహ ర్షికిఁగూడను పూర్ణముగ ఛందోబద్ధములగు వాక్కుల ననుగ్రహించెను. ఆమెచే నిట్లు సత్కృతుఁడై పంపఁబడి వాల్మీకి, త్రోవలో నొక్కచోట విలాసములనున్న క్రౌంచపక్షుల (మిథునము) జంటలో నాడుపక్షిని బోయ యొక్కఁడు చంపుటఁజూచి, అందులకై కరుణ క్రేంకా రముగల ఎలుంగుతో విలపించుచున్న మగపిట్టను— చూచి, తానును తద్దర్శనజనితమగు సంతాపము చేత శోకాంతుఁడై -తనకుఁగల్గినదుఃఖమును వెంటనే ఛందో రూపమున నిట్లని వెల్లడించెను.

శ్లో. మా నిషాద ప్రతిష్ఠాం త్వ మగమ శ్శాశ్వతీ స్సమాః,
యత్క్రౌంచమిథునా దేక మవధీః కామమోహితమ్.

*[ఓరీ కిరాతా ! కామమోహితమైయున్న క్రౌంచ పక్షిని క్రౌంచమిథునమునుండి వేరుపఱచి వధించుటఁజేసి నీవు పెక్కేండ్లు ప్రతిష్ఠను పొందఁజాలవు - అని తాత్ప ర్యము.]

తరువాత దివ్యదృష్టిగల సరస్వతీదేవి, దీనినంతను నెఱిఁగినదై, అతనికిఁ గూడ ననుగ్రహించి ప్రసన్నయై,

ఇతరములను దేనినికూడ చదువనివాఁడైనను సరియే ఈశ్లోకమును తొలుదొలుత నెవఁడు పఠియించునో, వాఁడు సారస్వతకవిగాఁ గాఁగలఁడని—వరము నిచ్చెను. ఆ వాల్మీకిమహామునియును ఆమె చెప్పినచొప్పుననే–అవర ప్రభావముచేత–కవియై, రామాయణ మను నితిహాసమును రచించెను. ఇట్లే ద్వైపాయనుఁడగు వ్యాసమహర్షి కూడ పై శ్లోకములను తొలుదొల్తఁ జదివినవాఁడై ఆ సామర్థ్యముచేతనే నూరువేల శ్లోకములు గల భారత సంహితను రచింపఁ గల్గెను.

ఇట్లుండగా నొకమాఱు బ్రహ్మర్షులకును దేవతలకును శ్రుతివిషయమున గొప్ప వివాద మొకటి గాఁగా, దాక్షిణ్యము కలవాఁడు గనుక తాను పక్షపాతము వహింపక బ్రహ్మదేవుడు సరస్వతీదేవిని ఆ వివాదమును పరిష్కరించు దానినిగా నియమించెను. ఈసమాచారము నెట్లో విని కావ్యపురుషుఁడు బ్రహ్మలోకమునకు పోవుచున్నతనతల్లియగు సరస్వతీదేవిని–వెంబడింపఁ బోయెను. అంత నాయనా బ్రహ్మదేవుని యాజ్ఞలేనిదే నీవు బ్రహ్మలోకమునకు వచ్చుట మంచిది కాదు–అని బలాత్కారమున నతనిని వెనుకకు మఱల్చి సరస్వతి తాను వెడలిపోయెను. పిమ్మట ఆ కావ్యపురుషుఁడు రోషముతో వెనుకకు మఱలివచ్చెను. ఇతనికి (కావ్యపురుషుఁడు) ప్రియమిత్రమగు కుమారస్వామి ఈ కావ్యపురుషుని యాస్థితిని జూచి సహింపజాలక పెద్దపెట్టున నేడ్చుచుండ నతని

తల్లియగు గౌరిచే నిట్లని చెప్పఁబడినాఁడు. "బాబూ! నీవూరకుండుము. ఇదిగో నేను నీమిత్రుని మఱల్చి రప్పించెదను" అనిచెప్పి తనలో నిట్లని ఆలోచించికొనియెను:— తలఁచుగాఁ బ్రాణులకు ప్రేమకన్న మించిన బంధమే లేదు. కనుక ఇతనిని లోఁబరచుటకై దేనినైన నొక స్త్రీని సృజించెదను." అని ఆలోచించి నిశ్చయించికొని, సాహిత్యవిద్యావధువును సృజించెను. పిమ్మట ఆసాహిత్యవిద్యను "ఇదిగో నీకు-ధర్మతః పతియగు - కావ్యపురుషుఁడు రోషావిష్టుఁడై యున్నవాఁడు. కనుక-ఇతని ననుసరించి పోయి మఱల్చి కొని రమ్ము" అని ఆజ్ఞాపించి, అచ్చటి మునులఁజూచి, సరస్వతి 'అయ్యా! కావ్యవిద్యాస్నాతకులగు నో మునులారా! మీరుకూడ ఈదంపతుల (సాహిత్యవిద్యాకావ్యపురుషుల) చరితమును స్తుతియింపుఁడు ఇదియే మీకు కావ్యసరస్వముగఁ గాఁగలదు'- అని చెప్పి పూజ్యురా లగు ఆభవాని మౌనమున నుండెను. వారును-(అనఁగా నామునులును) ఆమె చెప్పినట్లు చేయ సంసిద్ధులై యుండిరి.

తరువాత నందలును మొదల-అంగ వంగ సుహ్మబ్రహ్మ పుండ్రాదులగు దేశములు గల తూర్పుదిక్కు నాశ్రయించిరి. [అనఁగా తూర్పుదిక్కునకు పోయిరని తాత్పర్యము] అచ్చట ఔమేయి [ఉమ అనఁ బార్వతి. ఆమెకన్న ఆఁడుబిడ్డ గనుక ఔమేయి అని సాహిత్యవధువుకు పేరు.] కావ్యపురుషుని అనుసరించుచు నేయే విషయమును-

అలంకార రచనావిధానమును స్వేచ్ఛగఁ జేసికొనెనో, అద్దానిని నచ్చటివారుకూడ ననుకరించిరి. అనఁగా అది యే అచ్చటనున్న స్త్రీలవలనను అనుకరింపబడెను. అచ్చటి యీసాహిత్యవధూకావ్యపురుషుల ఆప్రవృత్తియే ఔఢ్రమాగధి వృత్తి యయ్యెను. ఆవృత్తిని ఆమును లును ఇట్లు స్తుతించిరి:—

శ్లో. ఆర్ద్రార్ద్ర చందనకుచార్పిత సూత్రహారః
సీమంత చుంబిసిచయః స్ఫుటబాహుమూలః,
దూర్వా ప్రకాండ రుచిరా స్వగు రూపభోగాత్,
గౌడాంగనాసు చిర మేష చకాస్తు వేషః.

[మిక్కిలి యార్ద్రము (తడి) అగు చందనము నలఁదిన స్తనములపైని నర్పితములగు సూత్రహారములు గలది యును, పాపటను ముద్దుగొనుచున్న నిద్దంపు కుంకమపు బొట్టుగలదియును, స్పష్టములగు బాహుమూలములు కలదియును అగు ఈవేషాలంకృతి - అనఁగా నలంక రించుకొనురీతి - అగరును పొగ వైచుకొనుటఁజేసి, దూర్వాకాండములవలె మనోహరలై యున్న—గౌడదే శపుస్త్రీలయందు చిరకాలము ప్రకాశించుఁగాక. అనఁగా గౌడదేశపుస్త్రీలు, ఆరగా నారగా చందనముఁ బూసి కొనుచు హారములను ధరియించుచు నుందురనియును, పాపటలోఁ గుంకమపుబొట్టు పెట్టుకొందు రనియును, బాహు మూలములు స్పష్టముగాఁ గన్పించునట్లు వస్త్ర

ములఁ దాల్చుచుందు రనియును, అగరును మిక్కిలిగ వాడుచు నుండెడి రనియునుఁ దాత్పర్యము.]

యాదృచ్ఛికముగ నైన నాసాహిత్యతేయుఁడు ఎట్టి యలంకృతిగలవాఁ డయ్యెనో, అచ్చటి పురుషులును నట్టి వేషములే గలవారలైరి. ఆసాహిత్యవిద్యయును అచ్చట నాకావ్యపురుషుని వేషమున కనుకూలమగు వృత్తిగలది యే యయ్యెను. మఱియును ఆసాహిత్యవధువు అపు డచ్చోట నృత్తవాద్యాదికము నెయ్యెదాని నొనర్చెనో, అదియే భారతీవృత్తి యనఁబడినది. దాని నా మును లును ఇట్లని అభినుతించిరి - అను మాటను చేర్చుకొన వలయును. ఇట్లై మున్ముందు నని యెఱుంగఁదగు. అట్టి వేషము కలిగిన దైయున్నను ఆమెచేత వశంవదుఁడు కాక యుండి, ఆకావ్యపురుషుఁ డామెచే సమాసవంతముగను అనుప్రాసయుతముగను, యోగవృత్తి పరంపరాగర్భము గను పలుకఁబడిన దెయ్యదిగలదో, అదియే గౌడీయరీతి యని చెప్పఁబడెను. అట్టిరీతిని ఆ మునులును అనుకరించి రని వెనుక దానితో నన్వయము. ఏవృత్తుల స్వరూపస్వభా వాదు లెట్టివో, అవి ఏవిధముగా నుండునో మున్ముందు ఆయాసందర్భముల ననుసరించి చెప్పఁగలము.

పిమ్మట నతఁడు అటఁగదలి పాంచాలములఁ గూర్చి బయలువెడలెను. శూరసేనము హస్తినాపురము కాశ్మీర ము వాహీకము బాహ్లీకము బాహ్లావేయము మున్నగు దేశము లాపాంచాలమందే యంతర్గర్భితములై యున్నవి.

అచ్చట నతని ననువర్తించుచు, ఆసాహిత్యవిద్య ఏ వేషమును ధరించి సేవించెనో ఆవేషమే ఆదేశవాసులగు స్త్రీలచేతను ననుకరింపంబడియె. ఆదేశమున ప్రవర్తిల్లి నట్టి సాహిత్య వధూప్రవర్తనమెయ్యది కలదో, అదియే పాంచాలమధ్యమ యనెడివృత్తి యనంబడినది. అంత నద్దానిని ఆమునులు ఇట్లు అభినుతించిరి:—

శ్లో. తాటంకవల్గన తరంగిత గండలేఖ
మానాభిలంబి దర దోలిత తారహారం,
ఆశ్రోణిగుల్ఫ పరిమండలి తోత్తరీయం
వేషం నమస్యత మహోదయ సుందరీణామ్.

[కమ్మలు కదలియాడుటచే తరంగితములగుచున్న గండస్థలములతో నొప్పారుచు - నాభి- అనఁగా బొడ్డు వఱకును-వ్రేలుచుఁ గదలియుఁ గదలనిరీతి నడయాడు చున్న హారములుఁగలిగి - పిరుదులనుండి గుల్ఫముల వఱకు చుట్టుకొనిన యుత్తరీయముతో నొప్పియున్న మహోదయదేశపు సుందరీమతల్లులయొక్క వేషమును గుఱించి - అనఁగా నలంకరణ ప్రకారమును గుఱించి- నమస్కరింత్రుగాక.]

దీనఁ గొంచెమంత ఆర్ద్రితమనస్కుఁడై -అనఁగాఁ గొంచెము కఱఁగిన చిత్తముఁగలవాఁడై, - ఆసారస్వతేయుఁడగు కావ్యపురుషుఁడు ఏయే విధమగు నేపథ్యమున నలంకృతుఁ డయ్యెనో, ఆయా వేషాలంకృతుల నచ్చటి స్త్రీలును అనుకరించిరి. అచ్చట నాసాహిత్యవధువు ప్రద

ర్శించిన యీషన్నృత్తగీతవాద్య విలాసాదిక మేదికలదో అది సాత్వతీవృత్తి యయ్యెను. ఆవిద్ధగతి కలదగుటచే నవి ఆరభటి యనఁబడినవి. దానిని ఆమునులును నుతించిరి- అని ఇత్యాదికముగా వెనుకటియట్లే తెలియవలయును. ఇట్టి వేషము కల్గియున్నను నతఁడు ఈషద్వశుఁడుగాఁ జేయఁబడినవాఁడై ఆ సాహిత్యవధువుచే ఈషదను ప్రాసముగను, ఈషదసమాసముగను ఉపచారగర్భముగను సంభాషించుట యెయ్యది గలదో అదియే, అనఁగా నాప్రవృత్తియే—పాంచాలిరీతి యనఁబడినది.

తరువాతను ఆకావ్యపురుషుఁ డవంతిదేశములఁ గూర్చి బయలు వెడలెను. అందు వైదిశసురాష్ట్రమాలవ అర్బుద భృగుకచ్ఛపావంత్యాది జనపదములు గలవు. అవంతిదేశములకుఁ బోయి, అచ్చటఁ బ్రవర్తించుచు నతని ననువర్తించు ఆసాహిత్యవధువు ఏయే వేషమును చేసికొనెనో, దానిని అచ్చటి స్త్రీలును అనుకరించిరి. ఆ ప్రవృత్తియే అవంతీవృత్తి నాఁబడెను. అదియే పాంచాలమధ్యమము మొదలు దాక్షిణాత్యుల దేశము వఱకుఁగల మధ్యప్రదేశమం దున్నది. కనుకనే ఆ దేశములలోనివి సాత్వతీ కౌశికీవృత్తు లనంబడు అచ్చట నా సాహిత్యవధువును ఆమునులు ఇట్లని స్తుతించిరి.

శ్లో. పాంచాలనేపథ్యవిధి ర్నరాణాం
స్త్రీణాం పున ర్నందతు దాక్షిణాత్యః,
య జ్జల్పితం య చ్చరితాదికం త
దన్యోన్యసంభిన్న మవంతిదేశే.

[పురుషులకైనచోఁ బాంచాలదేశపు నేపథ్యవిధి యును, స్త్రీల కైనచో దాక్షిణాత్య వేష రచనమును అచ్చటివారి కయ్యెను. ఇఁక నవంతిదేశమున నయ్యది అన్యోన్య భిన్నముగా నున్నది-యని భావము.

తరువాత వారు దక్షిణంపు దిక్కున కేగిరి. అందు మలయ మేకల (మేఖల?) కుంతల కేరళ పాల మంజర మహారాష్ట్ర గంగ కళింగాదులు దేశములు కలవు. ఇవి ఈ దేశములోఁ జేరినవే. అచ్చట ప్రవర్తించుచు ఆమె ఏయే వేషమును వైచిత్యసమెనో దానినే అచ్చటి స్త్రీలును అనుకరించిరి - ఇత్యాదికము నెప్పటివలెనే యెఱుంగు నది. అదియే దాక్షిణాత్య వృత్తి యనఁబడినది. దాని నా మునులును ఇట్లని యభినందించిరి.

శ్లో. ఆమూలతో వలితకుంతల చారుచూడ
చూర్ణాలక ప్రచయలాంఛిత ఫాలభాగః,
కక్షానివేశనిబిడీకృతనీవి రేష
వేష శ్చిరం జయతి కేరళకామినీనామ్.

[మూలమునుండియు వలితములుగనున్న (ఉంగరములుగ గుండ్రనైన) వెండ్రుకల కొప్పులు గలదై, కుంకుమ చూర్ణముచే రంజితములగు ముంగురుల గుంపు చేత లాంఛితములగు ఫాలప్రదేశములు గలదయ్యును, కటిలవలికను [చంకలవలకు] ఎగగట్టబడిన పోకముడి కుచ్చు గలదియు నగు కేరళదేశపు స్త్రీలవేషము బహుకాలము అతిశయమునఁ బ్రకాశించును గాక!]

ఇట్టి వేషముగల ఆ సాహిత్యవధువును మిక్కిలిగ ప్రేమించినవాఁడై, ఆ కావ్యపురుషుఁ డెట్టిరీతి వేషము కలవాఁ డయ్యెనో, ఆమెయు నట్టిరీతినే యతని ననుకరించెను. అచ్చటివారి[సాహిత్యవిద్యాకావ్యపురుషుల] వేషము నచ్చటి స్త్రీపురుషులచేతను ననుకరింపఁ బడియెను. మఱియు నామె ఏయే చిత్ర విచిత్రములగు గీత వాద్య విలాసాదులను ప్రకటించెనో అదియ కౌశికీవృత్తి యయ్యెను. ఆ కౌశికీవృత్తిని ఆ మునులును స్తుతించిరి. ఆ సాహిత్యవధువుచే వశంవదుఁడుగఁ జేసికొనంబడి యతఁడు, స్థానము లనుప్రాసములు గలుగునట్లుగను-సమాసములు లేకుండునట్లుగను, యోగవృత్తి గర్భముగను - పలికినపలుకులే వైదర్భీరీతిగఁ బరిణమించెను. దానిని ఆమునులును స్తుతించిరి. అందలి వేష విన్యాసక్రమ మేది గలదో అదియే ప్రవృత్తియని, విలాస విన్యాసక్రమ మేది గలదో అదే వృత్తియని యనఁబడును. వచన విన్యాసక్రమ మేది గలదో అదియే రీతి నాఁబడెను. "వృత్తులకును ప్రవృత్తులకును నాలుగు విధముల గమనము మాత్రమే కదా యున్నది. అట్టిచో దేశములెన్ని యో గలవు. లెక్కలేనట్టి ఇన్ని దేశములకు అన్నిటికినిఁగలిసి ఈ నాల్గువిధములగు రీతి ప్రవృత్తులు మాత్రమేయని యెట్లు గ్రహింపవచ్చు"నని ఆచార్యులు అనిరి. దేశములు లెక్కలేనన్ని యున్నను, వాని నన్నిటిని మొత్తముపైని నాల్గు భాగములుగా విభజించి, ఏర్పాటు చేయు

దురు. క్షేత్రమును(దేశమును)సామాన్యముగా నిర్దేశించిన పిమ్మట, అవాంతర భేదములచేత నద్దానిని వివరింతురు. కాఁబట్టి "సామాన్యతః చక్రవర్తిక్షేత్రమందురు. దానిలో నవాంతరవిశేషములచేఁ బెక్కుదేశము లనంతముగాఁగలవు కాన దేశములు మాత్రము అనంతములే" అని యాయావరీయుఁ డనెను. దక్షిణసముద్రము మొదలుగా నుత్తరపుదిక్కున వేయియోజనములవఱకునుఁగల దేశము చక్రవర్తి క్షేత్రము. ఆక్షేత్రమం దిది అలంకారపద్ధతి. అటుపైని దివ్యాదు లాశ్రయించిన దేశములునుగలవు. ఏదేశము నధివసింతు రచ్చటి వేషము నాశ్రయించినట్లు చెప్పి,అందుఁ గలసందర్భములు ఆయాదేశానుసారముగఁ నిబంధింపఁదగును. [1]కవులు వర్ణన సందర్భములలో తమ

---

1. రాజశేఖరుఁడు ఈ కథావర్ణన వ్యాజముతో రీతుల యుత్పత్తిని వివరించుచున్నాడు. కావ్యాలంకార సూత్రమును వ్రాసిన ఆచార్య వామనుఁడును తన గ్రంథమునఁ దక్కిన యాలంకారికులు చెప్పిన చొప్పుననే వైదర్భీ గౌడీపాంచాలీ రీతులను మూఁడింటిని మాత్రమే పేర్కొనెను. కాని రాజశేఖరునివలె నాల్గు రీతులను గాని, అయ్యవి ఆయాదేశవశమున నేర్పడిన వని గాని, చెప్పకుంటయే గాక—'విదర్భాదిషు దృష్టత్వా త్తత్సమాఖ్యా' [అధి ౧. అధ్యా ౨. సూ ౧౦] అని లక్షణముం జెప్పి, విదర్భ గౌడపాంచాలేషు దేశేషు తత్రత్యైః కవిభిః యథాస్వరూప ముపలబ్ధత్వా ద్దేశ సమాఖ్యా, నపున ర్దేశైఃకించి దుపక్రియతే కావ్యానాం—అని దానికి తానే వ్యాఖ్యానించెను. మఱి యిట్టిస్థితిలో—రాజశేఖరుని యీవచనము అప్రమాణమని—యనుకొందమన్నచో నట్లు

దేశమువారిని అందు తమ్ముఁ దా మెల్లు వర్ణించుకొన్న నః- ద్వీపాంతరలోకాంతరములందు జనించిన వారిస్థితి విషయమునందు మాత్రము తదనుసారముగనే వృత్తిప్రవృత్తులను వర్ణింపఁదగును. ఇఁక రీతులన్ననో మూఁడు మాత్రమే. వానిని మున్ముందు వివరించెదము.

ఈ వివరించిన దేశములలో-భగవానుఁడగు మన్మథునకు క్రీడావాసముగ నొప్పుచున్నదై, విదర్భదేశమునందు వత్సగుల్మమను [1]పట్టణ మొక్కటి గలదు. ఆపట్టణ

---

చెప్పుటకు వీలు లేదు. భరతమహర్షి రచించిన నాట్యశాస్త్రమునందు రీతివివేచన సేయు సందర్భమునందలి యీక్రింది వాక్యములు రాజశేఖరుని మతమున కాధారములుగా గన్పట్టుచున్నవందురు. ఆవాక్యము లివి. (చూడుము-భరతశాస్త్రము 13 అధ్యాయము.)

శ్లో. చతుర్విధా ప్రవృత్తిశ్చ ప్రోక్తా నాట్యప్రయోక్తృభిః,
ఆవంతీ దాక్షిణాత్యా చ పాంచాలీ చోఢ్రమాగధీ.

అత్రాహ—ప్రవృత్తిరితి కస్మాత్? ఉచ్యతే-పృథివ్యాం నానాదేశభాషాచారవార్తాః ప్రవర్తయతీతి ఖ్యాపయతీతి వృత్తిః ప్రవృత్తిశ్చ నివేదనే. అత్రాహ-యదా పృథివ్యాం నానాదేశాస్సంతి, కథమాసాం చతుర్విధత్వం ఉపపన్నం? సమానలక్షణశ్చాసాం ప్రయోగ ఉచ్యతే. ఏవ మేవ సమానలక్షణః ప్రయోగః. కింతు నానాదేశవేషభాషాచారో లోక ఇతి కృత్వా, లోకానుమతే వృత్తిసంశ్రితస్య మయా చతుర్విధత్వమభిహితం భారత్యారభటీ సాత్వతీ కైశికీచేతి. వృత్తిసంశ్రితైశ్చ ప్రయోగైరభిహితా దేశాః, యతః ప్రవృత్తిచతుష్టయమభినివృత్తం ప్రయోగశ్చోక్తాదితః—ఇత్యాది.

2. బృహత్కథా మంజరియందును, వాత్స్యాయనుని కామ

మందు సారస్వతేయుఁడు పార్వతీపుత్రియగు సాహిత్య విద్యను గాంధర్వవిధితోఁ బెండ్లిచేసికొనెను. పిమ్మట నా దంపతులు (అనఁగా సాహిత్య విద్యా కావ్యపురుషులు) ఆయా దేశముల నెల్ల విహరించుచుఁ గ్రమముగా హిమవద్గిరిఁ జేరిరి. అచ్చట గౌరీసరస్వతు లిద్దఱును ఒకరితో నొకరు సంబంధములను చేసికొనఁగోరినవారలై యుండిరి. వా రిర్వురును, తమకు నమస్కరించిన సాహిత్య విద్యా కావ్యపురుషులను ఆశీర్వదించి, దివ్యప్రభావమయ మగు శరీరమును వారల కనుగ్రహించి, వా రిర్వురను కవిజన మానసములందు స్థిరనివాసులై దివ్యరూపమున వెలుఁగొందుఁ డని వరమిచ్చి యనుగ్రహించిరి. ఆ దంపతుల కిద్దఱకును కవిలోక స్వర్గమును కల్పించి యిచ్చిరి.

---

సూత్రములందు, బాణుని హర్షచరిత్రమునందు ఈవత్సగుల్మములను గుఱించిన ప్రస్తావనము కలదు. అందులో—

౧. బృహత్కథా మంజరిలో —(1-3-4)

శ్లో॥ అభూత్తాం దాక్షిణాత్యస్య ద్విజాతేస్సోమశర్మణః,
వత్సగుల్మాభిధౌ పుత్రౌ తద్దేశో వత్సగుల్మకః.

౨. వాత్స్యాయన సూత్రములలో - (జయమంగళవ్యాఖ్యలో 5-6-36) దక్షిణాపథే సోదర్యౌ రాజపుత్రౌ వత్సగుల్మౌ తాభ్యా మధ్యాసితో దేశో వత్సగుల్మక ఇతి ప్రతీతః

పైని చూపిన వాక్యములంబట్టి వత్సగుల్మము దక్షిణాపథమునందలి దేశ మనుట నిర్వివాదము. మఱియు రాజశేఖరుఁడు కూడ ఈదక్షిణదిక్కును గూర్చి చెప్పినప్పుడే వత్సగుల్మములను పేర్కొనుటచేత విదర్భయు వత్సగుల్మమును దక్షిణాపథమునే యని నిర్ణీత మగుచున్నది

ఆ స్వర్గమునందే కవులు, కావ్యమయమగు శరీరముతో మర్త్యలోకమున నుండియును, దివ్యదేహములతో కవిలోకస్వర్గమున నివసించువారలై ఆకల్పము నానందించుచున్నారు—అని. యీ విధముగా బృహస్పతి తనగురువగు కావ్యపురుషుని యుత్పత్తిని గుఱించినకథను తన శిష్యులకు ఎఱింగించెను.—అని విని యున్నారము.

ఇట్లు బ్రహ్మచేత కావ్యపురుషుఁడు పూర్వము సృజింపఁబడెను. ఈరీతిగా విభజనపూర్వకముగా కావ్యపురుషుని యుదంతమును—ఎవ్వఁడెఱుగునో, వాఁడు ఐహికాముష్మికములందు అనారతమును నానందరూపుఁడై వెలుఁగుచున్నాఁడు. 3

ఇది రాజశేఖరకవిరాజకృత మగు కావ్యమీమాంస యను
కవిరహస్యమునందు ప్రథమాధికరణమునందు
కావ్యపురుషోత్పత్తి యనునది తృతీయాధ్యాయము.

---

3. నాట్యశాస్త్రమునందు-ఆయాదేశములును తత్రత్యవేషభాషాచారములు గల లోకమును, తదనుసారములుగా నేర్పడిన వృత్తిభేదములును ఈక్రింది శ్లోకములలోఁ బొందుపరుపఁబడినవి.

(౧) అందు దాక్షిణాత్య దేశ వృత్త్యాదులు:—

శ్లో. మహేంద్రో మలయ స్సహ్యో మేకలః పలపింజరః,
యే తేషు సంశ్రితా దేశా స్సదేశో దక్షిణాపథః.
కోసలా స్తోసలా శ్చైవ కళింగా ఏవ గోసలాః,
ద్రవిడాంధ్రమహారాష్ట్రాః వైణ్ణా వై వానవాసజాః.
దక్షిణస్య సముద్రస్య తథా వింధ్యస్య చాంతరే,
యే దేశా స్తేషు యుంజీత దాక్షిణాత్యాం తు నిత్యశః.

(౨) ఆవంతికి దేశ వృత్త్యాదులు:—

శ్లో. ఆవంతికా వైదిశికా సౌరాష్ట్రీ మాళవా స్తథా,
సైంధవా స్త్వథ సౌవీరాః ఆనర్తా స్సార్బుదేయకాః,
దాశార్ణా స్త్రైపురా శ్చైవ తథా వై మార్తికా స్స్మృతాః,
కుర్వం త్యావంతికీ మేతే ప్రవృత్తిం నిత్య మేవ తు.
సాత్త్వకీ కైశికీ చైవ వృత్తి రేషాం సమాశ్రితా,
భవే త్ప్రయోగో నాఽన్యత్ర సర్వైః కార్యః ప్రయోక్తృభిః.

(౩) ఔఢ్రమాగధీ వృత్త్యాది దేశములు:—

శ్లో. అంగా వంగాః కళింగా శ్చ వత్సా శ్చౌఢ్రమాగధాః,
పౌండ్రనేపాళికా శ్చైవ అంతర్గిరి బహిర్గిరీ,
తత్ర వంగసమా జ్ఞేయా మలదా మల్లవర్తకాః,
బ్రహ్మోత్తరప్రభృతయో భార్గవా మార్గవా స్తథా.
ప్రాగ్జ్యోతిషాః పుళిందా శ్చ వైదేహాః తామ్రలిప్తికాః,
ప్రాఙ్మాగాః ప్రావృతయ శ్చైవ యుంజంతి హ్యౌఢ్రమాగధీం,
అన్యే దేశా ఏభ్యోఽపి పురాణే యే ప్రకీర్తితాః,
తేషు ప్రయుజ్యతే హ్యేషా ప్రవృత్తి స్త్వౌఢ్రమాగధీ.

(౪) పాంచాలాది దేశ తద్వృత్త్యాదులు:—

శ్లో. పాంచాలమధ్యమాయాం తు సాత్త్వ త్యారభటీ స్మృతా,
ప్రయోగ స్త్వల్పగీతార్థం ఆవిద్ధగతివిభ్రమః.
పాంచాలా శ్శౌరసేనా శ్చ కాశ్మీరా హా స్తినాపురాః,
వాల్హికా శ్శాకలా శ్చైవ భద్రకాశీనరా స్తథా.
హిమవత్సంశ్రితా యే చ గంగాయా శ్చోత్తరాం దిశం,
యే శ్రితా వై జనపదా స్తేషు పాంచాలమధ్యమా.

# రాజశేఖరకవి కావ్యమీమాంస.

## పదవాక్య వివేకము.



### చతుర్థాధ్యాయము.

[ఈ యధ్యాయమునందు వచ్చు విషయములు:—౧. శాస్త్రముచే ననుశాసింపఁదగిన శిష్యులలోని భేదములు. ౨. అందన్యథాబుద్ధి తక్కువ రకమువాఁడనుట. ౩. సమాధి అభ్యాసయోగము లను వాని వివరములు. ౪. దానివలన శక్తివికాసము గల్గు ననుట. ౫. ప్రతిభా వ్యుత్పత్తి కర్మలు శక్తికర్తృకము లనుట. ౬. ప్రతిభను నిర్వచించుట, ౭. ప్రతిభలోఁగల భేదములు. ౮. అందు కారయిత్రి అను ప్రతిభ సహజాదిభేదములచే ముత్తెఱఁగు లగుట, ౯. దానికి వ్యుత్పత్త్యాదుల వివరించుట. ౧౦. తదనుసారముగా కవుల్లోను ముత్తెఱఁగు లేర్పడుట. ౧౧. ముత్తెఱఁగులగు నా కవులకు పేర్లు వెట్టుట. ౧౨. వారిలక్షణములు. ౧౩. భావయిత్రీ ప్రతిభను నిర్వచించుట. ౧౪. భావకత్వము కవిత్వము—అను నివి వేర్వేరు శక్తు లనుట. ౧౫. భావకత్వము గలకవులలోఁ గల (అనఁగా భావకులలో) నాల్గు భేదముల నిర్వచించుట. ౧౬. తల్లక్షణములు. ౧౭. అందభినివేశులు తఱుచుగా నుందు రనుట. ౧౮. భావకునిఁ గూర్చిన ప్రాచీనుల మతములఁ దెల్పు సంగ్రహ శ్లోకములు మొ.]



బుద్ధిమంతుఁ డనియును ఆహార్యబుద్ధి యనియును శిష్యుడు 1 రెండు తెఱఁగు లని పల్కెదరు. ఎవ్వానికి సహజముగ శాస్త్రములపైఁ బ్రసరించుబుద్ధి గలదో, వాఁడు బుద్ధిమంతుఁడు. శాస్త్రాభ్యాసమువలన సంస్కరింపఁబడిన బుద్ధి ఎవ్వానికిఁ గలదో, వాఁడు ఆహార్యబుద్ధి. ఆబుద్ధికూడ— స్మృతియనియును మతియనియును, ప్రజ్ఞయనియును ముత్తెఱఁగులు. అందు—కడచిపోయినట్టి కార్యములనైనను జ్ఞప్తికిఁ దెచ్చుకొనునది స్మృతిబుద్ధి. వర్తమాన కార్యమును చింతించుచుండునట్టిది మతిబుద్ధి. అనాగత మగదానిని తెలిసికొనునది ప్రజ్ఞాబుద్ధి. ఈ మూఁడు విధములగు బుద్ధులును కవులకు మిగుల నుపకరించునట్టి వని యెఱుంగఁ దగును.

ఇరుతెఱఁగులగు ఆ శిష్యులలోను—బుద్ధిమంతుఁడగు వాఁడు గురువులకు ప్రయత్న పూర్వకముగా శుశ్రూషల నొనర్చును. ఆతఁడు చెప్పిన దానిని చక్కఁగా వినును. వినినదానిని గ్రహించును. గురువు చెప్పిన విద్యను మఱచిపోక జ్ఞప్తియందు నుంచుకొనును.

---

1. శిష్యులు అనఁగా శాస్త్రోపదేశముచేత శాసింపఁదగిన బుద్ధి గలవారు అని అర్థము. కౌటిల్యుడును తనయర్థశాస్త్రమందు (1-17) ఇట్లే చెప్పుచున్నాఁడు:—బుద్ధిమాన్ ఆహార్య బుద్ధిః దుర్బుద్ధిః ఇతి పుత్రవిశేషాః, శిష్యమాణో ధర్మార్థా వుపలభతే అనుతిష్ఠతిచ య స్స బుద్ధిమాన్, ఉపలభమానో నానుతిష్ఠతి య స్స ఆహార్యబుద్ధిః అపాయనిత్యో ధర్మార్థద్వేషీచ య స్స దుర్బుద్ధిః—అని.

అందలి సారము నెక్కుడుగ గ్రహింపగలుగును. ఊహాపోహలచే నాలోచించును. అనర్థములను పోగొట్టుకొనగలడు. తత్వమును గుర్తింపగలడు. ఆహార్యబుద్ధికి గూడ నివియే గుణములు; కాని ప్రశాస్తను-శిక్షసేయు గురువును-అపేక్షించును. ఇట్టి వీరుభయులకును దినదినమును గురువుల నుపాసించుట అనునది—అత్యుత్తమమైన గుణముగా నగును. గురూపాసనము బుద్ధిని వికసింపజేయుటకు కామధేనువు వంటిది. ఇట్లే పలికిరిగూడ-

శ్లో. ప్రథయతి పురః ప్రజ్ఞాజ్యోతి ర్యథార్థపరిగ్రహే
తదను జనయ త్యూహాపోహక్రియా విశదం మనః
అభినివిశతే తస్మా త్తత్త్వం తదేకముఖోదయమ్
సహపరిచయో విద్యావృద్ధైః క్రమా దమృతాయతే.

[విద్యావృద్ధులైన (గురువులు మున్నగు) వారితోనయ్యెడి పరిచయము, ప్రజ్ఞాజ్యోతిని అర్థమును పరిగ్రహించుటలో నెల్లలుదొల్త సమర్థమైనదెట్లగునో యట్లు జేయును. అటుతరువాత మనస్సును ఊహాఽపోహ క్రియలందు నిర్మల మైనదానిగా జేయును. తన్మూలమున నేకముఖోదయముగా తత్త్వము గుఱించిన యభినివేశము గల్గించుచున్నది. ఇట్టిది క్రమక్రమముగా బెక్కులు శ్రేయములకు దావలమై సదా అమృతాయమానమై రాజిల్లుచున్న దని భావము.]

ఈ పైని చెప్పిన బుద్ధులకంటెను భిన్న మైనట్టిదగు బుద్ధి కలవాడు దుర్బుద్ధి యనబడును. కనుక బుద్ధిమంతునకే

కవిత్వప్రతిపత్తి కల్గు నందురు. అట్టి శిష్యజనుఁడు, అనఁగా బుద్ధిమంతుఁడు, ఒకమాఱు చెప్పినంతనె అర్థముఁ జేసికొనుచున్నవాఁడై కవిమార్గమును అన్వేషించుటకై గురుకులమును ఉపాసింపవలయును. ఆహార్యబుద్ధి కన్ననో అప్రతిపత్తి యని సందేహ మని రెండును నుండును. ఆతఁడు నిష్పన్నముగాని యర్థముఁ దెలిసికొనుటకును, సందేహములను బోఁగొట్టుకొనుటకు నై గురువులను సేవింపవలయును. ఇఁక దుర్బుద్ధికన్ననో సర్వత్రా సర్వవిషయములలోను మతివిపర్యాసమే. మఱియును ఆదుర్బుద్ధి అనాధేయగుణాంతరుఁ డగుటవలన నీలమేచకితసిచయకల్పుఁడై యుండును. అట్టి వానిని సారస్వతానుభావ మనుగ్రహించు నందురేని అట్లయినచో నా రీతులను ఔపనిషదిక ప్రకరణమునందు వివరింపఁ గలవారము.

"కావ్య నిర్మాణమునందు కవికి సమాధి (ఏకాగ్ర చిత్తము) మిక్కిలి ఆవశ్యక" మని శ్యామదేవుఁడు పల్కెను. 2 మనస్సు నేకాగ్రత నొందించుటయే-అనఁగా

2. కావ్యాలంకార సూత్రకర్త యగు ఆచార్య వామనుఁడు నిట్లే చెప్పెను—సూ. చిత్తైకాగ్ర్యం అవధానం [1-3-17] చిత్తస్యైకాగ్ర్యం బాహ్యార్థనివృత్తిః, త దవధానం-అని. అనఁగా బహిరింద్రియములగు చక్షుశ్శ్రోత్రాదులు తమతమ వ్యాపారములను కట్టి పెట్టుట వలనఁ జేకూరెడి ఏకాగ్రతయే అవధానమని యనంబడును నని యందురు—అని దీని కర్థము.

నిశ్చలత్వము నొందించుటయే-సమాధి యనఁబడును. చిత్తము సమాహితమయ్యెనేని వర్ణనీయములగు అర్థములను చక్కఁగా సంవర్ణింపఁ గలుగును. ఇట్లే చెప్పఁబడినదికూడ—

శ్లో. సారస్వతం కిమపి తత్సుమహారహస్యం
యద్గోచరే చ విదుషాం నిపుణైకసేవ్యం,
తత్సిద్ధయే పరమయం పరమోఽభ్యుపాయః
య చ్చేతసో విదితవేద్యవిధే స్సమాధిః.

[సారస్వతమనునది ఒకవిధమగు — అనిర్వచనీయమును - సుమహారహస్యమునగు వస్తువు. దానిని ప్రత్యక్షముఁ జేసికొనుటలో అయ్యది విద్వాంసులకే- (నిపుణతతో సేవింపఁ దగియున్నదై) నిపుణైకసేవ్యమై యుండును. అనఁగాఁ జక్కఁగాఁ జదివిన పండితులైనప్పటికిని మంచి నైపుణ్యమలవఱచికొనినఁగాని సారస్వతరహస్యమును కనిపెట్టుశక్తి నొందఁజాలరు. అట్టి దుర్జ్ఞేయమైన సారస్వతవిద్యారహస్యమును సిద్ధింపఁజేసికొనుటకు, ఒకే యొక యుపాయము కలదు. అదియే యనఁగా—వేద్యవస్తువు నెఱుఁగఁగల చిత్తమునకు ఏకాగ్రత నొందించుటయే!]

'అభ్యాసతిమావశ్యక మని మంగళుఁడు'4 అనెను.

3. ఇట్టులనే ఇతరాలంకారికులును సెలవిచ్చినారు:— "అభ్యాసోహి కర్మణాం కౌశల మావహతి" - అని. అనఁగా నెట్టిదుర్ఘటము లగు కార్యములైనను సరియే నిరంతర మగు నభ్యాసము

అభ్యాస మనఁగా౯ డెంపులేకుండ, అనఁగా-నిరంతరమును కృత్యవస్తువును-పరిశీలించుటయేయగు. ఇట్టి యభ్యాసము అలవడెనేని ఏవిషయమందైన నా విషయముపై వ్యాపించి, నిరతిశయ మగునేర్పు నందు నొనగూడఁ జేయఁగలదు. సమాధి (చిత్తైకాగ్ర్యము) అంతరప్రయత్న మని, అభ్యాసము బాహ్యప్రయత్న మని చెప్పఁబడును. ఈ యుభయ యత్నములును శక్తిని కలిగించునవియే. "ఇదియొక్కటియే కావ్యరచనమునఁ బ్రధానహేతు వగును":—అని యాయావరీయుఁడు. అయ్యది, ప్రతిభవలనను వ్యుత్పత్తి వలనను బ్రవరించును. ఏలయనఁగా ప్రతిభ యనియును

చేయుచుండినచో నయ్యభ్యాసమే కౌశలమును (నేర్పును) గల్గించుచున్నది—అని దీని భావము.

4. ప్రాచీనులగుకవులలో మంగళుఁ డొక్కఁడు. సరసమైయాతని కవిత యొప్పుచుండునట్టు. 'సదుక్తికర్ణామృతము'-అనుగ్రంథమునందు ఈకవివిగా నీక్రిందిరెండు శ్లోకములును ఉదాహరింపఁబడినవని యందురు. కావ్యమీమాంసలోఁ బెక్కుచోట్ల నితని మతము స్వీకృతము. ఆ శ్లోకము లివి:—

శ్లో. యదాభ్యాసాసంగా దుపసి పునతే వాచ మృషయః
యదీయ స్సంకల్పో హృది సుకృతినామేవ రమతే,
స సార్వ స్సర్వజ్ఞః కథి సరపవాదే కృతపదో
జనో జంతూ నుచ్చై ర్దమయతు భవావర్తపతితాన్.

శ్లో. నిషిక్తుంచనత్వా ద్విధురస్య పాథో రథ్యార్థిత సార్థిజనస్య కించిత్.
నాస్తీతి వర్ణా మనసి భ్రవంతో నిర్యాంతు మిచ్ఛంత్యనుభిస్సహైవ.

వ్యుత్పత్తియనియు ననెడిపనులు శక్తికర్తృకములే కదా! అనఁగా శక్తిచేఁ గలుగునట్టివి యని యర్థము. వర్ణనీయమగు వస్తువుయొక్క నిజస్థితి శక్తిగలవానికే కదా బోధపడును. కాన శక్తుఁడే వ్యుత్పాద్యుఁ 5 డగును. శబ్దరాశి అర్థపుంజము అలంకారతంత్రము ఉక్తిమార్గము [మాటనేర్పు] మఱియు నీవిధమగు ఇతర కౌశలము-ఈ మున్నగువానిని హృదయఫలకమునఁ జిత్రించి, ఏది ప్రకాశింపఁ జేయునో, దానినే ప్రతిభ-యనెదరు. ప్రతిభ లేనివానికి పదార్థపుంజము కన్నులయెదుట నున్నను పరోక్షమునం దున్నట్లే కనుపట్టుచుండును. ప్రతిభకల వాని కన్ననో, ఎదుట లేక పోయినను, ప్రత్యక్షముగా నెదుర నున్నట్టులే కన్పించు చుండును. ఎందువలన ననఁగా-ప్రతిభానిధులు కవిచక్రవర్తులు నని పేరొందిన 6 మేధావిభట్టు రుద్రభట్టు కుమారవాసుఁడు మున్నగు

---

౫, కనుకనే వామనుఁడును-నూ. అరోచకిన స్సతృణాభ్యవహారిణశ్చ కవయః [1-2-1] అని చెప్పి, పూర్వే శిష్యాః వివేకిత్వాత్ [1-2-2] నేతరే తద్విపర్యయాత్ [1-2-3] అనిచెప్పినాఁడు. అనఁగా కవులలో అరోచకు లని సతృణాభ్యవహారు లని రెండుతెఱఁగుల వుందు రనియు, అందులో అరోచకులకే శాస్త్రోపదేశముఁ జేయవలయు ననియు, ఏలయనఁగా వారు వివేకులు కాఁబట్టి యనియును, తక్కిన వారు శాస్త్రోపదేశమున కనర్హు లనియు నిర్ణయించినాఁడు అని తాత్పర్యము.

౬. మేధావిరుద్రుఁడు కవియు నాలంకారికుఁడు నై యున్నట్లు రుద్రటుని యాలంకారగ్రంథమునకు వ్యాఖ్యవ్రాసిననమిసాధువు వ్రాసి

వారు పుట్టుగ్రుడ్డులైయున్నను కవులైరని వినికి కలదు. మఱియును, మహాకవులు తాము ఎన్నఁడును వినియును కనియును నెఱుఁగని దేశ దేశాంతరములు ద్వీపాంతరములు మున్నగువానికిఁ జెందిన కథా పురుషులు మొదలగువారిని కూడ, స్వప్రతిభా బలమున దర్శించి, ఆయాస్థలములయందలి ఆచార వ్యవహారములను తమకృతి రత్నములయందు వర్ణించుచున్నారు కదా! అందు

## దేశాంతరవ్యవహారము.

శ్లో. 7 ప్రాణానా మనిలేన వృత్తిరుచితా సత్కల్పవృక్షేవనే
తోయే కాంచన పద్మరేణు కపిశే పుణ్యాభిషేకక్రియా,
ధ్యానం రత్నశిలాగృహేషు విబుధస్త్రీసన్నిధౌ సంయమో
యత్కాంక్షంతి తపోభి రన్యమునయ స్తస్మిం స్తపస్యంత్యమీ.

[ఈ శ్లోకము కాళిదాస మహాకవియొక్క అభిజ్ఞాన శాకుంతలము నందలిది:—దుష్యంతుఁడు దేవలోకము

---

యున్నాఁడు—"నను. దండిమేధావి రుద్ర భామహాదికృతాని సంత్యే వాలంకారశాస్త్రాణి-అని. రుద్రటుఁడు నిట్టే కవియు నాలంకారికుఁడై యున్నాఁడు. రుద్రటాలంకార మితనిదే యందురు. కుమారదాసునుగూర్చి సోడ్ఢలుని ఉదయసుందరీకథలో నిట్లు ఖింపఁబడినది:—

శ్లో. బభూవు రన్యోఽపి కుమారదాస
భాసాదయో హంత కవీంద్రవస్తే
యదీయవాగ్భిః కృతినాం ద్రవంతి
చేతాంసి చంద్రోపలనిర్మలాని.

7. కాళిదాసు శకుంతలలో 7 వ అంకము.

నుండి వచ్చుచు మార్గమున మరీచిమహాముని యాశ్రమమును జూచి ఆయాశ్రమమును వర్ణించుట సందర్భము. అర్థము:—సత్కల్పవృక్షములు గల ఈ తపోవనమునందు ప్రాణధారణమునకై వాయుభక్షణవృత్తియును, బంగారు కమలములందలి పరాగములచేత పచ్చనైన నీటిలో త్రిషవణస్నానమును, రత్నవికారములగు జాతి శిలలయందు ధ్యానమును, దేవతాస్త్రీల సన్నిధినే సంయమమును గలిగి, ఇతర మునులందఱును తపస్సులకు ఫలములుగా నేపదమును కోరి తపస్సు చేయుచుందురో, అట్టి ప్రదేశములందే ఈ మునులు తపస్సును చేయుచున్నారు. అహా!—అని. ఇచ్చట కవి చర్మచక్షువుల కగోచరము లగు దేశాంతర వ్యవహారమును తన ప్రతిభాబలమున నూహించి కూర్చినాడు.]

దీపాంతర వ్యవహారము.

శ్లో. అనేన సార్థం విహరాంబురాశే
స్తీరేషు తాళీవన మర్మరేషు,
ద్వీపాంతరానీత లవంగపుష్పై
రపాకృతస్వేదలవా మరుద్భిః. 8

[తాటితోఁపులచేత మరమరమనెడి చప్పుళ్లుగల సముద్రతీరములందు ద్వీపాంతరములనుండి సేకరించికొని తెచ్చిన లవంగంపుఁబూవులచే విలసిల్లెడి పిల్లతెమ్మెరలచేత

8. శ్లో 12;-8, రఘువంశమున 6-వ సర్గ. శ్లో-57.

చెప్పఁబడుచున్నట్లు వీవఁబడుచున్న దానవై, ఈ రాజకుమారునిఁ గూడి విహరింపుము-అని భావము. ఇచ్చట కవి చక్షురగోచరము లగు ద్వీపాంతరములలోని స్థితిగతులను స్వప్రతిభా బలమునఁ బ్రత్యక్షముఁ జేసినాఁడు.]

కథాపురుష వ్యవహారము.

శ్లో. హరోపి తావ త్పరివృత్తధైర్య
శ్చంద్రోదయారంభ ఇవాఽంబురాశిః,
ఉమాముఖే బింబఫలాధరోష్ఠే
వ్యాపారయామాస విలోచనాని. 9

[ఈశ్వరుఁడును నంతలో పరివృత్తమగు ధైర్యము కలవాఁడై చంద్రోదయకాలమునందలి సముద్రమునుబోలి, క్షోభించుచు బింబఫలమువంటి అధరోష్ఠము గల పార్వతి ముఖమునందు తన లోచనములను సంచరింపఁ జేసెను. ఇచ్చట అప్రత్యక్షమగు ఈశ్వరుని (కుమారసంభవ కథాపురుషుః) మన్మథాకులత కవిప్రతిభాబలమున వివరింపఁబడినది.]

ద్వీపాంతర కథాపురుషాది దర్శనము౯-అను శ్లోకముఁ గల ఆది పదముచేత—ఈక్రింద నిచ్చెడిలాంటి విషయములను కూడ గ్రహింపఁగాఁ జనును.

శ్లో. 10 తథా గతాయాం పరిహాసపూర్వం
సఖ్యాం సఖీ వేత్రవతీ బభాషే,

9. కుమారసంభవము 3, వ సర్గలో 67-శ్లోకము;
10. రఘువంశము 6-వ సర్గ, 82-శ్లో.

బాలే ప్రజామో౽న్యత ఇత్యథైనాం
వధూ రసూయాకుటిలం దదర్శ. 10

[ఇంతలో నచ్చటఁ దన చెలికత్తెయగు (నాయిక) ఇందుమతి అవిధమగు భావము (అనురాగమును) పొందియుండఁగా- వేత్రధారిణియగు నాసునంద పరిహాసపూర్వకముగా 'మనము ఇంకొక దిక్కునకుఁ బోవుదమా?' యనియనెను. పిమ్మట నిట్లు పలికిన ఆ దాసిని ఆవధువు అసూయాకుటిలముగఁ జూచెను. ఇచ్చట నాయికయొక్క లజ్జా మాధుర్యములు కన్నులఁ గట్టినట్టులు వర్ణింపఁబడినవి.]

పైని ఉపవర్ణింపఁబడిన ఆశక్తి కారయిత్రి యనియును భావయిత్రి యనియును రెండు తెఱఁగులు. కవికి రచనకు ఉపకరించునది కారయిత్రి అనఁబడును. అదియును సహజము, ఆహార్యము, ఔపదేశికము, అను భేదములచేత మూఁడు విధములు. జన్మాంతర సంస్కారమును అపేక్షించునది సహజ జన్మసంస్కారజము ఆహార్య. మంత్రాములు ఉపాసనలు మున్నగు వానివలనఁ గలుగునట్టిది యౌపదేశిక యనఁబడును. ఐహిక సంబంధమగు నేమాత్రము సంస్కారము ఉన్నప్పటికిని పుట్టునది అగుటవలన తొలిదానిని సహజ యనిరి. ఇంకను ఆహార్య యన్నది చాల ప్రయత్నముచేసినఁగాని సిద్ధింపనిది. ఔపదేశికయన్ననో ఈ జన్మముననే సంస్కారకాలము గలిగియుండును. ఈ మూఁడు విధము లగు శక్తులును కలకవులు కూడను, క్రమముగా సారస్వతకవి,

ఆభ్యాసికకవి, ఔపదేశికకవి, అని ముత్తెఱంగులుగా నన్నారు. ఈ ముగ్వురిలోన, జన్మాంతర సంస్కారము చేత సన్నిబద్ధమైన సారస్వతసంపదగల బుద్ధిమంతుఁడు సారస్వతకవి. ప్రస్తుత మీ జన్మమునందు సంభవించిన వాఙ్మయాభ్యాసముచేతఁ బ్రకాశితమైన సారస్వతము గలవాఁడు ఆభ్యాసికుఁడు. ఉపదేశితమును దర్శితమును నగు వాగ్విభవము గల దుర్బుద్ధి ఔపదేశికుఁడు. కనుక మొదటివానికంటెను మిగిలిన ఇద్దరును తంత్రశేషమును ఆచరింపవలయును. స్వతస్సిద్ధముగఁ దీయఁగా నుండెడి స్వభావము గల ద్రాక్ష, శర్కరాదుల సంస్కారమును అపేక్షింపదు గదా ! (అనఁగా ద్రాక్షకు తీయఁదనమును కలిగించుటకై చక్కెర వాడుట అనవసర మనియర్థము.) అట్లు కాదని యాయావరీయుఁడు. ఒక వస్తువు సిద్ధించుకొఱకై ఇబ్బడిగా పనిచేయుట లోకమునందు కలదు. వానిలో వెనుకటివారికంటెఁ దర్వాతివారు శ్రేష్ఠులు అని శ్యామదేవుఁడు. ఎందువలన ననఁగా:—

శ్లో. సారస్వతః స్వతంత్రస్స్యా ద్భవే దాభ్యాసికో మితః,
ఔపదేశకవి స్త్వత్ర వల్గు ఫల్గు చ జల్పతి—అని.

[సారస్వతకవి స్వతంత్రుఁడుగ నుండును. ఆభ్యాసికుఁడు పరిమితుఁడై యుండును. ఔపదేశకవి నోటికి వచ్చిన పిల్ల పిప్పిలాఁటి కవనమును వాగుచుండును.]

వీరిలో నుత్కర్ష గలవాఁడు శ్రేష్ఠుఁడని యాయావ

రేయుఁడు. ఆయుత్కర్షము అనేక గుణము లొక్కచోఁ జేరినచో సంభవించును మఱియును:—

శ్లో. బుద్ధిమత్త్వం చ కావ్యాంగవిద్యా స్వభ్యాసకర్మ చ,
కవే శ్చోపనిషచ్ఛక్తి స్త్రయ మేకత్ర దుర్లభమ్.

[బుద్ధిమత్త్వము కావ్యవిద్యలుఁ దదంగభూతములగు విద్యలు, వీనియందలి పరిశ్రమము, ఉపనిషచ్ఛక్తి ఈ మూఁడును ఒక్కనియందే గలుగుట దుర్లభము] కావ్యము కావ్యాంగములు మున్నగువానియందు పరిశ్రమఁ జేయుచు, మంత్రానుష్ఠానమును చేయుచు, బుద్ధిమంతుఁడగు కవికి కవిరాజత్వము ఒప్పిదమై యుండును.

కాని, కవులలోఁగల తారతమ్యము లనుఁ బట్టి ఇయ్యది ప్రాయోవాదము అనఁగా నిట్టి వాడుక పడియున్నది.

శ్లో. 1 ఏకస్య తిష్ఠతి కవే ర్గృహ ఏవ కావ్య,
మన్యస్య గచ్ఛతి సుహృద్భవనాని యావత్,
న్యస్యావిదగ్ధ వదనేషు పదాని శశ్వ
త్కస్యాపి సంచరతి విశ్వకతూహలీవ.

[ఒకానొక కవి చేసినకావ్యము (అతనిదురదృష్టము వలన వ్యాపింపక) అతనియింటియందే యుండును, ఇఁక నింకొక్కనిది స్నేహితుల యిండ్లదనుక మాత్రమె పోఁగల్గును. వ్యాపింపఁగలు ననుట. మఱియు నొకానొకకవి యొక్క కృతి ప్రపంచమునంతను చూడవలయునని కోరిక

[పా. 1 తత్రాన్యస్య మానోప్యపదం నదగ్ధ వక్త్రేషు విశ్వం పరిబంభ్రమీతి. రుద్ర. శృం. 11. టీ.]

గలదివోలె, సరసుల వదనములఁ బ్రవేశించి, యెల్లప్పుడు నెల్ల దేశములందును సంచరించుచుండును--అని భావము.

ఇట్టిశక్తినే కారయిత్రి యందురు. భావకునకు (సరసునకు) ఉపకరించునట్టిది భావయిత్రీశక్తి. ఈశక్తియే కవియొక్క పరిశ్రమమును అభిప్రాయమును (పాఠకుని చేత) భావింపఁజేయును. అందుమూలముననే కవియొక్క పరిశ్రమమనెడి పాదపము ఫలింపఁ గల్గుచున్నది. ఇది లేనివో ఆపాదపము మోడై పోవును. "కవి భావించుట, భావకుడై కవి యుండుట-అను నీరెంటికిని మఱియేమి భేదము?" అని యాచార్యులు అనిరి. ఆవిషయము నిట్లు సమాధానపఱచిరి:—

శ్లో. ప్రతిభాతారతమ్యేన ప్రతిష్ఠా భువి భూరిధా,
భావక స్తు కవిః ప్రాయో న భజ త్యధమాం దశామ్.

[ప్రతిభయొక్క హెచ్చుతగ్గులఁదుఁనుబట్టి ప్రతిష్ఠ లోకమునం దనేకవిధములుగా గలుగుచున్నది. కాని భావకుఁడై యున్నచో, ఆకవి, ఎప్పటికి నీచదశకుఁ బాల్పడకుండును అని భావము.]

'కా'దని కాళిదాసునిమతము. ఎట్లనఁగా—భావకత్వము వేఱు కవిత్వముకంటెను. కవిత్వము భావకత్వముకంటె వేఱు (అనగా భిన్నమనియర్థము.) ఎందువలన ననఁగా, ఈరెంటికిని స్వరూపములోనేమి విషయములో నేమి చాల భేదము కలదు. ఏమని యనగా:—

శ్లో. కశ్చి ద్వాచం రచయితు మలం శ్రోతు మే వాఽపరస్తాం,
కల్యాణీ తే మతి రుభయథా విస్మయం న స్తనోతి,
న హ్యేకస్మి న్నతిశయవతాం సన్నిపాతో గుణానా,
మేకస్సూ్తే కనక ముపల స్తత్పరీక్షాక్షమోఽన్యః.

[ఒక్కొక్క కవి వాగ్రచనమునందు నిపుణుఁడగును. ఇఁక నొక్కఁడు ఆతని వాగ్రచనముఁ జక్కఁగ విమర్శన బుద్ధితో విని దానికి మెఱుఁగు వెట్టఁగలఁడు. కాని కల్యాణియగు నీబుద్ధి పై రెండువిధములను గనిచేయఁగలదు. ఈవిషయము మాకు చాల అబ్బురమును గొల్పుచున్నది. ఏలయనఁగా - ఒక్కవస్తువునందే లోకమున నతిశయవంతములగు గుణము లెల్లఁబ్రోవై యుండవుగదా. శిలలలోఁ గూడ బంగారమును ఉత్పత్తిచేయునది యొకటియు, నాబంగారమును పరీక్షఁ జేయఁగలవస్తువు మఱియొకటియుఁ గదా!]

'పైని చెప్పినట్టి కవులు ఇరుతెఱఁగుల [అరోచకులని, సతృణాభ్యవహారులని'] నుందురని మంగళుఁడు చెప్పెను. కవులుగూడ నిట్లె యుందు రని వామన మతానుయాయు లనిరి మత్సరులును తత్త్వాభినివేశులు అను భేదములతోఁ గలపిన నాల్గువిధము లని యాయావరీయుఁడు. వీరిలో మొదటివారు వివేకులు. తద్భిన్నులు వారి తరువాతివారలు" అని వామనమతానుయాయులు అనిరి.

అరోచకిత్వము వారికి సహజ మనికాని, అజ్ఞానకారణ మని గాని యనవచ్చును. సహజమగు గుణమును

నూర్లకొలఁది సంస్కారములచేనైనను "వంగము కాళిమను [సహజమగు నలుపునువలె"] వారు వదలిపెట్టఁ జాలరు. అజ్ఞానయోని కలిగిన, విశిష్టజ్ఞేయవస్తుగు వాక్కులవిషయమున రోచకతావృత్తియే యలవడు నని యాయావరీయము. మఱియును సతృణాభ్యవహారిత్వము సర్వసాధారణ మగునది ఎట్లందురా? పరీక్షింపుఁడు. వ్యుత్పత్తిని కోరుచుండెడునట్టి కౌతుకము గలవారికి నందఱకు అన్నియెడలను తొలుత నయ్యది యుండితీరును. ప్రతిభావివేక వికలత్వము అనునది గుణాగుణ వివేచనములఁ గూర్చిన విభాగక్రమము నంటనీయదు గదా! కనుక అవసరమైనపుడు ఎక్కుడుభాగము పరిత్యజించుటయును, చాల గ్రహించుటయుఁ గల్గును.

ఏల యనంగా—వారివారి వివేకము ననుసరించియే ఆబుద్ధులఁ దేనిని లోలుకుచుండును. ఆబుద్ధులకు పరిపక్వదశ కలిగినప్పుడు యథార్థదర్శిగా - అనఁగా వస్తుతత్త్వమును కనిపెట్టఁ గలవాఁడుగా నగును విభ్రమ భ్రంశము కూడ నిశ్శ్రేయసమునే చేకూర్చును. ఇఁకను మత్సరికిన్నినో సహజముగా కనిపించుచున్న వస్తువుకూడ బుద్ధికి గోచరముకాకయే యుండును. ఎందుకనఁగా నతఁడు పరగుణవర్ణనమున వాచంయమత(మూఁగతనము) కలిగియుండుంగాబట్టి కనుక కవులైనవారలలో మాత్సర్యములేక వస్తుతత్త్వము నెఱింగి సంతసించువాఁడు తఱచుగా దొరకుట దుర్లభము. అట్లే కదా పెద్దలును పల్కిరి:—

శ్లో. క స్త్వం భోః ? కవి రస్మి !
కా ప్యభినవా సూక్తి స్సఖే పఠ్యతామ్,
త్యక్త్వా కావ్యకథైవ సంప్రతిమయా,
కస్మాదిదం ? శ్రూయతాం,
య స్సమ్య గ్వివినక్తి దోషగుణయో
స్సారం స్వయం సత్కవిః,
సోఽస్మిన్ భావక ఏవ నా స్త్యథ
భవే ద్దైవా న్న నిర్మత్సరః.

ఇది కవికిని భావకుని జరిగిన సంభాషణముఁ దెలుపును.

ప్ర. ఎవరు నీవు ?

ఉ. అయ్యా ! కవిని నేను.

ప్ర. ఏమైనను అభినవసూక్తి కలదేని మిత్రమా చదువుము.

ఉ. ఇప్పుడు నేను కవితాప్రస్తావననే తలఁచు కొనుట లేదు.

ప్ర. ఏల ఇది ?

ఉ. వినుఁడు. స్వయముగా తాను కవియై గుణదోషముల సారము నెఱిఁగి, చక్కఁగా విమర్శింపఁ గల భావకుఁడే ఈప్రపంచములో లేఁడు. అథవా ఎచ్చట నైన నొకఁడున్నను, ఆతఁడు దైవవశమున మాత్సర్య మును వీడియుండుట లేదు; కావుననే నేను కవిత్వమును వదలితి నని తాత్పర్యము.

భావకుని విషయమే ఇట్లుండఁగా—ఇఁకను తత్త్వాభినివేశి మాట చెప్పనేల ? అట్టివాఁడు ఈలోకమున వేయిమంది కొక్కఁడైన నుండుట అరుదు. ఇట్లే పెద్దలనిరది కూడ.

శ్లో. శబ్దానాం వివినక్తి గుంఫనవిధీ నామోదతే సూక్తిభి
స్సాంద్రం లేఢి రసామృతం విచినుతే తాత్పర్యముద్రాంచయః
పుణ్యైస్సంఘటతే వివేక్తృవిరహా దంతర్ముఖం తామ్యతాం
కేషామేవ కదాచిదేవ సుధియాం కావ్యశ్రమజ్ఞో జనః.

['తాము చేసిన కావ్యములను చక్కఁగా వివేచన చేయఁగల సరసుఁడు లేఁడాయెఁ గదా యని తమలో తాము విచారపడెడి కవులలో ఎవ్వరికో కొంతటికే, ఎప్పుడో ఒకప్పుడే కావ్యపరిశ్రమజ్ఞుఁ డగువాఁడు వివేచకుఁడుగా సంభవించును. ఇట్టి వివేచకుఁడు శబ్దములను అర్థములనుఁ జక్కఁగా వివేచన సేయఁగలఁడు. శబ్దముల కూర్పును సూక్తులతోఁ బ్రశంసింపఁగలఁడు. రసామృతమును జుఱ్ఱఁగలఁడు. తాత్పర్యమును విరింపఁగలఁడు అని భావము.]

కవికి ఆతని కవితారచన వ్యాప్తికై, సాధారణముగా నొక మిత్రుఁడు శిష్యుఁడు గురువు-అని ఇట్టి వారెందఱైన లభింపఁగలరు; కాని భావకుఁడు మాత్రము లభింపఁడనుట నిక్కముగా నాశ్చర్యము. కావ్యము స్వమనోమాత్ర వృత్తికర మగునేని దానిని రచించిన యా కవికి నేమిలాభము? అనఁగా రసజ్ఞులు అగు విమర్శ

కులు పదిదిక్కులను వ్యాపింపజేయని కావ్య నిబంధములతోఁ బ్రయోజన ముండ దని తాత్పర్యము.

1 ఇంటింటను గ్రంథస్థములై కట్టలు కట్టలుగా నున్న కావ్యనిబంధనము లనేకము గలవు; కాని వానిలో రిసజ్ఞుల మనసులనెడి శిలాఫలకములవి కుట్టితములుగాఁ-గలుగుచున్నవి. ఒకటి రెండు మాత్రమే అభినయ నిర్ణయ కాలమున నాట్యకర్తలందుండి, వారికిఁ దెలియరాక, 2 ప్రేక్షకులకుఁ గన్పించుచున్న వానివలెనే, సత్కావ్యమునందుఁ గల కొన్ని వికారరచనలు కవికిఁ దెలియరాక భావకుల కొక్కరికే(రసజ్ఞులకే)పొడగట్టుచుండును.

భావకులలో కొందఱుమాటలను, కొందఱు హృదయభావనలను, మఱికొందఱు ఆంగిక సాత్వికాదులను, ఇంకను కొందఱు గుణములను, మఱికొందఱు దోషములను, మఱి కొందఱు గుణదోషపరిత్యాగరీతులను విమర్శించి సగ్గు దేల్చుచుందురు. కనుక నాయా కార్యభేదములఁ బట్టి, పూర్వ క్రమముగా వాగ్భావక హృదయభావక, అనుభావ భావక—ఇత్యాది పేర్లఁ జెప్పంబడుదురు. వీరందఱు చేయుపనికూడ, మొత్తముపైని కావ్యవిమర్శనమేయైనను

1. సత్యం సంతి గృహే గృహే కవయః—అని ఇట్టి భావముగలదే శృంగార తిలకమున నొక శ్లోకము కలదు.

2. నాట్యశాస్త్రమునందు నిట్టి భావముగల వాక్యమే యున్నది. పర్వాభినయ నిర్ణీతా దృష్టా నాట్య ప్రజానయః—అని.

వారివారి విమర్శన క్రమములు చిత్ర చిత్రములుగా నుండుటనుబట్టి-ఈవిషయమై మనుజులలో అమానుష ముగు నొకవిధమైన ప్రసాదగుణము కల దని-తలంచు చున్నాము.

శాస్త్రములందు తగినంత పరిశ్రమముఁ జేయకయే కవిత్వముఁ జెప్పువాఁడు నిసర్గకవి యనిపించుకొనఁడు. కాని పట్టుదల గలిగినవాఁ డనిమాత్ర మనిపించికొనును. స్వతః కవితఁ జెప్పవలె నను కుతూహలము కలిగి యుండీ, కవిత్వము చేయరానివానికి, సారస్వత మంత్ర తంత్రాదుల యనుష్ఠానమువలనఁ గవిత్వము సిద్ధింపఁగలదు. కవీశ్వరులలో ఎవఁడు స్వపరవాక్యములకుఁ గల తారతమ్యము నెఱుఁగఁ గలఁడో, వాఁడు సిద్ధకవి. తక్కిన వారు కుకవులని గాని నామమాత్రమునఁ గవు లని కాని చెప్పఁబడఁ దగుదురు. ఈ ప్రకరణమునం దింతదనుక చర్చింపఁబడిన కారయిత్రీశక్తి భావయిత్రీశక్తి అను నీ రెంటను ప్రతిభాభేదము లని యెఱుఁగఁ దగును. ఇటుపైని కావ్యహేతు వగు వ్యుత్పత్తిని వివరించెదము.

ఇది కావ్యమీమాంస యను కవిరహస్యమునఁ బ్రథమాధికరణమునఁ బదవాక్యవివేక మనునది,
కావ్యవిశేషాది శక్తివివేచన మనునది,
నాల్గవ యధ్యాయము.



# రాజశేఖరకవి కావ్యమీమాంస.

## కావ్యపాకకల్పము.

---

### పంచమాధ్యాయము.

[ఈయధ్యాయమున వచ్చెడివిషయములు:—౧. వ్యుత్పత్తిప్రతిఫల వ్యుత్పత్తులు ౨. అందలి మతభేదములు, చర్చలు. ౩. శాస్త్రకవ్యాది కవిభేదములు. ౪. అందుఁగల ఎక్కువ తక్కువలంగూర్చిన భిన్నాభిప్రాయములు. ౫. వారిస్వరూపస్వభావాదులు. ౬. కావ్యకవులలోఁ గల యెన్మిదిభేదములు. ౭. వాని వివరములు. ౮. రచనాకవి. ౯. అలంకారకవి నిరూపణము. ౧౦. ఉక్తికవులు మున్నగు వాని యుదాహరణములు. ౧౧. కవుల దశావస్థలు. ౧౨. తల్లక్షణములు. ౧౩. పాకలక్షణములు. ౧౪. నవవిధపాకములను నిరూపించుట. ౧౫. కపిత్థపాక నిర్వచనము—ఇత్యాదులు.]

బహుజ్ఞతయే వ్యుత్పత్తి యని ఆచార్యులు. ఏల యనఁగా కవీశ్వరుల వాక్కులు సర్వతః ప్రసారము కలవి కదా!—అనఁగా కవీశ్వరులు ఆశాస్త్రము ఈశాస్త్రమను నియమములేక సర్వ శాస్త్రముల మర్యాదలను సర్వ దేశముల ఆచార వ్యవహారములను ఇంకను ఇట్టివాని ననేకములను అనేకవిధములుగా తమ ప్రబంధములలోఁ గూర్చెద రనుట. ఇట్లె పెద్దలచేతనుఁ జెప్పఁబడినది.

శ్లో. ప్రసరతి కిమపి కథంచన నాభ్యస్తే గోచరే వచః కస్య,
ఇదమేవ తత్కవిత్వం యద్వాచః సర్వతోదిక్కాః.

[అభ్యస్తమై అలవాటు పడినదై-కన్నులకు ఎదుట గోచరమగు వస్తువు విషయమున నెవనికైనను ఏదోయొక విధముగ వాక్కు ప్రసరించును. కాని కవిత్వము అనఁగా ఎదుట ఉన్నను లేకున్నను సర్వతఃప్రసరము లగు వాక్కులు గల్గునది మాత్రమే యని భావము]

ఉచితానుచిత వివేకమే వ్యుత్పత్తియని యాయావరీయుఁడు. ప్రతిభావ్యుత్పత్తులలో ప్రతిభయే శ్రేష్ఠమని [1]ఆనందుఁడు. అట్టి ప్రతిభ గలిగెనేని, అది, కవికి వ్యుత్పత్తి లేకుండుటవలన వచ్చెడి (అవ్యుత్పత్తికృతము లగు) సమస్త లోపములను కప్పిపుచ్చఁగలదు. అట్లే అన్నారు కూడను.

శ్లో. అవ్యుత్పత్తికృతో దోష శ్శక్త్యా సంవ్రియతే కవేః,
యస్త్వశక్తికృత స్తస్య ఝగి త్యేవాఽవభాసతే.

[2][కవికి వ్యుత్పత్తి చాలినంత లేకుండుటవలనం గలిగెడు లోపము, భావనాశక్తిచేత నాచ్ఛాదితమగును.

1. ఆనందవర్ధనాచార్యులకే యానందుఁ డన్న పేరని కొందఱు, కాదని మఱికొందఱు వందురు. ఆనందవర్ధనాచార్యుల కీక్రింది ప్రశంస గలదు.

శ్లో. ధ్వనినాఽతిగభీరేణ కావ్యతత్త్వనివేశినా,
ఆనందవర్ధనః కస్య నాఽఽసీ దానందవర్ధనః. — అని.

2. ద్వివిధో హి దోషః కవే రవ్యుత్పత్తికృతోఽశక్తికృతశ్చ. తత్ర అవ్యుత్పత్తికృతో దోష శ్శక్తితిరస్కృతత్వాత్ కదాచి న్న

కాని యశక్తికృతమగు దోషము మాత్రము వెంటనే మెఱసినట్లు కనిపించు నని తాత్పర్యము.] శక్తి అను నీ శబ్దము ప్రతిభానము అను నర్థమునం దుపచరిత మగుచున్నది:—

శ్లో. ఏతత్కిం శిరసిస్థితం ? మమపితుః ఖండం సుధాజన్మనః
లాలాటం కిమిదం విలోచన మిదం హాఽ స్తేఽస్యకిం పన్నగాః
ఇత్థం క్రౌంచరిపోః క్రమా దుపగతే దిగ్వాసస శ్శూలినః
ప్రశ్నే బాలక లోపరోధసుభగం దేవ్యా స్స్మితంపాతువః.

[ఈ శ్లోకము హరకుమారుల (శివుఁడును నతని కొమరుఁడగు కుమారస్వామికి జరిగిన) సంవాదముఁ దెలుపును. తలమీఁద నిది యేమి? అని హరుఁడు కుమారు నడిగెను.

ఉ॥ మా తండ్రిగారు ధరించెడి చంద్రశకలము.

ప్ర॥ అట్లయిన నొసల నిది యేమి ?

ఉ॥ ఇది లాలాటలోచనము.

ప్ర॥ చేత నివి యేమి ?

ఉ॥ సర్పములు.

---

లక్ష్యతే. య స్త్వశక్తి కృతోదోషః స ఝడితి ప్రతీయతే — పరికరశ్లోక శ్చాఽత్ర,

అవ్యుత్పత్తికృతో దోష శ్శక్త్యా సంవ్రియతే కవేః,
య స్త్వశక్తికృతో స్తస్య స ఝటి త్యవభాసతే.

అని ఇట్లు కుమారస్వామికిని దిగ్వస్త్రుఁడగు-అనఁగా దిగంబరదశలో-అతి బాల్యావస్థలో-నున్న ఈశ్వరునకును సంవాదము జరుగుచుండగా, కుడిచేయి నడ్డము పెట్టుకొని నవ్వుచున్న దేవియొక్క-నవ్వు మిమ్ముఁ బ్రోచుగాఁక.]

ప్రతిభావ్యుత్పత్తులలో వ్యుత్పత్తియే శ్రేయసియని మంగళుఁడనెను. ఆవ్యుత్పత్తియే కవికి శక్తిలోపము వలన సంభవించెడి లోపముల నన్నింటిని కప్పిపుచ్చును ఇట్లు:—

కవేః సంవ్రియతే శక్తి ర్వ్యుత్పత్త్యా కావ్యవర్త్మని,
వైదగ్ధీహృతచిత్తానాం హేయా శబ్దార్థ గుంఫనా.

[కావ్యనిర్మాణ మార్గమున కవికిఁగల యశక్తిని వ్యుత్పత్తి కప్పిపుచ్చఁగలదు. కాని నేర్పు మిక్కుటముగాఁ జూపఁగల శక్తిఁగల్గియు, ఆశక్తి నుపయోగింపకయే రచనసేయువారి శబ్దార్థగుంఫన చాల హేయమైనదే] యనిరి.

శ్లో. కృతః కంఠే నిష్కో నహి కిముత తన్వీ మణిలతా
కృశం లీలాపత్రం శ్రవసి నిహితం కుండలముచి,
న కౌశేయం చిత్రం వసన మపదాతం తు వసితం
సమాసన్నీభూతే నిధువనవిలాసే వనితయా.

(రతివిలాసనమయము మిక్కిలి సమీపింపగా,తొందరపాటుచేత) మెడలో కాసుల పేరునే వైచుకొనలేదనఁగా— ఇఁక మణిలతను గుఱించి వేఱుగఁ జెప్పవలయునా? కుండలములఁగూర్చి చెవియందు వాడిన లీలాపత్రముఁచి

కొనినది. చిత్రమైన పట్టువస్త్రముఁగట్టక తెల్లని బట్టను మాత్రమే కట్టినది ]

ప్రతిభావ్యుత్పత్తులు ఒకదానితో నొకటి చేరియున్న వని యాయావరీయుఁడు. లావణ్యము లేని రూపసంపద గాని, రూపసంపద లేని లావణ్యముగాని సౌందర్యాధిక్య మును వెల్లడింపఁజాలవు గదా! ప్రతిభావ్యుత్పత్తుల (యుభయ) సంయోగము ఇట్లుండును.—

శ్లో. 3 జంఘాకాండోరునాళో నఖకిరణలస త్కేసరాళీకరాళః
ప్రత్యగ్రాలక్తకాభా ప్రసరకిసలయో మంజుమంజీర భృంగః,
భర్తు ర్నృత్యానుకారే జయతినిజతను స్వచ్ఛ లావణ్యవాపీ
సంభూతాంభోజశోభాం విదధదభినవో దండపాదో భవాన్యాః.

[పార్వతియొక్క భర్తృనృత్యానుకరణసమయము నందలి దండపాదము-అనఁగా దండాకారముగా పైకిసాఁచఁబడినపాదము, జంఘా కాండమనే పెద్దకాడగలదియు, నఖకిరణములనే ప్రకాశించు కింజల్కములు గలదియు, క్రొత్తగా నలంకరించుకొనిన లత్తుకలనెడి చిగుళ్లు కలదియును, మనోహరమగు నందెల లనెడి తుమ్మెదలు కలదియునై స్వశరీరలావణ్య మనెడి నడబావియందు పుట్టిన కమలంపు చెలువముఁ గూర్చుచున్నదై జయించు చున్నది.]

కావునఁ బ్రతిభావ్యుత్పత్తిమంతుఁ డగు కవియే 'కవి'యనఁబడును. ఇట్టివారు మూఁడు తెఱఁగులు. శాస్త్ర

3. కావ్యప్రకాశమున నిద్దియె నుదాహృతము.

కవి కావ్యకవి ఉభయకవి అని. వారిలో ఉత్తరోత్తరుఁడు శ్రేష్ఠుఁడని శ్యామదేవుఁడు. కాదని యాయావరీయుఁడు. వారి వారి యాభిమానిక విషయములలో నందఱుకవులును శ్రేష్ఠులే. తక్కిన వానిలో నట్లన వీలులేదు. రాజహంసను చకోరముంబోలి చంద్రికాపానముఁ జేయఁ జాలదు. చకోరము రాజహంసవలె నీటిని పాలను వేఱుపఱుపఁ జాలదు. కనుక నెవ్వరిగుణములు-శక్తులు-వారివి. ఈమాత్రానఁ గవులలోని హెచ్చుతగ్గులను నిర్ణయింపరాదని భావము.

ఇట్లే-శాస్త్రకవి కావ్యమునందు రససంపదను నింపఁగలుగును. కావ్యకవి యగువాఁడు ఘటపటాదిశబ్దములతోనున్న తార్కికకర్కశ ఫక్కిని గూడ మాటల నేర్పుతో విడదీయఁగలఁడు. ఇఁకను నుభయకవి శాస్త్రకావ్యముల త్రోవలలో రెండింటియందును నేర్పరియై యుండి, ప్రావీణ్యమను ప్రదర్శింపఁగలుగును. కావున శాస్త్రకవియును కావ్యకవియును సామర్థ్య విషయములో సమానులె! కాని వీరికిని పరస్పరము ఉపకార్యోపకారకభావము కలదని యొప్పుకొందుము. ఎందువలన ననఁగా శాస్త్రకవికి శాస్త్రసంస్కారము కావ్యమును నిర్మించుటలో ననుగ్రాహక మగును. శాస్త్రసంస్కారమనునది కావ్యము ననుగ్రహించును. కాని కేవల శాస్త్రమందే ప్రవణత గల్గియుండుట మాత్రమే అర్థానిని - ఆకావ్య నిర్మాణమున-ఆటంక పెట్టును. ఇట్లె కావ్యసంస్కారము కూడ

శాస్త్రవాక్యపాకమును అనుసరించును. కాని కేవలకావ్యైక ప్రవణత్వము అద్దానిని నిగ్రహించుచుండును.

పైనిచెప్పిన ముత్తెఱఁగులగు కవులలో జేన శాస్త్ర కవి, మఱల మూఁడు విధములుగ నుండును. (1) శాస్త్రమును నిర్మించువాఁడు (2) శాస్త్రమునందే కావ్యమును నిర్మించువాఁడు (3) కావ్యమునందు శాస్త్రార్థములఁ గూర్చువాఁడు అని. కావ్యకవియందన్ననో ఎనిమిది భేదములు కలవు (1) రచనాకవి (2) శబ్దకవి (3) అర్థకవి (4) అలంకారకవి (5) ఉక్తికవి (6) రసకవి (7) మార్గకవి (8) శాస్త్రార్థకవి—అని. వీనిఁ గ్రమముగా, నెనిమిది విధములగు కవుల రచనలను నుదాహరణపూర్వకముగా వ్రాయుచున్నాము. (1) రచనాకవి:—

4 శ్లో. లోలల్లాంగూలవల్లీ వలయిత వకుళా నోకహస్కంధగోత్రైః
గోలాంగూలైర్నదద్భిః ప్రతిరసితజరత్కందరా మందిరేషు,
ఖండేషూద్దండ పిండీతగరతరళకాః ప్రాపిరే యేన వేలా
మాలంఘ్యోత్తాళతాళస్ఫుటితపుటకినీబంధవో గంధవాహాః.

ఇఁక శబ్దకవి, నామకవి ఆఖ్యాతకవి అర్థకవి యని ముత్తెఱఁగులు. అందు నామకవి కవిత్వమున కుదాహరణము:—

శ్లో. విద్యేవ పుంసో మహిమేవ రాజ్ఞః
ప్రజ్ఞేవ వైద్యస్య దయేవ సాధోః,

4. సరస్వతీకంఠాభరణమున నిది యుదాహరింపఁబడినది.

లజ్జేవ శూరస్య మృజేవ యూనోః
విభూషణం తస్య నృపస్య సైవ.

[పురుషునకు విద్యవలెనే, రాజునకు సామర్థ్యము వలెనే, వైద్యునకు ప్రజ్ఞవలెనే, సాధువునకు దయవలెనే, శూరునకు లజ్జవలెనే, యువకునకు పారిశుద్ధ్యమువలెనే, ఆ రాజునకును నామెయే విభూషణ మని భావము. ఇందు నామములు - అనఁగా నామవాచకములు రంజకముగాఁ గూర్పంబడినవి.

(1) ఆఖ్యాత కవికి ఉదాహరణము:—

శ్లో. ఉచ్చైస్తరాం జహాసు రాజహృషు ర్జగర్జు
రాజఘ్నిరే భుజతటీనికరై స్స్ఫురద్భిః,
సంతుష్టువు ర్ముముదిరే బహు మేనిరే చ
వాచం గురో రమృతసంభవలాభగర్భామ్.

[బృహస్పతి చెప్పిన యమృతోత్పత్తిలాభ మంతరార్థముగాఁ గలయా వాక్యమును విని, దేవతలు సంతోషమును పట్టఁజాలక పెద్దగ నవ్విరి. హర్షించిరి. గర్జించిరి. భుజములను తట్టుకొనిరి. సంతసించిరి. మోదించిరి. ఎంతో మంచి దనుకొని రని భావము. ఇందాఖ్యాతలే చెప్పంబడినవి.]

(2) నామాఖ్యాత కవికి ఉదాహరణము:—

శ్లో. హాతిప్రిషాంధా శ్శిథిలాంశబాహవః
స్త్రియో విషాదేన విచేతనా ఇవ,

న చక్షుషు గ్నే రురుదు ర్న సస్వను
ర్న చేలు రాసు ర్లిఖితా ఇవ క్షణమ్.

[కొట్టువడిన కాంతిగలవారై కనుకనే అంధప్రాయులై శిథిలములైన అవయవములు బాహువులును గలవారలై, వారు-లక్ష్మి పోయె నను దుఃఖముచేత (ప్రాఁవడి) చేతనము లేనివారివలె-ఆక్రోశింపను లేదు. ఏడువను లేదు. అరవను లేదు. కదలను లేదు. కేవలము గోడపైని వ్రాసిపెట్టిన బొమ్మలను బోలి యుండిరి ఇచ్చట నామాఖ్యాతము లందముగాఁ గూర్పంబడినవి.

(3) అర్థకవి:—

5 శ్లో. దేవీపుత్ర మనృత్యత గణాః
కింతిష్ఠతే త్యుద్భుజే,
హర్షా ద్భృంగిరిటా వుదాహృతగిరా
చాముండయాఽఽలింగితే,
పాతాయా ద్వో జిత దేవదుందుభి ఘన
ధ్వాన ప్రవృత్తి స్తయో,
రన్యోన్యాంకనిపాత జర్జరజర
త్స్థూలాస్థి జన్మా రవః.

[పార్వతీదేవి కుమారునిం గనినది. ప్రమథగణములారా! నాట్యముం జేయుఁడు. ఏల ఇట్లున్నారు?-అని భృంగిరిటుఁడు చేయెత్తి చెప్పఁగా, సంతోషముతో నా

5. ఇది యోగేశ్వరునిదిగా సదుక్తి కర్ణామృతమునను. సరస్వతీ కంఠాభరణమునందు ఉదాహరింపఁబడినది.

మాటనే పల్కుచు, చాముండి వచ్చి యతని నాలింగ నము జేసికొనెను. ఆసమయమునందు వారి యుభయుల యాలింగనమువలనఁ గలిగిన, ఒకొరొకరి తొడలపై వ్రేలాడుచున్న ఎముకల పేరువలన గల యాధ్వని, దేవ దుందుభి జయించినధ్వని కలది యై, మిమ్ముఁ బ్రోచెడుఁ గాక. ఇం దర్థము చాల సరసముగాఁ గూర్పంబడి యున్నది.]

(4) అలంకార కవి—శబ్దాలంకార కవి, అర్థాలంకార కవి, యని ఇఱు తెఱఁగులు. శబ్దముల నుచితరీతిని శ్లోకంబులఁ జొన్పి జెప్పి, చమత్కారముఁ గలిగించువాఁడు శబ్దాలంకారకవి. అర్థమును గంభీరముగా శ్లోకమునఁ గూర్పంగలవాఁడు అర్థాలంకారకవి. ఈ ఇర్వురిలో శబ్దాలంకార కవి కవిత కుదాహృతి:—

శ్లో. న ప్రాప్తం విషమరణం
ప్రాప్తం పాపేన కర్మణా విషమరణం చ,
న మృతో భాగీరథ్యాం
మృతో ఽహ ముపగుహ్య మందభాగీరథ్యాం.

[నాకు విషమరణము (విషముమగుణము) ప్రాప్తించ లేదు. కాని నేను చేసిన పాపకర్మచేత విషమరణమే (విషముచేఁ జచ్చుటయే) ప్రాప్తించినది. నేను భాగీరథి యందు (గంగానదియందు) మృతుఁడను కాలేదు గాని, (రహస్యముగా) మందభాగి (నై) రథియందే – అనగా వీథిలోనె చచ్చితిని–అని భావము] ఇందలి విషమరణఁ,

భాగీరథ్యాం—అను పదములు చమత్కారమును పోషించుచున్నది. ఈ శబ్దాలంకారము సభంగశ్లేషము!

అర్థాలంకార కవి:—

శ్లో. భ్రాంతజిహ్వా పతాకస్య ఫణచ్ఛత్రస్య వాసుకేః,
దంష్ట్రాశలాకాదారిద్ర్యం కర్తుం యోగ్యోస్తి మే భుజః.

[ఉద్భ్రాంతములగు నాలుకలే పతాకలుగాఁ గల వాసుకి యొక్క ఫణచ్ఛత్రమునకు [అనఁగాఁ బడియగను గొడుగున] నా భుజము కోరలను శలాకలు (చెత్తములఁ బోలిన దంష్ట్రలు) లేకుండఁ జేయుటకుఁ జాలినట్టిది. అనఁగా నా బాహు బలముచేత వాసుకి కోరలనైనఁ బెఱికి వేయగల నని తాత్పర్యము. ఇందు అర్థవైచిత్ర్యము రూపకమునఁ జక్కఁగా నిరూపితము.

ఉక్తి కవి:—

శ్లో. ఉదర మిద మనింద్యం మానినీశ్వాసలావ్యం
స్తనతట పరిణాహో దోర్లతాలేహ్యసీమా
స్ఫురతి చ వదనేందు ర్దృక్ప్రణాళీనిపేయ
స్త దిహ సుదృశి కల్యాః కేళియోగ్యా యౌవనస్య.

[ఈమె యొక్క ఉదరము (నడుము) అనింద్యమై మానవతియగు నీమె నిట్టూర్పులవలననే తెగిపోవునట్లు లున్నది. అనఁగా నంతటి సౌకుమార్యమును కార్శ్యమును వహించుచున్నదని యర్థము. ఇక స్తనతటములు వైశాల్యమందు మా బాహువులచే కొలవఁ దగినవి. అనఁగాఁ బీవరములని భావము. ముఖచంద్రుఁడును దృక్ప్రణాళీనిపేయుఁడు.

విశ్వవిద్యాల గ్రంథాలయము
సేకరణ సంఖ్య 8046
17-7-26

అనఁగా చంద్రునిఁబోలిన నెమ్మోముకన్నులఁ గఱవుదీరు నట్లు త్రావఁదగినది-అని భావము. కావున నో చిన్నదానా ! ఈ విలాసము లన్నియు నీ యౌవనముయొక్క శుభకరము లగు క్రీడలు. ఇందలి ఉక్తి (మాటల) నేర్పు గమనింపఁదగినది. మఱియును:—

శ్లో. ప్రతీచ్ఛ త్యా శోకీం కిసలయపరావృత్తి మధరః
కపోలః పాండుత్వా దవతరతి తాడీపరిణతిం,
పరిమ్లానప్రాయా మనువదతి దృష్టిః కమలినీ
మితీయం మాధుర్యం స్పృశతి చ తనుత్వం చ భజతే.

తా. నీ యధరోష్ఠము అశోకంపుఁజిగుళ్ల పరావృత్తిని (ఓటమిని) కోరు చున్నది. కపోలము పాండువర్ణము కల దగుట. అనఁగాఁ బచ్చనగుటవలనఁ దాళఫలపరిణతి నొందుచున్నది. చూపుఁకనులు పరిమ్లానప్రాయమగు కమలిని ననుకరించుచు నున్నది. ఇట్లు ఈ చిన్నది యొక విధముగా మాధుర్యమను మఱొక్క రీతిగఁ దనుత్వమును పొందు చున్నది. (ఇందుఁగూడ వైతీరునసే ఉక్తివైచిత్ర్యము )

రసకవి:—

శ్లో. ఏతాం విలోకయ తనూదరి తామ్రపర్ణీమ్
అంభోనిధౌ వివృతశుక్తి పుటోద్ధృతాని,
యస్యాః పయాంసి పరిణాహిషు హారమూర్త్యా
వామభ్రువాం పరిణమంతి పయోధరేషు.

[ఈశ్లోకము రఘువంశమునందు రాముఁడు లంక నుండి సీతను చెఱవిడిపించుకొని పుష్పకమెక్కించుకొని

అయోధ్యకుఁ బోవుచున్నఘట్టములోనిది.—అర్థము:— ఓకృశోదరి! సీతా! ఈతామ్రపర్ణీనదిని చూడుము. సముద్రమునందు తెఱచికొనియున్న ముత్తెపుఁజిప్పలలోఁ బడిన యీనది (తామ్రపర్ణి)యుదకములు ప్రవృద్ధములైన యువతులపయోధరములందు హారరూపమునఁ బరిణమించుచున్నవి! (అనఁగా సముద్రమునందున్న ముత్తెపుఁజిప్పలలో తామ్రపర్ణియుదకములు బడి ముత్తెములై అందకత్తె లగు సుందరుల చక్కని స్తనములకును నందముఁ గూర్పంగల యొప్పున నొప్పుచున్న వని భావము.]

మార్గకవిః:—

6శ్లో. మూలంవాలక వీరుధాం సురభయో జాతీతరూణాం త్వచః
సార శ్చందనశాఖినాం కిసలయా న్యార్ద్రా ణ్యశోకస్య చ,
శైలీవః కుసుమోద్గతిః పరిణమన్మోచం చ సోయం గణః
గ్రీష్మేణోష్మహరః పురాకిల కృదే దగ్ధాయ పంచేషవే.

[వట్టివేరులు,గుమగుమలాడు జాజిబెరడులు, చందన తరుసారము-చల్లని (ఆర్ద్రములైన) అశోకంపుఁజిగుళ్లు-జరిసినపూవులు - అనునీవస్తుగణము (వియోగుల దురదృష్టమునకు తగినట్లుగ) దగ్ధుఁడగు మన్మథునకు గ్రీష్మర్తువు నందలి ఊష్మహరమగువస్తుగణముగ నీయఁ బడినది కదా! యని భావము. ఇదియొక విరహిజన భాషి

6. విద్ధసాలభంజిక 4-వ అంకమునఁ గలదు.

తము. ఇందు మార్గము (శైలి) చాల చక్కఁగా కూర్పం
బడినది.

శాస్త్రార్థకవి:—

7శ్లో. ఆత్మారామా విహితరతయో నిర్వికల్పే సమాధౌ
జ్ఞానోద్రేకాద్విఘటితతమోగ్రంథయస్సత్త్వనిష్ఠాః,
యంవీక్షంతే కమపి తమసాం జ్యోతిషాం వా పరస్తా
త్తం మోహాంధః కథ మముం వేత్తి దేవం పురాణమ్.

[నిర్వికల్పసమాధియందు అత్యంత మాసక్తులై యాత్మారాములై జ్ఞానోత్తేజన మాత్రమున తమోగ్రంథులను వీడఁగొట్టగల సత్త్వనిష్ఠులైనమునులు ఏదేవుని - తమస్సులకు గాని జ్యోతిస్సులకుగాని పరమైనవానింగా-నెఱుఁగుచున్నారో, అట్టివానిని మోహాంధుఁడగు నీజనుఁడు ఏరీతిగా నెఱుఁగఁ గలవాఁడు—అని తాత్పర్యము. ఇందు యోగశాస్త్రమునందలి యర్థము చక్కఁగా జెప్పఁబడినది ]

ఈపైనఁ జెప్పిన గుణములలో, రెండు మూఁడు గలవాఁడు పిన్నయనియును, అయిదు గుణములు గలవాఁడు మధ్యముఁడు అనియు, అన్నియుఁ గలవాఁడు మహాకవి యనియు ననిపించుకొనును. ఇట్టి గుణములు గల కవికి దశవిధావస్థలు గలవు. అందు బుద్ధిమ దాహార్య కవులకు నేడును, ఔపదేశికునకు మూఁడును అవస్థలుండును. (1) కావ్యవిద్యాస్నాతకుఁడు (2) హృదయకవి (3)

7. వేణీసంహారమునఁ గలదు. అంకము-౧.

అన్యాపదేశి(4)సేవిత (5) ఘటమానుఁడు (6) మహాకవి (7) కవిరాజు (8)ఆవేశికుఁడు(9)అవిచ్ఛేది(10) సంక్రామయిత-అని ఇట్లు కవితయందలి యవస్థలనుబట్టి కవుల లోను దశవిధము లగు (అనఁగాఁ బది తెఱఁగు లగు)భేద ములు గలవని యెఱుంగందగు.

కవిత్వమునుఁ కోరి,అనఁగా గవిత్వ కామనగలవాఁడై కావ్యవిద్యను ఉపవిద్యలను నేర్చుకొనుటకై గురుకుల మును సేవించువాఁడు కావ్య విద్యాస్నాతకుఁ డనబడును. తనలోఁ దానే కవిత్వము నల్లుకొనుచును పై వారికిఁ దెలియనీక,దాఁచికొనుచుండువాఁడు హృదయకవి యనఁ బడును. కావ్యము తానుజేసినదే యైనను, చూచిన వారు తప్పులు పట్టెద రనుభయముతో నితరుల యొద్ద-మఱియెవరిదో కవిత్వ మని, చదువువాఁడు అన్యాపదేశి యనఁబడును. కవిత్వమును సాగించు పౌరస్త్యులు మున్నగు వారివారి కూర్పులలో నేదోయొకరి కూర్పు నందుఁగల నేర్పుల నభ్యసించువాఁడు సేవిత యనఁ బడును. కవిత్వముఁ జెప్ప మొదలిడినచో నిర్దుష్టముగాఁ జెప్పగల్గియుఁ గవితనుఁ అల్లక యేయుండువాఁడు,అనఁగాఁ దగినంత నేర్పు ఇంకనుఁ దనకు జాలదన్న యనుమాన ముతోఁ గవిత సేయనివాఁడు, ఘటమానుఁ డనఁబడును. ఏవిధమగు ప్రబంధమును నిర్మించుటలోనైనను సామ ర్థ్యముగలవాఁడు మహాకవి యనబడును. తాను రచించు ప్రబంధమునందు అచ్చటచ్చట నాయాభాషల యందుగు

తత్తదవస్థాములగు రసములయందును, నిపుణముగాఁ గవితఁ జెప్పఁగలస్వతంత్రుఁడు కవిరాజు అనఁబడును. అట్టి వారు లోకమునందు సంభవించిరేని చాలకొలఁదిమంది మాత్రమే. మంత్రములు మొదలగువాని యుపదేశములద్వారా, కవిత్వసిద్ధి నొందినవాఁడు ఆవేశికుఁడు. ఎప్పుడు తలంచుకొనిన నప్పుడే తెంపులేని కవితఁ జెప్పెడి వాఁడు, అనఁగా నెప్పుడు బట్టిన నప్పుడు నిరాతంకముగాఁ గవిత్వముఁ జెప్పెడివాఁడు అవిచ్ఛేది. కన్యకలు పెండ్లికాని పడుచులు మున్నగువారి విషయమున, ఎవఁడు, మంత్రసిద్ధి కలవాఁడై, కవితను సంక్రమింజేయఁగలఁడో, వాఁడు సంక్రమయిత. నిరంతరముగా నభ్యాసముఁ జేయుటచేత, సుకవి యొక్క కవితా భాషితము పరిపాకమునకు వచ్చుచుండును. పాకము పాకమననేమిటి? యని ఆచార్యులు అడిగిరి. పరిణామమే యని మంగళుం డనెను. ఏమి టాపరిణామ మని ఆచార్యు లనిరి. *సుబంతములను తిఙన్తములను శ్రోత్రప్రియము లగునట్లు కూర్పుటయే యని, యదియే వ్యుత్పత్తియని, మంగళుఁ డనియెను. కాని

---

*ఇది భామహునిదిగా దోఁచుచున్న దందురు:—

శ్లో. సుపాం తిఙాం చ వ్యుత్పత్తిం వాచాం వాంఛ న్త్యలంక్రియాం,
తదేత దాహు స్సౌశబ్ద్యం నార్థవ్యుత్పత్తి రీదృశీ.
(భామహ. 1-14)

ఇట్లే సరస్వతీ కంఠాభరణమునందును —

శ్లో. వ్యుత్పత్తి స్సుప్తిఙాం యా తు ప్రోచ్యతే సా సుశబ్దతా.

ఇది సౌశబ్ద్యము. పదనివేశ నిష్కంపతయే పాకము అని ఆచార్యులు బల్కిరి. అట్లేయనిరి గదా! పెద్దలు- "మనస్సు డోలాయమాన మగుచుండు వఱకును శబ్దముల యావాపోద్ధరణములే జరుగుచుండును. [అనఁగా పదములను పద్యమునందు కూర్చుటయును తీసివేయుటయును గలుగుచుండును] పదముల స్థైర్యము చక్కఁగా సంస్థాపితమైనచో, ఆపిమ్మట సరస్వతి సంసిద్ధయే యగును." అనిరి గదా!

పదములను కూర్చుట యేర్పుటల వలనను కూడ, పదస్థైర్యము సంభవించును. అందుమూలమునం గల్గు పదముల పరివృత్తి విముఖతయే పాకమని వామన మతానుసారాయు లనిరి. ఎట్లనఁగా:—పదములు పరివృత్తి సహిష్ణుత్వమును పరిత్యజించుట ఎయ్యదిగలదో, అదియే శబ్దపాకమని శబ్దశాస్త్రసంప్రదాయవేత్తలు పలికిరి. అది అసమర్థతయే యగునుగాని పాకము కా దని అవంతిసుందరి చెప్పినది. ఏమన—ఏకవస్తువు విషయమునైనను, మహాకవు లంతటివారికినికూడ, పాకము అనేకముగా నన్నునుంబరిపక్వము నొందుట కలదు. కావున రసోచితములగు శబ్దార్థములు గల సూక్తులను కూర్చుటయే పాకము.

అట్లే యగరి:—గుణములు అలంకారములు రీతులు ఉక్తి వైచిత్ర్యములు శబ్దార్థములు మున్నగువానియొక్క

గ్రథనక్రమము విద్వాంసులకు దేని సాన్నిధ్యమూలమున రచించునో, అదియే పాకము. ఆ కావ్యపాకము మమ్మ గుఱిచి సిద్ధించునుగాక-అని.

అట్లే యనిరి:—వక్తయున్నను శబ్దార్థము లున్నను రసమున్నను ఏయది లేనంతమాత్రాన వాఙ్మధువు (మాటలను నమృతంపుటూట) స్రవింపదో, అట్టి అనిర్వచనీయమగు పదార్థమొక్కటి కలదు. కార్యానుమేయమైనదగుటచేత యత్తచ్ఛబ్ద నివేద్యమై పాకము అభిధావిషయమైనది. అదిసహృదయ ప్రసిద్ధిసిద్ధమై వ్యవహారాంగమగుచున్నదని యాయావరీయుఁడు. ఇట్టిపాకము కావ్యాభ్యాసము చేయుచున్న కవిబృందమునకు తొమ్మిదితెఱఁగులఁ గలుగుచుండును.

ఈనవవిధ పాకములలో(1)ఆరంభమందును సమాప్తి యందును కొంచెమంత అస్వాదువుగా నుండునది పిచుమంద పాకము. (వేపపండు పాకము) (2) తొలుతను అస్వాదువుగానుండి, చివఱకు ఒకవిధముగా నుండునది బదరీపాకము. [అనఁగా ఱేఁగుపండు పాకము.] (3) తొలుత నస్వాదువుగానుండి చివఱకు స్వాదువుగా నుండునది మృద్వీకాపాకము, (ద్రాక్షాపాకము) (4) తొలుత నొకమాదిరిగానుండి చివఱకు అస్వాదుగా నుండునది వార్తాక పాకము (5) ఆద్యంతములయం దొకమాదిరిగా నున్నది తింత్రిడీపాకము. (చింతపండుపాకము) (6)ఆదియందు మధ్యమముగానుండి చివఱ స్వాదుగానుండునది

సహకార పాకము (తియ్యమామిడి పాకము.) (7) ఆది యం దుత్తమముగా నుండి చివఱకు అస్వాదుగానుండు నది క్రముక పాకము(8) ఆదియం దుత్తమమును అంత మున మధ్యమముగా నుండునది త్రపుస పాకము. (9) ఆద్యంతములందు స్వాదువుగా నుండునది నారికేళ పాకము అని. మూఁడేసి మూఁడేసి త్రికములుగా నున్న వీనిలో తొలుఁదొల్తవి పరిత్యజింపఁ దగినవి. ఏలయనఁగా - కుకవి యగుటకంటెను కవి కాకుండు టయే మేలుగదా! కుకవిత్వ మనఁగా సాక్షాత్తును ఉచ్ఛ్వాసములు గల మరణమే! ఇంకను ఇట్టు లీ తొలి పాకములు పోఁగా మిగిలిన వానిలోగల మధ్యమ పాకములు సంస్కరింప నర్హము లగుచున్నవి. ఇంతయేల? సమస్త వస్తువులకును సంస్కారమే గుణమును పెంపొందించుచుండును. పసారువన్నె బంగారమైనను సరియే, నిప్పునందు కాచుటచేతనే పాకమునకు వచ్చుచున్నది. చిట్టచివరఁ జెప్పినట్టి పాకములు అందఱకును గ్రహింపదగినవే యగును. వీటికి మాత్రము మధ్యమమునకుఁబోలె సంస్కార మక్కఱలేదా యందురేమో? కాని సహజ శుద్ధమగు దానికి ఇతరముల సంస్కారము లేయక్కఱలేదు. ముత్తెమునకు వరిపిడిరాయి వలయునా? అట్లోకవేళ వలసినను అయ్యది వానికిఁ (తరళత) దారత్వము నీయఁజాలదుగదా!

ఏ పాకములోను చేరకగాని, పాకమునకు రాకగా

యుండెడి పాకము కపిత్థపాకమని (పచ్చి వెలగకాయ పాకమని) పెద్ద లనియెదరు. ఇట్టి కపిత్థపాకమునందును రసవత్తరమగు కవిత్వ ముండదా యందు రేని- కేవలము పొట్టును చెఱిగినచో ధాన్యకణములందు ఎట్లెంతవఱకు లభింపఁగల్గునో - అట్లే, ఇందును సరసకవితాభాషిత లాభము నుండును.

కావ్యవిద్యను చక్కఁగా నభ్యసించుచున్న వానికి ఈ తొమ్మిది తెఱఁగులను కవిత్వము పాకమునకు వచ్చును. ఇట్టి కావ్యవిద్యను హానోపాదాన సూత్రముతో (అనఁగాఁ బదముల కూర్పుల తీసివేయుట అను నియమముతో) విభజించుకొని, అభ్యసింపఁదగును. ఈరీతి ముత్తెఱఁగులను ఈ ప్రకరణమునందె ప్రదర్శించితిమి. కాని మున్ముందు ఇదియే వివిధమై లోకవ్యాప్తియై ఇంపుఁ గానఁబడగలదు.

ఇది, రాజశేఖరకవిరాజకృతమగు కావ్యమీమాంస యను
కవిరహస్యమునఁ బ్రథమాధికరణమునందు
కావ్యపాక కల్ప మనునది పంచమాధ్యాయము.



# రాజశేఖరకవి కావ్యమీమాంస.

## కావ్యపాకకల్పము.



### షషాధ్యాయము.

వ్యాకరణస్మృతినిర్ణీత మగునది శబ్దము. నిరుక్తమునిఘంటువులు మున్నగువానిచేత నిర్దిష్టమైనఆశబ్దభావమును చెప్పునది అర్థము ఈశబ్దార్థములు రెండునుగలసి పదమనఁబడును. ఇట్టిపదమునకు సుబ్వృత్తి సమాసవృత్తి తద్ధితవృత్తి కృద్వృత్తితిజ్వృత్తియని యైదువృత్తులుగలవు అనఁగా పదములు అయిదువిధములుగా నున్నవని ముత్తమునైని తాత్పర్యము. ఆవు గుఱ్ఱము మనుష్యుఁడు ఏనుగు అను నిట్టివి జాతివాచకములగు శబ్దములును హరుఁడు, హరి, హిరణ్యగర్భుఁడు కాలము, ఆకాశము, దిక్కు అను నిత్యాదులు ద్రవ్యవాచకములు, తెలుపు నలుపు ఎఱుపు పసుపు అనునిట్టివి గుణవాచము లగు శబ్దములును, అద్రవ్యార్థములగు (అనఁగా లింగము వచనములేనివగు) ప్రాదులును, చాదులును, నగరముప, ప్రస్థితాఃపన్థాః (పట్టణమునకు దాపున నున్న మార్గము) వృక్షమనుద్యోతతే విద్యుత్ అను నిట్టి కర్మప్రవచనీయములును (సుబ్వృత్తిని) ఇందు జేరును.

"ఈచెప్పిన సుబ్వృత్తి అయిదు తెలుగులైనపై

వాఙ్మయమునకు మాతగా (ఆధారముముగా)నున్న” దని పండితులనెదరు. సుబ్వృత్తియే సమాసవృత్తినాఁబడును. విడివిడిగను గలసియును ఉండుటయే ఈ రెండింటికి (సుబ్వృత్తి సమాస వృత్తులకు) గలభేదమునకు క్రమముగా కారణము. ఇట్టి సమాసవృత్తి ద్వంద్వాది భేదముచేత పదునారు విధములుగా నున్నది (అనఁగా సమాసము పదునారువిధము లని యర్థము.) అందు షట్సమాసీసమాసనూక్తము (ఆరుసమాసములను సంగ్రహించి చెప్పుకారిక) ఇట్లుదాహరింపఁబడును.

శ్లో. ద్వంద్వోస్మి ద్విగురస్మి చగృహేచ మే సతతమవ్యయీభావః
తత్పురుష కర్మధారయ యేనాహంస్యాం బహువ్రీహిః,

తద్ధితవృత్తి అనంతముగ నున్నది. 'తద్ధితమూఢాః పాణినీయాః' అనునది శాస్త్రప్రాయమగు వాదము. మాంజిష్ఠము, రౌచనికము, సారము, సైంధవము, వైయాసీయము, అనునీరూపములు తద్ధితాంతరూపములు. కృత్తద్ధితవృత్తి ప్రాతిపదిక విషయము. కృద్వృత్తి ధాతువిషయకమైనది. కర్త హర్త కుంభకారుడు నగరకారుఁడు అను నివి కృదంతములు. తిఙ్వృత్తి లకారభేదముచేత పదివిధములు. మఱియును పదివిధములైన యీతిఙ్వృత్తి మఱల ధాతువిషయము, సుబ్ధాతువిషయకము అని రెండు విధములు. అపాక్షీత్, పచతి, పక్ష్యతి అనునివి ధాతు సంబంధములగు ఆఖ్యాతములు.(పేరులు.) అపల్లవయత్, పల్లవయతి, పల్లవయిష్యతి అను నిట్టివి సుబ్ధాతు సంబం

ధములగు నాఖ్యాతములు. ఇట్లు మొత్తమునకై దువిధము లుగా నైనయీపదజాల మంతయు నొకదానితో నొకటి సమన్వీయమానమై అంతులేని దగుచున్నది. ఈ కారణము వలననే పండితులు - వేయిదివ్యవర్షములకాలము బృహస్పతియంటివాఁ డుపాధ్యాయుఁడు, నింద్రునంతటివాఁడు అధ్యేత, అయినను శబ్దరాశి తుదిముట్టలేదు."- అని యనుచుందురు.

ఈపైని చెప్పినవానిలో సుబ్వృత్తిక్రియులు విదర్భదేశీయులు. సమాసవృత్తిక్రియులు గౌడులు. తద్ధితక్రియులు దాక్షిణాత్యులు. కృత్ప్రయోగక్రియులు ఉత్తరదేశపువారు. తక్కినపెద్దలందఱును తిఙ్వృత్తిక్రియులు. పైయన్నింటికి విశేషలక్షణముల ననుసంధానము చేయుటచేత ఆఖ్యాతగణము వృద్ధిచెందినది. "విశేషముగ లక్షణవేత్తల ప్రయోగములచేత ఆఖ్యాతరాశి దినదినమును వృద్ధిపొందింపఁబడుచున్నది" అనికూడ పెద్దలనిరి.

పదములయొక్క అభిధిత్సితార్థ గ్రంథనమునకు (అనఁగా ఇష్టమగు అర్థమును కూర్చుటకు) ఆకరమైన సందర్భము వాక్యము. అందు పదమునకు గల అభిధావ్యాపారము ముత్తెఱఁగులని, ఉద్ఘాటమతానుయాయులనిరి. ఆభేదములు వైభక్తము శాక్తము శక్తివిభక్తిమయము నని. ప్రతిపదమునందును ఉపపదవిభక్తులుగాని కారకవిభక్తులు గాని వినిపించునట్టిది వైభక్తము. విభక్తులు లోపించినను సమాసనామర్థ్యమువలన నాయా

విభక్తవ్యక్తులు స్ఫురించునట్టిది శాక్తము. ఏతదుభయాత్మక మగునది శక్తివిభక్తిమయము.

వైభక్తమున కుదాహరణము:—

"నమ స్తస్మై వరాహాయ లీల యోద్ధరతే మహీం,
ఖురయో ర్మధ్యగో యస్య మేరుః ఖణఖణాయతే॥"

[లీలామాత్రముచేత భూమిని ఉద్ధరించు నాదివరాహమూర్తి కొఱకు నమస్కారము. ఏవరాహమూర్తి ఖురమధ్యమునఁ బడి మేరువు ఖణఖణ మనుచుండునో.]

శాక్తమున కుదాహరణము—

విత్రస్త శత్రు స్స్పృహయాళులోకః
ప్రసన్న సామంత ఉదగ్రసత్వః,
అధిష్ఠితౌదార్యగుణోఽసిపత్రః
జితావని ర్నాస్తి నృప స్త్వదన్యః."

[భీతులగుశత్రువులు గలవాఁడును, లోకముచే అభిలషింపఁబడువాఁడును, ప్రసన్నులగు సామంతులు గలవాఁడును, ఉదగ్రమగు బలముకలవాఁడును, ఉదారగుణుఁడును నై ఖడ్గమాత్ర సహాయమున నీభూమండలము నంతయు జయించినవాఁడు నీకంటె నొరుఁడు లేఁడు.]

మఱియు నెట్లనఁగా—

"కంఠడోలాయితోద్దామనీలేందీవరదామకాః,
హరిభీత్యా శ్రితాశేషకాళియాహికులా ఇవ॥

[కంఠమునఁ దూఁగులాడుచున్న శ్లేష్మము లగు నల్లగల్పాలదండలు శ్రీహరి(శ్రీకృష్ణుఁడు)భయముచేత బయలు వెడలివచ్చి ఆశ్రయించిన కాళీయనాగను యొక్క వంశపు నాగకులాలవలె ప్రకాశించినవి.]

శక్తివిభక్తిమయమున కుదాహరణము—

అథాగాదేకదా స్పష్టచతురాశాముఖద్యుతిః,
తం బ్రహ్మేవ శరత్కాలః ప్రోత్ఫుల్లకమలాసనః.

[తరువాత స్పష్టచతురాశా ముఖద్యుతియై, వికసించిన కమలాసనమున నొప్పారుచు శరత్కాలము బ్రహ్మదేవునిఁబోలి, అతనిని సమీపించెను.]

పైని చెప్పిన ఆవాక్యము- ఏకాఖ్యాతము, అనేకాఖ్యాతము, ఆవృత్తాఖ్యాతము, ఏకాభిధేయాఖ్యాతము, పరిణతాఖ్యాతము, అనువృత్తాఖ్యాతము, సముచితాఖ్యాతము, అధ్యాహృతాఖ్యాతము, కృదభిహితాఖ్యాతము, అనపేక్షితాఖ్యాతము-అని పదివిధములుగాఁ బరఁగుచున్నది.

ఏకాఖ్యాతము:—

"జయత్యేకపదాక్రాంత సమస్తభువనత్రయః,
ద్వితీయ పదవిన్యాస వ్యాకులాభినయ శ్శివః.

[ఒక కాలితో సమస్త భువనత్రయము నాక్రమించి, రెండవకాలి నెచ్చట నుంచెదవా యని వ్యాకులుఁడై అభినయించు శివుఁడు సర్వోత్కర్షతో నున్నాఁడు.]

అనేకాఖ్యాతము సాంతర మని నిరంతర మని రెండువిధములు. సాంతరమున కిది యుదాహరణము:—

"దేవాసురా స్త మథమంథగిరాం విరామే
పద్మాసనం జయ జయేతి బభాషిరే చ,
ద్రాగ్బేజిరే చ పరితో బహుమేనిరే చ
స్వాగ్రేసరం విదధిరే చ వవందిరే చ."

నిరంతరాఖ్యాతమున కిది యుదాహరణము:—

"త్వం పాసి హంసి తనుషే మనుషే బిభర్షి
విభ్రాజసే సృజసి సంహరసే విరౌషి.
అస్సే నిరస్యసి సరస్యసి రాసి లాసి
సంక్రీడసే బ్రుడసి మేధసి మోదసే చ."

'వాక్యవృత్తి ఆఖ్యాతవశమైనది, కావున ఆఖ్యాతానుసారము వాక్యము లుండును' అని ఆచార్యులు. విభక్తిబృందము ఒక్కరీతిగా నుండుటచేతను, వాక్యవృత్తి ఏకార్థమును చెప్పునది అగుటచేతను,ఇది అంతయు నొకే వాక్య మని యాయావరీయుఁడు.

ఆవృత్తాఖ్యాతమున కుదాహరణము:—

"జయ త్యమలకౌస్తుభ స్తబకితాంశపీఠో హరి
ర్జయంతి చ మృగేక్షణా శ్చలదపాంగదృష్టిక్రమాః
తతో జయతి మల్లికా తదనుసార సంవేదనా
వినాశకరణక్షమో జయతి పంచమస్య ధ్వనిః"

[తొలుత నిర్మల మగు కౌస్తుభమణిచేత స్తబకిత

మగు నంసపీఠము (భుజపీఠము) గలవారి జయించు చున్నాఁడు.] సర్వోత్కర్షతో నొప్పుచున్నాఁ డని భావము.] అటుపైని చంచలాపాంగవీక్షణముల యువతులును, అటుపిమ్మట మల్లికయును, నటుపైని సమస్త వేదనలను పోఁగొట్టంగల కోయిలలయొక్క పంచమ కూజితమును సర్వోత్కర్షతో నొప్పుచున్నది. - యని యర్థము.)

ఏకాభిధేయాఖ్యాతము:—

"హృష్యతి చూతేషు చిరం
తుష్యతి వకుళేషు మోదతే మరుతి,
ఇహ హి మధౌకలకూజిషు
పికేషు చ ప్రీయతే రాగీ"

[ఈ మధుమాసమున రక్తుఁడగు పురుషుఁడు చూతముల సంతుష్టుఁడగుచున్నాఁడు, పొగడలు మున్నగు వానియందు సంతుష్టుఁ డగుచున్నాఁడు. చల్లగాలి వను మోదించుచున్నాఁడు. కలకల మనెడి పికముల యెడలఁ బ్రీతుఁ డగుచున్నాఁ డని భావము.]

పరిణతాఖ్యాతము:—

సోఽస్మిన్నయతి జీవాతుః పంచేషోః పంచమధ్వనిః,
తే చ చైత్రే విచిత్రైలాకర్కోలీకేళయోఽనిలాః.

[ఈ మధుమాసమునందు మన్మథునకు జీవనౌషధ మనఁదగిన పంచమధ్వని సర్వోత్కృష్టమై యొప్పుచున్నది. మఱియు నీ చైత్రమునఁ జిత్రవిచిత్రములగు

కంకోలైలా కక్కోలీలతల విలాసక్రీడల నల్పెడి యీ చిఱుగాడ్పులును సర్వోత్కర్షతో నొప్పుచున్నయవి.]

అనువృత్తాఖ్యాతము:—

చరంతి చతురంభోధి వేలోద్యానేషు దంతినః,
చక్రవాళాద్రి కుంజేషు కుందభాసో గుణాశ్చ తే.

[రాజా! నీయొక్క ఏనుఁగులును, గుణములును మల్లెలవంటి కాంతిఁ గలవై చతుస్సముద్రముల దరులనుండు ఉద్యానములయందును చక్రవాళపర్వతము యొక్క పొదరిండ్లయందును చరించుచున్నవి. అనఁగాఁ జతుస్సముద్రముద్రితమైన భూమండలమును, చక్రవాళాంతము వ్యాపించిన సద్గుణములును నీకుఁ గలవని తాత్పర్యము.

సముచితాఖ్యాతము:—

పరిగ్రహభరాక్రాంతం దౌర్గత్యగతిచోదితం,
మనో గంత్రీవ కుపథే చీత్కరోతి చ యాతి చ.

[పరిగ్రహభరాక్రాంతమును దుర్గతిప్రేరితమును నగు మనస్సుకుమార్గమునం బోయెడి దానివలె,చీదరించుకొనుచున్నది. మఱియును అట్లే పోవుచున్నది కూడ ననిభావము.]

మఱియును ఎట్లనఁగా:—

శ్లో. స దేవ స్సా దంష్ట్రా కృతకిటివిలాసస్మిత సితా
ద్వయం దిశ్యా త్తుభ్యం ముద మిద ముదారం జయతి చ
ఉదంచద్భిః స్ఫూర్త్యా య స్తరళితని వేశా వసుమతీ
యదగ్రే యచ్ఛాయాస్సైర్గిరిగుడకలీలా మదవహాత్.

[మాటిమాటికి బయలు వెడలుచున్న ఏదేవుని నిట్టూర్పులచేత నీభూమండల మంతయు చలితనివేశమై ఏకోరయొక్క కొనయందు గిరిగుడకమును బోలియుండెనో, ఆయాదివరాహ దేవుడును,ఆయాదివరాహవేషము యొక్క చిఱునగవుచేత తెల్లవాఱిన ఆకోరయును, నీకు ముదము నొసంగుంగాక. అనఁగా నయ్యాది సర్వోత్కర్ష ముతో నొప్పుచు నుండు గాక యని తాత్పర్యము.

అధ్యాహృతాఖ్యాతము: —

దోర్దండ తాండవ భ్రష్ట మదుఖండం బిభర్తి యః,
వ్యస్తపుష్పాంజలిపదే చంద్రచూడః శ్రియేఽస్తు వః.

[పుష్పాంజలి నర్పించు భుజదండమునుండి తాండవకాలమున జాఱిన చంద్రఖండమును వహించుచున్న చంద్రచూడుఁడు (శివుఁడు) మీకు లక్ష్మి నిచ్చుటకై అగుగాక.]

కృదభిహితాఖ్యాతము: —

"అభిముఖే మయి సంహృత మీక్షితం
హసిత మన్యనిమిత్తకథోదయం
వినయబాధిత వృత్తి రత స్తయా
న వివృతో మదనో న చసంవృతః

[నే నెదురు కాఁగా(నావైపు చూచెడి)చూపును మఱల్చు కొనినది. వినయబాధితవృత్తియై ఇతర విషయమునకు దేనికో నవ్వినట్లు నవ్వినది. కావున, ఆనాయిక చేత మన్మథుఁడు వివృతుఁడును (వెల్లడింపఁబడినవాఁడు)

కాలేదు. సంవృతుఁడును, (గోప్యముగా నుంచఁబడిన వాఁడును) కాలేదు.

అనపేక్షితాఖ్యాతము:—

శ్లో. కియ న్మాత్రం జలం విప్రజానుదఘ్నం నరాధిప,
తథాపీయ మవస్థా తే న సర్వత్ర భవాదృశాః"

[ఈయుదాహరణము విద్వత్ప్రియుఁడగు నొక రాజునకు, విద్వద్వరిష్ఠుండగు బ్రాహ్మణునకును జరిగిన సంవాదమును తెల్పుచున్నది. రాజు బ్రాహ్మణుఁడా, నీ రెంత మాత్రము? (ఉన్నది అని అధ్యాహారము) అని యడిగెను. అట్లడుగునప్పుడు, వ్యాకరణమునందు తనకుంగల ప్రజ్ఞను కనంబఱచుచు, సూ. పరిమాణే ద్వయసచ్ దఘ్నచ్ మాత్రచః-- అన్న సూత్రము చొప్పున, మాత్రచ్ ప్రత్యయమునుపయోగించి ప్రశ్నించెను. ఈప్రశ్నకు ఉత్తరముగా, రాజా జానుదఘ్నము అని ద్విజుఁడు పాండిత్య సూచకముగనే జవాబునిచ్చెను. అందుపైని, రాజు ఆశ్చర్యపడుచు, అట్లయిన (అనఁగా దఘ్నచ్ ప్రత్యయమును వాడఁగలిగినంతటి వ్యాకరణ పాండిత్య మున్నను) నీ కీయవస్థ యేమిటి? అని యడిగెను. అన్నియెడలను నీవంటివారలే యుండరుకదా! అని బ్రాహ్మణపండితుఁడు జవాబు చెప్పెను—అని భావము.]

గుణవత్తును అలంకృతవత్తును నగు వాక్యమే కావ్యము అని సిద్ధాంతము. కావ్యము అసత్యవిషయము

ముల నుపదేశించును గనుక యుపదేశింప రాదని కొం
దఱు అనిరి.

ఎట్లనంగా:—

శ్లో. స్తైమిస్తోకో పిఽంగే శ్వసిత మపి కలం
చక్షుషాం ప్రైవృత్తిః,
మధ్యే క్షీరాబ్ధిమగ్నాః స్ఫుట మథచ వయం
కోఽయ మీదృక్ప్రకారః,
ఇత్థం దిగ్భిత్తిరోధః క్షతవిసరతయా
మాంస లై స్త్వద్యశోభిః,
స్తోకావస్థానదుస్థే త్రిజగతి ధవళే
విస్మయంతే మృగాక్షః.

[రాజా! నీకీర్తులు — మాకీ యల్పమగు తావెట్లు
చాలును?—అని స్థలసంకోచమునకు తాళంజాలక, దిగ్భి
త్తిరోధఃక్షతవిసరతగల్గునట్టులు లోకముల నొరసికొని
వ్యాపింపసాగంగా, తన్మూలమున ముల్లోకములును
తెల్లనై పోవఁగా, సందలి స్త్రీలును తెలుపెక్కినవారలై
తమ్ముఁ దాముజూచికొని, ముగ్ధలుకావున, మనమేల
యిట్లయితిమి? పాలవెల్లిలో నిమగ్నల మైతిమా! అట్లయిన
చో నంగములందుఁ గొంచెమైనను స్తైమము గన్పట్టదు.
నిట్టూర్పులును ఎప్పటిరీతిగానే ఒప్పుచున్నవి. కన్ను
లును వెనుకటివలెనే పనిఁ జేయుచున్నవి. పోనీ అట్లు
నిమగ్నలముఁ గాలేదనుకొందమా? అట్లయిన ప్రపంచ
మంతటను పాలవెల్లివలె ఈ తెల్లందనమేమి! ఏదియు

నిశ్చయించుటకు వలను గాక యున్నది. ఏమిటీ యద్భుతము—అని యిట్లు నచ్చెరువాటు నొందుచున్నారు అని తాత్పర్యము.]

మఱియు నెట్లు లనఁగా:—

శ్లో. భ్రశ్యద్భ్రూభ్రమ్న భోగీశ్వర ఫణపవనా
ఘ్మాత పాతాళతాలుః
త్రుట్యన్నానాగిరీంద్రావళి శిఖరఖరా
స్ఫాల లోలాంబురాశిః,
ఉద్యన్నీరంధ్రధూళీ విధుర సురవధూ
ముచ్యమానోపశల్యః
కల్యోద్యోగస్య యస్య త్రిభువనదమనః
సైన్య సమ్మర్ద ఆసీత్.

యని యిత్యాదిగా నెఱుంగఁ దగును. చెప్పిరికూడ ఇట్లు:—

శ్లో. దృష్టం కించి దదృష్ట మన్య దపరం
వాచాల వార్తార్పితం,
భూయ స్తందుపురాణకైః పరిణతం
కించి చ్చ శాస్త్రశ్రుతం,
సూక్త్యై వస్తు య దత్ర చిత్రరచనం
తత్కావ్య మవ్యాహతం,
రత్న స్యేవ న తస్య జన్మ జలధేః
నో రోహణా ద్వా గిరేః

"కొంచెము త దృష్టమును, మఱికొంచెము ఆ దృష్టమును, మఱికొంత వాచాలతవలనఁ గల్పించి చెప్ప

నదియు, నింకంగొంత పుక్కిటిపురాణమునుండి తెచ్చినది యు, మఱియును గొంత శ్రుతులు శాస్త్రములనుండి విన్న దియు, నీరీతిగా జక్కనిసూక్తులతో కావ్యమందు గూర్పం బడెడి చిత్రవిచిత్రవస్తురచన మెద్దానం గల్గునో, అట్టి కావ్య మవ్యాహతమై యుండఁగలదు. అంతియేకాని, కావ్య వస్తువులను రత్నములనుఁబోలి, రత్నాకరమునుండి గాని, లేక, రోహిణిగిరి నుండిగాని, ఉన్నవాని నున్నట్టులు త్రవ్వి తెచ్చి యొక్కసారిగా నెవ్వరైనను, నుత్పత్తిచేయు టసంభవింపదు:—అని రని భావము. అట్లు కాదని యా యావరీయుఁ డనెను. ఏమనంగా,—"కావ్యమునందు అస త్యమనునదిసుమంతయు నుండదు. ఇఁక నసత్యముగాఁగను పట్టునది స్తుత్యవిషయములందు సాధారణముగా చేయు నట్టి అర్థవాదమేగాని వేఱు కాదు. అట్లయిన నర్థవాదము మాత్ర మేల యందురా? అ ట్లయినచో, అది కేవలము కవుల కావ్యములలో మాత్రమే యుండలేదు. వేదముల లోను, శాస్త్రములలోను, లోకములలోను గూడఁగలదు.

వేదములలోని యర్థవాదమున కుదాహరణము:—

"ప్రస్విణ్యౌ చంతో జంఘే భూమ్నా రాత్మా ఫలేగ్రహిః,
శేరేస్య సర్వే పాప్మాన శ్రమేణ ప్రపథే హతాః."

శాస్త్రీయములలోని యర్థవాదముల కుదాహర ణము:—

ఆపః పవిత్రం ప్రథమం పృథివ్యా
మపాం పవిత్రం పరమం చ మంత్రాః,

తేషాం చ సామగ్ర్యజుషః పవిత్రం
మహర్షయో వ్యాకరణం నిరాహుః.

[భూలోకమునందలి సమస్తము లగువస్తువులలో నెల్ల మిక్కిలి పవిత్రము లయినవి యుదకములు. అవ్వాని కింగూడ(ననఁగా నుదకములకుగూడ) పవిత్రతనిచ్చునవి వేదమంత్రములు. ఆవేదమంత్రములలోను, సామవేద ఋగ్వేదయజుర్వేదములందలివి పరమపవిత్రములు. వాని కింగూడ బవిత్రతఁ గలిగించునది వ్యాకరణ మని మహర్షులు ప్రవచించి రని భావము. ఇది వ్యాకరణముంగుఱించిన అర్థవాదము.]

మఱియును ఇట్లు కలదు:—

యస్తు ప్రయుంక్తే కుశలో విశేషే
శబ్దా న్యథావ ద్వ్యవహారకాలే,
సోఽనంత మాప్నోతి జయం పరత్ర
వాగ్యోగవి ద్దుష్యతి చాఽపశబ్దైః.

[ఎవ్వఁడు నేర్పరియై వ్యవహారకాలమునందు యథాశాస్త్రీయముగా సుశబ్దములను ప్రయోగించుచున్నాఁడో, అతఁడు అనంతమగు జయమును (ఈలోకమునను పరలోకమునను కూడ పొందుచున్నాఁడు. వాగ్యోగవిదుఁడు అపశబ్దములం ప్రయోగించుట చేత దోషయుక్తుఁ డగుచున్నాఁడు" అని భావము.

వ్యాకరణమహాభాష్యమున నున్న కారిక ఇది.

[అందలి విచారణ ప్రస్తుతమునందు ఇచ్చట ముఖ్యముగాఁ దెలియఁదగి యుండుటచే మూలమును ఇచ్చట నుద్ధరించు చున్నాఁడు.

"కః, వాగ్యోగవిదేవ. కుత ఏతత్? యో హి శబ్దాన్ జానాత్యపశబ్దా నప్యసౌ జానాతి. యథైవహి శబ్దజ్ఞానే ధర్మ ఏవ మపశబ్దజ్ఞానేఽప్యధర్మః, అథవా భూయా నధర్మః ప్రాప్నోతి. భూయాంసో హ్యపశబ్దా అల్పీయాంసశ్శబ్దాః. ఏకైకస్య హి బహవో అపభ్రంశాః, తద్యథా;—గౌ రిత్యస్య శబ్దస్య, గావీ గోణీ గోతా గోపోతలి కే త్యేవ మాదయోఽపభ్రంశాః, అథ యోఽవాగ్యోగవిత్ అజ్ఞానం తస్య శరణం, నాత్యంతాయా మజ్ఞానం శరణం భవితుమర్హతి, యో హ్యజాన న్వై బ్రాహ్మణం హన్యా త్సురాం వా పిబేత్సోఽపి మన్యే పతిత స్స్యాత్, ఏవం తర్హి సోఽనంత మాప్నోతి జయం పరత్ర వాగ్యోగవి ద్దుష్యతి చాపశబ్దైః, కః? అవాగ్యోగవిదేవ. అథ యో వాగ్యోగవిత్ విజ్ఞానం తస్య శరణం. క్వ పున రిదం పఠితం? భ్రాజా నామ శ్లోకాః. కించ భోః శ్లోకా అపి ప్రమాణం? కించాతః? యది ప్రమాణ, మయ మపి శ్లోకః ప్రమాణం భవితు మర్హతి.

ఇది దీనికి భావము:—దోషయుక్తుఁ డగునది ఎవఁడు? వాగ్యోగవిదుఁడే!, ఇది ఎందువలన?,ఎవఁడు సుశబ్దముల నెఱుఁగునో, వాఁడు అపశబ్దములను గూడ నెఱుఁగును. సుశబ్దజ్ఞానమున పుణ్యధర్మమున్నట్లె అపశబ్దజ్ఞానమున నధర్మముఁకూడ కలదు. (కేవలము అధర్మ మనుట కంటె)చాల నధర్మమునుపొందుచున్నాఁడు(అనుట మేలు) లోకమునందు అపశబ్దములు పెక్కులును, సుశబ్దములు కొలఁదిగను నున్నవి. ఒక్కొక్కశబ్దమునకును అనేకముగ

నపభ్రంశములు గలవు. ఎట్లనఁగా—గౌః అను శబ్దమునకు గావి, గోణి, గోత, గోపోతలిక అను నీమొదలగు నపభ్రంశములు పెక్కులు గలవు. వాగ్యోగవిదుఁడు గాక అవాగ్యోగ విదుఁడే యైనచో ? అజ్ఞానమే అతనికి అట్టి యపశబ్దములఁ బ్రయోగించినందులకు శరణ్యము. అందు నను మితిమీఱినచో అజ్ఞానము శరణము కాఁజాలదు. తెలియక ఎవ్వఁడైనను బ్రాహ్మణుని చంపినఁ గాని,కల్లు ద్రావిననుగాని, అతఁడు పతితుఁడే యగు ననుకొందునా? ఇట్లయినచో—అతఁడు, అనగా సోనంతిమాప్నోతి అను దానిచే దోషభాక్కుగాఁ జెప్పఁబడినవాఁ డెవ్వఁడు? వాగ్యోగవేత్తా? లేకఅవాగ్యోగవిత్తా? ఇట్లు దూష్యుఁడగున దెవ్వరు ? అవాగ్యోగవిదుఁడే. మఱి వాగ్యోగ విదుని విషయ మేమి యన్ననో, విజ్ఞాన మతనికి శరణము. ఇయ్యది ఎచ్చట పఠితము ? అనఁగా నెందున్నది ? అని భావము. భ్రాజానామశ్లోకములలో. ఓహో! మఱి శ్లోకములుకూడ ప్రమాణములేనా? యేమి కాక ? మఱి శ్లోకములు కూడ ప్రమాణమైనచో, ఈ క్రింది శ్లోకముగూడ ప్రమాణము కావలసి వచ్చుచున్నది కాదా?

“యదుదుంబర వర్ణానాం ఘటీనాం మండలం మహత్,
పీతం న గమయేత్స్వర్గం కిం తత్ క్రతుగతం నయేత్?”

ప్రమత్తగీత ఏషః, భవతో యస్త్వప్రమత్తగీతః? తత్ప్రమాణమేవ”—ఇతి గోనర్దీయః, [పాతంజలవ్యాకరణం—పస్పశము.].

[ఉదుంబరవర్ణములు గల (అనేక) ఘటముల మద్యముఁ ద్రాగినను, మనుజుఁడు స్వర్గమును పొందఁజాలకున్నాఁడని చెప్పినచో, నింకను క్రతువులలోని స్వల్పమాత్రమగు మద్యపానమున స్వర్గప్రాప్తి కలుగునా? అని మూలమునం దుదాహరించిన యదుదు బరవర్ణానాం- అన్నదానికి భావము.]

మీరు చెప్పినట్టిది ప్రమత్తగీతము తా ముదాహరించినట్టిది మాత్రమో? అప్రమత్తగీతము. కావున నది ప్రమాణమే యగును—" అని గోవర్ధియుఁడనెను. అనఁగా మహాభాష్యప్రణేత చెప్పె నని భావము.

లౌకికమగునర్థవాదమున కుదాహరణము:—

శ్లో. గుణానురాగ మిశ్రేణ యశసా తవసర్పతా,
దిగ్వధూనాం ముఖే జాత మకస్మా దర్ధకుంకుమమ్.- అని.

"అసద్విషయము నుపదేశించును గనుక కావ్యములను ఉపదేశింపఁగారాదు" అని కొందఱందురు. అది యెట్లనఁగా:-

శ్లో. వయం బాల్యేడింభాం స్తరుణిమని యూనః పరిణతా,
వపీచ్ఛామో వృద్ధా న్పరిణయ విధే స్తు స్థితి రియమ్,
త్వయారబ్ధం జన్మ క్షపయితు మమార్గేణ కి మిదం,
న నోగోత్రే పుత్రి క్వచి దపి సతీలాంఛన మభూత్.

[అమ్మాయీ! మేము బాల్యమున పిల్లలమై పిల్లలను వయస్సున యువకులను, ముసలితనమున (ముసలివారమై) ముసలులను రమించితిమి. ఇదియే మనలో

మాంపెండ్లిండ్లరీతి. ఇంక నీవన్ననో మావలె చేయక, విరుద్ధముగా కుమార్గమునం బడి జన్మను వ్యర్థము సేయుచున్నావు. ఏమిది? తల్లీ! మన వంశమునందు ఎక్కడను ఇంతదనుక 'పతివ్రత' అనెడి పొలకువైనను లేనేలేదు—అని భావము. ఇందు అసద్విషయము దేశింపం బడుచున్నది. ఇదియొక వృద్ధవేశ్య తనకుమారిత కుపదేశించిన యుపదేశమందురు.]

"ఇట్టి యుపదేశము కావ్యములందున్నమాట నిజమే! కాని, ఇయ్యది నిషేధ్యత్వేన చేయంబడినదే కాని, విధేయత్వేన చేయాబడినది కాదు" అనియాయావరీయుఁడు. ఇటువంటి ప్రవర్తనలు పరస్త్రీలయందు పురుషులకు ఏవేవి సంభవించుచుండునో, వాటిని తెలిసికొని జాగ్రత్త వహింపవలయు ననియే, ఇట్టిచోటుల కవియభిప్రాయము. మఱియును లోకయాత్ర యంతయును కవివచనాయత్తమయియే యున్నది. అయ్యదియును నిశ్శ్రేయసముఁకు-శుభముల నొందుటకు-కారణము" అని మహర్షు లనిరి. వా రేమని చెప్పి రనంగా:—"కావ్య స్వరూపమున నెలకొన్నవై (అనఁగా కావ్యమయములై) కవుల సూక్తులు ఎందాక భూమండలమున నిలచి యుండునో, అందాక, ఆకవి సారస్వతస్థానము నొంది, పరమంబున నానందించి యుండఁగలఁడు." అని. మఱియును,

శ్లో. శ్రీమంతి రాజ్ఞాం చరితాని యాని
ప్రిభుత్వలీలా శ్చ మహాశినాం యాః,

యే చ ప్రభావా స్తపసామృషీణాం
తాః సత్కవిభ్యః శ్రుతయః ప్రసూతాః.

"రాజులయొక్క శుభచరిత్రము లెయ్యెయ్యవి కలవో, దేవతలయొక్క ప్రాభవలీల లెయ్యెవి కలవో, తపోనిధులగు మహర్షుల ప్రభావము లేయెవి గలవో, అవి యన్నియును సత్కవుల గ్రంథములనుండియే లోకమున బయలు వెడలినవి. ఇంత యేల! లోకప్రసిద్ధములగు నా శ్రుతులును సత్కవులనుండియే ప్రసూతము లయినవి గదా! యని భావము.

చెప్పిరి కూడ నిట్లు:—

శ్లో. ఖ్యాతా నరాధిపతయః కవిసంశ్రయేణ
రాజాశ్రయేణ చ గతాః కవయః ప్రసిద్ధిం,
రాజ్ఞా సమోఽస్తి న కవేః పరమోపకారీ
రాజ్ఞో న చాఽస్తి కవినా సదృశః సహాయః.

["రాజులు కవులయాశ్రయముచేతను, కవులు రాజుల యాశ్రయము చేతను లోకమున శాశ్వతముగా విఖ్యాతు లైరి. కనుక కవికి రాజుతో సమానుఁడైన పరమోపకారి గాని, రాజునకు కవితో సమానుఁడైన ఉత్తముఁడగు సహాయుఁడు గాని లేఁడు" అని. భావము.

శ్లో. వల్మీకజన్మా స కవిః పురాణః
కవీశ్వర స్సత్యవతీసుత శ్చ,
యస్య ప్రణేతా త దిహాఽనవద్యం
సారస్వతం వర్త్మ న కస్య వంద్యమ్?

[వల్మీకమునఁ (పుట్టలోఁ) బుట్టిన వాల్మీకిమహర్షియును, సత్యవతీదేవి పుత్రుండగు వ్యాసమహర్షియు, ప్రాచీనులగు కవులును కవీశ్వరులు నైయున్నారు. వారిర్వురు నేర్పఱచియుంచిన యనవద్య (అనఁగా నిర్దుష్ట) మగు సారస్వతమార్గము అభివంద్యమైనదిగా నెవ్వరికి నుండదు? అనఁగా నందఱకు నామార్గ మాభివంద్యమే యగు నని భావము.

అసభ్యమగు నర్థమును చెప్పునది గనుక కావ్యము నుపదేశింప రా దని మఱి గొంద ఱనిరి. ఆయసభ్యార్థమున కుదాహరణ మెట్టి దనఁగా.

శ్లో. ప్రసర్పన్నిశ్శ్రీవైర్భృత భువనకుక్షి ర్ఘృణ ఘృణా
కరాళః ప్రాగల్భ్యం వదతి తరుణీనాం ప్రణయిషు,
విలాసవ్యత్యాసా జ్జఘనఫల కాస్ఫాలన ఘన
స్ఫుట చ్ఛేదోత్సిక్తః కలకనక కాంచీ కలకలః.

అని యిందు నసభ్యార్థమున్న దందురు. మఱియును.

శ్లో. నిత్యం త్వయి ప్రచురచిత్రక పత్రభంగీ
తాటంకతాడన విపాండుర గండలేఖా,
స్నిహ్యంతు రత్నరశనారణనాభిరామ
కామార్తి నర్తిత నితంబ తటాస్తరుణ్యాః.

అనియును వా రసభ్యార్థముల కుదాహరింతురు.

కాని విషయమునందలి వర్ణనసందర్భముల క్రమము ననుసరించి, ఇట్టి అర్థముఁ గూడఁ జెప్పవలసినదే" అని యాయావరీయుఁడు అనెను. ఇట్లు చెప్పుట, కేవలము

కావ్యములందేగాక, వేదములలోను శాస్త్రములలోను కూడ కలదు. యజుర్వేదమున నసభ్యార్థ మిట్లు కలదు:—

యోని రుదూఖలం శిశ్నం ముసలం
మిథున మే వైత త్ప్రజననం కురుతే" అని.

ఋక్కులలోఁ గూడ కలదు:—

ఉపోప మే పరామృశ మా మేదభ్రాణి మన్యథాః
సర్వాహ మస్మి రోమశా గాంధారీణా మి వావికా. అని.

ఇఁక శాస్త్రములలో నున్న యసభ్యార్థములకు ఉదాహరణము:—

శ్లో. యస్యాః ప్రసన్నగవళం చక్షుః పర్యంత పక్ష్మలమ్,
నవనీతోపమం తస్యా భవతి స్మరమందిరమ్"

[ఈపైని చెప్పిన యసభ్యార్థములకు అర్థమును చదువరులకు అశ్లీలము తోఁచు నని వ్రాయనైతిని.— సంపా.]

ఇది పదవాక్యవివేకము. ఇట నిదిగ్దర్శకముగాఁ గొంచెముగా వివరింపఁ బడినది. ఇటుపైని కొన్నివాక్య ప్రకారములను, ఇతర విషయములను, మఱికొన్నిటిని మున్ముందు ప్రకరణములందు చెప్పెదము.

ఇది. రాజశేఖరకవిరాజకృతమగు కావ్యమీమాంస యను
కవిరహస్యమునఁ బ్రథమాధికరణమునందు
షష్ఠాధ్యాయము.

---

# రాజశేఖరకవి కావ్యమీమాంస.

## పాఠప్రతిష్ఠ.



### సప్తమాధ్యాయము.

[ఈయధ్యాయమునందు వచ్చెడివిషయములు:— ౧. పురాణాదిమతముల ననుసరించి, ప్రణేతృభేదమునమైన వాక్యభేదములు, ౨ స్వాయంభువాదివాక్యములు. వానియర్థములు. ౩ సారస్వతికవిమతానుసారమున పారమేశ్వరవచోనిరూపణము. ౪ దానికే దివ్యత్వాదులగు వ్యపదేశములు. ౫ అందుగల వైబుధాదిభేదములు, వానియుదాహరణములు. ౬ వైష్ణవవాక్యమునకు మానవత్వవ్యపదేశము. ౭ అందు రీత్యనుసారమున నేర్పడిన భేదములు. ౮ కాకువక్రోక్తులవిషయమునం జేసిన రుద్రటమతఖండనము. ౯ కాకునిరూపణము, తద్భేదములు. తదుదాహరణములు. ౧౦. కాకుపాఠప్రతిష్ఠాభేద నిరూపణములను గుఱించిన సంగ్రహశ్లోకములు. ౧౧. మగధాదులగు దేశములలోని కవుల పాఠప్రతిష్ఠను గుఱించిన సంగ్రహశ్లోకములు—ఇత్యాదులు.

వాక్యమును వచన మనియు వ్యవహరించెదరు. ఆవాక్యము ప్రణేతలభేదమునుబట్టి బ్రాహ్మమని శైవమని వైష్ణవమని మూఁడు తెఱఁగులు. ఈవిభాగవిషయము అంతయును వాయుపురాణము మున్నగు వానివలన నేర్పడినట్టిది. అందులో బ్రాహ్మవచనము, స్వాయంభువ మని, ఐశ్వమని, ఆర్షమని, ఆర్షికమని, ఆర్షిపుత్రకమని యైదువిధములు. స్వాయంభువు అనఁగా బ్రహ్మ. ఆతనికి సంబంధించినది స్వా

యంభువము. స్వాయంభువునికి భృగుమహర్షి మున్నగు వారు మానసికపుత్రులు. వీరిని నైశ్వరు లందురు. వీరికి సంబంధించినది నైశ్వర మనంబడును. ఈశ్వరులయొక్క పుత్రులు ఋషులు. వారికి సంబంధించినది ఆర్షము. ఋషులయొక్క బిడ్డలు ఋషీకులు. వారికి సంబంధించినది ఆర్షిపుత్రిక మనంబడును. స్వాయంభువుని ప్రథమవాక్యము శ్రుతి (వేదము). శ్రుతికంటె నితరమగునదికూడ స్వాయంభువ మనియే చెప్పందగును. ఇట్లే అనిరికూడ.

శ్లో. సర్వభూతాత్మకం భూతం పరివాదం చ య ద్భవేత్।
క్వచి న్నిరుక్తమోక్షార్థం వాక్యం స్వాయంభువం హి తత్.

ఆశ్రుతియే కొంచెము తేము రూపాంతరగా నొందినట్లు పరిణతమై యీశ్వరవచన మనంబడుచున్నది. అది ఇట్లు చెప్పంబడినది:—

శ్లో. వ్యక్తక్రమ మసంక్షిప్తం, దీప్తగంభీర మర్థవత్,
ప్రత్యక్షం చ పరోక్షంచ, లక్ష్యతా మైశ్వరంవచః.

వాక్యక్రమము స్పష్టముగా వ్యక్తమై యున్నదియును, అసంక్షిప్తమును, దీప్తగంభీరత గలదియును, అర్థవంతమును, ప్రత్యక్ష పరోక్షముల రెండింటియందును లక్ష్యముగా నున్నదియును నగునది నైశ్వరవాక్యము.

శ్లో. యత్కించిన్మంత్ర సంయుక్తం। యుక్తం నామవిభక్తిభిః,
ప్రత్యక్షాభిహితార్థంచ త ృషీణాం వచ స్మృతం.

ఆర్షముకొంత మంత్రభాగముతోకూడికొని నామవిభక్తి సమన్వితమై ప్రత్యక్షాభిహితమగు నర్థముకల్గి

యుండునట్టిది యార్షవాక్య మనఁబడు నని తాత్పర్యము.

ఆర్షికము:—

శ్లో. నైగమై ర్వివిధై శ్శబ్దైః నిపాతబహుళం చ యత్,
నచాఽపి సుమహ ద్వాక్య మృషీకాణాం వ చ స్తు తత్.

నిగమప్రసిద్ధము లగు వివిధశబ్దములతోఁ గూడి కొని, నిపాత బహుళముగా నుండి, పొడవుగానుండు వాక్యములు లేక యుండునట్టిని ఆర్షికము నాబడును.

ఆర్షిపుత్రకము—

శ్లో. అవిస్పష్టపదప్రాయం య చ్చ స్యా ద్బహుసంశయం,
ఋషిపుత్రవచ స్తత్స్యా స సర్వపరిదేవనమ్.

ప్రాయశః అవిస్పష్టముగాని పదములతోనిండి,అనేక సంశయములతోఁ గూడినదై సర్వపరిదేవనమైయుండునది ఋషిపుత్రవాక్యము అనఁబడును. వీనికన్నిఁటికిని నుదాహరణములను పురాణములనుండి అనుసంధింపందగును. [ఈగ్రంథముచివరఁ జూచునది.]

మహాకవులై పూర్వాచార్యులగు పెద్దలు సారస్వతికవు లెల్లరు నిట్లని చెప్పుచుండిరి.

బ్రహ్మ విష్ణువు రుద్రుఁడు గుహుఁడు బృహస్పతి శుక్రుఁడు మున్నగు నరువది నల్వురు శిష్యులకును ఉపదేశించినవాక్యము పారమేశ్వరము. క్రమముగా దేవుల చేతను దేవయోనులచేతను యథామతిగ నుపజీవ్యమాన మగుచు వచ్చుచున్నది దివ్యవచన మని చెప్పఁబడుచున్న

ది. ఇంక దేవయోను లెవ్వరని—విద్యాధరులు అప్సరలు యక్షులు రక్షస్సులు గంధర్వులు కిన్నరులు సిద్ధులు గుహ్యకులు భూతములు పిశాచములు అనెడి వీరు దేవయోను లనంబడుదురు.

అందు దేవయోనులలోఁ బిశాచాదు లగు శివానుచరులు స్వభూమియందు సంస్కృతమును మాటాడుచుండునట్లును, మర్త్యలోకమునందు భూతభాషతో వ్యవహరించుచుండునట్లును కూర్పవలయును. కవులు తమ గ్రంథములలో ఇట్లె యప్సరసలు ప్రాకృతభాషతో వ్యవహించెదరు. పైనిచెప్పిన దివ్యవచనము- వైబుధ మనియును, వైద్యాధర మనియును, గాంధర్వ మనియును, యోగినీగత మనియును, నాలుగు తెఱఁగులు. ఈ నాలుగు తెఱఁగులకంటె, మిగిలిన వన్నియు ప్రకృతి సాదృశ్యము కలవి గనుక ఇందే చేరినట్లు ఎంచుకొనవలయును. అనఁగాఁ దక్కినవివిధములగు భాషలెల్లను కొంచె మెచ్చు తక్కువఁగా నీభాషలలో నుండియే పుట్టినవి. గనుక నీ భేదములలోనే ఏదో యొకదాని యందు చేరును.

అందులో వైబుధము:—

శ్లో. సమాసవ్యాససందృబ్ధం శృంగారాద్భుతసంభృతం,
సానుప్రాస ముదారం చ వచ స్స్యా ద్దమృతాశినాం.

సమాసవ్యాసముతో-చిన్నచిన్న సమాసములు గల్గునట్లు-కూర్పఁబడి, శృంగారాఽద్భుతరసములతో

నిండి యనుప్రాసములు గలిగి ఉదారమై ఉండునది. దేవవాక్యము అనంబడును.

ఉదాహరణము:—

యచ్చంద్రకోటి కరకోరక భారభాజి
బభ్రామ బభ్రుణి జటాపహారే హారస్య,
తద్వః పునాతు హిమశైలశిలానికుంజ
ఝాత్కారడంబర విరావి సురాపగాంభః.

[ఎయ్యది చంద్రకోటికిరణము లనెడి (మల్లె మొగ్గల బరువును వహించినదై, బభ్రువర్ణము గల శివుని జటాపహారమున సుడివడం దిరిగినదో, హిమవద్గిరి శిలాప్రదేశముల యందలి పొదరిండ్లలోని ఝాంకారాడంబరంబును గల్గి మ్రోసెడి, యా దేవగంగాంభః ప్రవాహము మిమ్ములఁ బ్రోచుగాక - యని భావము. ఈశ్లోకము సదుక్తికర్ణామృతమునందును, సరస్వతీకంఠాభరణమునను ఉన్నది. ఇఁదు విస్తారముగ సంస్కృతసమాసములును, అనుప్రాసములును కూర్పఁబడి శృంగారాద్భుతరసములతో నుదార మగు రచన సేయఁబడినది. గనుక నిది వైబుధమగు వాక్యమున కుదాహరణము.

వైద్యాధరము:—

శ్లో. స్తోకానుప్రాసచ్ఛాయం చతురోక్తిప్రసాది చ,
ద్రాఘీయసా సమాసేనవిద్ధి వైద్యాధరం వచః.

కొలదిపాటిగ అనుప్రాసచ్ఛాయగలిగి చతురోక్తు

లచే నొప్పుచున్నదై పొడవగు సమాసములతో నొప్పి యుండెడిది వైద్యాధరము నాఁబడును.

ఇందులకు ఉదాహరణము:—

శ్లో. ప్రణతసురకిరీటప్రాంశురత్నాంశువంశ
చ్ఛురితనఖశిఖాగ్రోద్భాసమానారుణాంఘ్రే,
ఉదితతరణిబృందోద్దామధామోర్ధ్వనేత్ర
జ్వలననికరదగ్ధానంగమూర్తే! నమస్తే.

[అనఁగా ప్రణతులగు దేవతల తలలందలి కిరీటములందుగల ప్రాంశురత్నాంశువంశములచే, చ్ఛురితములగు గోళ్ళతో విలసిల్లెడి కెంపుగదరిన పాదపద్మములు గలవాఁడా! యుదయించిన సూర్యులగుంపునుంబోలి యుద్ధామమగు తేజము బర్వెడి యూర్ధ్వనేత్రము యొక్క జ్వాలలగుంపుతో దగ్ధముగావింపఁబడిన మన్మథశరీరము కలవాఁడా! హరా! నీకొఱకు నమస్కారము అనిభావము. ఇందు కొలఁదిపాటియనుప్రాసలచ్ఛాయశేయున్న, చతురోక్తులచే ప్రసాదగుణమును దీర్ఘసమాసమును కూర్పఁబడుటచేత నిది వైద్యాధరవాక్యమున కుదాహరణము.]

మఱియు నింకనొక యుదాహరణము:—

శ్లో. భ్రమతి భ్రమరకరంచిత,
నందనవనచంపకస్తబకగౌరవః.
నాత్యాహత ఇవ వియతి
స్ఫుటలక్ష్మా రోహిణీకమణః.

[భ్రమరములచేఁ జుట్టుకోఁబడిన నందనవనము నందలి సంపెంగగుత్తివలె గౌరవర్ణము గల చంద్రుఁడు హాత్యాహాతుని వలె స్పష్టముగుగుఱుతు కలవాఁడై తోఁచు చున్నాఁడని భావము.]

గాంధర్వము:—

శ్లో. ప్రాస్త్యైస్సమాసైర్వ్యాధియోభిః
విభూషిత పదాచయా.
తత్వార్థగ్రథనగ్రాహ్యా
గంధర్వాణాం సరస్వతీ.

[అనేకములగు చిన్న చిన్న సమాసములచేతనలంకృత మగు పదోన్నతిగలదియును, యథార్థము నెఱుంగననునగు నది గాంధర్వము.]

ఉదాహరణము:—

"నమశ్శివాయ సోమాయసగణాయ సమానవే,
సన్నృషవ్యాళశూలాయ సకపాలాయసేందవే" అని.

[ఉమానహితుఁడును, ప్రమథగణయుతుఁడును, వృషభవాహనము, నాగయజ్ఞోపవీతము,శూలాయుధము వీనిచే నొప్పెడివాఁడును, కపాలధారియుఁ, జంద్రకళాధరుండును నగుశివుని కొఱకు నమస్కారమని భావము. ఇందు చిన్నచిన్నవగు పెక్కులు సమాసములు, స్వాభావికములగు వర్ణనము లుండుటచేత నివి గాంధర్వవాక్యమనంబడినది.]

యోగినీగత వాక్యలక్షణము: —

శ్లో. సమాసరూపకప్రాయం గంభీరార్థపదక్రమం.
సిద్ధాంత సమయస్థాయి యోగినీనా మిదం వచః.

[తఱచుగా చిన్నచిన్నరూపకములతో నిండియున్నదై గాంభీర్యముగల అర్థములయుఁ బదములయు నానుపూర్వి గలది యై, సిద్ధాంతసమయముల (సిద్ధాంతరూపము లగుశాస్త్రవచనముల) నొప్పియుండు నట్టి వాక్యము యోగినీ గత మనంబడుచు నున్నది.]

యోగినీగతవాక్యమున కుదాహరణము: —

శ్లో. దుఃఖేంధనైకదహనామృతవర్షమేఘ
సంసారకూపపతనైకకరావలంబ!
యోగీంద్రదర్పణ! జగద్గతకృత్స్న తేజః
ప్రత్యక్షచారవర! వీరప తే నమ స్తే.

[దుఃఖముల నెడి ఇంధనములకు ఏక దహనుఁడును, భక్తకోటికి అమృతమును వర్షించుటలో ప్రధానుఁడవగు మేఘుఁడవును, సంసారకూపమునఁ బడిన భక్తకోటికి ప్రధానమైన హస్తావలంబనము కలవాఁడవును యోగీంద్రు లనెడియద్దములందు ప్రతిఫలించినవాఁడవును, లోకవ్యాప్తమైన తేజస్సుగలవాఁడవును, భగవత్తేజముఁ గన్నులారఁ గాంచినవాడవును అగు నోవీరా! నీకొఱకు నమస్కారము. అని భావము. ఇచ్చట దుఃఖేంధన దహన - అమృతవర్షమేఘ, సంసారకూప, యోగీంద్రదర్పణ-

ఇత్యాదులగు రూపకములతో నిండి, గంభీరార్థపదక్రమము గలిగి యుండి, జైనసిద్ధాంతస్థాయి యగువాక్యము లుండుటచే, నిత్యాదులు యోగినీగత వాక్యముల కుదాహరణము లయ్యెను.]

భుజంగమ(నాగుల)సంబంధ మగు వాక్యము కూడ, మహాప్రభావసంపన్నమై యుండుటం జేసి, దివ్యమనియే యుపచారముగాఁ జెప్పంబడుచున్నది. అద్దాని క్రిందిది లక్షణము:—

శ్లో. ప్రసన్న మధురోదాత్త సమాసవ్యాసభాగవత్,
అనోజస్వి పదప్రాయం వచో భవతి భోగినాం.

[ప్రసన్నములు, మధురములు నుదాత్తములు నగు చిన్న చిన్న సమాసభాగములతో విలసిల్లుచు, అనోజస్వులగుపదములతో తఱచుగా నున్నవాక్యములు భోగి (నాగజాతి)సంబంధము లగు వాక్యము లని యందురు.]

భోగినీగతవాక్యమున కుదాహరణము:—

శ్లో. మసజ్జితాం శ్రోత్రసుఖాం సురూపాం,
అనేకరత్నోజ్జ్వల చిత్రితాంగీం,
విద్యాధరేంద్రః ప్రతిగృహ్య వీణాం
పినాకినే గాయతి మంగళాని.

[విద్యాధరరాజు, చక్కఁగా సజ్జితమై, చెవికింపుచు గూర్చుచు నందమై అనేకరత్నములు పొదిగియుండుటచే చిత్ర విచిత్రము లగునవయవములు గలవీణను చేతఁబట్టి కొని, పినాకియగు నీశ్వరునకై మంగళములను పాడుచు

నున్నాఁడు-అని తాత్పర్యము. ఇందు ప్రసన్నమధురోక్త సమాసభాగములతో అనోజస్విపద ప్రాయముగాఁ జెప్పం బడుటచేత నిట్టివాక్యములు భోగినీవాక్యమున కుదాహరణము లైనవి.]

అట్లయిన ననుపదేశ్యములగు బ్రాహ్మపారమేశ్వర వాక్యమార్గముల నిట నుపదేశింప నేల? అని ఆచార్యుల డిగిరి. అదియును కవులకు నుపదేశపరము గనుక, నిట నుపదేశింపఁబడిన దని యాయావరీయుఁడు అనెను. ఏలయనఁగా:—నాటకములు మున్నగు దృశ్యకావ్యములందును, ఇతరములు లగు శ్రవ్యకావ్యములందును ఈశ్వరాదులను దేవాదులను ప్రవేశపెట్టి, వారి వాక్యములుగా చెప్పింపవలసి వచ్చును. అట్టి సమయములలో ఆయాజాడలు గల్గునట్లుగా బ్రాహ్మపారమేశ్వర వాక్యజాతములు కూర్పవలసి యుండును. కావుననే నిది దివ్యమని చెప్పంబడినది కూడ నని యెఱుఁగునది.

మనుష్యుఁడుగా నవతరించి వ్యవహరించుట కభిరుచి గల శ్రీమహావిష్ణువుయొక్క వాక్యములై వైష్ణవ మనియు, కనుక వైష్ణవ వాక్య మనఁగా మానుషవాక్య మనియుఁ గొంద అందురు. అట్లనుట ప్రాయోపవాద మే యగుఁగాని, వేఱు కాఁజాలదు.

ఇట్టులు వివరింపఁ బడిన యీవాక్యము మరల్తే ఱఁగు లగు రీతిభేదముల ననుసరించి, మూఁడువిధము లగుచున్నది. అట్లే చెప్పియున్నారు కూడ:—

శ్లో. వైదర్భీ గౌడీయా పాంచాలీ చేతి రీతయ స్తిస్రః,
ఆసు చ సాక్షా న్నివసతి సరస్వతీ తేన లక్ష్యంతే,
రీతిరూపం వాక్యత్రితయం కాకుః పున రనేక యతి.

[1వైదర్భియని, గౌడీయ యని, పాంచాలి యని మూఁడురీతులు కలవు. సరస్వతి యీరీతి ననుసరించియే

---

1 సా త్రేధా వైదర్భీ గౌడీయా పాంచాలీ చేతి. వామనుని కావ్యాలంకారసూత్రము (1-2-17).

శ్లో. విస్పష్ట క్రియమాణా దక్లిష్టా స్వరవిశేషతో భవతి,
అర్థాంతరప్రతీతి ర్యత్రాఽసౌ కాకువక్రోక్తిః.
—రుద్రటుని కావ్యాలంకారము (2-16)

కాకు ర్వక్రోక్తి ర్నాలంకారత్వేన న వాచ్యా. పాఠధర్మత్వాత్. తథా చ అభిప్రాయవా న్పాఠధర్మః కాకుః, స కథ మలంకారస్స్యా దితి యాయావరీయః. గుణీభూతవ్యంగ్యప్రభేద ఏవ చాఽయం, శబ్ద స్పృష్టత్వేన అర్థాంతర ప్రతీతి హేతుత్వాత్. యదాఽహ ధ్వని కారః.—

శ్లో. అర్థాంతరగతిః కాక్వా యా చైషా పరిదృశ్యతే,
సా వ్యంగ్యస్య గుణీభావే ప్రకార మిమ మాశ్రితా.

సా చ కాకు ర్ద్వివిధా. సాకాంక్షా నిరాకాంక్షా చ, వాక్యస్య సాంకాంక్షనిరాకాంక్షత్వాత్. యస్మా ద్వాక్యా ద్యాదృశస్సంకేతబలేనాఽర్థః ప్రతీయతే, న తాదృశ ఏవ. కింతు న్యూనాదికః ప్రమాణబలేన నిర్ణయయోగ్యః తద్వాక్యం సాకాంక్షం, తద్విపరీతం నిరాకాంక్షం. వక్తృగతా హ్యాకాంక్షా వాక్యే ఉపచర్యతే. సా చ ప్రకరణబలా న్నిశ్చీయతే. విశిష్టవిషయత్వం చ తస్యా స్తత ఏవాఽవసీయతే. —హేమచంద్రుని కావ్యానుశాసనం.

శీఘ్రముగను ప్రత్యక్షముగను వసించుచున్నదనిగుర్తింపఁ బడుచున్నది—అనియును, రీతిరూపమున నున్న యీ మూత్తెఱంగులగు వాక్యములను కాకువు పెక్కువిధముల నొనర్చుచున్నది అనియును భావము.]

'కాకు వనునది వక్రోక్తియను పేరను జెప్పంబడునట్టి శబ్దాలంకారమే' అని రుద్రటుఁడు పల్కెను. అభిప్రాయవంతమగు [అనంగా సాభిప్రాయమగు] పాఠధర్మము కాకువుగదా? అది అలంకార మెట్లగును? అని యాయాపరీయుఁ డనును. మఱి ఇంక నా కాకువుకూడ సాకాంక్ష యని నిరాకాంక్షయని రెండువిధములు. వాక్యాంతరాకాంక్షిణి యగునది (అనఁగా వాక్యాంతరముఁ గోరునట్టిది) సాకాంక్ష. వాక్యోత్తరభాషిని యగునది నిరాకాంక్ష, ఆబక్కవాక్యమే కాకు విశేషమున కాంక్షగను నిరాకాంక్షముగను నుండును. మఱియు నీకాకువు ౧ ఆక్షేపగర్భ, ౨ ప్రశ్నగర్భ, 3 వితర్కగర్భ అని ముత్తెఱఁగులుగా సాకాంక్షయగు కాకువును, ౧ విధిరూప, ౨ ఉత్తరరూప, 3 నిర్ణయరూప—అని ముత్తెఱఁగులుగా నిరాకాంక్షయగు కాకువును, నుండును. అందు సాకాంక్షా భేదము లగు కాకువులలో—

ఆక్షేపగర్భ యగు కాకువున కుదాహరణము:—

శ్లో. యది మే వల్లభా దూతీ తదాఽహ మపి వల్లభా,
యది తస్యాః ప్రియా వాచః, తన్మమాఽపి ప్రియః. తూపి)

[నాదాసీది వల్లభ యైన నేనును వల్లభనే (వల్లభుఁడు= ప్రియుఁడు; వల్లభ- స్వాధీనభర్తృక) యగుదును. ఆవిడకు అతని మాటలు ప్రియము లైనచో నాకును అవి అత్యంతము ప్రియము లగును-అని భావము.]

ఇందు నాయకునితోడి పొత్తు గలిపిన యొకదూతిక నాయికచే కాకుస్వరమున నాక్షేపింపంబడు చుండుటచే ఇది ఆక్షేపగర్భ యగు కాకువున కుదాహరణ మగు చున్న దందురు. ఇట్టులనే నిర్దేష్టృవిధిరూప మగు కాకువును గూడ నూహించుకొనవలయును.

౨. ప్రశ్నగర్భయగు కాకువున కుదాహరణము:—

శ్లో. గత స్స కాలో యత్రాసీ న్ముక్తానాం జన్మ వల్లిషు,
వర్తంతే సాంప్రతం తాసాం హేతవ శ్శుక్తిసంపుటాః.

[వల్లులయందు (తీవలలో) ముత్తెములు పుట్టునట్టి ఆకాలము గడచి చాలదినములు) అయి పోలేదా? ఇఁక నిప్పుడు వానికి జన్మహేతువులుగా శుక్తిసంపుటములు మాత్రమే ఉన్నవి- అని భావము.

ఇందు—ముత్తెములు తీవలనుండి పుట్టునట్టికాలము పోయినదనుటచేత, ఉత్తమగుణవిశిష్ట యగునాయికల నాచుదరించుకాలము పోయిన దనియు, నిఁక నిప్పుడు ఆస్థానమునందు కేవలము నిర్గుణులగు నాయిక లున్నా (రనియు, కావున నినుఁబోలిన బుద్ధిమంతుఁడు, ప్రయత్నించి అట్టియుత్తమగుణవిశిష్ట లగునాయికలను ఆదరింపవలయు ననియు నిర్దేశింపఁబడు చున్నది. ప్రశ్న

పూర్వకముగా నిందు కాకువు విశ్లేషింపఁబడుటచేత నిది ప్రశ్నగర్భ యనఁబడినది. ఇదియే ఉపదేష్ట కుత్తరరూపమున నుండెడి కాకు వందురు.

3. వితర్కగర్భయగు కాకువున కుదాహరణము:—

శ్లో. నవజలధర స్సన్నద్ధోయం! న దృప్తనిశాచరః?
సురధను రిదం దూరాకృష్టం! న నామ శరాసనం?
అయ మపి పటు ర్ధారాసారో! న బాణపరంపరా?
కనకనిపస్నిగ్ధా విద్యుత్! ప్రియా మ న మోర్వశీ?
—విక్రమోర్వశీయము.

[ఈసన్నద్ధమైనది నవజలధరమా! దృప్తనిశాచరుఁడు కాఁడూ? ఇది ఇంద్రధనుస్సా! దూరాకృష్టమగు శరాసనము కాదా? ఇది దృఢమగుజడివానయా! బాణపరంపర కాదూ? కనకనికషస్నిగ్ధమైన మెఱపా? ఇది నాప్రియురా లూర్వశి కాదా?—అని భావము. ఇందు వితర్కగర్భముగా కాకువుండుటచే నిట్టిపేరు దీనికి వచ్చినది అని యెఱుంగునది.]

ఇదియే ఉపదేష్టృనిర్ణయరూప యగు కాకువు. ఇట్లీమూఁడువిధములగునవి నియతనిబంధము గలవి. ఏతదన్యము లన్ననో అవి అంతులేకుండునట్లు పెక్కువిధము లున్నవి. అందు—

అభ్యుపగమానునయ కాకువున కుదాహరణము:-

శ్లో. యుష్మచ్ఛాసనలంఘనాంభసి మయా మగ్నేన నామ స్థితం,
ప్రాప్తానామ విగర్హణా స్థితిమతాం మధ్యేఽనుజానా మపి,
క్రోధోల్లాసిత శోణితారుణగద స్యోచ్ఛిందతః కౌరవాన్

అద్యైకం దివసం మమాఽసి న గురుర్నాఽహం విధేయస్తవ.
— వేణీ సంహారము. (1-12)

అభ్యనుజ్ఞోపహాసకాకువున కుదాహరణము.—

శ్లో. మథ్నామి కౌరవశతం సమరే న కోపాత్
దుశ్శాసనస్య రుధిరం న పిబా మ్యురస్తః,
సంచూర్ణయామి గదయా న సుయోధనోరూ
సంధిం కరోతు భవతాం నృపతిః పణేన.
—(వేణీసంహారము 1-5)

ఇట్టులనే మూఁడేసి నాల్గేసి కాకువులు గలదానిని కూడ నెఱుంగునది అందు మూఁడు కాకువులుండుటకు ఒక్క యుదాహరణము:—

శ్లో. సేయం పశ్యతి నో కురంగకవధూ స్త్రస్తైవ ముద్వీక్షతే,
కస్యాః పాణి రయం న మారుతవలత్పత్రాఙ్గుళిః పల్లవః
తారం రోదితి సైవ నైవ మరుతా వేణు స్స మాపూర్యతే
సేయం మా మభిభాషతే ప్రియతమా నో కోకిలః కూజతి.

[నా ప్రియురాలు చూచుటలేదా? భీతహరిణియా చూచుచున్నది! ఇది ఆవిడచేయి కాదూ? గాలికి కదులాడు (అంగుళులంబోలిన) చిగుళ్లుగల పల్లవమా? తారస్వరమున నావిడ రోదించుట లేదూ? కాటి అది గాలిఁబోసికొన్న వేణుధ్వనియా! ఆనాప్రియురాలు నన్ను గుఱించి సంభాషించుటలేదూ? అది కోకిలకూజితమా!—అని అర్థము. ఇందు మూఁడు కాకువులుండునట్లు పాఠక్రమ ముండుటచేత నిది త్రికాకుయోగమున కుదాహరణము]

చతురోర్యోగమున కుదాహరణము:—

శ్లో. ఉచ్యతాం స వచనీయ మశేషం
నేశ్వరే పరుషతా సఖి సాధ్వీ?
ఆనయైన మనునీయ కథంవా
విప్రియాణి జనయ న్ననునేయః. (కిరాతార్జునీయము; భారవి.)

[ఓ చెలీ! చెప్పఁదలచిదాని నంతను చెప్పంబడదే! ఈశ్వరులవిషయమున పారుష్యము కూడదుగాని ఆతని నెట్లైన ననునయించి తీసికొనిరా! విప్రియములఁ బల్కుచున్నను అనునేయుఁడే కా!—అని భావము. ఇందు పాత్రక్రమమున నాల్గుకాకువు లుండుటచే నిది చతురోర్యోగమున కుదాహరణ మందురు.]

౧. కాకురచనమునఁ గొన్ని ప్రాచీనుల నియమములు:-

శ్లో. సఖ్యా వా నాయికాయా వా సఖీనాయికయో ర్మిథః,
సఖీనాం భూయసీనాం వా వాక్యే కాకు రిహ స్థితా.
పదవాక్యవిదాం మార్గో యోఽన్యథైవ వ్యవస్థితః,
స త్వాంగాభినయద్యోత్య స్తం కాకు రితి చక్షతే.

౧ సఖియొక్క, లేక నాయికయొక్క మాటలలోను, లేదా సఖీనాయికలు పరస్పరము మాటలాడుకొనుటల లోను, పెక్కురుచెలికత్తెలు మాటలాడుకొనుటలోను తఱచు ఈకాకువు కన్పట్టుచుండును. ఒకవిశిష్టవ్యవస్థతో నియ్యది పదవాక్యవేత్తల ముఖ్యమార్గమై యొప్పుచుండును. కాకువు ఇట్టిది- అని మాటలతో నిర్వచించుటకు వీలు కానట్టిదియు, ఆంగికాభినయముచే వెల్లడిసేయం

బగునట్టిదియు నగు నొక చక్కని యొప్పు. ఇట్టిదానినే కాకు వని యందురు. ఈకాకువే సంభాషణము నన్యథా చేయు శక్తిగలది.

౨. కాకువు సర్వవ్యాపియై యుండుట:—

శ్లో. అయం కాకుకృతో లోకే వ్యవహారో న కేవలం,
శాస్త్రేష్వప్యస్య సామ్రాజ్యం కావ్యస్యాప్యేష జీవితం,
కామం వివృణుతే కాకురర్థాంతర మతంద్రితా,
స్ఫుటీకరోతి తు సతాం భావాభినయచాతురీమ్.

ఈరీతిగా కేవలము ఒక్కలోకవ్యవహారమున మాత్రమే కాకువు ఒప్పుచుండుట లేదు. మఱే మనఁగా దర్శనములందును (కాణాదాది తర్కశాస్త్రము మున్నగు వానియందును) ఈకాకువుయొక్క సామ్రాజ్యమే యొప్పుచున్నది. కావ్యమునకుఁగూడ నిదియే ముఖ్య మగు నాయువుఁబట్టు. కాకువును, సరసముగాఁ బ్రయోగించు నేర్పున్నచో, నయ్యది అతంద్రితయై అర్థాంతరమును వివరింపఁగల్గును. సత్కవుల భావాభినయచాతుర్యమును కూడ వెల్లడింపఁ గలుగుచున్నది - అని భావము.

౩. కాకువును కూర్పవలసిన తెఱఁగులు—

శ్లో. ఇత్థం కవి ర్నిబధ్నీయా దిత్థం చ పఠితా స్వరాత్,
యథా నిబంధనిగద చ్ఛాయాం కాం చిన్నిషించతి,
కరోతి కావ్యం ప్రాయేణ సంస్కృతాత్మా యథా తథా
పఠితుం వేత్తి స పరం యస్య సిద్ధా సరస్వతీ.

ప్రబంధములలోని కాకురచన ఏరీతిగాఁ గూర్చినచో యొకవిధమగు(అనిర్వచనీయమైన)రసచ్ఛాయను బలుకుచుండునో, ఆరీతిగా మతిమంతుఁడగు కవి తనకావ్యరచనఁ గూర్పవలయును. మతిమంతుఁ డగుపాఠకుఁడును ఆకూర్పిన కాకువుఁ గనిపెట్టి చక్కఁగా వెల్లడి యగునట్లుఁ బఠింపఁ గాఁదగును. చక్కనిసంస్కారము(ఈజన్మమునందలివిద్యాసంస్కారమును, ప్రాగ్జన్మమునందలి పుణ్యసంస్కారము నుభయము) గలవాఁ డెట్టులు సరసముగాఁ కావ్యముఁ గూర్పం గలండో, అట్లే చక్కని సంస్కారముచే (ఉభయవిధము లయిన సంస్కారములచే) సిద్ధిఁబడసిన పాఠకుఁడును,అర్థానింజదువు నేర్పు నెఱుంగఁ గల్గి యుండును:—అని భావము.

౪. కాకువు ఆలభ్యమగునట్టి సంస్కారము—

శ్లో. యథా జన్మాంతరాభ్యాసా త్కంఠే కస్యాఽపి రక్తతా,
తథైవ పాఠ సౌందర్యం నైకజన్మ వినిర్మితమ్.

పూర్వజన్మంబులం జేసిన పుణ్యాభ్యాసమున నొక్కొక్క పుణ్యాత్మునకు కంఠమున రక్తత (అనఁగా రక్తినిచ్చెడి మాధుర్యముగల స్వరము) ప్రాప్తించునో, అట్లే కవులకు కావ్యములను రచనసేయుటలోను, పాఠకులకు చదువుటలోను,కాకువుచేనైన పాఠసౌందర్యముఅనునది లభించుట అనేకజన్మలయం దార్జించిన పుణ్యముచేతనే ఏర్పడుచున్నదే గాని, మఱొక్కటి కా దని యర్థము.

౫. కాకువుతో నాయాభాషలఁ జదువఁదగు పద్ధతులు:—

శ్లో. స సంస్కృత మపభ్రంశం లాలిత్యాలింగితం పఠేత్,
ప్రాకృతం భూతభాషాం చ సౌష్ఠవోత్తర ముద్గిరేత్,
ప్రసన్నే మంద్రయే ద్వాచం తారయే త్తద్విరోధని,
మంద్రతారా చ రచయే న్నిర్వాహిణి యథోత్తరం.

శ్లో. లలితం కాకుసమన్విత
ముజ్జ్వల మర్థవశకృత పరిచ్ఛేదం,
శ్రుతిసుఖ వివిక్తవర్ణం
కవయః పాఠం ప్రశంసంతి.

సంస్కృతముతోఁ గలిసిన యపభ్రంశభాషను చదువునప్పుడు లలితత్వ మొప్పునట్లుగాఁ బఠింపఁదగును. ప్రాకృతభాషను, పైశాచీభాషను, సౌష్ఠవోత్తరముగాఁ జదువవలయును. ఇట్లు చదువునప్పుడు ప్రసన్నత వెల్లడించవలసినచోటుల మంద్రస్వరముననుఁ, అప్రసన్నతను వెల్లడించ వలసిన తావులను దారస్వరమునను పఠించుచు, చివఱను(ముగింపు నందు) మంద్రతారములు ఒప్పునట్లు రచింప వలసినది. పఠింపవలసినది కూడ.

కాకువుతోఁ గూడినదై, లలితమై యుండి, పదోజ్జ్వలతయును పాఠోజ్జ్వలతయు వెల్లడి యగునట్లుగా, అన్వయసందర్భముల నర్థము ననుసరించి, పదములను విడఁదీసి చదువుచు, చెవి కింపగునట్టులుగా వర్ణములను (అక్షరములను) విడమఱచి యుండునట్లుగాఁ జదివెడి పఠనపద్ధతిని కవులు మిక్కిలి ప్రశంసింతురు.

౬. పఠనపద్ధతిలోని గుణదోషములు:—

శ్లో. అతితూర్ణ మతివిలంబితం ముల్బణనాదం చ నాదహీనం చ
అపదచ్ఛిన్న మనావృత మతిమృదుపరుషం చ నిందంతి.

శ్లో. గంభీరత్వ మవైశ్వర్యం నిర్వ్యూఢి స్తారమంద్రయోః
సంయుక్తవర్ణ లావణ్య మితి పాఠగుణాః స్మృతాః.

అమితత్వరతో(పదోచ్చారణసేయుచు) జదువుట, అమి తాలస్యముగా (నాన్చినాన్చి) చదువుట, చెవిబ్రద్దగు నట్లు ఉల్బణస్వరముతోఁ జదువుట, బొత్తుగా వినఁబడనట్లు నాదహీనముగాఁ జదువుట, పదవిభాగము లేకుండఁదా ర్థాటుగా (రాములతోక పీకులనాయకుండు- వలె) చదువుట, పెదవులమీఁద నంటియు నంటనట్లుఅనావృతముగఁ (దులబరించుచు) జదువుట, అతిమృదువుగను గాని అతి పరుషముగఁగాని (యౌచిత్యముంగన్పట్టకుండ) చదువుట, అను నీవేడుదోషములు గల పఠనపద్ధతిని పెద్దలు ఏవగించుకొనుచున్నారు. కానఁ జదువువాఁ డిట్టిలోపములు రాకుండునట్లుగా చదువ నేర్వవలయును. చదువునప్పుడు పదగాంభీర్యమును అర్థగాంభీర్యమును నెల్లడి యగు నట్లు చదువుట, పట్టువీగకయుండుట, తారమంద్రస్వర ముల నెచ్చుతెచ్చుట ఏవిధముగా ధ్వనింపఁజేయఁదగునో అట్లు చదువుట, సంయుక్తాక్షరములను పలుకునప్పుడును, సంయుక్తముగా (కలియునట్లు) పలుకు నప్పుడును అంద ము చిందునట్లు చదువుట - అనునియ్యవి నాల్గును పఠన పద్ధతియందలి గుణములుగాఁ బెద్దలచేఁ జేర్కొనఁబడిన వని భావము.

౭. పఠనమున నవలంబింపందగు నియమములు:—

శ్లో. యథా వ్యాఘ్రీ హరేత్పుత్రాం దంష్ట్రాభి శ్చ నపీడయేత్,
భీతా పతనభేదాభ్యాం తద్వ ద్వర్ణాన్ ప్రయోజయేత్.
విభక్తయ స్స్ఫుటా యత్ర సమాస శ్చాకదర్థితః,
అమ్లానః పదసంధి శ్చ తత్ర పాఠః ప్రతిష్ఠితః,
న వ్యస్తపదయో రైక్యం న భిదాం తు సమస్తయోః
న చాఽఽఖ్యాతపదగ్లానిం విదధీత సుధీః పఠన్.

ఆఁడుపులి (లేక ఆడుపిల్లియును) తనకూనలను నోటఁ గవ్వికొని, వాటికి బాధకలుగక యుండునట్లు [అమితమగు నేర్పుతో నొకచోటినుండి మఱొక్కచోటు నకుం గొనిపోవునో] అట్టులనే కవిగాని, పాఠకుఁడుగాని, తాను కవితంగూర్చునప్పుడును, పఠించునప్పుడును, శబ్దార్థములు జారిపోకుండునట్లును వీడిపోవకుండునట్లునుగా వర్ణములను నేర్పుమెయిఁ బ్రయోగింపందగును. ఎవ్వనికి పఠన కాలమున విభక్తులు స్ఫుటములుగాను, సమాసములు వెల్లడియగునట్లుగాను, పదసంధులు రూపుసెడ యుండునట్లుగాను ఉండునో, అందే పఠనపద్ధతి చక్కఁగాఁ బ్రతిష్ఠితమైనట్లు నెఱుంగునది. విద్వాంసుఁడును బుద్ధిమంతుఁడును తాను చదువునప్పుడు విడివిడిగా నున్న పదములను కలుపఁగా రాదు. సమాసాదులచే గలసియున్న శబ్దములను విడఁగొట్టుటను కూడ చేయరాదు. ఆఖ్యాతపదముల నసహ్యమగురీతిని నములుట, దిగమ్రింగుటమున్నగు దోసఁగులు పొసఁగునట్లులుఁ గూడఁ జేయఁగా రాదు—అని భావము

౮. పాఠనియమములు:—

శ్లో. ఆగోపాలక మాయోషిత్ ఆస్తాం మేతస్య లేహ్యతా,
ఇత్థం కవిః పఠ న్నాస్యం వాగ్దేవ్యా అతివల్లభః,
యేఽపి శబ్దవిదో నైవ నైవ, చాఽర్థవిచక్షణాః
తేషా మపి సతాం పాఠః సుష్ఠు కర్ణరసాయనమ్.

గొల్లలు మొదలుకొని ఆబాలస్త్రీవృద్ధాదులును వినదగినరీతి యభిరుచి నొందునట్లుగా పాఠపద్ధతియుండ వలయును. ఇట్టులు పఠింపఁగల కవిసరస్వతికి అత్యంతము ప్రేమాస్పదుఁడు కాఁగల్గుచున్నాఁడు. నిక్కముగా విద్వాంసులయినచో వారిపఠనపద్ధతి, శబ్దజ్ఞానము లేని వారికి సయితము, అర్థము చేసికొనునేర్పు చాలని వారికిని సయితము, శ్రోత్రపేయమై (అనఁగా నాహ్లాదకరమును హాయి నిచ్చునదియును నై) ఉండును—అని భావము. కనుక కవులును, వారికృతులం బఠించువారును ఈనియమముల నెఱుంగఁదగు నని యర్థము.

౯. వివిధదేశీయుల పాఠపద్ధతులు.—

శ్లో. పఠంతి సంస్కృతం సుష్ఠు కుంఠాః ప్రాకృతవాచి తే,
వారణాసీతః పూర్వేణ యే కేచి న్మగధాదయః.

ఆహుశ్చ—

శ్లో. ౧. బ్రహ్మణ్ విజ్ఞాపయామి త్వాం స్వాధికారజిహాసయా,
గౌడ స్త్యజతు వా గాథా మన్యా వాఽస్తు సరస్వతీ.
౨. నాతిస్పష్టో నచాశ్లిష్టో న రూక్షో నాఽతికోమలః,
నమంద్రో నాఽతితార శ్చ పాఠో గౌడేషు బాడబః.

౩. రసః కోప్యస్తు కావ్యస్తు రీతిః కోప్యస్తు వా గుణః,
సగర్వం సర్వకర్ణాటా ష్టంకారోత్తరపాఠినః.

౪. గద్యే పద్యేఽథవా మిశ్రే కావ్యే కావ్యగుణా అపి,
గేయగర్భే స్థితః పాఠే సర్వోపి ద్రావిడః కవిః,

౫. పఠంతి లటభం లాటాః ప్రాకృతం సంస్కృతద్విషః,
జిహ్వయా లలితోల్లాసలబ్ధ సౌందర్యముద్రయా.

౬. సురాష్ట్రత్రవణాద్యా యే పఠంత్యర్పితసౌష్ఠవమ్,
అపభ్రంశావదంశాని తే సంస్కృతవచాం స్యపి.

౭. శారదాయాః ప్రసాదేన కాశ్మీరః సుకవి ర్జనః.
కర్ణే గుడూచీ గండూష స్తేషాం పాఠక్రమః కిము.

౮. తతపురస్తా త్కవయో యే భవం త్యుత్తగాపథే,
తే మహా త్యపి సంస్కారే సానునాసిక పాఠినః,

౯., మార్గానుగేన నినదేన నిధి ర్గుణానాం
సంపూర్ణవర్ణరచనో యతిభి ర్విభక్తః,
పాంచాలమండలభువాం సుభగః కవీనాం
శ్రోత్రే మధు క్షరతి కించన కావ్యపాఠః.

౧౦. లల్లకారియా జిహ్వాం జర్జరస్ఫారరేఫయా,
గిరా భుజంగాః పూజ్యంతే కావ్యభవ్యధియో నతు.

౧౧. పంచస్థానసముద్భవ వర్ణేషు యథాస్వరూపనిష్పత్తిః,
అర్థవశేన చ విరతి స్సర్వస్వ మిదం హి పాఠస్య,
సకాకుకలనా పాఠప్రతిష్ఠేయం ప్రతిష్ఠితా
అర్థానుశాసన స్యాథ ప్రకారః పరికీర్త్యతే.

ప్రాకృతమును చదువుటలో చక్కఁగా కుంటు వడిన నోళ్లతో (వారణాశి) కాశి మొదలుకొని తూర్పు

దేశములందుండెడి మగధదేశీయులు మున్నగు వారు సంస్కృతమును చదువుచునుందురు.

ఈవిషయమై ప్రాచీనమునుండి, పెద్ద లిట్లు చెప్పుచు వచ్చుచున్నారు. "బ్రహ్మన్—స్వాధికారజిహాసతో, మీకు షనవి చేసికొనుచున్న వాఁడను. ఏమన, గౌడదేశీయుఁడు గాథను వదలనైనను వదలవలయును. లేనిచో సరస్వతి (అనఁగా భాషాదేవి) అన్యయైనను (అనఁగా గౌడులలోఁ బ్రచారమున నున్నదానికంటె భిన్నముగానైనను) కావలయును. గౌడదేశము నందలి బ్రాహ్మణుఁడు పఠించుచున్నచో నన్నిసందర్భములను నొకేరీతిగా అనతిస్పష్టముగను, అశ్లిష్టముగను, అరూక్షముగను, అనతికోమలముగను అమంద్రముగను ననతితారముగను పఠించునని భావము.

ఇఁకను కర్ణాటకుఁడన్ననో రసమేదియైననుసరియే, రీతి యేదియైనను సరియే, గుణ మెయ్యది యైనను సరియే గర్వముతో (అనఁగా నాడంబరముతోడ) టన్ టన్ మనునట్లు (విరామములు కలుగునట్లు) చదువుచుండును.

ద్రవిడకవి ఎంతటి కావ్యమనస్కుఁడైనను ఇది గద్యము ఇదిపద్యము ఇది గద్యపద్యముల మిశ్రమము – అనుభేదములను వదలి, సంగీత ప్రధానమైన పాఠమును స్వీకరించును. సంస్కృతభాష యనిన ప్రాణసంకటమను కొనెడి లాటదేశీయులు లలితోచ్చారణలబ్ధసౌందర్యము గల నాలుకతో ప్రాకృతమును లొడలొడ మని చది

వెదరు. సౌరాష్ట్రులు ౹త్రవణులు మున్నగువారలు సౌష్ఠవము తోలుకాడునట్లు సంస్కృతిపదముల నైనను అపభ్రంశావదంశములఁ బోలెను పఠించెదరు.

కాశ్మీరదేశపు యుత్తమకవిజనము సరస్వతీప్రసాదము కలదగుటచేతఁ జెవులకు నమృతము లొలుకునట్లు పఠించెదరు. ఆహా! ఏమివారిపఠనరీతి! ఆకాశ్మీరదేశమునకుఁదూర్పున నున్న(ఉత్తరదేశపు)కవులు గొప్పసంస్కారము (అనఁగాఁజాలినంతటి శాస్త్రజ్ఞానము)కలవారలైనను అనునాసిక సహితముగా- అనఁగా ముక్కుతో-పఠించుచు నుందురు.

ఆయారీతులకుఁ దగినస్వరములతో విలసిల్లుచు, గుణములకు పెన్నిధి యనఁదగి, వర్ణరచనము పూర్తిగా గలిగి, యతులతో (విశ్రమస్థానములచేత) విలసిల్లుచు, పాంచాలదేశపు కవీశ్వరుల యొక్క కావ్యపఠనము చెవుల కమృతము లొలుకుచునుండును. లలలలమని ఒకే ధోరణితో లకారముల యనుబంధముఁగలిగి రేఫసాంకర్యము నవక్రముగా నుండెడి పఠరీతిగల వాక్యములను పామరులు పూజించినఁ బూజింపవచ్చును, గాని కావ్యములఁ జక్కఁగఁ బరిశ్రమముఁ జేసిన పండితులు మాత్రము ఆవిధమగు ధోరణిని నాదరింపఁగాఁ జాలరు.

పఠనమునందుఁ గల మర్మ మేమనఁగా—(1) వర్ణోత్పత్తినిలయములగు పంచస్థానములయందును (ఉచ్చారణకాలమున) నుద్భవము లయిన ఆయావర్ణముల స్వరూ

షము చెదరకుండ నివృత్తి కల్గించుటయు, (2) అందలి యర్థము చెడకుండఁ దగినచోటుల నిలుపుటయు అని అనిపెద్దలు అనిరి. కాకుశబ్దవిచారణతోఁ గూడిన పాఠప్రతిష్ఠ యను నీయధ్యాయము ఈతీరున సాంగముగా నిరూపింపఁబడి ప్రతిష్ఠిత మైనది. ఇటుపైని అర్థము ననుశాసించు విధానము (ప్రకారములు) ఉపవర్ణింపం బడును.

ఇది రాజశేఖరకవిరాజకృతమగు కావ్యమీమాంస యను
కవిరహస్యమునఁ బ్రథమాధికరణమునందు
వాక్యవిశేషములు, పాఠప్రతిష్ఠ, కాకుకలన యను విషయములుగల
సప్తమాధ్యాయము.

---

# రాజశేఖరకవి కావ్యమీమాంస.

## అష్టమాధ్యాయము.

---

### కావ్యార్థయోనులు.

[ఈ యధ్యాయమునందలి విషయములు:—౧. కావ్యార్థయోను లగు పదునారువిధము లగు శ్రుతిస్మృత్యాది మూలవిద్యలు. ౨. తన్మూలకములగు శ్రౌత స్మార్త ఐతిహాసిక పౌరాణిక మైమాంసిక సాంఖ్యీయ న్యాయవైశేషికీయ బౌద్ధీయ లౌకికాయతిక ఆర్హత శైవసిద్ధాంతీయ పాంచరాత్ర బౌద్ధసిద్ధాంతీయ నాట్యశాస్త్రీయ కామసూత్రీయ లౌకిక రచనావిషయక హస్తిశిక్షీయ రత్నపరీక్షీయ. యోగశాస్త్రీయము లగు, ఉచిత, యోక్తృసంయోగ, ఉత్పాద్య వికారసంయోగ పరిభృతులగు కావ్యార్థయోనుల కుదాహరణములు మున్నగునవి.]

శ్రుతి, స్మృతి, ఇతిహాసము, పురాణము, ప్రమాణవిద్య, రాజసిద్ధాంతత్రయి, లోకము, విరచనము, ప్రకీర్ణకము-అని యిట్టులు కావ్యార్థముల నుపనిబంధించుటకు పండ్రెండువిధములగు 1 కావ్యార్థయోనులు(అనఁగా కావ్యరచన కాధారభూతము లగు మూలప్రకృతులు) కల వని

---

1 కావ్యార్థయోనులం గురించి, వామనాచార్యుఁడు ఆచార్య హేమచంద్రుఁడు భామహుఁడు వాగ్భటుఁడు-మున్నగురు, కావ్య

ఆచార్యు లందురు. ఈ చెప్పిన పంద్రెండింటికిని ఉచితసంయోగము, యోక్తృ సంయోగము ఉత్పాద్యసంయోగ

---

సాహిత్య (శాస్త్రి) లక్షణగ్రంథములను రచించి, అందు వివరించి యున్నారు.

౧. వామనాచార్యుడు — కావ్యాలంకార సూత్రములందు.

"లోకో విద్యా ప్రకీర్ణం చ కావ్యాంగాని లోకవృత్తం లోకః" శబ్దస్మృత్యభిధానకోశచ్ఛందోవిచితికలాకామశాస్త్రదండనీతి పూర్వా విద్యాః, శబ్దస్మృతేః శబ్దశుద్ధిః, అభిధానకోశాత్పదార్థనిశ్చయః, ఛందోవిచితేర్వృత్తసంశయచ్ఛేదః కలాశాస్త్రేభ్యః కలాతత్త్వస్య సంవిత్, కామశాస్త్రతః కామోపచారస్య, దండనీతేర్నయాపనయయోః, ఇతివృత్తకుటిలత్వంచ తతః. లక్ష్యజ్ఞత్వం అభియోగో వృద్ధసేవాఽవేక్షణం ప్రతిభాన మవధానం చ ప్రకీర్ణకం. తత్ర కావ్యపరిచయో లక్ష్యజ్ఞత్వం, కావ్యబంధోద్యమోఽభియోగః, కావ్యోపదేశ గురు శుశ్రూషణం వృద్ధసేవా, పదాధానోద్ధరణం అవేక్షణం కవిత్వజం ప్రతిభానం, చిత్తైకాగ్ర్యం అవధానం" — అని కావ్యాంగయోనులను పేర్కొన్నాడు.

౨. భామహాచార్యుడు — భామహాలంకారమునందు —

శ్లో. శబ్దశ్ఛందోఽభిధానార్థా ఇతిహాసాశ్రయాః కథాః,
లోకో యుక్తిః కలాశ్చేతి మంతవ్యాః కావ్యయోనయః.

3 వాగ్భటుడు- కావ్యానుశాసనమునందు-

లోకే స్థావరజంగమరూపే తత్స్వరూపేచ- లక్షణ ప్రమాణ సాహిత్యచ్ఛందోలంకార శ్రుతిస్మృతి పురాణేతిహాసాగమ నాట్యాభిధాన కోశ కామార్థయోగాది శాస్త్రేషు చ నిపుణతా- వ్యుత్పత్తిః-

ము, సంయోగవికారము అనెడియీనాల్గును చేర్చినచో పైనిం జెప్పిన కావ్యార్థయోనులు పదునా రగునని యాయావరీయుఁ డనెను. అందు—

౧. శ్రౌత మగు (శ్రుతి మూలక మగు) కావ్యార్థయోని కుదాహరణము.

శ్రు. "ఊర్వశీ హాఽప్సరాః పురూరవస మైడం చకమే

—శతపథబ్రాహ్మణము—5-1-

దీనియర్థమే ఈక్రిందిశ్లోకమునందు చెప్పంబడినది.

శ్లో. చంద్రా ద్బుధ స్సమభవ ద్భగవా న్నరేంద్ర
మాద్యం పురూరవస మైడ మసౌ వసూత,
తం చాఽప్సరాః స్మరవతీ చకమే కిమన్య
ద త్రోర్వశీ స్మితవశీకృత శక్ర చేతాః. (విక్రమోర్వశీయం)

[లోకప్రసిద్ధుఁడగు చంద్రునినుండి పూజ్యుఁడగు బుధుఁడు జనించెను. ఆబుధుఁడే ఆదిరా జగుపురూరవసు నైడునిఁ గనెను. ఆపురూరవుని,చిఱునవ్వు నవ్వినంత

---

౪-౫ ఇట్లే హేమచంద్రుఁడును తన కావ్యానుశాసనమునందును, వినయ చంద్రుఁడు కావ్యశిక్షయందును పేర్కొన్నారు. అందు కావ్యశిక్షయందు-

భారత పరిచయః, రామాయణ పరిచయః, మోక్షోపాయాత్మజ్ఞాన ధాతువాద పురుషలక్షణ స్త్రీలక్షణ, ద్యూత చిత్రవృక్ష పక్షేచర భక్తి వివేకప్రశమ హాస్తివైద్యక శాస్త్రి ధనుర్వేద గజతురగాది పరిచయాః- అని. ఇత్యాదులు ప్రత్యేకముగా కావ్యార్థయోనులంగాఁ జేర్కొని యున్నారలు.

మాత్రాననే దేవేంద్రునంతటివాని చిత్తమును కూడ తత్తరింపఁ జేయఁగల యూర్వశి యనెడి యప్సర, మన్మథసంతప్తయై, కామించె నన నింకనతని (గొప్పతనము)ఁగూర్చి చెప్పఁ వగిన దేమి?—యని తాత్పర్యము. ఇందు-ఊర్వశి యనెడి యప్సర ఐడుఁడగు పురూరవసునిఁ గామించెను—అన్న శ్రుత్యర్థమును ఆధారముగాఁ గొని, కవి చక్కనిరచనతో నద్దానికి (సొంపు గల్గునట్లు) లు కూర్చుటచేత నీశ్లోకము శ్రుతియోని యగుకావ్యార్థమున కుదాహరణ మగు చున్న దని తెలియుంగునది.]

మఱొక్క యుద్దాహరణము:—

శ్రు. య దేత న్మండలం తపతి, త న్మహ స్తదఃక్థం, తా ఋచ స్స ఋచాం లోకో౽థ య దేత దర్చి ర్దీ ప్యతే, త న్మహావ్రతం తాని సామాని స సామ్నాం లోకో౽థ య ఏషఏతస్మి న్మండలే పురుష స్సో౽గ్ని స్తాని యజూంషి స యజుషాం లోక స్సైషా త్రయ్యేవ విద్యాతపతి -మహో - నారా-త్తు

ఈశ్రుతియొక్క అర్థము వచ్చునట్లుగా మయూరకవి సూర్యశతకమునందు, ఈక్రిందిశ్లోకమును రచించెను. కావున నిదియును శ్రుతియోనియగు (శ్రౌత మగు) కావ్యార్థయోని కుదాహరణ మగుచున్నది.

---

వాగ్భటుఁడు శ్రుత్యర్థయోని కిట్లు ఉదాహరణము నిచ్చినాఁడు.

శ్లో. నివేశయామాసిథ హేలయోద్ధృతం,
ఫణాభృతాం ఛాదన మేక మోకసః,
జగత్త్రియైకస్థపతి స్త్వ ముచ్చకైః
అహీశ్వర స్తంభ శిరస్సు భూతలమ్.

శ్లో. ఏత ద్యన్మండలం ఖే తపతి దినకృత
స్తా ఋచోఽర్చీంషి యాని,
ద్యోతంతే తాని సామా న్యయ మపి పురుషో
మండలేఽణు ర్యజూంషి,
ఏవం యం వేద వేదత్రితయమయ మముం
వేదవేదీ సమగ్రో,
వర్గ స్స్వర్గాపవర్గప్రకృతి రవికృతి
స్సోఽస్తు సూర్య శ్శ్రియే వః.
మయూరకవి-సూర్యశతకము. 89

ఈవేదహరణ మనునది ఇట్టిదిగా నుండును. దీనిని పెద్దలు ఇట్లని ప్రశంసించుచు నున్నారు.:—

శ్లో. నమోఽస్తు తస్యై శ్రుతయే యాం దుహంతి పదేపదే,
ఋషయ శ్శాస్త్రకారా శ్చ కవయ శ్చ యథామతి.

---

ఆతఁడే స్మృత్యర్థమున కిట్లు ఉదాహరించినాఁడు.

శ్లో. భవ్యాభవ్యవిలోలలోచనయుగం
చేత స్స్మృతేః పారగం
ధమ్మిల్లే శిరసి స్థితే వరతనో
ర్ముఖ్యాః ద్విజా స్సాక్షిణః
స్తేయం నో మమ కాలికేతి కుచయోః
ద్వంద్వం ప్రతిజ్ఞాపరం
హారాంతస్థితపద్మరాగమిషతో
ఫాలం దధా శుద్ధయే

ఈశ్లోకమునే నతఁడు నైతిహాసికమున కుదాహరించినాఁడు.

మహర్షులును, శాస్త్రకర్తలును ఏ వేదమును నిరంతరముగా తమతమశక్తినిమతిని అనుసరించి,లోకమునకుఁ ఉపదేశరచనల మూలమున మాటిమాటికిఁ బిదుకుచుందురో, ఆ (కామధేనుకల్పయగు) శ్రుతికి నమస్కారమగుగాక — అని భావము. అనగాఁ గవులును నెప్పటికప్పుడు వేదములలోని యర్థములను ఆహరణ మొనర్చి, కూర్చుచున్నను తరుగనట్టి శ్రుతులు వంద్యము లని తాత్పర్యము.

౨. స్మార్తమగు కావ్యార్థయోని కుదాహరణము.

స్మృతిగ్రంథములలో: —

శ్లో. బహ్వర్థేష్వభి యుక్తేన సర్వత్ర వ్యవలాపినా.
విభావితైకదేశేన దేయం య దభియుజ్యతే.

అని కల దీనియర్థమును మాతృకఁగాఁ గొని ఈ క్రింది రచనమును చేసియున్నారు.

శ్లో. హంస ప్రయచ్ఛ మే కాంతాం గతి స్తస్యా స్త్వయాహృతా
స్సంభావితైకదేశేన దేయం య దభియుజ్యతే.

(విక్రమోర్వశీ—4 అంకము. శ్లో. )

[ఓహంసా! నాప్రియురాలిని, (కాంతను) నాకిమ్ము. ఆవిడయొక్క అందమగు నడక నీచే నపహృతమై యున్నది. సంభావితైకదేశముచే న్యాయవిచారణకర్తలు, అభియోగము చేయఁబడుదానిని ఈయవలసినట్లు చెప్పుచున్నా రని శ్లోకమున కర్థము. ఇచ్చట—ధర్మ

శాస్త్రములలో, అభియోక్త (ఫిర్యాది) తనవస్తువును ఫలానివారు అపహరించిరి— అని ఫిర్యాదీని చేసినప్పుడు అభియోజ్యుండావిషయములను తా నెఱుంగనే యెఱుంగనని వ్యపలాపము (కప్పిపుచ్చుట) చేయుచో, నప్పుడు న్యాయమును తీర్చవలసిన అధికరణికులు అట్టి వస్తువునకు సంబంధించిన యేకదేశము (కొంతభాగము) అయినను ముద్దాయియెద్దఁ గనిపించినచో, నప్పుడతనిని దోషిగాఁ బరగణించి (ఆవస్తువునంతను) ఇచ్చివేయవలసినట్లుతీర్పు చెప్పవలెను"అనియున్న స్మృత్యర్థమును కొనివచ్చి, హంసా! నాప్రియురాలినడక (ఇదియే ఇట ఏకదేశము.) నీయొద్దనున్నది. కావున సంభావితైకదేశన్యాయము ననుసరించి నాప్రియురాలును ఉన్నట్టులే యగును. కనుక నీవే యామెను అపహరించితివి. తెచ్చి యిమ్ము—అని చెప్పంబడినది.]

3. ఐతిహాసిక మగు కావ్యార్థయోని కుదాహరణము:-

శ్లో॥ న స సంకుచితః పంథాః యేన వాలీ హతో గతః.
సమయే తిష్ఠ సుగ్రీవ! మా వాలిపథ మన్వగాః

—వాల్మీకిరామాయణము

[ఇత్యాది ఐతిహాసిక మగు శ్లోకము. ఓయీ సుగ్రీవా! ఇప్పటికిని నిహతుఁడైనవాలి వెడలిపోయిన మార్గ మల్లే మూయఁబడక యే యున్నది. కావున నీచేసిన సమయమునందు నిలచియుండుము.(సమయమును

నీవుచేసిన ఆళపథమును దాటి) వాలి వెడలిపోయిన మార్గము ననుసరింపకుము—అని యర్థము.]

ఇది యీ క్రింది విధముగా జానకీహరణ మనెడి నాటకమునందు కూర్పంబడినది.

శ్లో. మదం నవైశ్వర్యలవేన లంభితం,
విసృజ్య పూర్వ స్సమయో విమృశ్యతాం,
జగజ్జిఘ త్సోతురకంఠపద్ధతి
ర్న వాలి నై వాஉహితఃతృప్తి రంతకః.

[ఓసుగ్రీవా! క్రొంగ్రొత్తగ లభించిన లేశమంత యైశ్వర్యముచే తలకెక్కినమదమును దిగనాడి, వెనుకటి సమయమును [వెనుక నీవుచేసినశపథమును] విమర్శించి కొనుము. లేదేని ప్రపంచమునంతను నెప్పుడెప్పుడు దిగమ్రింగుదునా? యని యాత్రముతో నోరు దెఱచికొని యున్నయముఁడు కేవలమొక్క వాలితోమాత్రమే తృప్తుఁడై యుండక పోవఁగలఁడు—అని భావము.]

౫. పౌరాణిక మగు కావ్యార్థయోని కుదాహరణము:—

శ్లో. హిరణ్యకశిపు ర్దైత్యో యాంయాం స్మిత్వాஉ ప్యదైక్షత,
భయభ్రాంతై స్సురై శ్చక్రే తస్యై తస్యై దిశే నమః.
1భాగ. సప్తమస్కంధము,

1. బమ్మెరపోతరాజుగారీశ్లోకార్థమును మఱింతసరసముగా తనభాగవతమునంగూర్చినారు. భాగ. సప్త. 99. 100.

మ. దితిపుత్రుండు జగత్త్రయైకవిభుఁడై దేవేంద్రసింహాసనో
ద్ధతుఁడై యుండ, హాకాచ్యుతాంబుజభవుల్ దప్పంగభీతిన్సమా-

అని భాగవతపురాణమునందు కలదు. వరలాభమున విజృంభించిన ఆహిరణ్యకశిపుఁడు నవ్వుచు నైనను ఏయే దిక్కును వీక్షించెనో, దేవతలు ఆతనివలననైన భయముచే తబ్బిబ్బుపడుచు నయ్యె దిక్కులకు నమస్కరించుచు నుండి రని భావము. దీనిని ఈక్రింది విధముగా మాఘకవి తనశిశుపాలవధమునందు (స -16 శ్లో.)కూర్చె.

శ్లో. స సంచరిష్ణు ర్భువనత్రయేఽపి యాం
యదృచ్ఛయాఽశిశ్రియ దాశ్రయ శ్శ్రియః,
అకారి తస్యై ముకుటోపలస్ఖలత్
కరై స్త్రిసంధ్యం త్రిదశై ర్దిశే నమః.

[ఆతం డట్లు ముల్లోకములఁదిరుగుచు యాదాలాభమున నైనను ఏదిక్కునకు తనకుతన్నును మఱల్చునో ఆదిక్కునకెల్ల ముకుటోపలస్ఖలదులు అగుచున్న దేవతలచే ముప్పొద్దును మ్రొక్కులు చెల్లింపంబడెను – అని భావము. ఇందు నైభాగవతపురాణమునందు జెప్పం

---

గతులై తక్కినయక్షకిన్నరమరుద్గంధర్వసిద్ధాదులా
నతులై కానుక లిచ్చి కొల్చిరతనిన్ నానాప్రకారంబులన్.

శా. ఏదిక్కైలుఁ జూచి కేఁ దలంగునో యేదేవుబంధించునో
యేగదిగ్భాముమీఁద దాడిచనునో యేప్రాణులం జంపునో
యీదైత్యేశ్వరుఁడంచు నొండొరులు దారింద్రాదులాస్థానభూ
వేదిన్ మెల్లన నిక్కిచూతురు భయావిర్భూతరోమాంచులై.

బడిన యర్థము నాధారముగాఁగాని కవితారచన సేయం బడినది, గనుక నిది పౌరాణికకావ్యార్థయోని కుదాహరణము ]

ఈవిషయము నందు—అనంగా శ్రుతిస్మృతీతిహాసపురాణములయందలి యర్థములను కావ్యములందు సరసముగాఁ జెప్పి యుపనిబంధించెడి విషయమునందు, పూర్వులు చెప్పిన సంగ్రహపద్ధతులు కొన్ని కలవు:— అంగములతోను తత్తచ్ఛాఖలతోను గలవేదములయొక్కయును, ఇతిహాసపురాణముల యొక్కయును, అర్థములను కూర్చుటయును, అందలికథలను చక్కఁగాఁ జదివి వానిని గద్యపద్యరూపముగా వ్రాయుట కభ్యసించుటయును, కవిత్వప్రాప్తికి ముఖ్యమగు మందు అని అందురు. కనుక వివేకము (మంచిచెడ్డలను యుక్తాయుక్తములను ఏర్పఱిచునట్టి బుద్ధి) అనెడి యంజనముతోఁ జక్కఁగా శోధింపంబడినట్టి ఇతిహాసపురాణనామక మగు చక్షుర్ద్వయముతో సత్కవియగువాఁడట్టి సూక్ష్మార్థములనైనఁ దనప్రతిభచే జూడఁగల్గుచున్నాఁడు. వేదములందలి యర్థములను స్మృతులితిహాసములు పురాణములు మున్నగువాని యర్థములను సందర్భావిరోధముగాఁ దనకావ్యమునం దుపనిబంధించినచో నట్టికృతినికవులుమిక్కిలియుఁ గొనియాడెదరు—అని.

౫. ఇఁకఁ బ్రమాణవిద్య కావ్యార్థముగాఁ గలవాని నుదాహరించెదము. ప్రమాణములను బోధించు

నట్టి శాస్త్రములు ప్రామాణికము లనంబడును. ప్రామాణికము లగు నావిద్యలు— మైమాంసికము లని తార్కికము లని, రెండు విధములు. మీమాంసా శాస్త్రసంబంధము గలవి మైమాంసికములు. తర్కసంబంధములు గలవి తార్కికములు. అందు తొలుదొల్తటి వగు మైమాంసికములకు నుదాహరణము:—

శబ్దస్య సామాన్య మభిధేయం విశేష శ్చార్థః—

అని మీమాంసయందు గలదు. శబ్దమునకు సామాన్యము అభిధేయముగాను విశేషము అర్థముగాను ఉండు నని అద్దాని కర్థము ఈయర్థమును పూర్వకవియొక్కరు ఇట్లు తనకవితయందుఁ గూర్చినాఁడు.

3శ్లో. సామాన్యవాచి పద మప్యభిధీయమానం
మాం ప్రాప్య జాత మభిధేయవిశేషనిష్ఠం,
స్త్రీ కాచి దిత్యభిహితే నిశితం మనో మే
తా మేవ వామనయ నాం విషయీకరోతి.

---

3. ఈశ్లోకము కవీంద్రవచనసముచ్చయ మనుసంధాన గ్రంథమున నున్న దఁట.

3. జైనతర్కము, సాంఖ్యము, శైవము, భాట్టము బౌద్ధము, లోకాయతము—అనునియ్యవి ఆరే షట్తర్కము లనియుః నివియే శాస్త్రములు దర్శనములు ననుపేరం జెప్పఁదగిన వనియు, తక్కినవి పాషండప్రవృత్తి గలవనియు నందురు. శ్లో- జైనం సాంఖ్యం శివం భాట్టం బౌద్ధం లోకాయతం తథా, షడేతా దృష్టయః ప్రోక్తాః శ్శేషాః పాషండ ప్రవృత్తయః —అని ప్రమాణము నుదహరించెదరు.

[ప్రసంగవశమున 'ఒక స్త్రీ'—అని చెప్పినంతనే నామనసు ఎడతెగక తా నేస్త్రీని ప్రేమించెనో ఆవామ నేత్రనే విషయముగాఁ గైకొనుచున్నది. [అనఁగా దావల చినస్త్రీ పైననే ప్రసరించుచున్నది.] అన్నా! ఎంత వి ష్ణానము! పదము సామాన్యవాచిగా నభిధేయమాన మగుచున్నను, [అయ్యది ఆ నియమము నుల్లంఘించి] నాయెడ నయ్యది అభిధేయవిశేషనిష్ఠమే యైనది—అని తాత్పర్యము. ఇందు 'శబ్దస్య సామాన్య మభిధేయం విశేష స్త్వర్థః—అను మీమాంసాశాస్త్రార్థము కూర్పఁ బడినది గనుక నియ్యది మీమాంసాప్రమాణ విద్య కావ్యార్థయోనిగాఁ గలదాని కుదాహరణ మైన దని యెఱుఁగునది.]

3. ఇఁకఁ దర్క—శాస్త్రములకుసంబధించిన కావ్యా ర్థయోనుల కుదాహరణముల నిచ్చెదము. అందు సాంఖ్యీ యమునకు, అనఁగా సాంఖ్యశాస్త్రసంబద్ధమగు దానికి, కావ్యార్థయోని కీక్రిందిది యుదాహరణమనిఎఱుంగునది.

4 శ్లో. నాఽసతో విద్యతే భావః నాభావో విద్యతే సతః
ఉభయో రపి దృష్టోంతః స్త్వనయో స్తత్త్వదర్శిభిః.

ఈపైనిచెప్పిన సాంఖ్యశాస్త్రసిద్ధాంత మీక్రిందిశ్లోక మున కూర్పంబడి యున్నది

4. భగవద్గీతయందలి రెండవ యధ్యాయములోని పదునార వశ్లోకము

శ్లో॥ య ఏతే యజ్వానః ప్రథితమహసో యేఽప్యవనిపా
మృగాక్ష్యో యాశ్చైతాః కృత మపరసంసారకథయా,
అమీ యే దృశ్యంతే ఫలకుసుమనమ్రాశ్చ తరవో
జగత్యేవంరూపా విలసతి మృ దేషా భగవతీ!

యజ్ఞయాగాద్యనుష్ఠానములనొనర్చి వన్నెకెక్కిన యీయజ్వలును (అనఁగా సోమయాజులును) ప్రసిద్ధిగాంచిన క్షాత్రతేజము గల యీరాజులును లేడికన్నులవలె నందములయిన కన్నులుగల్గి చెన్నుమీరియుండెడి యీచెలువమిన్నలును, ఇది యది యని తక్కినసంసారమును [ప్రపంచమును] పేర్కొనుటయేల? పండ్లుపూవులు మున్నగు వానితోనిండిన యీపరిదృశ్యమానము లగు తరువులును, ఇంకను నిట్టిదగు నీజగత్తు అంతయును, మృద్వికారమున సాక్షాత్తు నాపూజ్యురాలే నిండియుండి విలసిల్లుచున్నది—అని తాత్పర్యము. ఇందు అసత్తులగు దేహాదులకు ఉండుట యనునది లేనేలేదు. ఇట్టులనే సత్తగు నాత్మకు ఉండకుండుటయు నుండదు. ఈరెండింటియొక్క నిశ్చితత్వమును తత్త్వవేత్త లగు వారలు కన్పెట్టియున్నారు—అనెడి సాంఖ్యశాస్త్రీయమగు సిద్ధాంతము పొందుపఱుపంబడి యుండుటచేత నిది సాంఖ్యశాస్త్రీయ మగు కావ్యార్థయోని కుదాహరణము.

న్యాయవైశేషికీయ కావ్యార్థయోనికినిదర్శనము:

స కింసామగ్రీక ఈశ్వరః కర్తా? (పూర్వపక్షః)
నిరతిశయైశ్వర్యస్య తస్య కర్తృత్వం (సిద్ధాంతః)

"అయ్యా! మీరు చెప్పినట్టి కర్తయగు నీశ్వరుఁడు ఎట్టి సామగ్రికలవాఁడు?—" అని పూర్వపక్షము రాఁగా నంశములకు సమాధానముగా నిరతిశయైశ్వర్యుఁడగు నతనికిఁ గర్తృత్వము సిద్ధించుచున్నది"—అని సిద్ధాంతము. ఈన్యాయవైశేషకీయసిద్ధాంతమును, ఆచార్య జగద్గురు శంకరులవారు మహిమ్నస్తోత్ర మను లఘు (ఖండ)కావ్యమునందిట్టులు కూర్చి యున్నారు.

శ్లో. కిమీహః కింకాయః స ఖలు కిముపాయ స్త్రిభువనం
కిమాధారో ధాతా సృజతి కిముపాదాన ఇతి చ,
అతర్క్యైశ్వర్యే త్వయ్యనవసరదుఃస్థో హతధియః
కుతర్కోऽయం కాంశ్చి న్ముఖరయతి మోహాయ జగతః,

ఓ దేవా! నీయైశ్వర్య మిట్టి దట్టి దని తర్కించుట కైనను వీలులేక యుండఁగా, 'జగత్కారణుం డగు నీశ్వరుండు ఎట్టి యిచ్ఛ గలవాఁ డెట్టికాయము గలవాఁ డతనికిఁ గల యుపాయ మెట్టిది? ఈముల్లోకముల నేయాధారమున నతండు సృజించుచు నున్నవాఁ డతనికి నందులకై యుపాదానకారణ మైన దెయ్యది?—అని యిట్టులుగా మతిపోయినవానియొక్క యీకుతర్కము, అనవసరమగు దుఃఖమునంబడినదై యున్నను, లోకమునం దలికొందఱిని మోహవశులం జేసి, వాగించుటకు మాత్ర ముపయోగించుచు నున్న దని భావము. ఇందుఁ బైని చెప్పినన్యాయవైశేషకీయసిద్ధాంతము కూర్పంబడుటచే నిది న్యాయవైశేషకీయ కావ్యార్థయోనికుదాహరణము.

బౌద్ధీయ మగు కావ్యార్థయోని కుదాహరణము:-

వివక్షాపూర్వా హి శబ్దాస్తా మేవ వివక్షాం నూచయేయుః

శబ్దములు వక్త చెప్పందలంచిన యర్థమును మాత్రమే చెప్పునట్టి శక్తిని గల్గియుండును. అందుచేత నవి ఆయర్థమునే (అనగా నతఁడు చెప్పఁదలఁచిన యర్థమునే సూచించును-అనునర్థము బౌద్ధశాస్త్ర సిద్ధాంతము. దీనిని ఒక కవి యీక్రిందం జెప్పంబోవువిధముగాఁ దన కావ్యమునందు గూర్చియుండుటచేత నియ్యది బౌద్ధశాస్త్రీయమగు కావ్యార్థయోని కుదాహరణముగా నగుచున్నది.

శ్లో. భవతు విదితం శబ్దా వక్తు ర్వివక్షితసూచకాః,
స్మరవతి యతిః కాంతే కాంతాం బలా త్పరిచుంబతి।
ననా మమమా మా మాం స్ప్రాక్షీః నిషేధపరం వచో
భవతి శిథిలే మానగ్రంథా త దేవ విధాయకమ్.

సంభావణకాలములందు వక్తయగువానికి [చెప్పఁదలఁచినది] వివక్షితమగు నర్థమునే ఆశబ్దములు సూచించుచున్నవి అని వాదుక యున్నది. కాని, తెలసినది. ఏరీతి ననఁగా, కాంతుఁడు మన్మథపీడితుఁడై తన కాంతను బల్మిని ముద్దిడుకొనుచున్న వేళలో, ఇంతకు పూర్వము-ననన(వలదు వలదు వలదు) అని, మ మ మా మాంస్ప్రాక్షీః (నన్ను త త తా తాఁకవలదు) అని ప్రయోగించిన ఏమాట ఆతనిని నిషేధించుట కుపకరించెనో, అది యే మానగ్రంథి సడలఁగనే, (ప్రణయకోపము శాంతింపఁగనే) విధించుటకై యుపకరించిన దని భావము. ఇందు

పైనిఁ జెప్పిన బౌద్ధసిద్ధాంతము నాధారముగాఁ గొని రచన సేయఁబడి యున్నది.

ఇఁక నార్హాత మగు కావ్యార్థయోని కుదాహృతి:—

శరీరపరిమాణ ఆత్మా, అన్యథా శరీరాఫల్యం,

ఆత్మాఫల్యం చ. (అర్హాత సిద్ధాంతము.)

ఆత్మ యనునది అప్పైస్యజీవుల శరీరములయొక్క పరిమాణము (కొలత) గలది. కా దందు రేని, శరీరమున (నున్నందుల) కఫలత్వమును, ఆత్మ కఫలత్వమును కూడ ఆపతిత మగు చున్నది—అని ఈవాక్యమున కర్థము. ఈ యర్థమును మూలముగాఁ గొని, ఈ క్రిందిరీతి నొక కవి కూర్చియున్నాఁడు.

శ్లో. శరీరమాత్ర మాత్మానం యే వదంతి, జయంతి తే,
తచ్చుంబనేపి య జ్జాత స్సర్వాంగపులకో౽ద్య మే.

[శరీరమాత్రమే ఆత్మయని చెప్పెడి వారలు ధరిత్రి యుత్కర్షతో విలసిల్లు చున్నారు. ఏల యనఁగా నా శరీరమునందలి యేకదేశ మగు వదనమును చుంబనము చేయఁగా, నాకు సర్వాంగసంజనిత మగు (ఆనందజనిత) పులకము కల్గినది—అని భావము. ఇందు ఆర్హాతుల శాస్త్రసిద్ధాంతము కూర్పంబడుటచే నిది యార్హాతమగు నట్టి కావ్యార్థయోని ]

కావ్యవిద్యయనునది - అనఁగా సాహిత్యవిద్య- సమస్తవిద్యా (శాస్త్ర) కళాపరిషత్తునకును సంబంధించి

యున్న దగుటచేత, వెనుకఁ జెప్పిన ఆయాశాస్త్రసిద్ధాంతములను మాత్రమేగాక, తక్కుంగల విద్యావిషయాదులగు నర్థములను కూడ, కవి యగువాఁడు చక్కనివ్యుత్పత్తి నార్జించుటకై, పరిశ్రమచేసి, చూచి యుండవలయును. పెద్దలు అనినారుకూడ:—తర్కకర్కశములగు సిద్ధాంతములను కూడ సత్కవియగువాఁడు చక్కనిదగు తనరచనమున నిపుణముగా నాదరించి కూర్చినచో, అయ్యవి సూర్యకిరణములు (ఉష్ణము లయినను) చంద్రుని నను ప్రవేశించి, యొకవిధమగు నాహ్లాదత్వమును కూర్చినట్టులుగా, నా కవిరచనలకు ఒకవిలక్షణ మగు నందచందములను కూర్చుచునున్నవి—అని భావము.

ఇఁకను సమయవిద్యలయందుగల సిద్ధాంతములఁ గావ్యార్థయోనులఁగా చేకొనిన వాని నుదాహరింపవలసియున్నది. అందు సంగ్రహరీతిగాఁ గొన్నిటిని వివరించెదము. అందు శైవ సిద్ధాంతములఁ గూర్చిన కావ్యార్థయోనిని తొలుత నుదాహరించెదము:—

శ్లో. ఘోరఘోరతరాతీత బ్రహ్మవిద్యాకళాతిగః,
పరాపర పదవ్యాపీ పాయా ద్వః పరమేశ్వరః.

[ఘోరములును ఘోరతరములునగు వాని నతిక్రమించిన బ్రహ్మవిద్యాకళను సైతము మించి యెవ్వాఁడుండునో, ఎవ్వాఁడు పరము అపరము నగు పదములను వ్యాపించియున్నాఁడో, అట్టి పరమేశ్వరుఁడు మిమ్ము రక్షించుగాక యని భావము. ఇందు బ్రహ్మవిద్యాకళాతి

గత్వము పరాపరపదవ్యాపిత్వము మున్నగునవి శైవ సిద్ధాంతసమయములు. వాని నిందుఁ గూర్చుటచేత నియ్యది శైవసిద్ధాంతీయ మగు కావ్యార్థయోని కుదాహరణ మయ్యెను.]

పాంచరాత్ర మగు కావ్యార్థయోని:—

శ్లో. నాద్యంతవంతః కవయః పురాణాః
సూక్ష్మా బృహంతో ఽప్యనుశాసితారః
సర్వజ్వరాన్ ఘ్నంతు మమాఽనిరుద్ధ
ప్రద్యుమ్న సంకర్షణవాసుదేవాః.

[ఆద్యంతములు లేనివారలై, కవిశబ్దవాచ్యులై, పురాణపూరుషులై, అణువులకంటె నణువులును, బృహత్తులకంటె బృహత్తులును నై, లోకముల నంతకును అనుశాసకులై యుండెడి అనిరుద్ధ ప్రద్యుమ్న సంకర్షణ వాసుదేవు లనుపేరఁ బఱఁగు శ్రీమహావిష్ణుని చతుర్వ్యూహమూర్తులు నాదగు జ్వరములను పోఁగొట్టుదురు గాక యని భావము. పాంచరాత్రశాస్త్ర మగు వైఖానసాగమ మువొక్క సిద్ధాంతమును మూలముగాఁ గొని, రచన సేయంబడుటచేత నిది పాంచరాత్ర మగు కావ్యార్థయోని కుదాహరణము.]

బౌద్ధసిద్ధాంతీయ మగు కావ్యార్థయోని:—

శ్లో. కలికలుషకృతాని యాని లోకే,
మయి నిపతంతు విముచ్యతాం స లోకః.
మమ హి సుచరితేన సర్వసత్త్వాః
పరమసుఖేన సుఖావతీం ప్రయాంతు.

[కలికలుషమున నేర్పడిన నరకదుఃఖము లన్నియు నాయందుఁ బడుఁగాక. వాని నొసర్చిన లోకము వదలి పెట్టఁబడుఁగాక. నాదగు సుచరితత్వముచే లోకము నంగల సర్వసత్త్వములును పరమానందమున మఱల నిభూమండలము దుదిసుఖించుంగాక—యని భావము. ఇందు సర్వభూతహితేచ్ఛయే మోక్షము—అగు సిద్ధాంతము బౌద్ధసంప్రదాయానుగతమైనది కూర్పంబడుట చేత నిది బౌద్ధ సిద్ధాంతీయ కావ్యార్థయోని కుదాహరణ మయ్యెను.]

ఇట్టులనే తక్కిన ఆయా మతములవారి సిద్ధాంతములను చేకొని కావ్యరచనలు చేసినట్టి యుదాహరణములు వెదకి కూర్చుకొనందగును. ఇఁకను రాజనీతిసిద్ధాంతశాస్త్రము లగు వార్తా దండనీతి ఆన్వీక్షిక్యాదులగు త్రయీవిద్యాసంబంధ కావ్యార్థయోనుల నుదాహరింపవలసి యున్నది. అందు త్రయ్యంతర్భూతమగు నర్థశాస్త్రసంబద్ధమగు కావ్యార్థయోని క్రిందిది యుదాహరణము.

శ్లో. శమవ్యాయామాభ్యాం ప్రతివిహిత తంత్రస్య నృపతేః
పరం ప్రత్యావాపః ఫలతి కృతవేక స్తరు రివ,
బహువ్యాజం రాజ్యం న సుకర మరాజ్ఞప్రణిధిభి
ర్దురారాధ్యా లక్ష్మీ ననవహితచిత్తం ఛలయతి.

రాజశేఖరుని బాలరామాయణము.

[శమవ్యాయామము లనువానిచే [శత్రురాజు వన్నినవ్యూహములకు] ప్రతివ్యూహము పన్నింగల రాజ

నకు అప్రత్యావాపము. ప్రయత్నముగ నీళ్లు పోసి పెంచిన వృక్షము ఫలించునట్టులుగానే తప్పక ఫలింపఁగలదు. ఇట్టులు ప్రత్యావాపముఁ జేయక యున్నచో, రాజ్యమనునది బహువ్యాజములు కలదై యుండి, రాజప్రణిధులు లేని వారికి సుకరముగా నుండఁజాలదు. ఏలయనఁగా, లక్ష్మి, అనఁగా రాజ్యలక్ష్మి, అనవహితచిత్తుఁడగువానిని దురారాధయై, వంచించును గదా యని తాత్పర్యము. ఇందు- ఈక్రింది అర్థశాస్త్రమునకు సంబంధించిన యర్థములు చేకొని కూర్పంబడుట చేత నియ్యది అర్థశాస్త్రీయ కావ్యార్థయోని కుదాహరణ మయ్యెను.

శ్లో. క్షయవ్యయాయాసవశా ద్విదోషవ్యపేక్షయాస్వీక్షిత సాధు
కృత్యః, కామం తు పీడా మపి కాంచి దిచ్ఛేన్న విగ్రహం
తత్ప్రభవా హి దోషాః...నిర్వృత్తక్షుపపాషాణస్థాణు వల్మీక
నిర్గతే, కారయేత్కంటకైశ్ఛిత్రైః సైన్యవ్యాయామ భూమికాః,
యస్మిన్దేశే యథాకామం సైన్యవ్యాయామభూమయః, పర
స్య విపరీతా శ్చ కుత్సితో దేశ స్స ఉత్తమః—అని.

[చూడుము నాపరిచరణము కామందకీయ నీతిసారము.]

నాట్యశాస్త్రీయ మగు కావ్యార్థయోని కుదాహరణము:—

శ్లో. ఏవం ధారయ దేవి బాహులతికా
మేవం కురుష్వాంగకం.
మాత్యుచ్చై ర్నమ కుంచయాగ్రచరణం
మాం పశ్య తావ త్స్థితం,

దేవీర న ర్తయతేః స్వవక్త్రమురజేన
అంభోధరధ్వానినా,
శంభో ర్వః పరిపాంతు లయలయ-
చ్ఛేదా హతా స్తాళికాః.

దేవీ! లతవలె నున్న నీ బాహువును ఇదిగో ఇట్లు (అనఁగా తాను పట్టుకొనిన రీతిగా) పట్టుకొనుము. అవయవ సన్నివేశమును ఈవిధముగా (నిలుచునట్లు) చేయుము. అంత ఎక్కువఁగా వంగకుము. ముంగాలిని (ఇట్లు) పంచుము. చూడుము (నేనెట్లు నిలువంబడితినో) నన్ను—అని యిట్లు తనదేవి యగు పార్వతికి నృత్తముఁ గఱపుచు, తననోటితో మేఘగంభీరముగా మద్దెల వాయించుచు లయకై చేతితో చిటుకలు వేయుచున్న ఈశ్వరుని తాళికలు (చిటుకలు) మిమ్ము రక్షించుంగాక-యని భావము. ఇందు నాట్య శాస్త్రసంబద్ధమగు వస్తువు కూర్పంబడుటచే, నిది నాట్యశాస్త్రీయ కావ్యార్థయోనికి నిదర్శన మయ్యెను.]

కామసూత్రీయ మగు కావ్యార్థయోనికి నిదర్శనము:—

శ్లో. వాఽఽశ్చర్యం త్వయి య ల్లక్ష్మీః
క్షిప్త్వాఽధోక్షజ మాగతా,
అసౌ మందరత స్త్వం తు
ప్రాప్త స్సమరత స్తయా.

[అధోక్షజుఁ డగు విష్ణునివదలి లక్ష్మి నీయందు నిలచియున్నది —యనువిషయములో నెట్టి యాశ్చ

ర్యమును లేదు. ఏమనఁగా లక్ష్మిచే నాతఁడు మందిరతః ప్రాప్తుఁడయ్యెను. మందరపర్వతమునుండియని యొక యర్థము. మందమైన రతి గలవాఁడని మఱియొక యర్థము. ఇఁక నీ వన్ననో సమరతః ప్రాప్తుఁడవు. కాఁబట్టి నిన్ను వరించి నీయందనురక్తయైనిలచి యున్నది. సమర్థతః ప్రాప్తుఁడన-చోట యుద్ధమునుండి పొందం బడినవాఁడని యొకయర్థము. సమమైన రతముగలవాఁ డని వేఱొక యర్థము. ఇచ్చట — తత్ర సదృశే సంప్రయోగే సమరతాణి త్రీని అనెడి కామశాస్త్రమును కొని కూర్పంబడుటచేత,నిది కామశాస్త్రీయమగు కావ్యా ర్థయోని కుదాహరణముగా నెఱుంగునది. శశజాతి పురుషునకు హరిణీ జాతిస్త్రీతోను, వృషజాతిపురుషునకు అశ్వజాతిస్త్రీతోను, అశ్వజాతి పురుషునకు హస్తినీజాతి స్త్రీతోను కలిగెడి సంయోగము సదృశమై యుండి, స్త్రీ పురుషుల యింద్రియములకు ఆనందము నిచ్చుటలో పటుత్వము గల్గియుండుననుట కామశాస్త్ర సంప్రదాయా గతమగు సిద్ధాంతము. [చూడు వాత్స్యాయనము. నా ప్రకరణము.]

ఇఁకను లౌకికమగు [అనఁగా లోకానుభవమును ఆధారముగాఁ జేసికొని కూర్చినట్టి కావ్యార్థయోని నుదాహరించెదము. అది ప్రాకృత మనియును, వ్యుత్ప న్న మనియు, ద్వివిధముగా నుండును. అందు లౌకిక కావ్యార్థయోనికి నిదర్శనము.

శ్లో. స్ఫుటితపిఠరీబంధశ్లాఘ్యో విపక్షగృహేష్వ భూత్,
ప్రియతమ యయో స్స్నేహగ్రంథి స్తథా ప్రథమం స నా,
జనప దధునా సద్మన్యావాం వసావ ఇహైవ తౌ,
ధి గపరిచితం ప్రేమ స్త్రీణాం చిరాయ చ జీవితమ్.

ఓయీ! ప్రియతమా! విపక్షుల (కిట్టనివారి) ఇంటియందున్నను, మన కిర్ర్వారకును మన యింటియందున్నటులే స్వజనము వలెనే యున్న మన కిర్ర్వారకును తొలుత స్ఫుటిత పిఠరీబంధమువోలె నేర్పడినట్టి శ్లాఘ్యమగు స్నేహగ్రంథి ఏది కలదో, అది యొక్కటియే ఇప్పుడు మనకు లేదు, కాని మనముమాత్ర మున్నవారము. (ఇది నాతప్పే.) స్త్రీలయొక్క యపరిచిత మగు ప్రేమయును చిరకాల జీవనమును వ్యర్థమై నింద్య మగుం గాక—యని భావము. ఇందు అకారణ ప్రణయ విముఖుండగు నాయకునిఁగూర్చి నాయిక నిందించెడి విషయమును ఇందు చక్కఁగా కవి నిబంధించుటచే నిది లౌకిక కావ్యార్థయోనికి—అందునను ప్రాకృత జన వ్యవహారమునుం గూర్చిన కావ్యార్థయోనికి నిదర్శనము అగునందురు.

అథవా—ప్రాకృతమగు కావ్యార్థయోని క్రింది దాని నైనను ఉదాహరణముగాఁ జేకొనవచ్చును.

శ్లో. ఇక్షుదండస్య ఖండస్య దధ్నః పిష్టకృతస్య చ,
వారాహస్య చ మాంసస్య నైవ గచ్ఛతి ఫాల్గునః.

ఇది యొక భోజనప్రియుఁడగు ఫాల్గునింగూర్చి

చెప్పిన పరిహాసోక్తి—ఈఫాల్గునుఁడును అదియును (ఫాల్గునుని భార్య), చెఱకుగడలు దధిమండము, పయః పిష్టము (దూద్పేడా) అడవిపందిమాంసము—అనువాని కై ఆశించి పోవుచున్నాఁడు—అని భావము. ఇందు ప్రాకృతజనుల లోకప్రవృత్తిఁ గూర్చుట చేత, నియ్యది ప్రాకృతమగు లౌకిక కావ్యార్థయోని కుదాహరణ మయ్యెను అని తెలియఁదగు.)

ఇఁకను రెండవదగు వ్యుత్పన్నమగు లౌకిక కావ్యార్థయోని నుదాహరించెదము. ఇది సర్వజనులయందుఁ గన్పట్టునట్టిది (దీనికి సమస్తజనజన్య మని పేరు.) అని యు, ఎక్కడనో ప్రాయికముగా కొందఱు జనులయందే కన్పట్టునది యనియును (దీనికి కతిపయ జనజన్య మని పేరు.) రెండు విధములు. ఈ రెండువిధములలోను తొలుతటి దగు సమస్త జనజన్యము ఆయాదేశముల ననుస రించి బహువిధముల నుండును. 1 ఈ సమస్తజనజన్య మగు లౌకిక కావ్యార్థయోని కిటుమీఁద స్థాలీపులాక

1. శ్రీనాథకవి రచించిన వీధినాటకము, వల్లభరాయుని క్రీడాభిరామము హంసవింశతి శుకసప్తతి, భోజరాజీయము ఆనుపూర్వ్య ప్రబంధములలోపలిదగును, ఇట్టి శ్రీపండితదాసు శ్రీరామకవి రచించిన తెలుఁగునాఁడు—అను దానియందును మనకు సవిస్తరముగాఁ గన్పట్టును. అనఁగా నాగ్రంథములలో నానాదేశజనితులగు స్త్రీపురుషుల వేషభావలు మున్నగులౌకిక ప్రవృత్తులు చక్కఁగాఁ గూర్పబడి యున్నవి. పైహానిలో వీథినాటకమును, హంసవింశతియును ప్రశిద్ధ

న్యాయముగా నుదాహరణముల నిచ్చెదము. అందు దాక్షిణాత్యమగు సమస్తజనజన్యలౌకిక కావ్యార్థయోని:-

శ్లో. పిబంత్యాస్వాద్య మరిచం, తాంబూలైర్విశదై ర్ముఖైః,
ప్రియాధరావదం శాని మధూని ద్రవిడాంగనాః.

మున్ముందుగా పచ్చిమిరియములను [చలువమిరియములను] ఆస్వాదించి, ఆపిమ్మట తాంబూలచర్వణముల నొనర్చి, నిర్మలములగు మోముదమ్ములతోఁ బ్రియులు సగము రుచిచూచి యిచ్చిన మధువులను ద్రవిడాంగనలు త్రావుచున్నారని భావము. ఇందు దక్షిణాపథమందున్న ద్రావిడదేశమునందలి లౌకికమగు నాచారము కూర్పంబడుటచేత నియ్యది దాక్షిణాత్య మగు సమస్త జనజన్య కావ్యార్థయోనికి ఉదాహరణ మయ్యె నందురు.]

ఈపై యుదాహరణమును గాని లేదా ఈ క్రింది యుదాహరణమును కాని, దాక్షిణాత్య సమస్త జనజన్య లౌకిక కావ్యార్థయోని కుదాహరణముగాఁ గొనవచ్చును.

శ్లో. విరమ మదన కస్త్వం చైత్ర కౌశక్తి రిందోః
ఇహహి కుసుమబాణాః కుంఠితాగ్రాః పతంతి,

---

మువారు అశ్లీలము అని బహిష్కరించి యున్నారు. దీనిచే నాంధ్ర వాఙ్మయపరిశోధకులకు వాని నుదాహరించుటకుగాని ప్రకటించుటకు గాని గొప్పయడ్డు యేర్పడినది. ఇది చాల శోచ్యము. భాషాభిమానులు ప్రయత్నించి దొరతనము వారిని నిషేధమును రద్దుఁజేయింప యత్నింపఁ దగును - సంపా.

హృదయభువ ఇమా స్తాః కుంతలప్రేయసీనాం
ప్రహతికిణకఠోర గ్రంథయో వజ్రసారాః,

[ఓయీ! మన్మథా! నీవింక నూరకొనుము. చైత్ర! నీ వెవ్వండవోయీ? (మీ యిర్వురస్థితియే వ్యర్థమైనప్పుడు) ఇంక నిచటం జంద్రుని కేమి పట్టు కలదు? ప్రకృతము మన్మథుని బాణములు మొక్కలువోయిన మొనలు గలవై పడుచున్నవి. [లేనిచో ఈసరికిం గార్యము కావలసినదే కాదా ?] ఏల మొక్కవోయె ననంగా, కుంతల రాజస్త్రీలయొక్క హృదయప్రదేశములు దెబ్బలు తినితిని కాయలు గాంచిపోయినవి. కనుకనే వజ్రసారములై యున్నవి—అని భావము. అతిసుకుమారములగు మదనుని పూవుటమ్ములు వజ్రకఠినములైనచోట్ల పనిం జేయనేరవుకదా. ఇందు దక్షిణాపథమునకుం జెందిన కేరళదేశపు స్త్రీలయొక్క ప్రాయికమగు లోకప్రవృత్తి వర్ణింపంబడినది; కాన నిది దాక్షిణాత్య సమస్తజనజన్య లౌకిక కావ్యార్థయోని.

ఇంకను ఉదీచ్య మగు సమస్తజన్య (లౌకిక) కావ్యార్థయోని కుదాహరణము:—

శ్లో. నేపాళ్యో వల్లభై స్సార్థ మార్ద్రేణ మదమండనాః,
గ్రంథిపర్ణకపాళీషు నయంతి గ్రీష్మయామినీః.

ఇట్లే ఈలౌకిక మగు కతిపయ జన్యకావ్యార్థయోనికిని ఈ క్రిందిశ్లోకము నుదాహరణముగాం గొనందగును.

శ్లో. మిథ్యామీలదరాళపక్ష్మణి వల త్యంతః కురంగీదృశో,
దీర్ఘాపాంగసరిత్తరంగతరళే తల్పోన్ముఖం చక్షుషి,
పత్యుః కేళిమతః కథాంవిరమయ న్ అన్యోన్యకండూయనా
త్కోఽయం వ్యాహరతీత్యు దీర్య నిరగా త్సవ్యాజ మాళీజనః

కవి, స్వమనీషా (స్వకపోల) కల్పితముగా నల్లిన కథాతంత్రము గాని, వస్తుమాత్రముగాని విరచన యనం బడును. ఇది తొమ్మిదవదగు కావ్యార్థయోని యగుచున్నది. ఇట్టి విరచనయను పేరంబఱగు ఈ రెండు తెఱగులగు కావ్యార్థయోనులలోను స్వమనీషాకల్పితమగు కథాతంత్రమునకు ఉదాహరణ మెట్టు లనంగా.

శ్లో. అస్తి చిత్రరథో నామ ఖడ్గవిద్యాధరాధిపః,
దక్షిణే మలయోత్సంగే రత్నావత్యాః పురః పతిః.
తస్య రత్నాకరసుతా శ్రియో దేవ్యాస్సహోదరీ
స్వయంవరవిధా వాసీ త్కళత్రం చిత్ర సుందరీ.

[ఖడ్గవిద్యాధరాధిపుఁడును, రత్నవతీపురాధినాథుండు నగు చిత్రరథుఁ డనుపేరుగలవాఁడు దక్షిణదేశమునందలి మలయపర్వతప్రాంతముల నివసించుచు నుండెను. అవ్విద్యాధరాధిపునకు రత్నాకరసుతయగు చిత్రసుందరి యనునది సాక్షాల్లక్ష్మికిఁ దోఁబుట్టువనఁ దగినది, స్వయంవరవిధియందు కళత్రముగా నయ్యెను-అని భావము. ఇందు వస్తునిర్దేశము కవి స్వప్రతిభతో గల్పించి చేయుటచేత, నిట్టిపి విరచన యను కావ్యార్థయోని యందలి తొలిభేదమున కుదాహరణము లయ్యెను.]

ఇఁక రెండవ దగు వస్తుమాత్రరూప మగు విరచిన కుదాహరణము:—

శ్లో. జ్యోత్స్నాంలింపతి చంద్రనేవస పురః సించత్యసౌ మాలతీ
మాలాం గంధజలైర్మధూని కురుతే స్వాదూ న్యసౌ ఫాణితైః ।
య స్తస్య ప్రథితా న్గుణా న్ప్రథయతి శ్రీవీరచూడామణేః
తారత్వం స చ శాణయా వ్యృగయతే ముక్తాఫలానా మపి.

[శ్రీవీర చూడామణి యను రాజుయొక్క లోక ప్రసిద్ధములగు గుణములను కూడ ప్రసిద్ధినొందింపఁ దివిరెడివాఁడు, సహజముగనే చల్లనైన పండువెన్నెలను చందనముతోఁ దడుపఁ బ్రయత్నించుచున్నవాఁ డగును. గమగమ మని వాసనలవిరియించెడి మాలతీమాలికను వాసనోదకములతో (నత్తరువులతో) సేచనముం జేయుచున్నవాఁ డగుచున్నాఁడు. మధురమధురము లగు మధువులకు (అనఁగాఁ దేనెలకు) మాధుర్యముఁగొల్పు ఫాణిత సంస్కారములతో స్వాదుత్వమును దేఁ బ్రయత్నించు చున్నవాఁ డగును. సహజముగాఁ దారత్వముగల ముత్తెములకు, బరపిడితాయితో తారత్వమును తెచ్చుటకు పూనుకొనుచున్నవాఁ డగు నని భావము. అనఁగా వెన్నెలలకు చల్లఁదనమునకై, మాలతీమాలకు పరిమళముఁ గూర్చుటకై, మధువులకు మాధుర్యము గల్గించుటకై ముత్తెములకు తారత్వము నొడఁగూర్చుటకై ఎవ్వరును బ్రయత్నింప నక్కఱలేదయ్యె, ఆయాగుణములు వానికి సహజముగానే కల్గిసిద్ధులుగా. సకలలోక ప్రసిద్ధము లగు

వీరచూడామణి రాజుగారి, గుణములఁ బ్రసిద్ధినొందించుట కితరుల ప్రయత్న మవసరము లేదని యభిప్రాయము. ఇందు వస్తుమాత్ర విరచనము చేయుటచేత నిది వస్తు విరచనయను కావ్యార్థయోని యయ్యెను.]

ఈ విషయమునందు పెద్దలిట్లు సిద్ధాంతము చేసి యున్నారలు—ఎంత చిన్నచిన్నవగు కథావిరచనములం దైనను, ఎవ్వనికిఁ బ్రతిభాదారిద్ర్యము ఉండదో, ఆతం డొక్కండే కవిగ్రామణి యనందగి యున్నాఁడు. తక్కిన వార లతనికి కుటుంబిప్రాయులు—అని.

పైని చెప్పఁగా మిగిలినట్టి కావ్యార్థయోనులు ప్రకీర్ణక మనఁబడును. ఇందు హాస్తిశిక్షీయ, రత్నపరీక్షీయ ధనుర్వేదీయ, యోగశాస్త్రీయాదు లన్నియు, నిందే చేరఁ దగియున్నవి. అందు రత్నపరీక్షీయమున కుదాహరణము:—

శ్లో. ద్వౌ వజ్రవర్ణౌ జగతీనాం,
సద్భిః ప్రదిష్టౌ నతు సార్వజన్యౌ,
యస్స్యాజ్జపావిద్రుమ శోణజన్యః,
యో వా హరిద్రారసనన్నికాశః.

[రాజులకు రెండేరెండు వజ్రవర్ణములు ఉత్తమము లని చెప్పఁబడినవి. అయ్యవి ఎక్కడఁబట్టిన నక్కడ దొరకునట్టివి కావు. ఆరెండు ఏవి యందురేని, ఏది జపా కుసుమమునందువలెను, పవడపు తునుకయందువలె నెఱు పుమీఁటి యుండునో, ఏది పసపురంగువంటి కాంతి గల్గి యుండునో,— అవి అని భావము. ఇందు జపావిద్రుమభంగ

శోషణము లైనవియును, హరిద్రారసనన్నికాశము గలవియును అగు వజ్రములు ఉత్తమజాతి రత్నము లనియు, అవి సార్వజన్యములు కావనియు చెప్పంబడిన రత్నశాస్త్ర సిద్ధాంతము నాధారముగాఁ గొని రచన సేయంబడినది కనుక నిది రత్నపరీక్షీయమునకు నిదర్శనముగా నెఱుఁగునది.]

ధనుర్వేదీయము అను కావ్యార్థయోని కుదాహరణము:—

శ్లో. స దక్షిణాపాంగనివిష్టముష్టిం
నతాంస మాకుంచిత సవ్యపాదం
దదర్శ చక్రీకృతచారు చాపం
ప్రహర్తు మభ్యుద్యత మాత్మయోనిమ్.

—కుమారసంభవము - స 3. శ్లో 70.

[ఆ యీశ్వరుఁడు దక్షిణాపాంగనివిష్టముష్టి యై నతాంశుఁడై ఆకుంచిత సవ్యపాదుఁడై చక్రీకృత చారుచాపుఁడై తన్ను ప్రహరించుటకు సంసిద్ధుఁడై యున్న మన్మథునిఁ గనుంగొనెను—అని భావము. ఇందు ధనుర్వేదోక్తములగు ఆలీఢపాదత్వాదులు కూర్పంబడుటచే నియ్యది ధనుర్వేదీయ మగు కావ్యార్థయోని కుదాహరణము.]

యోగశాస్త్రీయ మగు కావ్యార్థయోని కుదాహరణము:—

శ్లో. య స్సర్వేషాం హృదయకమలే ప్రాణినా మేకహంస
స్తం జాగర్షి స్వపిషి చ ముహుర్బద్ధదృష్టి ర్న చాఽసి బుద్ధః|

తం త్వారాధ్య పవిత్రితధియో బంధభేదం విధాయ
ధ్వస్తాతంకాః విమలమహస స్తే భవంతో భవంతి.

[ఎవ్వాఁడు ప్రాణులందఱియొక్క హృదయకమలమునందు ముఖ్యమగు హంసయై వర్తించుచుండునో, అనీవే మేల్కొనుట నిద్రించుట బోధయుక్తుఁడగుటయున్న సుధర్మములతో రాజిల్లుచున్నావు. అయినను నీవు బుద్ధుఁడవు కాలేదు. అట్టి నిన్నారాధించి, పవిత్రతమనస్కులై, బంధమును భేదించికొని, ఆశంకములనెల్ల రూపుమాపికొనినవారై, పూజ్యులగు ఆపెద్దలు నిర్మలతేజోవిరాజితులుగా, కాఁగల్గుచున్నారు–అని భావము. ఇందు యోగశాస్త్రసంబంధములయిన విషయములను మూలముగా గ్రహించి కూర్పంబడుటచేత ఇది యోగశాస్త్రీయ కావ్యార్థయోని యయ్యెను.]

ఈరీతిగానే తక్కిన ప్రకీర్ణకమునుకూడ నెఱుంగునది. ఇఁక నుచితసంయోగమున కుదాహరణము:—

శ్లో. పాండ్యోఽయ మంసార్పితలంబహారః
క్లృప్తాంగరాగో హరిచందనేన,
ఆభాతి బాలాతపరక్తసానుః
సనిర్ఝరోద్గార ఇవాఽద్రిరాజః

[రఘు, స 6. శ్లో. 60.

[బాలా! ఈపాండ్యదేశాధీశ్వరుఁడు అంసార్పితలంబమానతారహారుండై, హరిచందనరచితాంగరాగుండై బాలాతపరక్తసానుండును నిర్ఝరోద్గారసహితుండు నగు నద్రిరాజుబోలె విలసిల్లుచున్నాఁడు చూడుము–అని తాత్ప

ర్యను. ఇందు ఉచితమగు సంయోగము (ఉపమానోపమే యాదిసన్నివేశము) కూర్పంబడుటచే నిది ఉచితసంయోగమున కుదాహృతి యైనది.

ఇఁక యోక్తృసంయోగమున కుదాహృతి:—

శ్లో. కుర్వద్భిస్స్మరదంతినో మధులిహా మస్వాదు దానోదకం.
తన్వానైర్నముచిద్రుహో భగవత శ్చక్షుస్సహస్రవ్యథాం
మజ్జ న్స్వర్గతరంగిణీజలభరే పంకీకృతే పాంసుభిః
యద్యాత్రావ్యసనం వినింద విమనాః స్వర్లోకనాకీజనః.

ఉత్పాద్యసంయోగమున కుదాహరణము:—

శ్లో. ఉభౌ యది వ్యోమ్ని పృథక్ప్రవాహా,
ఆకాశగంగా పయసః పతేతాం.
తేనోపమీయేత తమాలనీల
మాముక్తముక్తాలత మస్య వక్షః.

[ఆకాశగంగోదక ప్రవాహము ఆకసమున రెండు పాయలుగా చీలి ప్రవహించిన దైనచో, నప్పు డద్దానితో తమాలనీలమును ఆముక్తముక్తాలతమునను నగు నితని వక్షమును ఉపమింపవచ్చు నని భావము.

ఇఁక సంయోగవికారమున కుదాహరణము:—

శ్లో. గుణానురాగమిశ్రేణ యశసా తవ సర్పతా,
దిగ్వధూనాం ముఖే జాత మకస్మా దర్ధకుంకుమం

లేనిచో, ఈక్రింది శ్లోకమునైనను ఉదాహరణముగాఁ గొనవచ్చును.

శ్లో. ఉన్మాద్య త్యంబురాశి ర్విదళతి కుముదం సంకుచం త్యంబుజాని,
స్యందంతే చంద్రకాంతాః, పతితసుమనసః సంతి శేఫాలికాశ్చ,

పీయంతే చంద్రికాంభః క్రమశ రళగళం, కించ కించిచ్ఛోరాః
చంద్రే కర్పూర గౌరద్యుతి భృతి నభసో యాతి చూడామణిత్వమ్.

ఈరీతిగా కవులకొఱకై అర్థోత్పత్తిపరాయణ మగు నీయధ్యాయము వివరింపంబడినది. దీనియందు ప్రౌఢతను సంపాదించిన కవికి ఎప్పుడును, నెచ్చటను అర్థవిషయకమగు కదర్థన పొసంగంజాలదు. అనంగా నిందుఁ జెప్పంబడినరీతిని సమస్తకావ్యార్థయోనులను కనిపెట్టి చక్కఁగా సరసమగు రీతిని ఆయ్యై యర్థముల నేర్పుఁ జూపంగల ప్రౌఢిమను ఆర్జించినవాని కెప్పుడుగాని కావ్యార్థ దారిద్ర్యము కలుగంజాల దని తాత్పర్యము.

ఇది రాజశేఖరకవిరాజకృతమగు కావ్యమీమాంస యను కవి-
రహస్యమునందు అర్థానుశాసన సంబద్ధము లగు పదునాఱు
కావ్యార్థయోనులను వివరించునట్టి
యష్టమాధ్యాయము.

---

# రాజశేఖరకవి కావ్యమీమాంస.

## నవమాధ్యాయము.

### అర్థవ్యాప్తి.

[ఈ యధ్యాయమునందలి విషయములు.—౧. దివ్యమానుషాదులగు నేడువిధము లగు అర్థములు. ౨. వాని భేదములు, ఉదాహరణములు. ౩. మర్త్యపాతాళీయాద్యుదాహరణములు. ౪. సరిత్సాగరాది వర్ణన రసవత్తలు, వాని ఉదాహరణములు. ౫. వస్తుస్వరూపవిచారణ. ౬. అందలి భేదములు. ౭. వాని కుదాహరణములు. ౮. సర్వభావములలోను అవధానము ముఖ్యమై యుండుటము.]

ఆ అర్థవ్యాప్తి ముత్తెఱఁగులని ద్రౌహిణుఁడు. దివ్యము దివ్యమానుషము మానుషము అని, పాతాళీయము, మర్త్యపాతాళీయము, దివ్యపాతాళీయము, దివ్యమర్త్యపాతాళీయము అను వానితోఁగూడ గలిసి ఏడని యాయావరీయుఁడు. అందు దివ్యమున కుదాహరణము:—

శ్లో. స్మృత్వా యన్నిజవారవాసగతయా వీణాసమం తుంబురో
రుద్గీతం నలకూబరస్య విరహా దుత్కంచులం రంభయా,
తేనైరావణ కర్ణచాపలముషా శక్రోఽపి నిద్రాం జహౌ
దూర్భాయుః కారిత ఏవ హాసిని శచీవక్త్రే ధృతాం సంభ్రమమ్.

[నిజవారవాసగతయగు రంభ వీణాసమ మగు తుంబురునిచే నుద్గీతమగు దేనిని వినుటం జేసి, నలకూబర విరహముచే ఉత్కంఠులముగా చేయుంబడినదో, ఐరావ తకర్ణ చాపలహారియగు నద్దానిచే తానే ఇంద్రునంతటి వాఁడు సైతము నిద్రనువీడి, నవ్వులుగుల్కుచున్న శశివ దనమునందు తన వేయికన్నుల సంభ్రమమును చేయింపం బడెను ఇందు దేవలోకసంబద్ధమగు నర్థవ్యాప్తి కూర్పం బడుటచే నిది దివ్యమున కుదాహరణ మయ్యెను.]

దివ్యమానుష మన్ననో నాల్గు తెఱఁగులు. దివ్యుఁడు మానుష్యలోకమునకు వచ్చునట్లు చెప్పుట. మర్త్యుఁడు స్వర్గమునకు పోవునట్లు చెప్పుట' అనునిది యొకభేదము. దివ్యునకు మర్త్యభావమును, మర్త్యునకు దివ్యభావమును చెప్పుట రెండవది. దివ్యేతివృత్తపరికల్పనచే నైనది మూఁడవది. ప్రభావావిర్భూత దివ్యకల్పనము నాల్గవది. అందు దివ్యుఁడు మర్త్యమునకు వచ్చినట్లు చెప్పుటకు ఉదాహరణము:—

శ్లో. శ్రియఃపతిః శ్రీమతి శాసితుం జగ
జ్జగన్నివాసో వసుదేవసద్మని,
వసన్ దదర్శావతరంత మంబరా
ద్ధిరణ్యగర్భాంగభువం మునిం హరిః॥

[శ్రీపతి యగు విష్ణువు లోకశాసనమునకై శ్రీమంత మగు వసుదేవు నింటియందు జనించి, (ఒకనాఁడు) అంబ

రమునుండి యవతరించుచున్న నారదునిగాంచెను. ఇందు దివ్యుఁడు మర్త్యాగమనముఁ జేసినట్లుచెప్పంబడినది.

మర్త్యుని స్వర్గగమనము:—

శ్లో. పాండో ర్నందన నందనం వనమిదం సంకల్పసిద్ధై స్సీధుభిః
క్లృప్తాపానక కేళికల్పతరుషు ద్వంద్వై స్సుధాశేహినాం
అప్యత్రేందుశిలాలవాల వలయం సంతానకానాం తలే
జ్యోత్స్నాసంగళ ద్దచ్ఛనిర్ఘరజలై ర్యత్నం వినా పూర్యతే.

[పాండుపుత్రా! ఇది నందనవనము. ఇచ్చోట దేవతామిథునములు సంకల్పమాత్రాన సంసిద్ధములైనమద్యములను కల్పవృక్షముల నుండి పొందినవారై ఆపానకేళిని సల్పినతావు లివి.మఱియు నిచ్చట, కల్పవృక్షముల క్రింద ఏర్పరుపఁబడిన చంద్రకాంతపు పాదులు, ఏవిధమైన ప్రయత్నమక్కఱలేకయే, వెన్నెలలవలన స్రవించెడు స్వచ్ఛము లగునిర్ఘరోదకములచేత నింపఁబడుచుండును. ఇందు మర్త్యుని స్వర్గగమనము కూర్పంబడినది.

దివ్యుని మర్త్యభావమునకు ఉదాహరణము:—

శ్లో. ఇతి వికసతి తస్మి న్నన్వవాయే యదూనాం
సమజని వసుదేవో దేవకీ యత్కళత్రమ్
కి మపర మథ తస్మాత్ షోడశస్త్రీ సహస్ర
ప్రణిహితపరిరంభః పద్మనాభో బభూవ.

ఇట్లు వికసించిన ఆయాదువంశమునందు వసుదేవుఁడను ప్రసిద్ధుఁడగు యాదవుఁడు పుట్టెను. దేవకియంతటి యామె అతనికిభార్యగను,పదారువేలగోపస్త్రీలకౌఁగిలిం

గనసంరంభముగల కృష్ణుఁడు కొమరుఁడుగానుగల ఆవసు దేవుని గొప్పతనమును గుఱించి, మఱి చెప్పఁదగిన దేమి కలదు ?

మర్త్యుని దివ్యభావమున కుదాహరణము:—

శ్లో. ఆకాశయాన తటకోటికృతైక పాదా
స్తద్హేమదండయుగళాన్యవలంబ్య హస్తైః
కౌతూహలా త్తవ తరంగవిఘట్టితాని
పశ్యంతి దేవి మనుజా స్స్వకళేబరాణి.

[దేవి, గంగానది ! (నీయందు మృతులైన) మను జులు ఆకాశవిమానముల (నెక్కుటకై) అంచులయందు ఒక అడుగు నుంచినవారై, చేతులతో ఆవిమానపు బంగరుదండములను బట్టుకొని, నీతరంగములచే విఘట్టిత ములు అగుచున్న తమశరీరములను, వేడుకతోఁ జూచెదరు అని భావము.

దివ్యమగు ఇతివృత్తమును కల్పనము చేయుటకు ఉదాహరణము:—

శ్లో. జ్యోత్స్నాపూర ప్రసరవిశదే సైకతేఽస్మిన్ సరయ్వా
వాదద్యూతం చిరతర మభూత్సిద్ధయూనోః కయో శ్చిత్
ఏకో బ్రూతే ప్రథమనిహతం కైటభం కంప మన్యః,
సత్యం తత్త్వం కథయ భగవన్ కో హత స్తత్ర పూర్వమ్ ?

[వెన్నెలలు ప్రసరించుటంజేసి స్వచ్ఛగా నున్న సరయూనదీసైకతప్రదేశమునందు, ఒకనాఁటు ఇద్దఱు సిద్ధయువకులకు వాదద్యూతము చిరకాలముదనుక జరి

గినది. ఆయిద్దరలో నొకఁడు విష్ణుచేత నిహతుఁడైన కైటభకంసు లను దానవులలో, మొదట నిహతుఁ డైన వాఁడు కైటభుఁ డనియెను. రెండవవాఁడు, ప్రథమనిహతుఁడు కంసుడేగాని కైటభుఁడు కాఁడనియెను. అయ్యా! (కృష్ణుఁడా) ఆ చంపినవాఁడవు నీవే కావున, ముందుగఁ జంపఁబడిన దెవ్వరో నిజము నెఱిఁగింపుము అనిభావము.

ప్రభావావిర్భూతదివ్య భావమునకు నుదాహరణము:—

శ్లో. మాగాః పాతాళ మూర్వి! స్ఫురసి కి మపరం
పాట్యమానశ్శుద్రైత్య
త్రైలోక్యం పాదపీఠ ప్రథిమ న హి జలే
పూరయస్యాన మంక్షుః
ఇ త్యుత్స్వప్నాయమానే భువనభృతి శిశా
వంకమస్తే యశోదా
పాయా చ్చక్రాంకపాద ప్రణతిపులకిత
స్మేర గండస్థలా వః.

"ఓయుర్వీ! (భూమీ) పాతాళమును చొరకుము. ఓరీ క్షుద్రదైత్యుఁడా బలీ! నీవు విపాట్యమానుఁడ వైతివి. ముల్లోకములును పాదపీఠప్రథిమములైనవి. ఇఁకను తక్కినయడుగునకు కొఱవడిన భాగమును పూరింపఁజాలవు సుమా"—అని, యిట్లు తనతొడపైఁ బరుండిన విశ్వంభరశిశువు (కృష్ణుఁడు) కలవరించుచుండఁగా, చక్రాంకితములగు ఆ విష్ణునిపాదములకు ప్రణతిఁజేయుటచేత, పుల

కితమైన గండస్థలము గల యశోద మిమ్ము రక్షించు నుగాక అని భావము.

మర్త్యమున కుదాహరణము:—

శ్లో॥ వధూః శ్వశ్రూస్థానే వ్యవహరతి, పుత్రః పితృపదే
పదే రిక్తే రిక్తే వినిహితపదార్థాన్తర మితి,
నదీస్రోతోన్యాయా దకలితవివేక క్రమఘనం,
న చ ప్రత్యావృత్తిః ప్రవహతి జగత్పూర్ణ మథ చ.

[కోడలు అత్తగారి స్థానమునందు (చేరి) వ్యవహరించుచున్నది. ఇట్లే కొడుకు తండ్రిస్థానమునందు వ్యవహరించు చున్నాడు. స్థానము కాళీపడెడికొలఁది దానియందు ఇంకొకవస్తువును ఏర్పాటుచేయుట అనునిది నదీస్రోతో న్యాయము ననుసరించి అకలితమగు వివేక క్రమఘనము గలదియై యున్నది. ఇట్టిజగత్తు మఱల వెనుకకు వచ్చుటయును లేదు. ఏకముఖముగా ప్రవహించుచునే యుండును. ఇట్లయ్యును ఇది ఏనాటికిని తరుగక నిండియే యుండు నని తాత్పర్యము.

పాతాళీయమున కుదాహరణము:—

శ్లో॥ కరోత్కంఠైః కోటిసంఘైః ప్రణమతి పురత
స్తక్షకే దేహి చక్షు
స్సజ్జ స్స్వాంజలి స్తైః కపిలకులికయో
స్త్వేతి చ స్వస్తిక స్త్వాం
పద్మ స్సైద్ర మభక్తే రవగలతి పురః
కంబలోయం బలో జయం.

సోత్సర్ప స్సర్పరాజో వ్రజతు నిజగృహం
ప్రేష్యతాంశంఖపాలః.

[కర్కోటకుఁడు కోటికుంఠుఁడై ప్రణమిల్లుచున్నాఁడు. ఎదుట నిల్వంబడిన తక్షకునిపై చక్షువును ప్రసరింపఁజేయుఁడు. కపిలకులికుల సేవాంజలి (తమనిమిత్తమై)సిద్ధముగా నున్నది స్వస్తికుఁడు మిమ్ము నుతించుచున్నాఁడు భక్తికి పుట్టిల్లగు పద్మఁడు ముఁదు నున్నాఁడు. అతి బలశాలి యగు కంబలుఁడు వీఁడే సిద్ధముగా నున్నాఁడు. ఈమా మనవి చిత్తగించి సర్పరాజు శంఖపాలుఁడుసోత్సర్పుఁడై తనయింటికిఁ బోవునట్లు తమచే ననుజ్ఞాతుఁడై పంపఁబడుం గాక.]

మర్త్యపాతాళీయమున కుదాహరణము:—

ఆర్ద్రాశివశే వ్రజ న వేత్స్యపకర్ణ! కర్ణమ్
ద్వి స్సంధధాతి న శరం హరశిష్యశిష్యః
తత్సాంప్రతం సమితి పశ్య కుతూహలేన
మర్త్యైశ్శరై రపి కిరీటి కిరీటమాథమ్.

[ఓయీ! కర్ణుని నీవు చక్కఁగా నెఱుంగని కతన నిట్లాడితివి. పో పొమ్ము. హరునిశిష్యుఁడగు పరశురామునికి శిష్యుఁడగు నితఁడు (కర్ణుఁడు) బాణమును రెండు మారులు అనుసంధింపఁడు. కావున నిప్పుడు ఈ యుద్ధరంగములో, కుతూహలముతో, మర్త్యబాణములచేతనే అర్జుననికిరీటమును నేలగలుపు నన్ను (కర్ణుని) కనుంగొనుము అని తాత్పర్యము.

ఇచ్చటఁగూడ వెనుక చెప్పిన చొప్పు ననుసరించి ఛత్రభేదముల నన్నింటిని ననుగమము చేయఁదగును.

దివ్యపాతాళీయమునకు ఉదాహరణము:—

శ్లో. స పాతు వో యస్య శిఖాశశాంకశ్శిక్ష్ణకః
స్వదేహనాళం ఫణమాత్రసంచయం
విభాతి జిహ్వాయుగలోలకేసరం
పినాకినః కర్ణభుజంగపంకజమ్.

స్వర్గమర్త్యపాతాళీయమునకుదాహరణము—

శ్లో. ఆస్తీకోఽస్తి మునిస్స విస్మయకృతః పారిక్షితీయాన్మఖా
త్త్రాతా తక్షకలక్ష్మణః ఫణభృతాం వంశస్య శక్రస్య చ
ఉద్వేల్లన్మలయాద్రిచందనలతా స్వాందోలన ప్రక్రియే,
యస్యాఽద్యాపి సవిభ్రమం ఫణివధూబృందైర్యశో గీయతే.

[పరీక్షిత్తురాజు విషయమై చేసినసర్పయాగము నుండి తక్షకరూపమున నున్న నాగమును, నాగేంద్రుల వంశమును దేవేంద్రుని, రక్షించినట్టి ఆస్తీకుఁడను మహాముని యొకఁడు కలఁడు. మలయాద్రియందలి చందనలతలయందు, ఉద్భూత లూగు డోలావిహారముల నుపక్రమించు నపుడు, నాగవధూజనము ఇప్పటికిని ఆయస్తీకుని యశమునే గానము చేయుచుందురని భావము.

"ఇట్టిది ఉల్లేఖితమ్ము ఉపజీవ్యమానమగుచు అనంతమగు నర్థబృందముగా (నిస్సీమార్థసార్థముగా) నగుచున్నది. అనంతమగు నర్థబృందముగా నైనచోఁ గావచ్చును; కాని ఇది విచారితసుస్థము అవిచారితసుస్థము అని

రెండువిధములు మాత్రమే, ఈ రెండింటియందును, తొలిదానిని శాస్త్రములును, పిమ్మటి దానిని కావ్యములును ఆశ్రయించిన వని ఔద్భటు లనిరి. అనఁగా నుద్భటమతా ను యాయు లని రని భావము.

ఎట్లనఁగా—

శ్లో. అపాం లంఘయితుం రాశిం, రుచా పింజర య న్నభః,
ఖ ముత్పపాత హనుమా న్నీలోత్పలదలద్యుతి.

[హనుమంతుఁడు నీలోత్పలదళద్యుతి యగు ఆకాశమును తన శరీరకాంతిచేత పింజరవర్ణము కలదానినిగా చేయుచు, నాకసమునకు లంఘించెను ]

మఱియును ఎట్లనఁగా—

"తదేవవారి సింధూనాం మహాత్మేమాచ్ఛపామితి"

అని యీ మొదలైనవానిని ఎఱుంగవలయును.

"దీనిని స్వరూపనిబంధన మని గాని, ఆకాశము యొక్క గాని లేక సరిత్సలిలాదులయొక్క స్వరూపకల్పన మని గాని యనుటకు వీలులేదు. కాని ప్రతిభాననిబంధనమే కాని ప్రతిభాన కాఁజాలదు. ప్రతిభానయే యని ఏల యనరా దందురా? అయ్యది తాదాత్మ్య మగు వస్తువునందే ఉండును. కావునఁ బ్రతిభాస కాఁజాలదు. ప్రతిభానయే అగు నందురేని మనకంటికి ద్వాదశాంగుళ ప్రమాణముగాఁ గనఁబడుచున్న సూర్యచంద్రుల మండలములు, పురాణాద్యాగమనివేదితధరా వలయ

మాత్రములుగా నుండఁగల్గునా?" అని యాయావరీయుఁడు. ఇట్లే నక్షత్రాదులు సరిత్సలిలాదులు, తదితరము మున్నగు వానియొక్కయు విషయము లని ఎఱుఁగునది.

ప్రతిభాసమును వస్తుస్వరూపమును శాస్త్రకావ్యముల నుపనిబంధించుటకు ఉపయోగించు నదై యుండును. శాస్త్రమున నెట్లనఁగా—

శ్లో. ప్రశాంత జలభృత్పంకే, విమలే వియదంభసి
తారా కుముదసంబంధే, హంసాయత ఇ వోడురాట్.

[ప్రశాంతములగు మేఘము లనెడి బురదగల్గిన నిర్మలమైన ఆకాశమనెడినీటిలో తారాకుముదములతో నిండిన యద్దానిలో, చంద్రుఁడు హంసవోలె నున్నాఁడని భావము.]

కావ్యము లన్ననో ఏతన్మయములే. "నిస్సీమార్థసార్థము (అనంతమగు నర్థబృందము) ఉన్నచో నుండును గాక. కాని రసవద్వస్తువునే కూర్చుట యుక్త మగును. గాని నీరసవస్తువును కూర్చుట యుక్తము కాదు. అని ఆపరాజితి యనెను. ఎట్లనఁగా—

శ్లో. మజ్జనపుష్పావచయన సంధ్యాచంద్రోదయాదివాక్యమిహ
సరసమపి నాతి బహుళం ప్రకృతరసానన్వితం రచయేత్
యస్తు సరిదద్రి సాగర పురతురగరథాది వర్ణనే యత్నః
కవిశక్తి ఖ్యాతిఫలో వితతధియాం నో మన స్స ఇహ.

మజ్జనము (అనఁగా జలక్రీడ మొ.) పుష్పావచయము, సంధ్యాకాలవర్ణనము, చంద్రోదయ వర్ణనము—

సూర్యోదయవర్ణనము (ఆదిశబ్దము చేత చంద్రాస్తమయ వర్ణనము ప్రభాతవర్ణనము, సూర్యాస్తమయ వర్ణనము తారకావర్ణనము. ము) మున్నగువానిని కూర్చెడి వాక్యములు గ్రంథములలో చేర్చునపుడు, సరిసముగనున్న ను అతి విస్తరముగాకుండగను-ప్రస్తుత మగు రసముతో కలసి మెలయునట్లుగను రచింపవలయును. నదులు కొండలు సముద్రములు నగరములు (ఉద్యానవనములు పుష్పలావికలు ఆపణములు, మొదలగునవి యన్నియు నిందు జేరును.) తురంగములు రథములు మున్నగువానిని ఆదిశబ్దముచేత గజవర్ణనము పదాతివర్ణనము, మంత్రద్యూత ప్రయాణాజి పరిభృతుల వర్ణనములను గ్రహింపఁగాఁదగును.) వర్ణించుటలో చేసెడి యత్నము, గ్రంథకర్త యొక్క శక్తిని, ఖ్యాతిని సూచింపఁ గలుగునే కాని, వేఱుఫలము కానరాదు. కావున బుద్ధివైశాల్యము కలిగినవారికి, ఈనదీనగరాది వర్ణనము అంతిగా ఇష్టముకాకయుండును." అని చెప్పెనని తాత్పర్యము.

కొందఱు అని యాయూవరీయుఁడనియెను. ఏమనఁగా, ఆయారసమునకు అనుగుణముగా నుండి, అనుభూయమానమగు విగుణమగు వర్థముకూడ కలదు. కాని, కావ్యములందన్ననో, సరసతనుగాని విరసతను గాని పుట్టించునవి కవివచనములే యగుం గాని, కావ్యనిబద్ధము లగు వస్తువులు ఎంతమాత్రమును కావు. అన్వయవ్యతిరేకముల చేత ఈవిషయము ఉపలభ్య మగుచున్నది.

సరిద్వర్ణనరసవత్తకు ఉదాహరణము —

శ్లో. ఏతాం విలోకయ తనూదరి తామ్రపర్ణీం
అంభోనిధౌ వివృతశుక్తి పుటోద్ధృతాని,
యస్యాః పయాంసి పరిణాహిషు హారమూర్త్యా
వామభ్రువాం పరిణమంతి పయోధరేషు.

[ఓ తనూదరీ! ఈ తామ్రపర్ణీనదిని విలోకింపుము. సముద్రమునందు విచ్చికొనియున్న ముత్తెపు చిప్పలలోఁ బడిన ఈ తామ్రపర్ణియుదకములే, స్త్రీలయొక్క వివృద్ధము లగుచున్న పయోధరములందు హారరూపమునఁ బరిణమించు చున్నవని భావము. తామ్రపర్ణీసముద్రసంగమమున ముత్తెపుజిప్ప లుండు ననియు, నందు స్వాతి వానలలోఁ గుఱియు వర్షబిందువులు ముత్తెము లగు ననియుఁ జెప్పెడి లోకోక్తి రసవత్తరముగా కూర్పంబడినది.

అద్రివర్ణన రసవత్తకు ఉదాహరణము—

శ్లో. ఏతా స్తా మలయోపకంఠసరితా మేణాక్షి రోధోభువ,
శ్చాపాభ్యాస నికేతనం భగవతః ప్రేయో మనోజన్మనః
యాసు శ్యామనిశాసు పీతతమసో ముక్తామయా శ్చంద్రికాః
పీయంతే వివృతోర్ధ్వచంచు విచలత్కంఠం చకోరాంగనాః.

[ఓ లేడికన్నులబోలినయందమైన కనులుగలదానా! ఈప్రదేశములు మలయపర్వతపు ప్రాంతములందలి నదులయొక్క దరులతోఁ గూడినవి. చూడుము. ఇయ్యవి మన్మథునికి అత్యంతము ప్రియమైన ధనురభ్యాసనికేతన

మని చెప్పందగును. ఈ ప్రదేశములందు ముత్తెములఁ బోలిన వెన్నెలలు చీఁకటులు విరియునట్లు కాయుచుండఁగా నవ్వానిని చకోరాంగనలు ముక్కులు దెఱచికొని, కుత్తుకలు తత్తరపడుచుండఁగా ద్రావుచుండు నని భావము. ఇందు మలయపర్వతవర్ణనము మిక్కిలి సరసముగాఁ గూర్పంబడుటచే నిది అద్రివర్ణనరసవత్తకు ఉదాహరణ మయ్యెను.

సాగరవర్ణనరసవత్త కుదాహరణము. —

శ్లో. ధత్తే యత్కిలికించిదైక గురుతా మేణీదృశాం వారుణీ
వైధుర్యం విదధాతి దంపతిరుషాం యచ్చంద్రికాన్తిం నభః
యచ్చస్వర్గసదాం వయస్స్మరసుహృన్నిత్యంసదాసంపదాం
యల్లక్ష్మీ రథ దైవతం చ జలధే స్తత్కాంత మాచేష్టితమ్.

ఇట్లే పురతురగాద్రి వర్ణనమునందలి రసవత్త్వమును కూడ తెలియవలయును. విప్రలంభమునందు కూడ నత్యాధికమగు రసవత్తయుండవలయును. ఇందుల కుదాహరణమ్ము.

శ్లో. విధర్మాణో భావా స్తదుపహితవృత్తే ర్న ధృతయే,
సమాపత్త్యా దస్యై విహిత విఫలౌత్సుక్య విరసాః,
ఇతః స్వేచ్ఛం పూర్వే ష్వరస మితరేభ్యః ప్రతిహతః,
క్వ హీనం ప్రేయస్యా హృదయ మిద మస్యత్ర రమతామ్.

ఇట్టులే తక్కినవానికిఁ గూడ నుదాహరణములం గూర్చుకొనవలయును.

కుకవి యగువాఁడు విప్రలంభమునం దైనను రస వత్త్వమును నిరసించుచుండును; కాని వస్తువులయందు రస మున్నను లేకున్నను, సుకవు లగుదు రేని వారివారి వాక్కులయందు మాత్రము, స్థిరముగా రసము ఉండియే తీఱును. "వస్తువుయొక్క రూపము ఏవిధముగా నైన నుండనిండు. దాన నించుకయును హాని లేదు. వక్త యొక్క ప్రకృతివిశేషమును అనుసరించియే రసవత్త్వము ప్రకాశించుచు నుండును. ఎట్లనఁగా రక్తుఁడైనవాఁడు దేనిని చక్కనిదని స్తుతించుచుండునో అద్దానినే, అనఁగా నా వస్తువునే విరక్తుఁ డగువాఁడు నిందించుచుండును. మధ్యస్థుఁడు పొగడకయును, తెగడకయు నౌదాసీన్య మును వహించుచుండును." అని పాల్యకీర్తి చెప్పెను.

ఉదాహరణము:—

శ్లో. యేషాం వల్లభయా సమం క్షణ మివ స్ఫారాక్షపా క్షీయతే,
తేషాం శీతతర శ్శశీ, విరహిణా ముల్కేవ సంతాపకృత్,
అస్మాకం న తు వల్లభా న విరహ స్తే నో భయభ్రంశినా,
మిందూ రాజతి దర్పణాకృతి రయం నోష్ణో న వా శీతలః.

[ప్రియురాలితోఁగూడి రాత్రినంతను క్షణకాలమును బోలె, వెళ్లఁగడపువారికి చంద్రుఁడు మిక్కిలి చల్లనివాఁడై యుండునని, ప్రియావిరహము గలవారికి ఆచంద్రుఁడే కొఱవినిఁబోలి సంతాపమును గలిగించునని, చెప్పుట కలదు. కాని మాకు అట్లు ఆ ప్రియురాలును లేదు ఇట్లు ఈ విరహమును లేదు. కావున [ఉభయభ్రష్టుల

మైన] మాట, ఆ చంద్రుఁడు దర్పణాకృతితో రాజిల్లు చున్నాఁడే గాని, సంతాపకుఁడుగను లేడు, చల్లనివాఁడు గను లేడు"—అని భావము.]

"విదగ్ధులగు కవులయొక్క (నేర్పరులగు కవుల యొక్క) వాక్ఛణతులచే (రీతులననుసరించి) వర్ణ్యమగు నాయా వస్తుస్వరూపము ఏర్పడునే కాని, నియతస్వభావముమాత్రము ఉండదు"—అని ఆవంతి సుందరి యనెను. ఆమె మాట లివి.—

శ్లో. వస్తుస్వభావోఽత్ర కవే రతంత్రో
గుణాగుణా వుక్తివశేన కావ్యే,
స్తువ న్నిబధ్నా త్యమృతాంశు మిందుం
నిందంస్తు దోషాకర మాహ ధూర్తః.

[అనఁగా, కావ్య విషయములో, కవికి వస్తుస్వభావము అతంత్రమై గోచరించుచుండును. అట్టి వస్తుస్వభావములు గుణాగుణములుగ నుక్తివశమున నగుచుండును. ఒక్కొక్కఁడు చంద్రుని నుతించుచు 'అమృతాంశు' వని పొగడుచున్నాఁడు. ఇట్లే ఇంకొక ధూర్తుఁడు నిందించుచు దోషాకరుఁ డని తెగడుచున్నాఁడు అని భావము.]

ఈ రెండువిధములును కూడ ఉండుట నిజమే అని యాయావరీయుఁ డనెను. పైనిఁ జెప్పిన యా వస్తు రూపములు, ముక్తకవిషయము లని, ప్రబంధవిషయము

లని రెండువిధములుగ నున్నవి. ఇట్లు రెండువిధములుగా నైన ఈవస్తురూపములు కూడ, ప్రత్యేకముగా శుద్ధము, చిత్రము, కథోత్థము, సంవిధానక భువు, ఆఖ్యానకవంతము—అని యైదేసివిధముల భేదిల్లుచు నుండును. అందు ముక్తేతివృత్తము శుద్ధము. ఇదియే విరివిగ నైనచో చిత్రము నాఁబడును. వృత్తేతివృత్తము కలది కథోత్థ మనంబడును. సంభావితేతి వృత్తముగలది సంవిధానక భువు వనంబడును. పరికల్పితమగు నితివృత్తముకలది ఆఖ్యానకవంతము అనిపించికొనును. క్రమముగా వీనికి నుదాహరణముల నీక్రింద నిచ్చుచున్నాము.

ముక్తకమునందు శుద్ధము:—

శ్లో. సా పత్యుః ప్రథమాపరాధసమయే శిక్షోపదేశం వినా,
నో జానాతి సవిభ్రమాంగవలనావక్రోక్తిచిత్రాంగతిం
స్వచ్ఛై రచ్ఛకపోలభిత్తి గళితైః పర్యస్తనేత్రోత్పలా,
బాలా కేవల మేవ రోదితి లుఠల్లోలాలకై రశ్రుభిః.

[ఆ బాలిక, తన భర్త తనయెడఁ దొట్టదొలుత నపరాధము చేసినప్పుడు, చెలికత్తెలయొక్క శిక్షోపదేశము లేకుండ, తనంతఁదాను—సవిభ్రమముగ నవయువములను త్రిప్పుట, వక్రోక్తులాడుట మున్నగునవి గల చిత్రమగు రీతిని, ఎఱుఁగనే యెఱుఁగదు. కాని స్వచ్ఛముగనైన కపోలభిత్తికలనుండి జాఱుచు, ముంగురుల నిటు

నటు కదల్చుచు రాలుచున్న స్వచ్ఛములగు నశ్రువుల తో, కేవలమును ఏడ్చినది—అని భావము.

ఇఁక ముక్తకమునందు చిత్రము:—

శ్లో. దూరా దుత్సుక మాగతే వివలితం సంభాషిణి స్ఫారితం,
సంశ్లిష్య త్యరుణే గృహీతవసనే కోపాంచిత భ్రూలతం
మానిన్యా శ్చరణా నత వ్యతికరే బాష్పాంబు పూర్ణం క్షణా
చ్చక్షు ర్జాత మహో ప్రపంచ చతురం జాతాగసి ప్రేయసి.

[ప్రియుఁడు (తనకు) అపరాధమును చేసినవాఁడై (నాయికయొద్దకు) రాఁగా, ఆమానినియొక్క (చక్షువు) కన్ను, దూరమున నున్నప్పుడు, ఉత్సుకముగను, మాటలాడించినప్పుడు, అడ్డముగఁ ద్రిప్పఁబడియును, కౌఁగిలించుకొనఁగ, ఎఱ్ఱవాఱియును, చీరయంచును పట్టుకొనఁగ, కోపాంచితభ్రూలతగల్గియును, పాదాక్రాంతుఁడు అయినప్పుడు బాష్పాంబుపూర్ణముగను నైనది. అహో! ఆ కన్ను ఎంతప్రపంచచతురమై యున్నదని తాత్పర్యము.]

ముక్తకమునందు కథోత్థము:—

శ్లో. దత్వా రుద్ధగతిః ఖసాధిపతయే దేవీం ధ్రువస్వామినీం
యస్మాత్ ఖండిత సాహసో నివవృతే శ్రీశర్మగుప్తో నృపః,
తస్మిన్నేవ హిమాలయే గురుగుహాకోణక్వణ త్కిన్నరే
గీయంతే తవ కార్తికేయనగరస్త్రీణాం గణైః కీర్తయః.

[మహారాజా! ఏహిమవత్పర్వతమునందు, శర్మగుప్తునంతటి నృపుఁడు, తనత్రోవ కడ్డమువచ్చిన ఖసదే

శాధిపతికి, ధ్రువస్వామిని యగు తన పట్టపుదేవి నొప్ప గించి పోయిన సాహసముగలవాఁడై వెనుకకు మఱలి రావలసి వచ్చెనో, గురుగుహాకోణక్వణత్కిన్నర మగు ఆహిమవత్పర్వతమునందే, కార్తికేయుని అంతః పురస్త్రీలు నీకీర్తులను సదా కీర్తించుచున్నారని భావము.]

యుక్తికమునందు సంవిధానకభువున కుదాహ రణము:—

శ్లో. దృష్ట్వైకాసన సంస్థితే ప్రియతమే
పశ్చాదుపేత్యాదరా
దేకస్యా నయనం నిమీల్య విహితం
క్రీడానుబంధచ్ఛలః,
ఈషద్వక్రిత కంధర స్సపులకః
ప్రేమోల్లసన్మానసా
మంతర్హాస లస త్కపోల ఫలకాం
ధూర్తోఽపరాం చుంబతి,

[ఏకాసనస్థితలగు ఇర్వురు ప్రియతమలనుచూచి వెనుకనుండి మెల్లఁగవచ్చి, అం దొక్కరి కన్నులను క్రీడానుబంధ మనువ్యాజమున మూసినవాఁడై, కొంచె మంత వక్రితమైన కంధరము గలవాఁడై - పులకలుగలిగి, యొక ధూర్తుఁడు ప్రేమోల్లసన్మానసయును అంతర్హాస లసత్కపోల ఫలకయు నగు (ఇతర) నాయికను ముద్దిడు కొనుచున్నాఁ డని భావము ]

మఱియును నెట్లన గా—

శ్లో. కుర్వత్యా కుంకుమాంభః కపిశితవపుషం

యత్తదా రాజహంసీం

క్రీడాహంసో మయా సా రజని విరహిత

శ్చక్రవాకీభ్రమేణ

తస్యైత త్పాప్మనో మే పరిణమతి ఫలం

యత్పురే ప్రేమబంధా

దేకత్రావాం వసావో న చ దయిత దృశా

ఉప్యస్తి నౌ సన్నికర్షః.

[నేను తొలుత ఆ యాడురాజహంసమును కుంకుమాంభఃకపిశితశరీరనుగా చేయుటచేత, ఆ మొగహంసము చక్రవాకి యను భ్రాంతితో దానిని వదలిపోయి విరహము ననుభవించుట గల్గెను. ఆపాపమే ఇట్టులు ఫలించి, ఇట్లు-మనము ఒక్కపట్టణమునం దున్నను చూపులతో నైనను-మనకు సాంగత్యము లేకుండఁగాఁ జేసినదని భావము.]

ఆఖ్యానకవంతమున కుదాహరణము:—

శ్లో. అర్థిజనార్థధృతానాం వనకరిణాం ప్రథమకల్పితై ర్దశనైః,
చక్రే పరోపకారీ హైహయజన్మా గృహం శంభోజః.

ప్రబంధశుద్ధమున కుదాహరణము—

శ్లో. స్తిమితవికసితానా మల్లసద్భ్రూలతానాం,
మసృణముకులితానాం ప్రాంత విస్తారభాజాం,
ప్రతినయననిపాతే కించి దాకుంచితానాం,
సుచిర మహ మభూవం పాత్ర మాలోకితానామ్.

ప్రబంధచిత్రమున కుదాహరణము—

శ్లో. అలసవలిత ముగ్ధస్నిగ్ధనిష్పంద మందై,
రధికవికస దంతర్విస్మయస్మేరతారైః,
హృదయ మశరణం మే పక్ష్మలాక్ష్యాః కటాక్షైః,
అపహృత మపవిద్ధం పీత మున్మూలితం చ.

ప్రబంధశ్లోత్రమున కుదాహరణము—

శ్లో. అభిలాష ముదీరితేన్ద్రియః,
స్వసుతాయా మకరోత్ప్రజాపతిః,
అథ తేన నిగృహ్య విక్రియా,
మభిశస్తః ఫల మేతదన్వభూత్.

ప్రబంధసంవిధానక భువున కుదాహరణము—

శ్లో. క్రోధం ప్రభో! సంహర సంహరేతి,
యావద్గిరః ఖే మరుతాం చరంతి,
తావత్స వహ్ని ర్భవనేత్రజన్మా,
భస్మావశేషం మదనం చకార.

ప్రబంధాఖ్యానవంతమున కుదాహరణము—

శ్లో. పత్యు శ్శిరశ్చంద్రకళా మనేన,
స్పృశేతి సఖ్యా పరిహాసపూర్వమ్,
సా రంజయిత్వా చరణౌ కృతాశీ
ర్మాల్యేన తాం నిర్వచనం జఘాన.

[చెలికత్తె యొకతె పార్వతీపాదములకు లత్తుక పెట్టి పిమ్మట పరిహసించుచు (ఈ పాదముతో) దీనితో నీభర్త తలపైఁగల చంద్రకళను స్పృశింపుమని ఆశీర్వ

దింపఁగా, ఆచెలికత్తెను పార్వతి, బదులు పలుకక యే పుష్పమాలికతోఁ గొట్టిన దని భావము.]

మఱియును సంస్కృతము నందువలెనే సమస్తభాషలయందును, తనశక్తికిఁ దగినట్లును తన యభిరుచికి తగిన రీతిని (కౌతుకము ననుసరించియును) పరిశ్రమనొనర్చిన వాఁడై యుండవలయును. శబ్దములకును తదర్థములకును గల అభిధానాభిధేయవ్యాపారసంబంధమును చక్కఁగా నెఱిఁగి యుండఁగా వలయును. ఇట్లు పెద్దలనిరి:—

శ్లో. ఏకోఽర్థ స్సంస్కృతోక్త్యా స సుకవిరచనః
ప్రాకృతే నాఽపరోఽస్మిన్
అన్యోఽపభ్రంశగీర్భిః కి మపర మపరో
భూతభాషాక్రమేణ,
ద్విత్రాభిః కోఽపి వాగ్భి ర్భవతి చతసృభిః
కిం చ కశ్చి ద్వివేక్తుం,
యస్యేత్థం ధీః ప్రసన్నా స్నపయతి సుకవే
స్తస్య కీర్తి ర్జగంతి.

“సంస్కృతోక్తితో నొక్కటే ప్రధానార్థము గలుగునట్లుగ నుండునది నొకవిధమగు సుకవిరచనము. ప్రాకృతముతో, ఆశ్లోకమునందే రెండవయర్థము గలుగునట్లుగ నుండునది మఱొక్కవిధమగు రచనము. ఇట్లే మఱియుఁ బెక్కువిధముల అపభ్రంశభాషోక్తులతో నింక నొకయర్థము గలుగునట్లుగను, పైశాచీభాషచేత వేఱొకయర్థము గలుగునట్లుగను, ఈరీతిని, రెండేసి, మూఁడేసి

నార్థేసి, భాషాశబ్దములతో నర్థవివేచనచేయుటకు ఒక్కొక్క మహానుభావుఁడు ప్రయత్నించి ఫలసిద్ధి నొందుచున్నాఁడు. ఈతీరున ప్రసన్నమైన బుద్ధిగలవాని కీర్తి సర్వలోకములందును వ్యాపించును. అనఁగా నీతీరున ఘనార్థములచేత వ్యుత్పన్నుఁడైనచో అట్టి కవియొక్క వాణి దుర్గమమార్గములనైనను కుంటుపడ జాలక నిరర్గళమై కీర్తిదాయిని యగుచున్నదని భావము.

ఇది రాజశేఖరుని కావ్యమీమాంస యనెడి కవిరహస్యమునందు
అర్థానుశాసనము నర్థవ్యాప్తి యనెడిది
నవమాధ్యాయము.

# రాజశేఖరకవి కావ్యమీమాంస.

---

## దశమాధ్యాయము.

---

### కవిచర్య - రాజచర్య.

[ఈ యధ్యాయమునందు వచ్చెడివిషయములు:—౧. నామపారాయణము ధాతుపారాయణము మున్నగాఁగల కావ్యవిద్యలయును, కావ్యమాతృకలయును పరిగణనము ౨ ఔచిత్యానుశీలనము కవికి ఆవశ్యకము లని చెప్పుట, ౩ కవినివసించు గృహము, అతని పరిచారికాపరిచారకాదులు, మిత్రులు, నిపుణులగు లేఖకులు మున్నగువాని స్వరూపస్వభావస్థిత్యాదులను వర్ణించుట. ౪. కవియగువాని యింటి యందుండఁదగిన భాషానియమములు. ౫. శిశునాగుఁడు. కువిందుఁడు, శాతవాహనుఁడు, సాహసాంకుఁడు, మున్నగాఁగల ప్రాచీనులగు రాజులు తమతమ భవనములఁ దేర్పఱచికొనిన భాషానియమములు వివరించుటం, ౬. కవియొక్క అహోరాత్రిక మగు (అనఁగా పగలు రాత్రులు చేయఁదగిన) కృత్యము విన్నవించుట. ౭ కవులలోఁగల అసూర్యంపశ్యాదిభేదముల పరిగణనము. ౮. వానిలక్షణములు. ౯. అందులకు నుదాహరణములఁ జూపుట. ౧౦ పురుషులవలెనే స్త్రీలును కవులుగాఁ గాఁగల్గుట. ౧౦. సంసిద్ధమైన కావ్యమునకు అనేకములగు ఆదర్శములను (నకళ్లు-లేకప్రతులు-కాపీలు) సిద్ధముచేయవలసి యుండుటలు-౧౧. ప్రస్తావసందర్భమున కవికావ్యములు నశించుటకుఁగల కారణములు. ౧౨. రాజుయొక్క కవిసమాజములను వర్ణించుటలు·

౧౩ కావ్యశాస్త్రపరీక్షణములు. ౧౪ అందులకై మహానగరములందు బ్రహ్మసభలు చేయించుట మున్నగు మానవస్మ ప్రయత్నకములు, ౧౫. అందు బ్రహ్మరథాది సత్కారములు-మొ.]

---

విద్యలను ఉపవిద్యలను నేర్చిన పిమ్మట కావ్యరచన మునకై యత్నింపవలయును. నామపారాయణ ధాతుపారాయణములు అభిధానకోశము ఛందోవిచితి, అలంకార శాస్త్రము-ఇవి కావ్యవిద్యలు. చతుష్షష్టిరూపమున నున్న విద్యలు. కళలు కావ్యవిద్యలును కళలును-సుజనోపజీవ్య మగు కవిసన్నిధియు -దేశవార్త. విదగ్ధులతోడి కావ్యశాస్త్రవిషయకములగు చర్చలను; గుఱించిన వివాదము - లోకతంత్రము, విద్వద్గోష్ఠులు, ప్రాచీన కవుల గ్రంథ రాజములు, ఇయ్యవి కావ్యమునకు అనఁగా సరసమగు కావ్యరచనము సేయుటకై మాతృకలవంటివి. అనఁగా మూలాధారము లని యర్థము. ఇంతియకాక, తగినంత స్వాస్థ్యము ప్రతిభాభ్యాసము భక్తి విద్వాంసులతోడి గోష్ఠి బహుశ్రుతత్వము స్మృతి దార్ఢ్యము-అనిర్వేదము; అను నివి యెనిమిదియును కవిత్వమునకు మాతృకల్పములు. అనఁగా తల్లులం బోలినవి.

ఇంతియగాక, కవి ఎల్లప్పుడును శుచియై యుండవల యును. వాక్శౌచ మొకటి, మనశ్శౌచ మని కాయశౌచమని శౌచము ముత్తెఱఁగులు. అందు మొదటి రెండును శాస్త్రాభ్యాసమున సిద్ధించును. మూఁడవది అనఁగా కాయశౌచ

మనునది లౌకికము. ఈ శారీర శుచిత్వమునుగూర్చి ఇట్లు చెప్పిరి. కాళ్లలో వ్రేళ్లలో, అసహ్యముగా నుండనట్లుగా, గోళ్ళను కత్తిరించి శుభ్రము చేసికొనుట, సర్వదా తాంబూల సేవనము చందనలేపనము చేసికొనుట అమూల్య వస్త్రధారణము పుష్పధారణము అనునవి కవియొక్క శారీరశుచిత్వమునకు లక్షణములు. కవికి ఈ బాహ్యశుచిత్వాడంబరముతో నేమిపని యందు రేని, శుచి శీలనములే, అనఁగా, (పరిశుద్ధతతో నుండుట సచ్ఛీలనము గల్గియుండుట అను నీరెంఁడును) సరస్వతి కావాసకారణ మని పెద్దలు పల్కుదురు. కవిస్వభావము ననుసరించి కావ్యము నుండును. ఎల యనఁగా-"యాదృశాకారశ్చిత్రకార స్తాదృశాకారమస్య చిత్రం"—అని, చిత్రకారుని ఆకారానుసారమే అతని చిత్తరువులు గూడ నుండు నని సామెత. స్మితపూర్వా భిభాషణము-అన్నియెడలను సాభిప్రాయముగను, గంభిర ముగ సంభాషించుట, సర్వతోముఖమగు తత్త్వ జిజ్ఞాస పరకావ్యదూషణ మొనర్పక యుండుట, అభిహితమైనచో యథార్థకథనము (అనఁగాఁ దనసంభాషణలలో సత్యము ను మఱుఁగుపఱచక వెల్లడింపఁగల్గుట) అను నివి కవికి ఉండవలసిన ముఖ్యములగు లక్షణములు.

కవి నివసించుగృహము, సుసమ్మృష్టమై (అనఁగా ముఱికి చేరకుండునట్లు గచ్చుచేసికాని, అలికిగాని అంద ముగా నుండునట్లు చేయఁబడినదై,) ఋతుపట్కోచిత

వివిధస్థానములు గలదై [ఆయా ఋతువులందలి అత్యుష్ణాతిశైత్యాది బాధలం దొలఁగించుకొనుట కనువైన ప్రదేశములు ప్రత్యేకముగా నేర్పరింపఁబడినవై,] వృక్షవాటి, క్రీడాపర్వతకము నడబావి పుష్కరిణి నదీసముద్రావర్తక కుల్యాప్రవాహాదులు, నెమళ్లు లేళ్లు తీతువుపిట్టలు సారసములు చక్రవాకములు రాజహంసలు చకోరములు క్రౌంచములు కురరములు చిలుకలు గోరువంకలు మున్నగువానిచే విరాజిల్లుచు, ఘర్మక్లాంతిని (వేసవినింగల్గు నెండబాధను,) పోగొట్టఁజాలినదియై – ధారాయంత్రములు భూగృహములు, గృహయంత్రములు లతామండపములు, డోలికాప్రేంఖణములు మున్నగు వానిచేత నొప్పుచు నుండవలయును కావ్యనిర్మాణ సమయములందు గలిగెడి ఖేదమును బో నడంచుటకై ఆజ్ఞామూకపరిజనముగ గాని, అనఁగా ఆతఁడు కోరినదానిని నిశ్శబ్దముగా తెచ్చియిచ్చెడి సేవకులు గలదియై గాని, లేదా ఇతరు లెవ్వరును లేకుండ నుండు విజనముగఁ గాని, ఆతఁడు కూర్చుండు తావు ఉండవలయును. పరిచారికలు అపభ్రంశభాషాప్రవీణలు గాను, పరిచారకులు మాగధభాషాభినివేశముగల వారుగను ఉండవలయును, ప్రాకృత సంస్కృత భాషల నెఱిఁగిన అంతఃపురస్త్రీలును సర్వభాషావేత్తలగు మిత్రులును ఈయన సన్నిధానమున నుండవలయును. సభాసంస్కార విశుద్ధికై గాని, సద్యస్సంస్కార విశుద్ధి కొఱకుఁగాని సర్వభాషా కుశలుఁడును శీఘ్రవాక్కు గ

వాఁడును చక్కనియుచ్చారణ గలిగి, సొగసైన ముద్దులు గులుకుఁ వ్రాఁత వ్రాయఁగలవాఁడై, కవి హృద్గతాభిప్రాయము నెఱింగి నానాలిపిజ్ఞుఁడై కవియై లాక్షణికుఁడై యుండు లేఖకుఁడు నొక్కఁడు సన్నిధానవర్తిగాఁ గావలయును. అట్టివాఁడు దొరకనియెడల నైనఁ జెప్పిన లక్షణములలో నేదో యొకటి కలవాఁడైనను యుత్తమమే యగును. కవిరాజగువాఁడు, తన యింటిలో భాషానియమము నేర్పఱచికొని యుండవలయును. ఏలయనఁగా ప్రభువు ఎట్టి పనిని చేయుచుండునో, సేవకుఁడును అట్లే చేయుచు నుండును గదా!

[ఈ విషయమునందుగల ప్రాచీనాచారముల నెఱిఁగించెదము.]

పూర్వము మగధదేశపు రాజగు శిశునాగుఁడు, అనువాఁ డుండెను. ఆయన యుచ్చారణము నందు కష్టము గల్గించు నెనిమిది వర్ణములను భాషనుండి తొలఁగించి మాట్లాడునట్లు, తన యంతఃపురమందు నియమము చేసికొనెనని తెలియుచున్నది.

ఆతొలఁగించిన ఎనిమిది అక్షరము లేవి యనఁగా:—టకారాదులగు నాలుగు మూర్ధన్య వర్ణములును తృతీయవర్ణవర్జములగు నూష్మవర్ణములు మూఁడును, క్షకారమొకటియు నై యున్నవి. అనఁగా ట ఠ, డ ఢ, శ, ష, హ, క్ష అను నెనిమిదింటిని తొలగించి మాట్లాడు నియమమును చేసికొనె నని భావము. ఇట్లె శూరసేన దేశము

నందు కువిందుఁ డనురాజు ఒకఁ డుండెను. ఆతనిచే పరుష
వర్ణములును సంయోగాక్షరములును లేకుండునట్లుగా-అ
నఁగా నావర్ణములను తొలఁగించి, తన యంతపురమున
మాట్లాడునియమము నేర్పఱచికొనె నని మఱియొక కథ
కలదు. ఉజ్జయినిరాజగు సాహసాంకుడు తన అంతఃపుర
మునందు సంభాషణకాలమున సంస్కృతభాషానియమ
మును చేసికొనె నని కుంతలరాజగు శాతవాహనుఁడు
నిట్లే తనయంతఃపురమునందు సంభాషణకాలమున ప్రా
కృతభాషానియమమును చేసికొనె నని పెద్దలవలన విం
దుము. ఇవి కొన్ని ప్రాచీనకాలపు భాషావ్యవహారములు.
మఱియును కవికి పలక బలపము కల యొక సంపు
టికయును, రంగులు మున్నగువానిని సేకరించి యుంచిన
యొకచిన్ని బరిణె, లేక పెట్టెయును, గంటము కలము
సిరాబుడ్డి మున్నగు వ్రాఁతపరికరములును, తాటియాకు
లు లేక భుజపత్రపుపట్టెలు నానారకము లగు గంటములు
నారసములు మున్నగు లేఖన సామగ్రితోఁగూడిన తాళీ
దళ సంపుటములును, చక్కఁగా నున్ననగునట్లు వర్ణము
వేయుంబడి పాలగచ్చుచేసిన మంచిగోడలును, ఎల్లప్పుడును
దాపున నతనికి సుసిద్ధముగా నుండవలయును. ఇదియే
కావ్యవిద్యాపరికర మని ఆచార్యులు అనిరి. ప్రతిభ యొ
క్కటియే పరికర మని యాయావరీయుఁడు చెప్పెను.

కవి ముందు తన్నుంగూర్చి తానే ఇట్లు వితర్కిం
చుకొనవలయును:— నాకుంగల శాస్త్రవిద్యాదిసంస్కా

రమెంత? ఏభాషలోఁ గవితఁ జెప్పఁగల సామర్థ్య మున్నది? లోక మెట్టివిషయములలో నభిరుచి కలదిగా నున్నది? ఎట్టి పరివృఢము గలవాఁడను? అనఁగా నెట్టిపరిస్థితులతో నావరింపఁ బడి యున్నాఁడను? ఎటువంటి గోష్ఠిలో పేరు పొందితిని? గ్రంథముఁ జేయ నుద్దేశించినవారి చిత్త మెచట నాకర్షింపంబడు చున్నది? అని ఆలోచించి నిశ్చయించుకొని, పిమ్మట ఏదో యొకభాషను కవిత్వముఁ జెప్పుటకై స్వీకరింపవలయు నని ఆచార్యులమతము. ఏకదేశమునఁ గవిత నల్లఁగల యట్టి కవికిని ఈ నిబంధనము గాని, స్వతంత్రుఁడగు కవికి అన్నిభాషలును ఒక్కభాష వలెనే సమానములే అని యాయావరీయుఁడు. మఱియు నయ్యై దేశ భేదములను బట్టి, భాషాశ్రయణపగతలును భేదించుటకలదు. ఎట్లందురా—చూడుఁడు:—

శ్లో. గౌడాద్యాః సంస్కృతస్థాః పరిచితరుచయః
ప్రాకృతే లాటదేశ్యాః,
సాపభ్రంశప్రయోగాః సకలమరుభువ
ష్టక్కభాదానకాశ్చ,
ఆవంత్యాః పారియాత్రాః సహ దశపురజై
ర్భూతభాషాం భజంతే,
యో మధ్యే మధ్యదేశం నివసతి స
కవిఃసర్వభాషానిషణ్ణః.

గౌడాదులు సంస్కృతభాషాప్రియులు. లాటదేశీయులకు ప్రాకృత మనిన నభిరుచి మెండు. మరు దేశస్థులందరకు, టక్కభాదాన దేశీయులకును, అపభ్రంశ భాష మి

క్కిలి యిష్టము. అవంతి పారియాత్ర దశపురిము మున్న గు దేశములవారు పైశాచికభాషనే మిక్కిలియుఁ బ్రియతరముగాఁ జూతురు. మధ్యదేశవాసులకు సర్వభాషలందును అభినివేశ ముండును.

శ్లో. జానీయా ల్లోకసామ్మత్యం కవిః కుత్ర మ మేతి చ
అసమ్మతం పరిహరే త్మతేఽభినివిశేత చ,
జనాపవాద మాత్రేణ న జుగుప్సేత చాఽఽత్మని
జానీయా త్స్వయ మాత్మానం యతో లోకో నిరంకుశః

కవి, కవనము చెప్పఁ నప్పుడు లోకసామ్మత్యము నెఱింగి తనదగు వృత్తన ర్తిష్యమాణములగు స్థితిగతులను గుర్తించి అసమ్మతమగు దాని బరిహరించి, సమ్మతమైనదానియందు నభినివేశము గల్గి వర్తింపవలయును. నిర్దుష్ట మగు విషయములను జనాపవాదమునకు జడిసి, విడిచి పెట్టగారాదు. తన్ను తానే విమర్శించి తనయందు గల దోషాదోషాదులం గూర్చిన నిజ మెఱుంగవలయు. ఎదుట లేకున్న [అనఁగా మృతినొందిన, లేకున్నచో దేశాంతరగతుఁడైన] కవిసూక్తిని గానము చేయుటయును, దేశాంతరమున నన్ను నుతించుటయును, ఆతఁడే తమయెదుట నుండుచో నిందించుటయును అనునిది సనాతనముగా వచ్చుచున్న నిరంకుశమగు లోకధర్మము. ప్రత్యక్షకవి కావ్యమును కులస్త్రీయొక్క రూప సంపదయు, గృహవైద్యుని వైద్య విద్యయును, సాధారణముగా రుచింపవు. ఒకవేళ రుచించినచో, ఎవ్వరికో ఒకనికే రుచించును. తాను నిరంతరముగా పరోక్షులను హరించుటయుఁ దాసక్తి చూపుచు

నుండిన వాఁడై సమస్తరత్నాకరత్వమును-(అనఁగా రత్న ములలాంటి అమూల్య రచనలు చేయుటలో ప్రఖ్యాతిని) బొందియున్న కవులను తానును కవిత్వరచన చేయఁగల నన్న పేరుతో, నిందించుట ఆలోచించితి మేని మిక్కిలి నవ్వుగలిగించుచున్నది. కవులయొక్క జాతిమతనీత్యా దులతో నిమిత్త మక్కఱలేకుండ నెవ్వరు చెప్పినను ఎట్లు చెప్పినను వారి రచనము సజ్జనుల కెల్లరకు స్వాదగు వాక్యము అయినచో సేవ్యమే అగును. ఒకవేళ అంతయు స్వాదువుగా లేకున్నను, కొలఁదిపాటి స్వాదుత్వమున్నను అది కౌతుకమున సేవ్యమే యగుచున్నది. అయినను, పిల్లలు ఆడువారు హీనజాతివారు మున్నగువారి కవిత్వము ఒక నోటినుండి మఱియొక నోటికి సులువుగా వ్యాపిం చును. మఱియును కార్యాయత్తులైన సన్యాసులు రాజులు మున్నగువారి కావ్యము తక్షణమే ఒక్కరోజుననే దశ దిశలకు వ్యాపింపఁ గల్గును. తండ్రి, గురువు, ప్రభువు, కొడుకు, శిష్యుఁడు, పదాతి అను వీరు చేసిన కావ్య రచ నలను గుణాగుణవివేచన చేయకయే లోకు లెల్లరు నాద రమున స్తుతించుటయును పఠించుటయును కూడ ప్రపంచ మునకు స్వాభావికమై యున్నది.

"సగము కూర్చిన రచనను లోకులయెదుట పఠింప రాదు, ఇందులకు ఫలము అది సమాప్తినొందకుంటయే" అనునది కవుల రహస్యము. తాను అపూర్వముగా రచిం చిన నవీనరచనమును ఏకాకి యెదుట చదువరాదు. అ ట్లు చదివినచో, వాఁడు అది తనదే యని వాదింప కొర

కొని, తనదని స్థాపించుకొనుటయును సంభవించును. తన కవితను తానే పొగడికొనరాదు. స్వకవితాభిమానము తనరచనలోఁగల గుణదోషములను విమర్శింప నీయదు. కవి గర్వపడరాదు. గర్వము ఇసుమంతయైనను సర్వ సంస్కారములను నశింపఁజేయును, అట్లైన మఱి తన కృతి వెల్లడియగుట యెట్లుందురేని, తన కృతిని నితరుల ద్వారా పరీక్ష చేయింపవలయును. ఇట్లు చేయించినను వెల్లడి కాకుండుటయుం గలదు. ఏమనఁగా కొన్నొక్క మాఱు అట్లు పరీక్షించినను ఆపరీక్షకుఁడు ఉదాసీనుండై యున్నచో, అయ్యది తగినంత ఫలమిచ్చునది కాదని పెద్దలందురు. కనుకఁ బరీక్షకుని మెప్పింపఁ బ్రయత్నించి, గుణదోషముల నెఱుంగఁదగును. ఇట్లు చేయునప్పుడు పరీక్షకునకు తానే కవి నను నభిమానమున్నచో నట్టి పరీక్షకుని ఛందోనువర్తనమున [అనఁగా నాతని యభిప్రాయమున కెదురాడక) రంజింపఁగాఁ జేయ వలయును. ఇట్లైనను మెచ్చని కవిమ్మన్యునెదుట సూక్తి పఠనము అరణ్యరోదనమై ఉపద్రవించును. ఇట్లే యనిరి.—

శ్లో. ఇదం హి వైదగ్ధ్యరహస్య ముత్తమం
పఠేన్న సూక్తిం కవిమానినః పురః,
న కేవలం తాం న విభావయ త్యసా
వ్యకావ్యబంధేన వినాశయ త్యపి.

[కవిమాని యెదుట సూక్తిపఠము చేయకుండుటయే సుమా నేర్పనఁగా! ఆకవిమాని ఈసూక్తిని కని తనదిగా

భావించుకొనుట మాత్రమేగాదు. పైగా, తన గ్రంథము లోఁ చేర్చి నిర్మూలము గూడ చేయును. అనిభావము.]

కవితారచనము సేయునప్పుడు కాలనియమములు లేని వర్తనములు విరోధించును. కనుక కవి తన కవితారచనమును నిర్విఘ్నముగా సాగించికొనుటకై, పగటిని రాత్రిని యామక్రమమున నాల్గుగా భాగింపవలయును. కవి యగువాఁడు ప్రాతఃకాలమున నిదురలేచి సంధ్యాపూజాదులను నిర్వర్తించినవాఁడై సారస్వత సూక్తమును పారాయణము చేయవలయును పిమ్మట విద్యాపరిశ్రమగృహమునందు సుఖముగాఁ గూర్చుండి కావ్య విద్యల నుపవిద్యలను జాము ప్రొద్దగు వఱకును చింతన చేయవలయును. ఈచింతనముతో సమానమైన ప్రతిభాహేతు వగు నూత్న సంస్కారము మఱియొక్కటి లేనే లే దందురు పిమ్మట రెండవ యామమున, కావ్యరచనాకార్యము నొనర్పవలెను. మధ్యాహ్నము సమీపింపఁగనే చక్కఁగా స్నానము చేసికొని, దేహప్రకృతి కవిరుద్ధముగ భుజింపవలెను భోజన మైన పిమ్మట మఱల కావ్యగోష్ఠిని చేయవలయును. ఇట్లు చేయునప్పుడు ఒక్కొక్కప్పుడు ప్రశ్నోత్తరరూపమునను సమస్యాదులలోని చిక్కును విడదీయవలయును. ఆతరువాత, కావ్యసమస్యాధారణ, మాతృకాభ్యాసము చిత్రబంధములు" అనునివి మూఁడవజాము వెళ్లువఱకును నభ్యసింపఁదగినవి. నాల్గవ యామమున నొంటరిగాఁగాని నల్వురను విజ్ఞులను పరిమత్తుగాఁ జేర్చికొని గాని, తాను పూర్వాహ్ణమున వ్రాసినదానిఁ బరీక్షించుకొనవలయును.

ఏల యనంగా, ఎంతటి సుకవి కేనియు, రసావేశమున కావ్యమును రచనసేయునపుడు గుణదోష వివేచనదృష్టి యుండఁజాలదు. కనుక ఎప్పటిరచనము నప్పుడు వెంట వెంటనే పరీక్షించుకొనవలయును. ఈ పరీక్షలో, తనరచనలోఁగల అధికార్థముల త్యాగమును న్యూనార్థముల పూరణమును అన్యథాస్థిత మగు దాని పరివర్తమును, మఱచి కూర్పనిదానిని జ్ఞప్తికి తెచ్చుకొని కూర్చుటయును అప్పుడు చేయఁ దగు కృత్యములు. పిమ్మట సాయంకాలము కాఁగానే లేచి, సాయంసంధ్యను, సరస్వతిని ఉపాసింపవలయును. ఆతరువాతఁ బ్రదోషముగడచు పర్యంతము, పగలు పరీక్షించిన కవిత్వమును శుద్ధముగ వ్రాసికొనవలయును. పిమ్మట స్వాభిలాష తీఱునట్లు ఉచితరీతిని స్వస్త్రీసేవనము చేయఁదగును. [అనఁగా రమింపందగు నని భావము] అటుపైని ద్వితీయ తృతీయయామము లందు చక్కఁగా నిద్రింపవలయును. చక్కఁగా నిద్రించుటవలన శరీరమునకు పరమారోగ్యము కలుగును. ప్రయత్నపూర్వకముగానైనను నాల్గవయామమున లేవవలయును. బ్రాహ్మముహూర్తమున మనస్సు నిర్మలమై యుండి, ఎంత దురధిగమములుగా నున్నను, ఆయా విషయములందు ప్రవేశించి, వానినిఁ లోఁగొనఁగలదు. ఇది కవితా రచనము సేయునట్టి సుకవు లాచరింపందగిన యహోరాత్రిక మగు కవిజనకృత్యము

కవులలో-అసూర్యంపశ్యులు- నిషణ్ణులు- దత్తావసరులు, ప్రాయోజనికులు-అనినాలుగు తెఱఁగులు కలరు.

మహాగుహాగర్భములు భూగృహములు మున్నగు వానిని ప్రవేశించి నియమముగా నైష్ఠికవృత్తితోఁ గవిత్వము చెప్పెడివారు అసూర్యంపశ్యులు. వీరికి పైని చెప్పిన విధమైన కాలనియమ మేదియును లేదు. నైష్ఠికవృత్తితోఁ, గావ్యక్రియయం దభినివిష్టులై కవనము చెప్పువారు నిషణ్ణులు. అనఁగాఁ గేవలము కావ్యరచనకే కూర్చున్నవా రని భావము. వీరికిని కాలనియమము లేదు. సేవాదు లగు నితరకార్యములను చేసికొనుచు కవిత్వము నల్లువానినే దత్తావసరుఁ డని యందురు. అట్టివానికిఁ గవితారచన సేయుటకై కొన్ని సమయములు మాత్రమే నియమితములు. అందు—రాత్రిలోని నాల్గవయామార్ధము ఒకటి అదియే సారస్వతముహూర్త మనఁబడును. భోజన మైన పిమ్మట నగుశయనము స్వాస్థ్యము నలవఱచును. ఆర్తి [అనఁగాఁ గాయబాధ] నివృత్తియైన పిమ్మట వ్యాయామును విరమించుట - ఏకాగ్రాయతనము- యాప్యయానయాత్ర-వీనిని చిత్ర ప్రణిధానమునకై ఆచరింపఁదగును. విషయాంతర వినివృత్తమగు చిత్తమును ఎచ్చటఁ బ్రవేశపెట్టిన నచ్చట గూడా శీఘ్రాయముగా ప్రవేశించును. తనకు, క్షణికత-అనఁగా మనోల్లాసము తోఁచినప్పు డెల్లను కవితా నిర్మాణమునకు సమయమే యగును. ప్రస్తుత మేదో యొక విషయమును గుఱించి మాత్రమే, అనఁగా నిరంతరముగాఁ రచన సేయక ఎప్పుడేని తటస్థపడిన ఏదో యొక విషయమును గుఱించి మాత్రమే కవనమల్లువారు ప్రాయోజనికులు.

వీరికి ప్రత్యేకప్రయోజనము ననుసరించియే కాలవ్యవస్థయు నుండును. బుద్ధిమదహార్యబుద్ధుల కిర్వురకును ఇదే నియమావళి. ఔపదేశికునకు అతని ఇచ్ఛానుసారముగ నన్నియును కాలములే అన్నియు నియమములే యగును.

పురుషులవలె స్త్రీలును కవులు కావచ్చును. సారస్వత సంస్కారము ఆత్మనిష్ఠ మగునే గాని, అయ్యది స్త్రీపురుష వివక్ష నొనర్పదు. రాజపుత్రికలు- మహామాత్యసుతలు- గణికలు- కౌతుకవంతులగు వారి భార్యలు- మున్నగువారు అనేకులు శాస్త్రప్రహతబుద్ధులై కవయిత్రు లుండిరని వినియును న్నాము. ప్రస్తుతము ప్రత్యక్షముగాఁ గనుచు నున్నాము. ఈరీతిని ప్రబంధము సిద్ధమైనపిమ్మట వానికి ప్రతుల ననేకముగా వ్రాసి యుంచవలయును, అందులకు కారణము ఏమనఁగా, పెద్దలు ఇట్లనిరి.—నిక్షేపము-విక్రయము-దానము-దేశత్యాగము అల్పజీవిత-విచ్ఛేదము-అగ్నిప్రమాదము- జలప్రమాదము అనునివి ప్రబంధోచ్ఛేదమునకు కారణములు. మఱియును, ఇట్లె దారిద్ర్యము-వ్యసనాసక్తి-అవజ్ఞ-దురదృష్టము-దుష్టవిశ్వాసము-శత్రుమైత్రి-అను నియ్యవి కావ్యమునకు మహాపదలు. ఇవి మాత్రమే గాక, ఎప్పుడో ముగింతము, సంస్కరింతము, స్నేహితులకు విన్పించి విమర్శింతము అను నిత్యాది గ్రంథకర్తృవ్యాకులీ భావమును, రాష్ట్రోపప్లవములును ప్రబంధనాశమునకుం గారణములే యగును. అహర్నిశావిభాగము నొనర్చి ఇట్లు కవనముఁ జెప్పు విద్వాంసుని యొక్క కృతి, ఏకావళీ

హారమువలె సజ్జనుల కంఠములందు సర్వదా విరాజిల్లఁ గలదు. కవికి గల అభియోగసంస్కారములలోఁగల పట్టుదల వన సాంబంధియే, ఆయాప్రబంధములకు తారతమ్యము లేర్పడుచుండును. ముక్తకముఁ జెప్పంగల కవు లనంత ముగ నుందురు. కాని సంఘాతముసుఁ జెప్పవాగు సూర్గురు మాత్రమే. అందునను మహాప్రబంధనిర్మాతలఁ గాఁ గల కవులు ఏఒకరో యిద్దరో మాత్రమె యుందురు. ముగ్గురు అత్యంతము దుర్లభులు.

ఈ విషయమునఁ బెద్దలిట్లు చెప్పిరి:—

అత్రాహస్మ:—

శ్లో. బహ్వాపి స్వేచ్ఛయా కామం ప్రకీర్ణ మభిధీయతే,
అనుజ్ఝితార్థసంబంధః ప్రబంధో దురుదాహరః.

శ్లో. రీతిం విచింత్య విగణయ్య గుణా న్విగాహ్య
శబ్దార్థసార్థ మనుసృత్య చ సూక్తిముద్రాః.
కావ్యే నిబంధవిషయే విదుషా ప్రయత్నః
కే పోతయంత్రరహితా జలధౌ ప్లవంతే?

శ్లో. లీఢాభిధోపనిషదాం సవిధే బుధానాం,
అభ్యస్యతః ప్రతిదినం బహుదృశ్వనోఽపి,
కించి త్కదాచన కథంచన సూక్తిపాకాత్
వాక్తత్త్వ మున్మిషతి కస్యచి దేవ పుంసః.

శ్లో. ఇత్యనన్యమనోవృత్తే ర్నిశ్శేషేఽస్య క్రియాక్రమే.
ఏకపత్నీవ్రతం ధత్తే కవే ర్దేవీ సరస్వతీ.

శ్లో. సిద్ధి స్సూక్తిషు సా తస్య జాయతే జగదుత్తరా,
మూలచ్ఛాయాం న జానాతి యస్యా స్సోఽపి గిరాం గురుః

స్వేచ్ఛఁగ, ఇటునటు ప్రకీర్ణముచేసి కవితం జెప్పఁదగునే గాని, పూర్వోత్తరములకుంగల యర్థసంబంధము చెడనట్లు చెప్పుట ఎంతటివారికి నేని, చాలకష్టము. కీర్తిని చక్కఁగా నాలోచించి గుణములను తూఁచి సరిజేసికొని, శబ్దార్థములను వానివాని యౌచిత్యము చెడనట్టులుగాఁ జూచికొని, సుభాషితములను వివేచించి, ప్రబంధమును గూర్చుచుటకై యత్నము సేయందలంపవలయును. ఇట్టియత్నము లేనివాఁడు వ్యర్థత నొందును. లోకమున సముద్రము నీఁదఁదలచినవారు మున్ముందుగా వలయు సాధనముల నలవఱచికొని ప్రయత్నింతురే కాని ఎవ్వరైనను తెప్పకొయ్య మున్నగునవి లేకయే సముద్రము నీఁదఁగల్గుదురా? కనుక ఆయా శబ్దార్థముల యభిధాది సారస్వతమగు ఉపనిషత్సారము నెఱింగిన విబుధసన్నిధిని ప్రతిదినము నిట్లు కావ్యవిద్యాభ్యాసముఁ జేయునట్టి వారిలో, బహుదృశ్వులైయున్నను సుకృతికో మాత్రమే, ఏపాటియో కొలఁదిగా, ఎప్పుడో, అతిప్రయత్నమున సూక్తిపాకమున మాత్రమే, సారస్వత తత్త్వము ఉన్మేషము నొందుట కల్గును. కనుక పైని చెప్పినట్లు, అనన్యమనోవృత్తియై కవితఁ జెప్పు సరసుని విషయమున సరస్వతీ దేవియును ఏకపత్నీవ్రతమును అవలంబించుట గల్గును. మఱియు నట్టివానికి, బృహస్పతికి సైతము దురవగాహమై యొప్పెడి సారస్వతసిద్ధి లోకోత్తరమై లభించును అని భావము.

రాజు కవియై కవిసమాజములను నిర్మింపవలయును.

రాజే కవియైనచో లోకమంతయును కవిమయ మగును. కనుక నాతఁడు కావ్యపరీక్షకై సభలనుచేయింకవలయును. అట్టిసభ పదాఱుస్తంభములతోను నాలుగు ద్వారములతోను, ఎనిమిది మత్తవారణముల చేతను నొప్పుచు, కేళీగృహమునకు దాపుగ నుండవలయును. సభ నడుమ నాల్గుస్తంభములు అంచులంగల్గి దాని నడుమ నొక్క మూర యెత్తుగల మణికట్టిత మగు నొక్కచిన్న వేదిక యును [అనఁగా అఱుగును] దానిపైని రాజసింహాసనము నుండవలెను. రాజసింహాసనమునకు త్తరవువైపున సంస్కృతకవులు కూర్చుండఁగాఁ దగును. అనేకభాషలలో గవితంజెప్పంగల కవులు పలువు రేర్పడినప్పుడు అందులో నెవ్వరెవ్వరి కేయే భాషలలో అన్నిఁటికన్న నెక్కుడు నేర్పుండునో, వారి నాభాషాకవులుగా నిర్దేశింపవలయును. ఒకవేళ నొక్కరే యనేకభాషలలోను సమాన నైపుణ్యము కలవారుగా నుందు రేని, వారిని ఆయాకవుల విభాగములలో చేర్చి ఆయాసందర్భములం గూర్చుండఁ బెట్టంగాఁ దగును. వారి తరువాత వేదవిద్యాభిజ్ఞులు, ప్రామాణికులు—అనఁగా ప్రమాణవిద్యలగు షడ్దర్శనములఁ జదివినవారు లేదా శాబ్దప్రామాణికు లగు వైయాకరణులు, పౌరాణికులు స్మార్తులు [స్మృతిశాస్త్రాదులలో ప్రవీణులు] వైద్యులు జ్యోతిషికులు మున్నగువా రుండవలయును. తూర్పువైపునఁ బ్రాకృతకవులును, వారికిఁ బిమ్మట నటులు నర్తకులు, గాయకులు వాదకులు (వాద్యముల నేర్పరులు) వాగ్జీవనకులు (బట్రాజులు మొ.) కుశీల

వ్రులు (నాట్యోపజీవులు) తాళికులు (వైతాళికులు) అనుచరులును ఉండవలయును పశ్చిమమువైపు నవ ప్రాంశకథాపాఠకవ్రులు, చిత్రలేఖకులు లేపనకర్మకుశలురు, మాణిక్యబంధకులు, వైకటికులు స్వర్ణకారులు, కౌయస్కాలు మున్నగు చెక్కడంపుపనిలో నేర్పుగల వర్ధకులు, లోహకారులు. మఱియుం దక్కుంగల యిట్టి యితరశిల్పులు నుండవలయును. దక్షిణము వైపున పైశాచికథాపాఠకవ్రులును, భుజంగులు (విటులు) వేశ్యలు, ప్లవక, శౌభిక, జంభక మల్లజాతులలోని నిపుణులు, (ప్లవకు లనంగా, ఈతనేర్పుగలవారు, శౌభికులు అలంకారరచనా నైపుణ్యము కలవారు. జంభకులు దూకుట పఱుగెత్తుట మున్నగు వ్యాయామవిద్యలలో పరిశ్రమ కలవారు, మల్లులు అనంగా జెట్టీలు - మల్లయుద్ధము చేయునట్టివారు,] శస్త్రోపజీవులు (కత్తినింజేపట్టి యుద్ధము చేయుటయే కులవృత్తిగాఁ బెట్టుకొన్న సైనికజాతివారు) ఇంకను నితరులు మున్నగువా రుండవలయును. ఇట్టి రాజాసనము నందు రాజు గూర్చుండి, కావ్యగోష్ఠిని జరుపుచు జరపించుచు, కవులను పరీక్షించుచు, ఆపరీక్షలులో జయము గాంచిన వారిని సత్కరించుచు, నితరులచే సత్కారింపం జేయుచు నుండంగా వలయును. పూర్వకాలమున నిట్లు సభాదుల నొనర్చి కవులం దాము సత్కరించి యితరులచే సత్కారింపం జేసిన వాసుదేవ సాతవాహనాది రాజులను సభాపతులను దానమానములచేతఁ దాము వారి ననుసరింపవలయును. ఇట్లయినచో తుష్టులై పుష్టులై ఆరాజు

సభలోఁ దమంతఁ దాముగా సభ్యులై విద్యోపజీవులు వచ్చి చేరుటయే గాక, తమనేర్పులంజూపి బహుమతినిఁ బడయంగలరు. ఇట్టిసభలలోఁ బరీక్షకులై వచ్చి నిలచి, సభ్యుల పరీక్షలకు దాళగల్గి లోకోత్తరత్వమును పొందఁగ ల్గినట్టి కావ్యమును గాని, కవినిగాని యోగ్యతకుందగిన యట్లులుగా సత్కరింపవలెను. ఇట్టులు అప్పటప్పటికిని కావ్యగోష్ఠిని శాస్త్రవాదములను రాజులు జరుపవలయును నిజమైన తేనెతొట్టియే యైనను, పిండకయే స్రవించునా? కావ్యశాస్త్రములగోష్ఠులు లేనికాలములలో, విజ్ఞాను లును దేశాంతరాగతులును అగు పండితులు మున్నగు వారితో కావ్యశాస్త్రాదిచర్చలం గ్రీడింపందగును. ఇట్లు దేశాంతరాగతులైన యాపండితులకు వారివారి యోగ్య తకుం దగినట్లు స్వయముగఁగాని ఇతరుల ద్వారాగాని తమవారి పరిచయముం గల్గించి, తగినట్లు ఆయాపండితు లకు సత్కారములను నెరపవలయును. అందునను జీవి కార్థులై వచ్చువారిని కాని, తదితరులలో తమకు ఆవశ్య కు లని తోఁచినవారిని కాని, యుక్తితో జేరఁదీసి యుం చుకొనంగా వలయును. ఏల యనఁగా పురుషరత్నములకు (అనఁగా పురుషులలో రత్నములలాంటి వారికి రాజులు ను, పురుష జాతిరత్నములకు సముద్రములు,) ఒక్కరాజు నురత్నాకరమును మాత్రమే సేవ్యములు. ఇట్లు రాజులు చేయందగిన కవిపండిత సభలరీతులు వివరింపంబడినవి. రాజులు లేనిచోటను, దూరస్థులుగా నున్నచోటను, రాజ కీయోద్యోగులు ఈపనిని చేయుచుండవలయును. రాజ

కీయోద్యోగుల నిట్టివానిగా నెన్నుకొనియుంట ఆరాజునకే ఉపకారకము కాఁగల్గును; గావున నట్టి రాజకీయోద్యోగులను రాజు పైఁజెప్పినరీతి చేయుటకై ప్రోత్సహింపందగును. మహానగరములలో కూడ కావ్యశాస్త్రపరీక్షలకై బ్రహ్మసభలను చేయించి ఆపరీక్షలలో నుత్తీర్ణులగు వారికి బ్రహ్మరథయానగౌరవములు పట్టములు అనుగ్రహింప వలయును. పూర్వ ముజ్జయినియందు కావ్యకార పరీక్ష జరుగుచుండెడి దని పెద్దలు చెప్పుచుండఁగా వినియున్నారము ఎట్లనఁగా—

శ్లో. ఇహ కాళిదాసమేంఠా వత్రామరరూపసూర భారవయః
హరిచంద్ర చంద్రగుప్తౌ పరీక్షితా విహ విశాలాయామ్.

[ఈ యుజ్జనియందే కాళిదాసమహాకవి, మేంఠకుఁడు, అమరసింహుఁడు, రూపసూరి, భారవి, సూర్యకవి, హరిశ్చంద్రుఁడు, చంద్రగుప్తుఁడు అనువారు పరీక్షితులైరి—అని చెప్పెద రని భావము.]

ఇట్లే పాటలీపుత్రమునందు శాస్త్రకార పరీక్షయును జరిగెడి దఁట!

శ్లో. అత్రోపవర్షవర్షా విహ పాణిని పింగళా విహ వ్యాడిః,
వరరుచిపతంజలీ ఇహ పరీక్షితాః ఖ్యాతి ముపజగ్ముః.

[ఈ పాటలినగరమునందే ఉపవర్షాచార్యుఁడు, వర్షాచార్యుఁడు పరీక్షింపఁబడిరి. ఆపిమ్మట పాణిన్యాచార్యుఁడు, పింగళనాగుఁడును పరీక్షింపఁబడిరి. ఆ పిమ్మట మహాభాష్య కర్తయగు పతంజలియును, వార్తిక

కర్త యగు వరరుచియును పరీక్షింపఁబడిరి. వారందఱు నిచ్చట పరీక్షితులై సత్కారముఁ గాంచుటచేతనే ప్రఖ్యాతి నొందిరి—అని చెప్పిర రని తాత్పర్యము.]

ఈతీరున రాజులు సభాపతులై కావ్యములను పరీక్షించి గౌరవించుచున్నచో, ఆ రాజులయొక్క కీర్తి జగద్విదితము కాఁగల్గును. ఆ రాజులును సుఖులై యుండఁ గల్గుదురు.

ఇది రాజశేఖరుని కావ్యమీమాంస యను కవిరహస్యమునందు ప్రథమాధికరణమున, కవిచర్య రాజచర్య యనునది దశమాధ్యాయము.

---

# రాజశేఖరకవి కావ్యమీమాంస.

---

## ఏకాదశాధ్యాయము.

---

### శబ్దహరణము.

[ఈయధ్యాయమునందు వచ్చెడివిషయములు:— ౧. పద పాదార్థవృత్తప్రబంధాదుల నగు అర్థహరణములు. ౨. శ్లిష్టయమకహరణములు- తద్భేదములు. ౩. శబ్దహరణవిషయమున అవంతి సుందరి యభిప్రాయములు. ౪. మూఁడు పదములకు పైఁబడినపదముల హరించుట హరణమగునా? కాదా? యన్నచర్చ. ౫. అందలిసిద్ధాంతములు. ౬. అందుగల వ్యవస్థలు. ౭. స్వీకరణము హరణము అనువాని లక్షణములు. ౮. మూల్యక్రయాదులుగూడ హరణములే యను సిద్ధాంతములు. ౯. దొంగిలింపని కవియే లేఁడనుట. ౧౦. హరణము చేసినను హార్యముకాని విధము. ౧౧. తదనుసారముగా ఉత్పాదకాది కవిభేదములు. ౧౨. మహాకవిలక్షణములు. ౧౩. తదుదాహరణములు— మున్నగునవి.]

పరకవిప్రయుక్తము లగు శబ్దార్థములను [అనఁగా శబ్దములను అర్థములను] స్వగ్రంథమున (తనవిగా) కూర్చుటయే హరణము. హరణము పరిత్యాజ్య మనియు, అనుగ్రాహ్య మనియు ద్వివిధము. ఇందు శబ్దహరణమే మొత్తమున పద, పాద, అర్థ, వృత్త, ప్రబంధాద్యు నండి యైన భేదములవలన నైదు తెఱఁగులు అగుచునల

ది. అనఁగా నితరకవుల గ్రంథములనుండి [ప్రదతః హార ణము] పదములుగా హరించుట, పాదములుగా హరిం చుట, అర్థము నక్కొ హరించుట, వృత్తితః (కథనుండి) హారణము ప్రబంధతః (గ్రంథమునుండి కొంత) హరిం చుట అని యైదు తెఱఁగుల హారణము ఉండునని తాత్ప ర్యము.

ఇందు ఏకపదహారణము [ఏకో యొక్క పదమును మాత్రము తీసికొనుట] అంతగా దోషము కాదని ఆచా ర్యు లనిరి. ఇయ్యది ద్వ్యర్థపదేతర స్థలములయందు మాత్రమే అని యాయావరీయుఁ డనెను అనంగా రెండేసి యర్థములు గల్గుపదములను హరించుట ఒక్కదానిని హరించినను హారణమే యగునని, తదితర స్థలములలో నది దోషము కాదని యాయావరీయుని భావము.

పైఁజెప్పినవానిలో శ్లిష్టపదమును శ్లిష్టపదముతో హరించుట కుదాహరణము:—

శ్లో. దూరాకృష్టశిలీముఖవ్యతికరా న్నో కింకిరాతా నిమా
నారాద్వ్యావృత పీతలోహితముఖాన్ కిం వా పలాశా నిమీ,
పాంథాః కేసరిణం న పశ్యత పురో హ్యేనం వసంతం వనే
మూఢా రక్షత జీవితాని శరణం యాత ప్రియాం దేవతామ్.

[దూరాకృష్టములగు శిలీముఖములచేత—(అనఁగా బాణములచేతను తుమ్మెదలచేతను) వ్యతికరు లైన ఈకింకిరాతులను (బోయలను - మన్మథసేనలను) గాని ఆరాద్వ్యావృతపీతలోహితముఖు లై యున్న ఈ పలాశ ములను, [మోదుగుచెట్లు-చిలుకలు] గాని, చూచుట

లేదా? కంఠమెదుట నున్న కేసరినైనను [సింహము-వసంతర్తువు] చూచుట లేదా? ఓరీ మూర్ఖులారా! ప్రాణములను కాపాడుకొనుటకు. రక్షణార్థమై మీకు ప్రియయగు దేవతను శరణుజొచ్చుడు ఈశ్లోకమునుండి ఈక్రింది శ్లోకమున హరించిన శబ్దములను (శ్లేషపదములతో శ్లేషపదములను హరించుటను) కనుడు.

శ్లో. మాగాః పాంథ ప్రియాం త్యక్త్వా దూరాకృష్టశిలీముఖం,
స్థితం పంథాన మావృత్య కింకిరాతం న పశ్యసి.

[ఓయీ! బాటసారీ! ప్రియురాలిని వదలి ప్రవాసమున కేగకుము. దూరాకృష్టశిలీముఖుఁడై, త్రోవ నడ్డగించి యున్న కింకిరాతుని నీవు చూచుటలేదా ?—అని భావము. ఇందు పైశ్లోకమునందున్న దూరాకృష్టశిలీముఖ, కింకిరాత శబ్దములు శ్లేషతో నున్నవి యున్నట్టుగానే హరింపంబడినవి.]

ఇఁక శ్లిష్టపదములలో ఏకదేశముతో హరించుట.—

శ్లో. నాశ్చర్యం యదనార్యాప్తా వ్యస్తప్రీతి రయం మయి,
మాం సోపయోగం కుర్వీత కథం క్షుద్రహితో జనః.

[అనార్యాప్తి గల నాయెడ నితఁడు అస్తప్రీతి యైనాఁడనిన నందు ఆశ్చర్యము లేదు క్షుద్రహితుఁ డగు జనుఁడు మాంసోపయోగము నెట్లు చేయ నేర్చును?-అని యర్థము. ఇచ్చట అనార్యాప్తి (అనార్యులయొక్క-పొందికగల-అని యొక యర్థము. స్త్రీ ప్రాప్తిలేని-అని మఱియొక యర్థము.) అస్తప్రీతి (ఆదరరహితుఁడని యొక యర్థము. ఇచ్ఛలేనివాఁడని వేఱొక యర్థము.)

మాంసోపయోగం (నన్ను ఉపయోగముతోఁ గూడిన వానినిగా అని యొక అర్థము. మాంసముయొక్క ఉపయోగమునుగా అని వేఱొక యర్థము.); క్షుద్రహిత (ఆఁకలి లేనివాఁ డని యొక యర్థము. క్షుద్రులకు హితుఁడైనవాఁ డని వేఱొక యర్థము.); ఈప్రకృతు లగు శబ్దములు శ్లిష్టములై యున్నవని భావము.]

శ్లో. కోపా న్మానిని! కిం స్మర త్యతితరాం శోభాధర స్తేధరః
కిం వా చుంబన కారణా ద్దయిత! నో వాయోర్వికారాదయం
తస్మా త్సుభ్రు! సుగంధ మాహితరసం స్నిగ్ధం భజస్వాదరా
న్మగ్ధే! మాంసరసం బ్రువ న్నితి తయా గాఢం సమాలింగితః.

[ఓమానినీ! నీయధరము కోపమునంజేసి ఒక విధమగు శోభను (అనఁగా నెఱ్ఱదనమును) ధరించినదియైనను, మీఁదు ఎక్కిలి శోభిల్లుచున్నది. కాని ఎన్నఁడును లేని యీరీతిగా నిట్లగుట నేను ముద్దుగొనిన కారణముననా యేమి? అని నాయకుఁ డడిగెను. అందులకు ఆ నాయిక ఆకోపమును కప్పిపుచ్చి—ప్రియా! ఇట్లగుట కోపము వలనఁగాదు. ఒకరీతి వాయువికారమువలన (అనగా వాతరోగముచేత) నిట్లైనది—అని జవాబు చెప్పెను. దానిపైని ఆ నాయకుఁడు నాయికచేసిన యుక్తికిం దగినట్లుగా—అట్లైనచో, ఓసుభ్రూ! శీఘ్రముగా సుగంధము స్నిగ్ధము ఆహితరసము నగు మాంసరసం సేవింపుము అని చెప్పెను. నాయిక మాంసరసం—అనే పదంలో మాం=నన్ను, సరసం=సరసుని—అనే అర్థము దీసికొని అతనిని గాఢముగా నాలింగనము చేసికొనినది—అని

భావము. ఈ శ్లోకములో పైశ్లోకమునందు చెప్పిన మాంసరసం—అనే శ్లిష్టైకదేశము హరించి కూర్పంబడినదని యెఱుంగందగును.]

శ్లిష్టమును యమకముతో హరించుట.—

శ్లో. హాల మపారపయోనిధి విస్తృతం
ప్రహరతా హలినా సమరాంగణే
నిజయశశ్చ శశాంకకలామలం
నిరవధీరితమాకుల మాసురమ్.

శ్లో. దలయతా విశిఖైర్బల మున్మదం
నిరవధీరిత మాకుల మాసురమ్
దశను దిక్షుచ తేన యశస్సితం
నిరవధీరిత మాకుల మాసురమ్.

[రణాంగణమునందు నిరవధీరిత మాకులము అంతు లేని సముద్రమువలె వ్యాపించి యున్నదియు నగు ఆసుర బలమును (రాక్షససైన్యమును) ప్రహరించుచున్న హలి (బలరాముని) చేత, తనయొక్క హాలమును (అనఁగా నాగలి) తనయొక్క యశస్సును శశాంక కళామలముగాఁ జేయఁబడినది—అని భావము. [ఇచ్చట ఈ మొదటి పద్యములోఁగల శ్లేషపద మగు- "నిరధీరిత మాకులము" అను పదము రెండవశ్లోకములో యామకరూపమున నాల్గవపాదముగా హరింపంబడినది.]

శ్లిష్టమునకు ప్రశ్నోత్తరరూపమున హరణము.—

(1). యస్యాం భుజంగవక్త్రః కర్ణాయతేక్షణాం కామినీవదనం చ.

శ్లో. కిం కరోతి కియత్కాలం వేశ్యావేశ్మని కాముకః,
కీదృశం వదనం వీక్ష్య తస్యాః కర్ణాయతేక్షణమ్.

[ఇచ్చట (1) మొదటివాక్యములోనున్న [ఏపట్టణామునందు భుజంగవర్గమును, (విటసమూహమని యొక యర్థము. పాములగుంపు అని వేఱొక యర్థము.) కామినీవదనమును, కర్ణాయతేక్షణమై యుండునో (అనఁగా కనుగొనలవఱకు వ్యాపించిన చెవులు కలది అని విటపరమగు నర్థము. చెవులచేఁ గప్పివేయఁబడిన కన్నులు గలది యని వేఱొక యర్థము) అన్న అర్థము గల వాక్యములోని] కర్ణాయతేక్షణం అన్న శ్లేషపదమును క్రిందనున్న రెండవదగు శ్లోకములో ప్రశ్నోత్తర రూపమున కూర్పంబడినది. ఎట్లనంగా—కాముకుఁడు వేశ్య యింటిలో నేమి చేయును? ఎంతకాలము చేయును? ఎట్టి ముఖకమలమును చూచి అట్టిపనిని చేయును?-అని మూడు ప్రశ్నలు ఈ మూఁడింటికి కర్ణాయతేక్షణం— అని ఒక్కటే జవాబు. ఇందులో ౧, వ ప్రశ్నకు—కర్ణుని వలె దానమును చేయు నని ఒక్క క్షణకాలము చేయు నని కనుగొనలవఱకును వ్యాపించిన అనఁగా కర్ణాయతేక్షణ మగు ముఖమును చూచిచేయునని జవాబులు చెప్పంబడుచున్నవి.-అని తెలియుంగగావలయును.]

శ్లో. వరదాయనమోహారయే పతతి జనోయం| నమోహారయే,
బహుళశ్చక్రందహాతా మనసి దితిశ్చైవ దైత్యచక్రందహాతా.

దీనిని ఈ రీతిని హరించిరి:—

"చంద్రికదపహారం చక్రంజపహారం
ఖడ్గేనతవాక్యా రాజన్నరివాక్యే

ఇట్లే తక్కిన వానిని గూడ అన్యోన్య సమన్వయమునందు గమనింపఁదగును. కాని ఇట్టి మార్గము ఒక విశేషముగా కవుల కుపదేశింప వలసినది కాదు. ఏల యందురా? పెద్దలిట్లు పల్కిరి:-కాలాతిపాతమగు కొలఁది పురుషుని శౌర్యము పాసిపోవుచున్నది. పుత్రపౌత్రాదులు తనమాటలను అనుకరించుచుందురు గదా! ఈ వాక్చౌర్యము క్రమముగా శీర్ణ మగుట లేదా?

"అతఁడు ప్రసిద్ధుఁడు నేను ప్రసిద్ధుఁడను. అతఁడు ప్రతిష్ఠుఁడు నేను ప్రతిష్ఠాశాలిని. ఆతని అల్లిక దారితప్పినది నాది తప్పలేదు. కటువచనము లతనివి అమృతసూక్తులు నావి. భాషా విశేషాదృతి ఆతనికిలేదు. నాకు కలదు. అను నిమున్నగు హేతువులను ప్రదర్శించుచు శబ్దహరణార్థహరణముల నొనర్పందగును" అని అవంతి సుందరి యనెను. మూఁడు మొదలుకొని పైగా అశ్లిష్టములగు పదము లున్ననే హరణ మగునని ఆచార్యు లనిరి. ఎట్లనఁ నీశ్లోకములను పరికింపుఁడు.

శ్లో. సపాతువో యస్య జటాకలాపే
స్థిత శ్శశాంక స్ఫుటహారగౌరః,
నీలోత్పలానా మివ నాళపుంజే
నిద్రాయమాణ శ్శరదీవ హంసః

శ్లో. స పాతు వో యస్య హతావశేషా
తత్తుల్యవర్ణా జనరంజితేషు
లావణ్యయుక్తేష్వపి విత్రసంతి
దైత్యాస్స్వకాంతానయనోత్పలేషు.

ఇయ్యుదిహారణమే కాదని యాయావరీయుఁడ నెను. ఉల్లేఖవంతమగు పదసందర్భము పరిహారణీయమగునే కాని అప్రత్యభిజ్ఞచేత వచ్చెడిపాదము వారణీయము కాఁజాలదు. అట్టిపాదమునకు గూడ కొంచెమంత దుష్టత యుండనే యుండును. ఎట్లందురా? చూడుడు:—

శ్లో. ఇత్యుక్తవానుక్తివిశేషరమ్యం
రామానుజన్మా విరరామ మానీ
సంక్షిప్తమాప్తావసరం చ వాక్యమ్
సేవావిధిజ్ఞైః పురతః ప్రభూణామ్.

ఇయ్యది ఈక్రింది భారవిశ్లోకముతోఁ బోల్చుఁడు:-

శ్లో. ఇత్యుక్తవానుక్తివిశేషరమ్యమ్
మనస్సమాధాయ జయోపపత్తౌ,
ఉదారచేతా గిర మిత్యుదారాం
ద్వైపాయనే నాభిదధే నరేంద్రః.

ఉల్లేఖవంతమున కీ క్రింది శ్లోకములు ఉదాహరణములు:—

శ్లో. నమ స్సంసారనిర్వాణ విహామృత విధాయినే,
నష్టలోకోర్మి భంగాయ శంకరక్షీరసింధవే.

శ్లో. ప్రసరద్బిందునాదాయ శుద్ధామృతమయాత్మనే,
నమోఽనన్తప్రకాశాయ శంకరక్షీరసింధవే.

ఇందు పాదము మార్చినను దోషమే కాని హరణము లేదు. ఇదియు నొక విధమగు స్వీకరణమే అని ఆచార్యులు పల్కిరి. ఈవిషయము స్పష్టపడుటకై ఈశ్లోకములను చూడుఁడు:—

శ్లో. త్యాగాధికాః స్వర్గముపాశ్రయంతే
త్యాగేన హీనా నరకం వ్రజన్తి
న త్యాగినాం కించిదసాధ్యమస్తి
త్యాగో హి సర్వవ్యసనాని హంతి.

శ్లో. త్యాగోహి సర్వవ్యసనాని హంతీ
త్యళీక మేతద్భువి సంప్రతీతమ్
జాతాని సర్వవ్యసనాని యస్యా
స్త్యాగేన మే ముగ్ధవిలోచనాయాః.

కాని ఇట్లుచేయుట అనునది స్వీకరణ మనుపేరుతో చేసెడు హరణమే యగును. పదహరణము వలెనే సార్థప్రయోగమునుఁ గూడ తెలియునది. ఎట్లందురా? చూడుఁడు.

శ్లో. పాదాస్తే నరవర దక్షిణే సముద్రే
పాదోఽన్యో హిమవతి హేమకూటలగ్నే
ఆక్రామత్యలఘు మహీతలం త్వయాత్థం
భూపాలాః ప్రణతి మపాస్య కిన్ను కుర్యుః.

ఈశ్లోకము నందలి పూర్వార్థమును మార్పక అట్లే యుంచి ఈక్రిందిశ్లోకమునందు ఉత్తరార్థమునందు చేసిన మార్పును జూడుడు:—

శ్లో. ఇత్థం తే విశ్రుతపదద్వయస్య రాజ
న్నాశ్చర్యం కథమివ నీవనీ న భిన్నా.

ఇట్లే వ్యస్తములుగాను (క్రిందుమీఁదులుగా చేసియును) అర్థప్రయోగములు గలవు:—

శ్లో. తత్తావదేవ శశిన స్స్ఫురితం మహీయో
యావన్న తిగ్మరుచి మండల మభ్యుదేతి,
అభ్యుద్గతే సకలధామనిధౌ తు తస్మి
న్నిందో స్సితాభ్రశకలస్య చ కో విశేషః

శ్లో. తత్తావదేవ శశిన స్స్ఫురితం మహీయో
యావన్నకించి దపి గౌరతరా హసంతి
తాభిః పునస్స్మితాసితా నవపంకజాభి
రిందోస్సితాభ్రశకలస్య చ కో విశేషః.

పాదములోనే కల అన్యథాత్వాకరణము స్వీకరణము గాని పాదోనహారణముగాని కొంజాలదు ఎట్లందురా చూడుడు.

శ్లో. ఆరణ్యే నిర్జనే రాత్రా వంతర్వేశ్మని సాహసే,
న్యాసాపహ్నవనేచైవ దివ్యా సంభవతి క్రియా.

అట్లే ఉత్తరార్థముతో
"తన్వంగి యది ల క్ష్యేత దివ్యా సంభవతి క్రియా"
అని మార్పుచేసిరి. మఱియును.

శ్లో. యస్య కేశేషు జీమూతా నద్య స్సర్వాంగ సంధిషు
కుక్షౌ సముద్రా శ్చత్వార స్తస్మై తోయాత్మనే నమః

దీనినే యొకకవి తన శ్లోకములో నుత్తరార్థమున మాత్రము ఇట్లు కూర్చెను.

"కుక్షౌ సముద్రా శ్చత్వారస్సహేత స్మరానలమ్"

భిన్నార్థములను పాదములను ఏకపాదముతో అన్వయించుటగూడ కవిత్వమే యనఁదగును. చూడుఁడు —

శ్లో. కిమిహ కిమపి దృష్టం స్థాన మస్తి శ్రుతం వా,
వ్రజతి దినకరోయం యత్ర నాస్తం కదాచిత్,
భ్రమతి విహగ సార్థానిత్థమాపృచ్ఛమానో
రజని విరహభీత శ్చక్రవాకో వరాకః

శ్లో. జయతి సితవిలోల వ్యాళ యజ్ఞోపవీతీ
ఘనకపిల జటాన్తర్భ్రాంత గంగాజలౌఘః
అవిరళ మృగచిహ్నం బిందురేఖాం దధానః
పరిణతశితి కంఠశ్యామకంఠః పినాకీ.

ఈ రెండు శ్లోకములలోని భిన్నపదార్థముల యర్థము. ఈ క్రింది శ్లోకములలో అన్వితమై యున్నది చూడుఁడు.—

శ్లో. కుముదవన మపశ్రి శ్రీమదంభోజఖండం
త్యజతి ముదము లూకం ప్రీతిమాం శ్చక్రవాకః.
ఉదయమహిమరశ్మి ర్యాతి శీతాంశు రస్తం
హతవిధిలసితానాం హా విచిత్రోవిపాకః.

శ్లో. కిమిహ కిమపిదృష్టం స్థాన మస్తిశ్రుతం వా
ఘనకపిలజటాంతర్భ్రాంత గంగాజలౌఘః,

నివసతి సపినాకీ యత్ర యాయాం త్తదస్మిన్
హతవిధలసితానాం హా! విచిత్రో విపాకః.

పాదోనపద్యము నన్వయించి నట్టులనే కొన్ని పదములను ప్రయోగించుటకూడ కవిత్వమే యగును.—

శ్లో. యావ్యాపారవతీ రసాన్ రసయితుం కాచిత్కవీనాంనవా,
దృష్టి ర్యా పరినిష్ఠితార్థ విషయో న్మేషా చ వైపశ్చితీ
తే ద్వే అప్యవల బ్య విశ్వ మనిశం నిర్వర్ణయంతో వయం
శ్రాన్తా నైవ చ లబ్ధ మబ్ధిశయన త్వద్భక్తితుల్యం సుఖమ్.

ఇందు చతుర్థపాదములో "శ్రాన్తానైవచ లబ్ధమ్." అనుపఱకును మార్చులను "ఉత్పలదృశాం ప్రేమ్ణస్సమానంముఖమ్" అని కొన్నిపదముల ప్రయోగించి అన్వయించ బడినది.

పాదములో ఏకదేశమును గ్రహించుటకూడ పదైకదేశమునకు ఉపలక్షణముగ నగును. ఉదా:—

శ్లో. అవికలహసితత్వాత్ క్షాళితానీవ కాన్త్యా,
ముకుళితః నయనత్వా ద్వ్యక్తకర్ణోత్పలాని
పిబతి మధుసుగంధీ న్యాననాని ప్రియాణాం
త్వయి వినిహితభారః కుంతలానా మధీశః.

ఇం దుత్తరార్ధమున 'పిబతి' అనుటకు బదులు పిబతు అనియు 'త్వయి' అనుటకు బదులు 'మయి' అనియు మార్చిన పదైకదేశము అగును.

వాక్యమును అన్యార్థము వచ్చునట్లు వ్యాఖ్యానము చేయుట కూడ స్వీకరణముగాని హారణముగాని కాఁజాలదు.

శ్లో. సుభ్రు! త్వం కుపితేత్యపాస్త మశనం త్యక్తా కథా యోషితాం
దూరాదేవ మయోజ్ఝితా స్సురభయ స్స్రగ్గంధధూపాదయః,
కోపం రాగిణి! ముంచ మయ్యవనతే దృష్టే ప్రసీదాధునా,
సత్యం త్వద్విరహా ద్భవంతి దయితే సర్వా మమాంధా దిశః.

ఈ శ్లోకము కాంతా ప్రసాదనపరమైనది. ఇయ్యది కుపితదృష్టియగు నాయిక యొక్క పరముగా వ్యాఖ్యానము చేయబడినదే కాని, స్వీకృతముగాని అపహృతముగా గాని కాఁజాలదు. పరకీయమగు దానిని, తన దానినిగా చెప్పుచు ఇతర కారణముల వలన నాలపించుట కేవలము హారణము మాత్రమేగాక దోషోదాహరణముగ కూడ నగును. ఇది ముక్తక ప్రబంధవిషయములకు సంబంధించినమాట. ఇఁకను ఇతరులు చెప్పినదానిని మూల్యమునకుఁ గొని తన గ్రంథములో చేర్చుకొనుట యును హారణమేయగును. కాని దుర్యశము సంపాదించుకొనుటకంటె యశమే లేకుండుట మంచిది గదా!

ఇంకను సభాపతి యన్ననో, ఉపజీవ్యుఁడు, ఉపజీవకుఁడు అను భేదములచేత ద్వివిధముగ నుండును. ఈ రెండు భేదములలో ఉప జీవనమాత్రాన దోషమేదియును లేదు. ఎందువలన నందురా? వినుఁడు ఎల్లవారును ఇతరులవలననే వ్యుత్పన్నులయ్యెదరు. కేవలమును అచ్చట

సముదాయమే గురుభూతమగు చున్నది. అట్లే ఉక్తిహరణము కూడ నని ఆచార్యులనిరి (అనఁగా అనేక గ్రంథములు చదివి వ్యుత్పన్నులయ్యెదరు. గనుక అనేక గ్రంథములలోఁ గల విషయమును తమగ్రంథములలో దొంగిలిన మాత్రాన హరణము గాని స్వీకరణముగాని అని అనుటకు వీలులే దని ఈయన భావము )

" ఊరుద్వంద్వం పరసకదళీ కాండసబ్రహ్మచారి "

యను మహాకవివాక్యమును ఒకరు మఱియొక వృత్తములో కూర్చిరి. అర్థాంతరములలో గూర్చిన అనుకరణోక్తులు బయల్పడక రసము లొలుకుచుండును. ఇట్టివి హరణమును గూడ హరించునవి యని యాయావరీయుండనియెను. చౌర్యము లేని కవి గాని వర్తకుఁడు గాని లేఁడు ఎవ్వఁడు గూఢముగా వాచ్యమగు నర్థమును కూర్పఁగలఁడో అతఁడానందమునకు పాత్రుఁడు. కవులలో ఒక్కఁడు ఉత్పాదుఁడుగను, మఱొకఁడు పరివర్తకుఁడుగను ఇంకనొకఁడు అచ్ఛాదకుండుగను మఱియు నొక్కఁడు సంఘటీకర్తగను నుండును. శబ్దార్థములలో నూత్న విశేషములను కనిపెట్టువాఁడును, ప్రాచీనసూక్తులలోఁగల కొంత వైశిష్ట్యమును అపేక్షించు వాఁడును నగువాఁడే మహాకవి యనఁదగు.

ఇది రాజశేఖరకవిరాజకృత కావ్యమీమాంస యను కవిరహస్యమునందు ప్రథమ ప్రకరణమునందు శబ్దహరణ మనునది యేకాదశాధ్యాయము ముగిసెను.

---

# రాజశేఖరకవి కావ్యమీమాంస.

---

## ద్వాదశాధ్యాయము.

---

### బింబప్రతిబింబకల్పన సమీక్ష.

ఈ అధ్యాయమునందు వచ్చువిషయములు:—అర్థహరణమును గూర్చిన చర్చ. అందుగలభేదములు. వానిసంఖ్య, తద్వివరములు, వానిననుసరించి కవులలో ఏర్పడు నాల్గువిధములగు భేదములు, వానిపేర్లు, ఐదవది అసాధారణమనుట, వానినిర్వచనములు, తదవాంతరభేదములు, వాని యుదాహరణములు. ప్రతిబింబకల్పాదులను విభజించుటచే నేర్పడిన ముప్పదిరెండు హరణోపాయములు, అందలి భేదములు వాని ఉదాహరణములు మొదలగునవి.

"కావ్యమార్గము ప్రాచీనకవి సంచారక్షుణ్ణము. కావున వారిచే దుర్లభమై అస్పృష్టమై యున్న వస్తువు మనకు దొరకుట కష్టము. కనుక వా రేర్పఱచిన వస్తువునే సంస్కరింప బ్రయత్నింపవలయు"నని ఆచార్యులనిరి. అట్లు కాదని వాక్పతిరాజు పలికెను. ఆతనిమాట లివి— "ప్రపంచము పుట్టిననాటనుండి నేటివఱకును ఎందఱో కవులచే నెన్నియోవిధముల సారము గ్రహింపబడుచున్నను సారస్వత పరిస్పందము ఇప్పటికి నభిన్నముద్రముగా బ్రకాశించుచునే యున్నది."

ఆ పూర్వకవుల ప్రతిభాభ్యాసమునకై పరప్రబంధ ములను విలోకించునది. 'పరగ్రంథావగాహనమున తదేక యోను లగు అర్థములు వేలువేలుగా వన్నెకువచ్చునని' కొందఱిమతము. 'ఆ గ్రంథములోని విషయములను చా యగా మార్చుకొనుటయే ఇందులకు ఫలము' అని మఱి కొందఱు. 'మహాత్ములకు సంవాదినులగు బుద్ధులు ఒక్కొ క్కప్పుడు తుల్యార్థములను ఉపస్థాపించును గనుక అ వ్వానిని పరిత్యజించుటకై పర గ్రంథములను ఆసక్తితో జదువవలయు న'ని ఇంక కొందఱు. ఇవన్నియును మిథ్యా భూతము లని యాయావరీయుఁడు. సారస్వత చక్షువు అవాఙ్మానస గోచర మగు నేకాగ్రతతో నుండినచో దృష్టాదృష్టార్థ సముదాయమును తనంతతానే విభజించి ప్రదర్శింపగలఁడు.

పెద్దలుకూడ ఇట్లే అనిరి —సరస్వతీదేవి మహాకవి యగు వానికి నిద్రావస్థలో నున్నను శబ్దార్థసార్థమును కనఁబఱచును. తద్భిన్నునకు జాగ్రదవస్థలోనున్నను అది గో చరింపదు. అన్యదృష్టములగు నర్థములయెడ మహాకవులు జాత్యంధప్రాయులు. కాని ఏతదన్యవస్తువులపట్టుల దివ్య దృక్కులే యగుదురు. కవులు చర్మచక్షువు లయ్యును పదార్థముల కనుగొనునట్లుగా త్ర్యక్షుండుగాని సహస్రా క్షుండుగాని కనుగొనఁ జాలఁడు. కవుల మతిదర్పణము

నందు ప్రపంచమంతయును ప్రతిఫలించును. "ఇట్టి మహాత్ముల యెదుట మన మెప్పుడు పడుదుమా"యని శ్రద్ధాగాథములు ఎల్లప్పుడును అహంపూర్వకముగఁ బయిగెత్తుచుండును. చిత్తైకాగ్రతతో యోగులు కనుగొనెడి చిన్మయ స్వరూపమును కవులు వాఙ్మాత్రముచేతనే సాధింతురు. మహాకవుల విషయములలో ఇట్టి వనేకము గలసిరి. "అంతము నిక్కమే" అని యాయావరీయుడు. అర్థము అన్యయోని యనియు నిహ్నుతయోనియనియు అయోని యనియును ముత్తెఱఁగులు. అందు అన్యయోని ప్రతిబింబకల్పనము ఆలేఖ్యప్రఖ్యము నని రెండువిధములు. నిహ్నుతయోనియును తుల్యదేహితుల్యము పరపురప్రవేశ సదృశమునని రెండు విధములు. ఇంకను, అయోనియన్నదో పదునొకండు విధములు. అందు అదే అర్థము గలిగి వాక్యాంతర విరచనాపరమైన వాక్యములు గల్గునది. ప్రతిబింబములాంటి ఇతరవిధమగు అర్థవిభేదము ఒకపాటి సంస్కారముచేత ప్రాతయంశమే క్రొత్తదై వేఱువస్తువు వలె గాన్పించునేని అయ్యది ఆలేఖ్యప్రఖ్యమను కావ్యము అగును. నితాంతసాదృశ్య ముండుటవలన విషయములకు భేదమున్నను అభేదబుద్ధితో నుపచరించునది తుల్యదేహి తుల్యమని వాకొందురు.

మూలైక్యము గలిగి అనేకవిధము లగు పరికరములతో నొప్పెడి కావ్యము పరపురప్రవేశముతో

సమానమైన కావ్య మని సుకవీశ్వరులు ఎఱుఁగవలయును. అని యిట్లు పైని వర్ణించిన నాలుగువిధములగు నిబంధనలును ముప్పదిరెండు విధములగు హరణోపాయములును కవులకుఁ గలవు. ఈ యర్థభేదములకుఁ దగినట్లే అయస్కాంతములఁ బోలి నాలుగు విధములగు కవులును అన్వర్థనాములై యున్నారు. అయిదవవాఁడు అదృష్టచరము లగు అర్థములను వివేచనసేయువాఁడు. పెద్దలును ఇట్లే పల్కిరి గదా చూడుఁడు:—కవి, భ్రామకుఁడని చుంబకుఁడని కర్షకుఁడని ద్రావకుఁడని నాల్గు విధములు. ఈ నాల్గువిధములగు కవిగణము లౌకికమనియు, తద్భిన్నుఁడు అయిన అయిదవవాఁడు అలౌకికుఁడనియు ననఁబడును. ప్రాచీనమగు కథాంశమునైనను అనన్యదృష్ట మైనదానినిగ చేయుచు అప్రసిద్ధ్యాదులచేత భ్రమించువాఁడు భ్రామకుఁడు. పరునిమాటను మనోహరమైన తన స్వంతమాటలతోఁ జేర్చి కొంచెము కొంచెము క్రొత్తచాయలఁ గవిత చెప్పెడివాఁడు చుంబకుఁ డనఁదగును. ఇతరుని వాక్యమును కొసితెచ్చి తనమాటలలో నిమిడ్చి ఏదో యొకవిధమున సముల్లేఖించువాఁడు కర్షకుఁ డనఁ దగును. ప్రాచీనవాక్యములనే పోల్చుకొన లేనంతగాఁ దన వాక్యములద్వారా మూలార్థమునందు ద్రవింపఁజేసి మేళవించుకవి ద్రావకుఁడని యనఁబడును. చింతామణిని పోలి రసస్ఫూర్తిని గల్గించుచు చిత్రాకృతియును అదృష్టపూర్వమును నై బయలు వెడలెడి అర్థసార్థము అద్వితీయమైన చింతామణియే యని కవుల

చేతఁ గాని యూహింపఁబడినది. ఇట్టి కవికి అయోని యర్థము. ఆ కవియును, లౌకికుఁడని అలౌకికుఁడని లౌకికాలౌకికుఁడనియును, మూఁడువిధములుగ నుండును. అందు లౌకికమునకు:—

శ్లో. మా భోః శ కారలతికే వహ వర్ణగర్వం,
కిం డంబరేణ చణికే తవ కానుమేన?,
పుండ్రేక్షుయష్టి రియ మేకతరా చకాస్తి,
యా స్యందతే రస మృతేపి హి యంత్రయోగాత్.

ఓ శోకకారలతా? నీవు నేనే యుత్తమవర్ణము గలదాన ననెడి వర్ణగర్వమును [ఇట వర్ణము అనఁగ కులము, రంగు అని యర్థములు] పూనకుము. ఓచణికలతా! నీవు నేనే చక్కని పూవులు గలదాన ననెడి ఆడంబరము చేయుటచే నేమి ప్రయోజనము? ఖండచక్కెర గడ యిది యొక్కటియే లోకమునఁ ఖ్యాతిగలదై యొప్పును గాక. ఎయ్యది యంత్రయోగము లేకున్నను గానుగలోనుంచి గానుక నాడకున్ననుఁ, గూడ రసము స్రవించునో! అట్టి ఖండచక్కెర గడ—యని యన్వయము.

ఇఁకను అలౌకికమునకు నుదాహరణము:—

శ్లో. దేవి పుత్ర మనూత నృత్యత గణాః కిం తిష్ఠతే త్యుద్భుజే,
హర్షా దృృంగిరిటా వుదాహృతగిరా చాముండయా లింగితే,
పాయా ద్వో జితదేవ దుందుభిఘనధ్వానప్రవృత్తి స్తయో,
రన్యోన్యాంక నిపాత జర్జరజర త్సూలాస్థి జన్మారవః.

ఈ శ్లోకమునకు 73 పేజిలో అర్థము వ్రాయంబడినది. ఇఁక మిశ్రమున కుదాహరణము:—

శ్లో. స్థితే కుక్షౌ రంత స్ఫురజయిని నిశ్వాసమరుతో,
జనన్యా స్తన్నాభీసరసిజపరాగోత్కరముచః,
నిపీతా స్సానందం రచితఫణచక్రేణ హరిణా
సమంతా దప్యాఽఘాః ప్రతిదివస మేనాంసి భవతః.

[భగవంతుండగు శ్రీకృష్ణపరమాత్మ తల్లి యగు యశోదాదేవి యొక్క గర్భస్థితుండై ఉండంగా, తన్నా భిసరసిజపరాగోత్కరములను వెలివఱచుచున్నట్లున్న ఆ తల్లియొక్కనిట్టూర్పులు, రచితఫణా చక్రముగల శేషుని చేత నీయొక్క అఘములు సానందముగా గ్రోలంబడు చున్నట్టులు ఒప్పుచున్నవని భావము. ఇది అలౌకికము నకు ఉదాహరణము.]

ఇట్టి నాలుగు అర్థములలోను వెనుక హారణోప దేశమునందు చెప్పిన నాల్గు విధములకును నల్వురు కవులు చెప్పంబడిరి. వీరు నల్వురును ప్రత్యేకముగా నెన్మిదేసి భేదముల నొందుటచేత ముప్పదిరెండు విధ ములభేదముల నొందినట్లు అయినది. ఈ యర్థముల యందు ప్రతిబింబ కల్ప వికల్పములు ఇటుపైని యుదా హరింపందగి యుండును. ఆ యర్థమునే పౌర్వాపర్య విపర్యాసము చేసి కూర్చినట్టి బింబ ప్రతిబింబభావము వ్యస్తక మనంబడును. అనఁగా చెప్పినయర్థమునే పౌర్వాపర్యవిపర్యాసము నొందించియు హెచ్చుతగ్గులు చేసియును మార్చియును కూర్చుటలు మున్నగునవి యని యర్థము. ఎట్లందురా? చూడుఁడు.

శ్లో. దృష్ట్వా౽న్యేభం ఛేద ముత్పాద్య రజ్జ్వా
యంతు ర్వాచం మన్యమాన స్తృణాయ,
గచ్ఛన్ దర్భే నాగరాజః కరిణ్యా
ప్రేమ్ణా తుల్యం బంధనం నా స్తి జంతోః.

[ఇతరమగు ఏనుఁగును చూచి బంధనమును త్రెంపుకొని మావంటివిమాటను గడ్డిపోచగ లెక్కించి, యుత్పథమునఁ బోవుచున్న నాగరాజు, మార్గమునందు ఆడు ఏనుఁగుచేత సంధింపఁబడి నిలువఁబడెను. అహా లోకమునందు ప్రేమను మించినబంధము వే ఱేమియు లేదు గదా!] ఈ యర్థమునే వచ్చునట్లు చెప్పిన ఈ శ్లోకమును చూడుఁడు.—

శ్లో. నిర్వ్యాజేశ మనసోపిహి జంతోః ప్రేమబంధన మశృంఖలదామ,
యత్ప్రియా ప్రతిగజం గజరాజః ప్రస్థిత శ్చిర మధారి కరిణ్యా.

వి స్తృతమగు నర్థమును సంగ్రహించి చెప్పుట ఖండ మనఁబడును.—

శ్లో. పురా—ండుచ్ఛాయం తదను కపిశిమ్నా కృతపదమ్,
తతః పాకోద్రేకా దరుణగుణ సంవర్ధితవపుః,
శనై శ్శోషా రంభే స్థపుటనిజ విష్కంభవిషమం,
వనే వీతామోదం బదర మర సత్త్వం కలయతి.

[తొలుత పాండుచ్ఛాయమై పిమ్మట కపిశితమై అటుపైని పాకోద్రేకమువలన నెఱ్ఱనైనదై, అటుతరువాత శోషారంభమునందు స్థపుటవిష్కంభవిలసితమై యుండి, బదరము (రేఁగుపండు) ఆమోదరహితమై అరసత్త్వ

మును కూర్చుచున్నగని భావము.) ఈ శ్లోకార్థము ఈ విధముగ ఈ క్రిందిశ్లోకమున బ్రతిబింబీకరింపంబడి యున్నది.

శ్లో. పాకక్రియా పరిచయ ప్రగుణీకృతేన,
సంవర్గితారుణగుణం వపుషా నిజేన,
ఆపాదితస్థపుట సంస్థితి శోణపాషా,
దేత ద్వనే విరవతాం బదరం బిభర్తి.

సంక్షిప్తమగు నర్థమును విస్తరించుట తెలబిందు వనంబడును.

శ్లో. యస్యతంత్ర భరాక్రాంత్యా పాతాల తలగామినీ,
మహావరాహ దంష్ట్రాయా భూయ స్సస్మార మేదినీ.

[ఏ రాజుగారి తంత్రభరాక్రాంతిచేత పాతాళమున కణఁగఁ ద్రొక్కంబడినదై మేదిని మహావరాహాము దంష్ట్రమును స్మరించెను. ఈ యర్థము ఈ రీతిని ఉపవర్ణితమై యున్నది.—

శ్లో. యత్తంత్రా క్రాంతిమజ్జ త్ప్రథులమణి శిలా
శల్య వేల్లత్ఫణాంతే,
క్లాంతే పత్యావహీనాం చలదచల మహా
స్తంభ స్తంభారసీమా,
సస్మార స్ఫారచంద్ర ద్యుతి పువరవని
స్త ద్ధిరణ్యాక్షవక్షః,
స్థలాస్థి శ్రేణిశాణా నికషణనిశిత
ప్రౌఢ దంష్ట్రాగ్ర మగ్రమ్.

మఱియు నితరభాషలలో గల యర్థమును భాషాంతరమున మార్చి కూర్చుట నటనేపథ్యమని యనంబడు చున్నది.

ప్రా. శ్లో. సేచ్చ ఇ పాసాసంకీ కా ఓ దిణ్ణం పి పహిఅఘరణీఏ
ఓవా త్తికరయలోగ్గలియవలయమజ్ఝత్థిఅం పిండమ్.
ఛాయ సేచ్ఛతి పాశాశంకీ కాకో దత్తమపి పథికగృహిణ్యాః
అవనతకరతలోద్గళిత వలయ మధ్యస్థితం పిండమ్.

అని పై ప్రాకృత శ్లోకమునకు సంస్కృతచ్ఛాయ. పాంథకుటుంబినిచే తనకు తినుట కొసంగంబడిన దైనను వంచిన చేతినుండి ఎత్తిన వలయ మధ్యమునంగల పిండమును పాశమను నాశంక గలదియై కాకము ముట్టుకొన నిచ్ఛగించుట లేదని భావము. ఈ యర్థము ప్రతిబింబించునట్టులుగా నీశ్లోకమున విస్తరించి కూర్పంబడినది. కావున నిది నటనేపథ్య మను బింబ ప్రతిబింబ మగుచున్నది. చూడుఁడు—

శ్లో. దత్తం పిండం నయన సలిలక్షాలనా ధౌతగండం,
ద్వారోపాంతేక థమపి తయా సంగమాశానుబంధాత్,
వక్రగ్రీవ శ్చలితశిరాః పార్శ్వ సంచారిచక్షుః,
పాశాశంకీ గళిత వలయం నైవ మశ్నాతి కాకః.

ఛందస్సును మార్చికూర్చుట ఛందోవినిమయ మనఁబడును.—

శ్లో. కాంతే తల్ప ముపాగతే విగళితా నీవీ స్వయం బంధనాత్,
తద్వాస శ్శ్లథ మేఖలాగుణధృతం కిం చిన్నితంబే స్థితం

ఏతావ త్సఖి వేద్మి కేవల మహం తస్యాంగసంగే పునః,
క్వాస్తే క్వాస్మి రతం ను కిం కథమపి స్వల్పాపి మే న స్మృతిః.

ఈ యర్థమును ఈ క్రిందిరీతిని కూర్చిరి.—

శ్లో. ధన్యా స్తు యాః కథయథ ప్రియసంగమేఽపి,
విశ్రబ్ధచాటుక శతాని రతాంత రేషు,
నీవీం ప్రతిప్రణిహిత శ్చ కరః ప్రియేణ,
సఖ్య శ్శపామి యది కించి దపి స్మరామి.

కారణమును పరావర్తనము చేసిన హేతువ్యత్యయము అగును.

శ్లో. తతోఽరుణ పరిస్పంద మందీకృతరుచి శ్శశీ,
దధ్రే కామ పరిక్షామ కామినీగండ పాండుతామ్.

[తరువాత నరుణపరిస్పందనమున మందీకృతరుచియై చంద్రుఁడు కామపరిక్షామ కామినీ గండపాండుత్వమును ధరించెనని భావము.] దీనిని ఈక్రిందితీరున హేతువ్యత్యయము నొనర్చిరి:—

శ్లో. పదం కుసుమచాపేన గర్భిణీ గండపాండునా,
ఉదయాద్రి శిరస్యస్మి న్నిహితం పద మిందునా.

దృష్టమగు వస్తువును ఇతరకావ్యమునందు సంక్రమింపఁ జేయుట సంక్రాంతక మని యనఁబడును. ఎట్లనఁగా.—

శ్లో. స్నానార్ద్రార్ద్ర శ్శ్లథిత కబరీబంధలోలై రివాస్మిం,
శ్రోణీభారః కృతపరిచయః పల్లవైః కుంతలానాం.

అక్ష్యైతేభ్యో నభసి పతితః పంక్తిశో వారిబిందూః,
శ్లిష్యన్తి ప్రియం కువలయదృశాం కేళిహంసాః పిబంతి.

[స్నానార్ద్రాగ్రములను విధుతకబరీలోలములు నగు పల్లవములచేత కుంతలస్త్రీలయొక్క శ్రోణీభారము పరిచితమై యున్నది. మఱియును ఈ పల్లవములనుండి రాలుచున్నవాఁ బిందువులను మెడ లెత్తి ఆ స్త్రీలయొక్క క్రీడాహంసములు త్రాగుచుండును.] ఇది ఇట్లుపనిబద్ధమై యున్నది. కాన సంక్రాంతక మందురు.

శ్లో. సద్యస్స్నాతజపత్తపోధనజటా ప్రాంతస్స్రుతాః ప్రోన్ముఖైః,
పీయంతేంబుకణాః కురంగశిశుభి స్తృష్ణాన్యథా విక్లబైః,
ఏతాం ప్రేమభరాలసాం చ సహసా కుర్వన్ముఖే మాకుల,
శ్లిష్యన్ రక్షతి పక్షసంపుటకృతచ్ఛాయ శ్శకుంతః ప్రియాం.

ఉభయవాక్యార్థములను చేకొనుట సంపుటము అనఁబడును.

శ్లో. వింధ్యస్యాద్రేః పరిసరనదీ నర్మదా సుభ్రుసైషా,
యాదోభర్తుః ప్రథమగృహిణీం యాం విదుః పశ్చిమస్య,
యస్యామంత స్స్ఫురిత శఫరత్రాసహాసాకులాక్షీ,
స్వైరంస్వైరం కథమపి మయా తీర మత్తారితాఽసి.

[పశ్చిమ సముద్రునికి ఏనదిని ప్రథమకళత్రమునుగా పెద్దలు ఎఱుంగుదురో, ఏనదియందు, అంతస్స్ఫురితమగు శఫరత్రాసముచేత హాసాకులాక్షివై యుండఁగా నిన్ను మెల్లమెల్లగా దాటించి దరిని జేర్చియుంటినో, ఆ యీ నర్మదానదియే సుమా ఇది. వింధ్యపర్వతమునుండి ఇది ప్రవహించు చున్న దని తాత్పర్యము.]

ఉభయ వాక్యార్థములతో నొప్పెడి ఈ క్రింది సంపుటీకరణమును చూడుడు.

శ్లో. నాభీగుహాబిల విశచ్చల వీచిజాత,
మంజుధ్వని శ్రుతికణత్కల కుక్కుభాని,
రేవాజలా న్యవిరళం గ్రహిళీక్రియం తే,
లాటాంగనాభి రపరాహ్ణ నిమజ్జనేషు.

[నాభీ గుహాబిలములో ప్రవేశించుచున్న చంచల తరంగములయొక్క మంజుధ్వనిని వినుటచేత ధ్వనిచేయుచున్న కుక్కుభపక్షులు గల నర్మదానదీనీరములు లాటదేశస్త్రీలయొక్క మధ్యాహ్నసమయములందలి స్నానములయందు అవిరళములుగ గ్రహిళములు చేయంబడు చున్నయవి.]

ఈ యర్థమునందే ఇశ్లో కూర్చియున్నారు.

శ్లో. యద్వర్గాభిర్జగాహే గురుశకుల కులాస్ఫాలనత్రాప హాస,
వ్యస్తోరు స్తంభికాభి ర్దిశదిశ సరితాం దిగ్జయప్రక్రమేషు,
అంభోగంభీరనాభీ కుహరకవలనోన్ముక్త పర్యాయలోల,
త్కల్లోలా బద్ధముగ్ధ ధ్వనిచకితరణత్కుక్కుభం కామినీభిః.

ఈ ప్రతిబింబకల్పము సర్వవిధములను కవికి సుకవిత్వమును కల్గింపక, అవకవిత్వమును కల్గించును; కావున సాధ్యమైనంతవఱకును బుద్ధిమంతులు దీనిని పరిత్యజింపవలయును. ఏల యందురా? ఒకయుక్తి చూడుడు.

శ్లో. పృథక్త్వేన న గృహ్ణంతి వస్తు కావ్యాంతర స్థితమ్,
పృథక్త్వేన న గృహ్ణంతి స్వవపుః ప్రతిబింబితమ్ .

స్వపవు: ప్రతిబింబితమును వేఱుగా గొనని యట్లే కావ్యాంతర స్థితమగు వస్తువునుకూడ బుద్ధిమంతులు వేఱుగాఁ గొనరు అని దీని యర్థము

ఇది రాజశేఖరకవిరాజకృతకావ్యమీమాంస యను కవిరహస్యమున
ప్రథమాధికరణమున బింబ ప్రతిబింబకల్పన సమీక్ష యనునది
ద్వాదశాధ్యాయము.

---

•

# రాజశేఖరకవి కావ్యమీమాంస.

---

## త్రయోదశాధ్యాయము.

---

### అర్థహారణమున నాలేఖ్య ప్రఖ్యాదిభేదములు.

[ఈయధ్యాయమునందు వచ్చెడి విషయములు:—౧. ఆలేఖ్య ప్రఖ్య తుల్యదేహితుల్య పరపుర ప్రవేశ సదృశములలో ప్రత్యేకము గాఁగల పదునెన్మిదిభేదములు. ౨. వానిపేరులు. ౩. అందు సమక్రమాదు లగు నాలేఖ్యప్రఖ్యమునందలి భేదములు. ౪. విషయ పరివర్తద్వంద్వ విచ్ఛిత్త్యాదు లగు తుల్యదేహితుల్యములోఁ గల నెన్మిది భేదములు. ౫. పరపుర ప్రవేశములో గల హుండయుద్ధాది అష్టవిధభేదములు. ౬. మొత్తమున నిట్లు ముప్పదిరెండు విధము లగు హారణోపాయములు. ౭ అర్థవైపరీత్యముచేఁ గల్గు తద్విరుద్ధములగు నర్థహారణములు. ౮. వీని హానోపాదానచాతుర్యముపై కవిత్వము ఆధారపడి యున్నదని రూపించుట మొదలగునవి.]

ఇంకను ఆలేఖ్యప్రఖ్యములలోఁ గల భేదములను పరిసంఖ్యానము చేసెదము. అందు సదృశ సంచారణము సక్రమ మనంబడును. అనఁగా నొక్కరి శ్లోకములందున్న విధముననే అర్థమును తూచా తప్పకుండ సమముగా తన కావ్యమునందు వర్తింపఁజేయుట యెయ్యది కలదో, అది యే సమక్రమ మనంబడును. ఈ సమక్రమమునకు ఉదాహారణము.

శ్లో. అస్తాద్రివేశ్మని దిశో వరుణప్రియాయా-
తిర్యక్ తరఙ్గతంచి దవయంత్రణ మాస్థితాయాః,
గండైకపార్శ్వ మివ కుంకుమపంకచుంబి
బింబం రుచా మధిపతే రరుణం రరాజ.

[ఇది సాయంకాల వర్ణనము. అస్తమయ పర్వత మనెడి యింటిలో వరుణుని ప్రియురాలగు దిగంగన, (అనఁగా పశ్చిమదిక్కనెడి యంగన) తిర్యక్కుగా (నడ్డముగా) నవయంత్రణము నొందియున్నట్టిది కాఁగా, ఆ సమయమునందు ఆమెయొక్క కుంకుమపంకము తగుల్కొనిన గండస్థలముయొక్క పార్శ్వభాగమువోలె భానుబింబము ఎఱ్ఱనిదై ప్రకాశించెను—అని యర్థము. అనఁగా వరుణునికి ప్రియురాలగు పశ్చిమదిశాంగన యస్తగిరియను నింటిలో అవయంత్రణము నొందియుండ ఆమె అడ్డుగా దిఱుగువేళ ఆమెముఖమందలి కుంకుమపంకము రాచుకొనిన గండస్థల ప్రదేశమువలె సూర్యబింబ మున్నదని భావము.] ఈ యర్థము నిట్టే యొకకవి హెచ్చుతగ్గులు సేయకుండ సమముగా తన కావ్యమునందు చంద్రవర్ణనమునం గూర్చి యున్నాఁడు; కనుక నిది సమక్రమ మనెడి ఆలేఖ్యప్రఖ్యము. ఎట్టు లనఁగా.—

శ్లో. ప్రాగ్దిశః ప్రతికళం విలసంత్యాః
కుంకుమారుణ కపోలతలేన
సామ్య మేతి కలితోదయరాగః
పశ్య సుందరి! తుషారమయూఖః

[ఓ సుందరీ! ప్రకాశించుచున్న ప్రాగ్దిగంగన యొక్క కుంకుమారుణ కపోలరాగముతో ఉదయరాగ ముగల యీచంద్రుఁడు సాదృశ్యము నొందుచున్నాఁడు. చూడుము—అని భావము.

ఇఁకను ఆలేఖ్యప్రఖ్యములోఁ గల రెండవభేదము విభూషణమోష మనునది. అనఁగా నొక కవి అలంకార సహితముగా కూర్చినయర్థమును అలంకారవిహీనముగా గూర్చుట యని భావము. దీనికి ఈ క్రిందిది యుదాహర ణము కాఁగలదు. ఎట్లనంగా—

శ్లో. కువలయసితి మూలే బాలచంద్రాంకురాభం,
కదను ఖలు తతోగ్రే పాకపీతామ్రపీతం
అభినవరవిరోచిః ధూమధూమ్రం శిఖాయాం
ఇతి వివిధ వికారం దిద్యుతే దైప మర్చిః.

[కువలయమువలె తెల్లనైన మూలమునందు [మొదటిభాగమునందు] బాలచంద్రాంకురమువంటికాంతి గలదై, ఆ పిమ్మట పరిపాకముచేత పండబారిన మామిడి పండువలె [పచ్చని పసుపుపచ్చని] రూపము గలదియై అగ్రభాగమున పొగచే ధూసరవర్ణము గలదియై క్రొత్తగా నుదయించుచున్న సూర్యబింబముం బోలిన కాంతి గలదియై ఈ దీపసంబంధమగు జ్వాల వివిధములగు మార్పులతోఁ బ్రకాశించుచున్నది—అని అర్థము. ఇందు అలంకారసహితముగా గూర్చిన యీ కల్పనార్థమును ఈ క్రింది శ్లోకమునందు అనలంకృతముగా (అలంకార

ములు లేనట్లుగా) కూర్పఁబడెను. కనుక నిత్యాది విభూషణమోష మను నాలేఖ్య ప్రఖ్య మయ్యె నని యెఱుంగగా వలయును.

శ్లో. మనా జ్మూలే నీలం తదను కపిశోన్మేష మువరే
తతః పాండు స్తోకం స్ఫురదరుణలేఖం చ తదను
శిఖాయా మాధూమ్రం ధృతవివిధవర్ణక్రమ మితి
క్షణా దర్చి ర్దైపం దళయతి తమః పుంజిత మపి.

[మూలప్రదేశమునందు కొంచెమంత నలుపును ఆతర్వాత కపిశకాంతియు నడిమి భాగమునఁ గొంచెమంత బచ్చయును ఆపిమ్మట ఎఱ్ఱనిచాయయును శిఖాభాగమున ధూమ్రవర్ణమును ఇట్టులు అనేకవిధములగు వర్ణక్రమములను ధరించుచు నొక్కక్షణములోనే దీపసంబంధమగు నీజ్వాల, పుంజితమైనను (రాసిగాఁజేరి యున్నను) నీతమస్సును విదళించుచున్నది.-అని భావము.)

క్రమేణ యొకకృతియందు చెప్పిన యర్థమునకు విపరీతముగాఁ జెప్పుటయనునది వ్యుత్క్రమ మనెడి యాలేఖ్యప్రఖ్యములోని భేదమగుచున్నది. అనఁగా నాలేఖ్యప్రఖ్యప్రఖ్య మనెడి అర్థహారణమునందు అభిహిత మగు నర్థమును తలక్రిందుగా గూర్చుట వ్యుత్క్రమ మనిభావము. ఈవ్యుత్క్రమమున కీ క్రిందిశ్లోకము ఉదాహరణము కాఁగలదు. ఎట్లనఁగా పైనిచెప్పిన దీపవర్ణమునే ఈక్రింది రీతిగాఁ గూర్చినచో, వ్యుత్క్రమ మగును.

శ్లో. శ్యామం శిఖాభుజి మనాగరుణం తతోర్ధః
స్తోకావపాండురఘనం చ తతో౽ప్యధస్తాత్
ఆపింజరం తదను తస్య తలే చ నీలం
అంధం తమః పటలి మర్దతి దీప వర్తిః.

ఇఁక సామాన్యనిబంధమునందు విశేషాభిధానము విశేషోక్తి యనఁబడును. ఎట్లనఁగా:—

శ్లో. ఇత్యుద్గతే శశిని పేశలకాంతదూతీ
సంలాపసంచలితలోచనమానసాభిః,
అగ్రాహి మండనవిధి ర్విపరీతభూషా
విన్యాసహాసితసఖీజన మంగనాభిః

:—దశరూపవ్యాఖ్య

ఈరీతిగా చంద్రబింబ ముదయించఁగా నాయకుఁడు పుత్తెంచిన దూతికలయొక్క సరసములగు వచనరచనలచేత సంచలించిన కన్నులును మనస్సులును కలవారై ఆయంగనలు అలంకరించుకొను తీరులోఁగల విపరీతవిన్యాసముచే (చెలికత్తెలు నవ్వుచుండఁగా నలంకారరచనము నాచరించికొని రని తాత్పర్యము.)

ఈ యర్థమును, అనఁగా సామాన్యముగాఁ గూర్చిన యీవర్ణనమును, ఈక్రింది శ్లోకములలో వైశిష్ట్యముతోఁ జెప్పంబడినది గనుక ఇత్యాది విశేషోక్తి యనెడి అర్థహారణము.

శ్లో. చకార కాచి త్సితచందనాంకే
కాంచీకలాపం స్తనభారపృష్ఠే

ప్రియంప్రతి ప్రేషిత చిత్తవృత్తిః
నితంబబింబే చ బబంధ హారం,

[ఒకనాయిక తన మనస్సునంతను ప్రియునిపైఁ గూర్చియున్న దగుటచేతఁ బ్రియునిదగ్గఱకు తాను వెడలి పోవుటకై ముందుగా చేసికొనుచున్న అలంకార రచనములో తబ్బిబ్బువడుచు, శ్వేతచందనాంకము గల స్తన పృష్ఠమున మొలనూలును, సితంబస్థానమున హారమును, అలంకారము నొనర్చుకొనెను. అనఁగా నితంబమునం గట్టికొనవలసిన మొలనూలును స్తనములందును, స్తనములందు ధరింపవలసిన హారమును నితంబమునను ధరించినదని భావము.]

ఉపసర్జనముగా (అప్రధానముగా) నుండవలసిన యర్థమునకు ప్రాధాన్యముఁ గల్పించి అర్థహారణము చేయుట ఉత్తఁస మని యనంబడును. ఉదాహరణము.—

శ్లో. దీపయ న్నథ నభః కిరణౌఘైః
కుంకుమారుణ పయోధరగౌరః,
హేమకుంభ ఇవ పూర్ణపయోధే
రున్మమజ్జ శనకై స్తుహినాంశుః.

కిరాతార్జునీయకావ్యమ్. స 9 శ్లో. 23.

[చంద్రుఁడు మెల్లమెల్లఁగా నాతర్వాత తన కిరణ సముదాయముచే నాకసము నెల్లఁ బ్రకాశింపం జేయుచు, కుంకుమారుణ పయోధరగౌర మగు హేమ కుంభము (బంగరుగిండి) వలె పూర్వపయోధినుండి పైకి లేచెను. అనఁగా నుదయించె నని యర్థము.]

ఇందు ఉపసర్జనప్రాయముగాఁ జెప్పిన కుంకుమారుణ పయోధరగౌర మగు హేమకుంభమువోలె—అన్నయర్థమును ఈ క్రిందిశ్లోకములోఁ బ్రధానముగాఁ గైకొని రచనచేసి యున్నారు. కావున నియ్యది ఉత్తంస మనెడి అర్థహరణము (ఆలేఖ్య ప్రకారాంతర్గత మగు భేదము) అగు చున్నదని యెఱుంగవలయును. ఎట్లనఁగా:—

శ్లో. తత స్తమ శ్శ్యామల పట్టకంచుకం
విపాటయ త్యంచి దదృశ్య తాంతరా,
నిశాతరుణ్యా స్థ్సితశేషకుంకుమ
స్తనాభిరామం సకలం కళాపతిః.

[చంద్రునియొక్క సకళ మగు బింబము (కళాపరిపూర్ణమైన చంద్రబింబము) ఆ పిమ్మట నుదయించుచు తమశ్శ్యామల పట్టకంచుకమును చించుకొని కొంచెము కొంచెముగాఁ గన్పించుచు, శేషించినకుంకుమరాగరంజిత మగు నిశాంగన స్తనమువోలె మనోహరమై యొప్పుచు, కన్పట్టెను అని భావము. అనఁగా, చంద్రబింబము ఉదయించుకాలమున కొలఁదిపాటి యెఱుపుడాలు గలదై యొప్పుచున్నందున, రాత్రియనెడి స్త్రీయొక్క స్తనము నల్లనిచీకట్లనెడి పట్టురవికను భేదించుకొనుచు కొంచెముగా బయల్పడి, కొలఁది కుంకుమపూఁత గల చనుకట్టువలె నొప్పుచున్న దని తాత్పర్యము. ఇందుఁ బై నుపసర్జనముగాఁ జెప్పినయర్థము ప్రధానముగాఁ గూర్పంబడుటచే నిది ఉత్తంసిత మైన దని యెఱుంగవలయును.]

కైని చెప్పినదియే వస్తూక్తివశమున నన్యథాగా

వర్ణింపఁబడినచో నయ్యది నటనేపథ్య మనంబడును. ఉదాహరణము ఎట్లనంగా:—

శ్లో. ఆననేందుః శశలక్ష్మ కపోలే సాదరం విరచితం తిలకం యత్,
తత్ప్రియే విరచితావధి భంగే క్షాళిత మీక్షణజలై స్తరళాక్ష్యాః.

[ముఖచంద్రునికి శశలక్ష్మప్రాయముగా (లాంఛనముగా) నున్న తిలకము నాదరముతో దిద్దుటంజేసి, తరళాక్షి యొక్క కన్నీళ్ళతో మకరికాపత్రములు తుడిచివేయఁబడిన ట్లున్న వని యర్థము. [అనఁగా పెరవారి కలంకారము చేసినచూపోపమిచేఁ దమయలంకారము నూడ్చి నట్లుగా నిచ్చట ముఖచంద్రునికి చిహ్నముగా తిలకము దిద్దుటంజేసి, నేత్రములు అసూయచే మకరికాది పత్రభంగమునుఁ దుడిచి వైచుకొన్నవని భావము] ఇయ్యది ఈక్రింది శ్లోకమున మఱొక్కవిధముగా కూర్పఁబడినది. గనుక నీక్రిందిది నటనేపథ్యమను అర్థహారణ మగును. ఎట్లనంగా:—

శ్లో. శోకాశ్రుభి ర్వాసరఖండితానాం సిక్తాః కపోలేషు విలాసినీనాం,
కాంతేషు కాలాత్యయమాచరత్సు స్వల్పాయుషః పత్రలతా బభూవుః.

[ప్రియులు వచ్చెద మనిన సమయమునకు రాక, ఆలస్యము చేయుటంజేసి, వాసరఖండిత లగు స్త్రీలయొక్క చెక్కిళ్లు శోకాశ్రువులతోఁ దడుపంబడుటచే నందున్న మకరికాది పత్రరచనలు తుడిచివేయంబడినవై పత్రలతలు (మకరికాదులు) స్వల్పాయుర్దాయము కలవిగా నయ్యెను అని భావము. ఇందు మకరికాది పత్రరచనలు తుడిచివేయుటకు, కాలాత్యయమును సహింపక పోవుటచేఁ గన్నీ

ళ్లి జనించు, అని కారణముగాఁ గూర్పంబడినది. కావున నిది నటనేపథ్య మనంబడును.)

పరికరసాదృశ్య మున్నను, పరికార్యమును అన్యథా కూర్చుటంజేసి ఏకపరికార్య మనెడి అర్థాహరణము అగు నని యందురు. ఇందులకు నుదాహరణము.—

శ్లో. అవ్యాద్గజేంద్రవదనః స ఇమాం త్రిలోకీం
యస్యోద్ధతేన గగనే మహతా కరేణ,
మూలావలగ్న సితదంతబిసాంకురేణ
నాళాయితం తపనబింబ సరోరుహస్య.

(అట్టి మహామహిముండగు గజాననుండు మమ్ము రక్షించుఁగాక ఏగజాననుఁడు తొండమును పైకిఁజాఁచి లేచినప్పుడు, ఈముల్లోకములను వ్యాపించిన సూర్యబింబ మనెడి పద్మమునకు నాళమువలె (కాడవలె) అయ్యెది అయ్యెనో. అట్టిగజాననుం డని పైదానితో నన్వయము.)

ఈయర్థమున క్రింది రచనము సేయంబడినది:—

శ్లో. సరళకరదంతనాళం గజవపుషః పద్మకరం విభో ర్జయతి
మూలబిసకాండభూమా యత్రాఽభూ దేకదంష్ట్రైవ.

(విఘ్న శరీరముగల దేవునియొక్క సరళమగు తుండాదండ మనెడి నాళము గలదియైన కమలము, సర్వోత్కర్షముతో విలసిల్లుచున్నది. ఏ మూలభూత మగు బిస కాండ ప్రదేశమునందు ఒంటికోరయే యున్నదో అని యర్థము. ఇందు తుండాదండమునకు ఉభయశ్లోకము లందును పరికరసామ్యము సమముగానే యున్నను, రెండవ దానిలో పరికార్యమునకు అన్యథాత్వమును కూర్చుటం

జేసి, ఇది ఏకపరికార్య మనెడి యర్థహరణ మగుచున్నద
ని యందురు. అనఁగా ఆలేఖ్యప్రఖ్యములలో నియ్యది
యొకవిధ మగు నని యర్థము.)

వికృతియగు నర్థమునకు ప్రకృతిప్రాప్తిని చెప్పుట
ప్రత్యాసత్తి యను నర్థహరణ మగును. ఎట్లనఁగా—

శ్లో. రవిసంక్రాంతసౌభాగ్యః, తుషారావిలమండలః,
నిశ్వాసాంధ ఇవాదర్శ, శ్చంద్రమా న ప్రకాశతే.

[సూర్యునియందు సంక్రమించిన సౌభాగ్యము (సు
భగత్వము) కలవాఁడును, మంచుచేఁ గప్పివేయంబడిన
మండలము కలవాఁడును నై, చంద్రుఁడు నిట్టూర్పులతో
గ్రుడ్డివారిన దర్పణము వలె ప్రకాశింప కున్నాఁడు—
అని తాత్పర్యము.] అనఁగా, చంద్రబింబము వికృతి నొం
దినట్లు లిచట వర్ణింపంబడినది. ఈయర్థమును తీసికొని
ప్రకృతి నొందినట్లుగా కూర్చిరి యీక్రింది శ్లోకమును.
కనుక నిది ప్రత్యాసత్తి యనెడి అర్థహరణ మయ్యెను.

శ్లో. తస్యాః ప్రతిద్వంద్విభవా ద్విషాదాత్,
సద్యోవిముక్తం ముఖ మాబభాసే,
నిశ్వాసబాష్పాపగమే ప్రసన్నః
ప్రసాద మాత్మీయ ఇ వాత్మదర్శః.

[ఆవిడయొక్క ముఖము, తనకు ప్రతిద్వంద్వి నె
చ్చుట నేర్పడునో యన్నవిషాదమునుండి వెన్వెంటనే
విముక్తి నొందినదై, తనయొక్క అద్దము నిట్టూర్పుల ఆవి
రి పోయిన వెన్వెంటనే, సహజ మగు ప్రసన్నత నొందిన
ట్లుగా, ప్రసన్నత నొంది ప్రకాశించెను—అని భావము.]

ఇంతదనుకను చెప్పినట్టి భేదములు, అనఁగా నింత వనుక వర్ణించిన అర్థహారణభేదములు—ఆ లేఖ్యప్రఖ్య మనెడి అర్థహారణములోని భేదము లని యెఱుఁగఁదగును.

[ఈయాలేఖ్యప్రఖ్య మనునది అన్యయోని రెండవదగు భేదము.] ఇయ్యది మహాకవులకు అనుగ్రాహ్య మగునట్టి—అనుసరింపఁ దగినట్టి—దగు మార్గము. ఇట్టులనే పెద్దలును చెప్పిరికూడ:—

శ్లో. సోయం భణితివైచిత్ర్యా త్సముత్థో వస్తువిస్తరః,
నటవద్వర్ణికాయోగాత్ అన్యథాత్వ మివాప్నుతి.

ఆనఁగా పైనిజెప్పినట్టి అయీమార్గము వర్ణనపద్ధతియందలి చమత్కృతి వలన నేర్పడినట్టిది. ఇందుఁ జెప్పిన వస్తువిస్తర మంతయును వర్ణికాయోగముచేత నటుఁడెట్లు అన్యథాత్వము నొందఁగల్గుచున్నాఁడో, అట్టులనే ఇదియును వర్ణికాయోగముచేతఅన్యథాత్వమునొందఁగల్గును. అనఁగా విలక్షణమై నూతనత్వము నొందు నని భావము. వర్ణికాయోగ మనుమాటకు, నటుని పక్షములో రంగులు పూసికొనుట అనియు, రచనపక్షములో మెఱుఁగులు కూర్చుట యనియును అర్థద్వయము నిట ననుసంధానముఁ జేసికొనందగును.

ఇఁకఁ దుల్యభేదతుల్యము నందలి భేదములను వివరించెదము. అందు విషయపరివర్త మనునది యొక్కభేదము. ఆవస్తువునకే విషయాంతరయోజన చేయుటచేత అన్యరూపప్రాప్తి కల్గును. ఇదియే విషయపరివర్త మని చెప్పంబడును. విషయపరివర్త మెట్లనంగా.—

శ్లో. యే సీమంతితగాత్రభస్మరజసో యే కుంభకద్వేషిణః,
యే లీఢాః శ్రవణాశ్రయేణ ఫణినా, యే చంద్రశైత్యద్రుహః,
తే కుప్యద్గిరిజావిభక్తవపుషః చిత్తవ్యథాసాక్షిణః,
స్థాణోర్దక్షిణనాసికాపుటభువః శ్వాసానిలాః పాంతు వః.

[ప్రణయకుపిత యగు పార్వతిచే వేఱుసేయఁబడిన శరీరము గలవాఁడు, నగు నర్ధనారీశ్వరుని యొక్క (విరహవేదనచేనైన) చిత్తవ్యథకు సాక్షిభూతములై, సీమంతితగాత్రమునందలి భస్మపరాగములు గలవై, కుంభకమునెడి యోగమునకు ద్వేషులై, శ్రవణకుండలభూతమగు ఫణిరాజుచే నాస్వాదింపఁబడినవై, చంద్రునిలోని శైత్యమును సయితముఁ బోకార్చునవై, దక్షిణ నాసికాపుటమునుండి బయలు వెడలిన శ్వాసానిలము లెయ్యవి గలవో, అయ్యవి మిమ్ము రక్షించుఁ గాక—యని భావము. ఈ యర్థమునే, అనఁగా నీశ్వరపరముగాఁ గూర్చిన యీ కల్పనమునే విష్ణుపరముగా నీ క్రింది శ్లోకమునఁ గూర్పంబడినది. కావున నిది విషయపరివర్త మను తుల్యభేద తుల్యమను నర్థహరణ మగును.

శ్లో. యే కీర్ణ క్వథితోదరాబ్జమధవో యే మ్లాపితోరఃస్రజః,
యే తాపాత్తిరిశేన తల్పఫణినా పీతప్రతీపోజ్ఝితాః,
తే రాధాస్మృతిసాక్షిణః కమలయా సానూయమాకర్ణితాః,
గాఢాంతర్దవతాపః ప్రతప్తపరుషాః శ్వాసా హరేః పాంతు వః.

[ఎయ్యవి చెదరి యుడుకెత్తిన ఉదర (నాభి) కమలమునందలి మధువులు (మకరందములు) గలవో, ఎయ్యవి సంతాపమునఁ దరిశమగు చున్న తల్పఫణియగు నాదిశేషువుచేఁ బీల్పఁబడి వదలి పెట్టంబడ బడినవో, రాధా

స్ఫురణమున కెయ్యవి సాక్షిభూతములో, ఎయ్యవి లక్ష్మిచే ససూయాగర్భముగాఁ గని పెట్టఁబడినవో, గాఢాంతస్సంతాపము గల శ్రీమహావిష్ణువు యొక్క ప్రతప్తసరళము లైన యా నిట్టూర్పులు, మిమ్ముఁ బ్రోచుఁగాక.

ఇక్కడ ద్విరూప మగు వస్తువును అందేదియో యొక రూపముతో స్వీకరించుట ద్వంద్వవిచ్ఛిత్తి యనెడి తుల్యదేహితుల్యభేద మగు నర్థహారణ మనఁబడును.

శ్లో. ఉత్క్లేశం కేశబంధః కుసుమశరరిపోః కల్మషం వస్స ముష్యాత్,
యత్రేందుం వీక్ష్య గంగాజలభరలులితం బాలభావా దభూతాం,
క్రౌంచారాతిశ్చ ఘాంటస్ఫురితశఫరికామోహ లోలేక్షణశ్రీః,
సద్యః ప్రోద్యన్మృణాళీ గ్రహణరసలసత్పుష్కరశ్చ ద్విపాస్యః.

[పరమేశ్వరుని ఏజటాజూటమునందలి గంగాంభోలులిత మగు చంద్రుంగాంచి, పిల్లతనముచే ఘాంటస్ఫురిత శఫరిక యనుభ్రాంతిచే, లోలమగు వీక్షణ శ్రీగలవాఁడు అగు కుమారస్వామియును, కొనలు సాగిన తామర తూఁడను భ్రాంతిచే పట్టుకొని రసగ్రహణము చేయుద మనెడి లాలసతో విలసిల్లు తొండముఁగల వాఁడుగా విఘ్నేశ్వరుఁడునైరో, అట్టి మన్మథారాతియొక్క కేశబంధము మీ యొక్క ఉత్క్లేశము నంతను హరించుఁగాక.] ఈయర్థమును గైకొని, ఈ క్రింది రీతిగా అన్యతరోపాదానము చేయంబడినది గనుక, నీక్రిందిది ద్వంద్వవిచ్ఛిత్తి యనెడి తుల్యా దేహి తుల్యా మగు నర్థహారణ భేదము.

శ్లో. దిశ్యా ద్ధూర్జటి జూటకోటిసరితి జ్యోత్స్నాలవోద్భాసినీ,
శాశాంకీ కళికా చలభ్రమివశా ద్ద్రాగ్దళిష్టస్పృష్టా సుఖం,

యాం చంచచ్ఛిఖరస్థ శేషణ మాకులీ కుర్వన్ ఫణాళీం ముహుః,
ముహ్యల్లిక్షు మహీ క్షిప్య క్షతితమా మాకుంచనప్రాంచనైః.

ఈశ్వరునిజటాజూటము నందలి నదిలో జ్యోత్స్నా లవముచే (చిఱువెన్నెలచే) భాసిల్లుచున్నయే చంద్రకళ, నీటిసుడిచే చక్కగ కన్పించి, అంతలో నదృశ్యతను చెందుచున్నదో, ఎద్దానిని చూచి ఈశ్వరుని అఱుతయందుగల సర్పము, మీలనెడి భ్రాంతిచేత, పడగను ముడిచికొని పట్టుకొనవలయునని యత్నించి, లక్ష్యము చెదఱఁగా మఱలఁజూచి మఱల నిట్లే ప్రయత్నించుచు, ఆ కుంచనప్రాంచనములను చేయుచున్నదో, ఆచంద్రకళ మీకు సుఖము నొసంగుఁగాక—యని భావము.]

ఇందు పైశ్లోకములోఁ జెప్పిన రెండుతెఱగులగు రూపములుగల వస్తువునుండి ఒక్కరూపముగల వస్తువునే స్వీకరించి యున్నాఁడని యెఱుంగునది.

పూర్వులు సెప్పినయర్థములను అర్థాంతరములలో హరించుట రత్నమాల యని యనంబడును. ఉదాహరణము:—

శ్లో. కపోలే మార్జారః పయ ఇతి కరాంల్లేఢి శశినః
తరుచ్ఛిద్రప్రోతా న్బిస మితి కరేణుః కలయతి,
రతాంతే తల్పస్థాన్ హరతి వనితా ప్యంశుక మితి
ప్రభామత్తశ్చంద్రో జగ దిద మహో విభ్రమయతి.

[ప్రపంచమునందంతటను చంద్రకిరణములు వెల్లివిఱిసి తెల్లనికాంతు లీనుచుండంగా, పిల్లి, పునుకపైనున్న చంద్రికలంజూచి, భ్రమతో పాలనుకొని, గతుకుచున్నది.

చెట్లకొమ్మల గుండ ప్రసరించిన చంద్రకిరణములను గని ఏనుఁగుగున్న తామరతూఁడని పట్టుకొనుచున్నది. సురతాంతమునందు స్త్రీకూడ పాన్పుపై పడిన ఆ కిరణములను తనవెల్లచీర యనుకొని లాగుచున్నది అహా ఎంత యాశ్చర్యము! ప్రభామత్తుఁడగు చంద్రుఁడు లోకమునంతను విభ్రమింపఁ జేయుచున్నాఁ డని యర్థము.] ఈయర్థమునందే ఈక్రింది శ్లోకమున నర్థాంతరములో నంతరణము కావించి కూర్చి యుండుటచేత, నియ్యది రత్నమాలయని చెప్పంబడుచున్నది. ఎట్లనఁగా—

శ్లో. జ్యోత్స్నాసావచ్ఛి దుగ్ధబుద్ధ్యాకబళితమసకృద్భాజనే రాజహంసైః,
స్నాస్యంసే కర్పూరపాంసుచ్ఛురణరభసతః సంభృతం సుందరీభిః,
పుంభిర్వ్యక్తం స్తనాంతాత్సిచయమితి కరాస్స్రంభమేవల్లభానాం,
శీఘ్రం ప్రాక్సింధువారే వ్యభిసరణమనోలంపటైః షట్పదైశ్చ.

[భోజన (పాత్ర) మునందు ప్రసరించిన వెన్నెల కాంతిని రాజహంసములు పాలనెడిబుద్ధితో కబళించుచున్నవి. సుందరులు తమబుజముల నుండి కర్పూరపరాగము జారిపోవుచున్నదని పట్టుకొనుచున్నారు. పురుషులు తమ ప్రియురాండ్ర స్తనాంతరముల నున్న సిచయమని తొలఁగఁ ద్రోయుచున్నారు. తుమ్మెదలు క్రొత్తగాఁ బూచిన పూవులనెడి లంపటతో సింధువారవృక్షములను ముసురుకొనుచున్నవని భావము.]

సంఖ్యావైషమ్యముతో నర్థముం గూర్చుట సంఖ్యోల్లేఖ మను వారణ మగును.

శ్లో. నమన్నారాయణచ్ఛాయా చ్ఛురితాః పాదయోర్నఖాః,
త్వచ్చంద్రమివ సేవంతే రుద్ర రుద్రేందవో దశ.

[ఓయీశా! నమస్కరించుటకై వంగినవిష్ణు దేవుని ఛాయచే నావరింపఁబడిన నీ (కాలి) గోళ్లు పదియు నీ చంద్రుని సేవింపవచ్చిన పదిరూపులగు చంద్రులఁబోలె నున్నవి యని భావము.] ఈ యర్థమే సంఖ్యావైషమ్యము నొనర్చి యీక్రింది శ్లోకమునందు కూర్పఁబడినది. గనుక నిదిసంఖ్యోల్లేఖ మను నర్థహారణము.

శ్లో. ఉమైకపాదాంబురుహే స్ఫురన్నఖే
కృతాగసో యస్య శిరస్సమాగమే,
పదాత్మతా మాశ్రయతీవ చంద్రమా
స్స నీలకంఠః శ్రియ మాతనోతు వః.

సమమును చెప్పి, ఎక్కుడు నుపన్యసించుట చూళిక యను నర్థహారణ మగును. ఇది సంవాదిని యనియు విసంవాదిని యనియు నిఱు తెఱఁగులు. అందుఁ దొలి దానికి నుదాహరణము.

శ్లో. అంగణే శశిమణీవిలేపనే సుప్తమిందుకరపుంజసన్నిభం,
రాజహంస మసమీక్ష్య కాతరా రౌతి హంసవనితాశ్రుగద్గదం.

[చంద్రకిరణములు దట్టముగా నలమికొనిన చంద్రకాంతమణివేదికయందు నిద్రించుచు, చంద్రకిరణములపుంజముఁబోలె నున్న రాజహంసను కనుఁగొనలేక, ఆడుహంసము అశ్రుగద్గదముగా నేడ్చుచున్న దని యర్థము. ఈ యర్థమునే ఈక్రింది రీతిని గూర్చిరి:—

శ్లో. చంద్రప్రభాప్రసరపాండిని సౌధపృష్ఠే
దుర్లక్షపక్షతి పుటాం న వివేద జాయాం,
మూకశ్రుతి ర్ముఖరనూపురనిస్వనేన
వ్యాహారిణీ మపి పురో గృహరాజహంసః.

చంద్రకాంతి గాఢముగాఁ బ్రసరించుటచేత తెల్ల బాఱిన మేడయొక్క (సౌధము యొక్క) పైభాగము నందు గుర్తింప వీలు లేని చెక్కులుగల తన భార్యను మొఱయుచున్న యందియలవంటి ధ్వనితోఁ దన పిలువు నకు మాఱు పలుకుచున్నను, ఆ గృహరాజహంసము అద్దానిని వినకయే యున్నందున, కనుంగొనంజాలక పోయె నని భావము.]

ఇఁక రెండవదానికి నుదాహరణము. పైనిఁ జెప్పిన విషయముననే. ఎట్లనంగా.—

శ్లో. జ్యోత్స్నాజలస్నాయిని సౌధపృష్ఠేవివిక్తముక్తాఫలపుంజగౌరాం,
వివేద హంసీ దయితం కథంచి చ్ఛలత్తులాకోటిరవైస్తినాదైః.

నిషేధమును విధితోఁ గూర్చుట విధానాపహరణ మనంబడును. ఎట్లనంగా —

శ్లో. కురవక కుచాఘాతక్రీడారసేన వియుజ్యసే,
వకుళవిటపిన్ స్మర్తవ్యం తే ముఖాసవసేచనం,
చరణ ఘటనాశూన్యో యాస్య స్యశోక సశోకతాం,
ఇతి నిజపురత్యాగే యస్య ద్విషాం జగదు స్త్రియః.

ఏ రాజుగారియొక్క శత్రుస్త్రీలు (శత్రువులభార్య లు) తమ పట్టణములను వీడి యరణ్యములకుఁ బోఁబోవు నపుడు, తాము దోహదము నొనర్చిన ఉద్యానవనపాదప ములను జూచి, ఓ కురవకవృక్షమా! నీ విటుపైని కుచా ఘాతక్రీడ లేనిదాన వయ్యెదవు. ఓ వకుళవృక్షమా! నీకు మే మొనర్చిన ముఖాసవ సంసేచనమును మఱచిపోక జ్ఞప్తియం దుంచుకొనుము, ఓ యశోకమా! పాదముల

సంఘటనలు లేక నే విట్లుపైని పశోకత్వము నొందఁ గలవు-అఃు పలికి చనిరో, ఆరాజు అని యన్వయము

ఈ యర్థమును సిల్లు ఈ క్రిందిశ్లోకమున హారణము నొనర్చినారు. చూడుఁడు.

శ్లో. ముఖమదిరయా పాదన్యాసైః విలాసవిలోకితైః,
వకుళవిటపీ రక్తాశోక స్తథా తిలకద్రుమః,
జలనిధితటీ కాంతారాణాం క్రమాత్కకుభాం జయే.
ఝటితి గమితా యద్వ్యగ్రాభిః వికాసమహోత్సవమ్.

సముద్రతీరపు అడవులలోని వకుళవృక్షములు రక్తాశోకము తిలకవృక్షము—అను నియ్యవి క్రమముగా ముఖమద్యముచేతను పాదన్యాసములచేతను విలాస విలోకనములచేతను ఒక్కమాఱుగా పుష్పవికాస మహోత్సవమును తమతమ వర్గమునకుఁజెందిన వృక్షము లన్నిటితోఁ గూడ నొంది, దిక్కులను జయించుటకై సిద్ధపడినట్టు లున్నవి—యని భావము.

ఇఁకఁ బెక్కర్థముల నొక్కచో నుపసంహరించుట మాణిక్యపుంజము అని చెప్పఁబడును. ఉదాహరణము ఎట్లనఁగా:—

శ్లో. శైలచ్ఛలేన స్వం దీర్ఘం భుజ ముత్తమ్య భూవధూః.
నిశాసఖ్యాః కరోతీవ శశాంకతిలకం ముఖే.

[భూదేవియనెడి నాయిక, కొండలనెడి మిషతోఁ పొడవగు తన బాహువు నెత్తి, రాత్రియనెడి తన చెలికత్తెకు, శశాంకతిలకమును (చందురుఁడనుబొట్టును) ముఖమున నొనర్చుచు నున్నట్టు లొప్పుచున్నది.]

మఱియును నెట్లనఁగా:—

శ్లో. ఫుల్లాతిముక్తకుసుమ స్తబకాభిరామ
మారోల్లసత్కిరణకేసర మిందుసింహమ్.
దృష్ట్వోదయాద్రి శిఖరస్థిత మంధకార
దుర్వారవారణ ఘటా వ్యఘటంత సద్యః.

[ఉదయపర్వతశిఖరమున నున్నదై, వికసించిన అతిముక్తవృక్షముల పూగుత్తులతో మనోహరమై, దూరమునకు ప్రసరించుచున్న కిరణములనెడి జూలు గలదియై, యొప్పెడి చందురుఁడను సింగముం గాంచినంతనే, చీఁకటు లనెడి ఏనుఁగులమంద వెన్వెంటనే పటాపంచలగునట్లు విచ్చిపోయెఁ నని తాత్పర్యము.] మఱియు నెట్లనఁగా—

శ్లో. సంవిధాతు మభిషేకముదాసే మన్మథస్య లసదంశుజలౌఘః,
యామినీవనితయా తతచిహ్నః సోత్పలో రజతకుంభ ఇవేందుః.

[మన్మథుండను యువరాజునకు నభిషేకము నొనర్పుటకై యొప్పుచున్న జలముతో నిండినదియును వ్యాప్తమైన చిహ్నము గలదియును యామినియనెడి స్త్రీచే ఉత్పలములతోఁ గూర్పంబడి యున్నదియు నగు వెండి కడవవోలె ఇందు బింబము ప్రకాశించె నని భావము.

మఱియును నెట్లనఁగా.—

శ్లో. ఉదయతి పశ్య కృశోదరి! దళితత్వక్క్షీర కరణిభిః కిరణైః,
ఉదయాచల చూడామణి రేష పురో రోహిణీరమణః.

[ఓ కృశోదరీ! దళితత్వక్క్షీరములవోలె నొప్పుచున్న కిరణములతోఁగూడి ఈరోహిణీభర్త (చంద్రుఁడని భావము.) ఉదయాచల చూడామణియై యెదుట నుదయించుచున్నాఁడు. చూడుము.]

శ్లో. ఉదయతి నవనీత పిండపాండుః
కుముదవనా న్యవఘట్టయ న్కరాగ్రైః
ఉదయగిరి తటస్ఫుటాట్టహాసో
రజనివధూముఖ దర్పణ శ్శశాంకః,

(తన కిరణజాలములచే గములవనములను మర్దించుచు, ఉదయగిరి తటముల నట్టహాసము సల్పుచు, వెన్నముద్దవోలె పాండురమై, రాత్రియనెడి నాయికకు అద్దము వలె నున్న యీ చంద్రుండు ఉదయించుచున్నవాఁ డని తాత్పర్యము.]

మఱియు నెట్లనఁగా.——

శ్లో. ప్రోషితైకేందు హంసేఽస్మి న్స్నాప్నావివ తమోంబుభిః,
నభ స్తటాకే మదనం తారాకుముద హాసిని.

[ప్రోషితైకేందుహంసమును తారలనెడి కుముదములతో విలసిల్లుచున్నదియు, నగు నాకస మనెడి తటాకమునందు మదనుఁడు తమము లనెడి యంబువులతో స్నానము నొనర్చినట్లు యొప్పె నని భావము.]

ఈపైని చెప్పినట్టి శ్లోకములలోఁగల భూదేవి బొట్టుపెట్టుట (శైలచ్ఛలేన అను శ్లో.) చీకట్లనెడి ఏనుఁగుల మంద చంద్రుఁడను సింహముంజూచి విచ్చిపోవుట, యామినీ నాయికచేఁబట్టిన వెండికడవవోలె చంద్రుఁ డొప్పుట, ఉదయాచలమునకు చంద్రుఁడు చూడామణివలె నుండుట, రాత్రియనెడి నాయికకు ముఖదర్పణమగుటఁ గగనమను సరస్సునకు హంసవోలె చంద్రుఁడొప్పుట— అను నీ పెక్కర్థములను ఒక్కచోట నీక్రిందఁ జెప్పంబడి

నరీతిగా సంగ్రహించి కూర్చుటంజేసి యీక్రిందిది మాణిక్యపుంజ మనెడి యర్థహారణమున కుదాహరణ మని యెఱుంగునది. ఎట్లు లనఁగా:—

శ్లో. రజనిపురంధ్రిలోధ్రతిలక స్తిమిరద్విపయూథకేసరీ
రజతమయోఽభిషేకకలశః కుసుమాయుధ మేదినీపతేః
అయ ముదయాచలైక చూడామణి రభినవ దర్పణో దిశాం
ఉదయతి గగనసరసి హంసస్య హసన్నివ విభ్రమం శశీ.

[రాత్రియనెడి పురంధ్రికి లోధ్రతిలకమై, చీఁకటు లనెడి ఏనుఁగులమందకు సింహమై, వెండితోఁ జేయంబడిన మన్మథమహారాజు నభిషేకకలశమై, ఉదయాచల చూడామణియై, దిగంగనలకుఁ గ్రొంగ్రొత్తయద్దమై గగనమను సరస్సునఁగల హంసయొక్క విలాసమును పరిహాసించుచున్నట్లున్న దై, చంద్రబింబ ముదయించుచున్న దని తాత్పర్యము.]

కందభూతముగా నున్నయర్థమును కందళాయమానము లగు విశేషణములతో జెప్పంబడునది కంద మనెడి అర్థహారణ మగును. అనఁగా సూక్ష్మరూపముతో కందమువలె [చెట్టు లేక తీగయొక్క దుంపవలె] నున్నదానిని విరివిగా చేసి ఆకందములోనుండి బయలువెడలినట్టి అంకురములువోలె నున్న విశేషణములతో బెంచి కూర్చినచో అది కంద మనెడి అర్థహారణము అగు నని తాత్పర్యము. ఉదాహరణము ఎట్లనంగా:—

శ్లో. విదిశాఖామున్మేషు విసరతి పుంజీభవతీవ శాఖిశిఖరేషు,
కుముదాకరేషు వికసతి శశికలశపర్యస్తా జ్యోత్స్నా.

వెన్నెల చంద్రుఁడనెడి కడవతో ముంచి పోయు చున్నట్లున్నదై, దిశాముఖముల నలముకొనుచు నున్నది. సౌధశిఖరముల రాశిపడుచున్నది. కుముదాకరముల నిండి వికసించుచున్నది–యని భావము. దీనిని ఈ క్రింది శ్లోకములో కిందభ్రాయమానములగు విశేషణములతో చెప్పియున్నారు కావున నియ్యది కంద మను నర్థహరణ మయ్యెను.

శ్లో. వియతి విసర్పతీవ కుముదేషు బహూభవతీవ యోషితాం,
ప్రతిఫలతీవ జరఠశరకాండపాండుషు గండభిత్తిషు,
అంభసి వికసతీవ లసతీవ సుధాధవళేషు ధామసు,
ధ్వజపటపల్లవేషు లలతీవ సమీరచలేషు చంద్రికా.

వెన్నెల ఆకసమునఁ జెలరేఁగి గుప్పుగుప్పున గుప్పు చున్నట్లును, కుముదములందు విరివిఁ జెందుచున్నట్లును స్త్రీలపాండు గండస్థలములఁ బ్రతిబింబించు చున్నట్లును నీళ్లపై మొలకలు దొట్టి వికసించుచున్నట్లును సుధాధవళములగు సౌధములఁ బూతపూయుచున్నట్లును గాలికిఁ గదలియాడెడి ధ్వజపటపల్లవములలో తూఁగాడుచున్నట్లును ఒప్పుచున్నదని భావము. ఇట్లులనే ఈ క్రింది శ్లోకమునందును కలదు. కనుఁడు.

శ్లో. స్ఫటికమణీఘట ఇవేందుః, తస్యా మపిధాన మానసమివాంకః,
క్షరతి చిరం తేన యథా జ్యోత్స్నా ఘనసారధూళిరివ.

చందురుఁడు పటికఁపుమణులతోఁ జేసిన కడవ వోలెను, చంద్రునియందున్న కళంకము ఆకడవయొక్క అపిధానమగు (తెఱచికొనియున్న) ముఖమువోలెను, అం

దుండి బయలు వెడలుచున్న వెన్నెల కర్పూరపుధూళి వోలెను చిఱకాల మలమికొనినది—అని తాత్పర్యము.

శ్లో. సితమణికలశా దిందోః హారిణహారిత్తృణ పిధా నతో గళితైః,
రజనిభుజిష్యా సించతి నభోంగణం చంద్రికాంభోభిః.

చంద్రుఁడనెడి తెల్లనిస్ఫటికమణముతోఁ జేసిన కడవనుండి, హారిణ హారిత్తృణ పిధానమున జారినచంద్రికలు (వెన్నెలలు) అనెడి నీళ్లతో నాకము అనెడి యంగణమును రాత్రియనెడి పరిచారిక సేచనము సేయుచున్నది. అని భావము.

శ్లో. సంవిభాగాసు మభిషేక ముదాసే మన్మథస్య లసదంశుజలౌఘః,
యామినీవనితయా తతచిహ్నః సోత్పలో రజతకుంభ ఇవేందుః.
—కిరాతార్జునీయము. స 9. 32 శ్లో.

ఈశ్లోకమున కర్థము ఇదివఱకు వ్రాయఁబడినది.

ఈపైనిఁ జెప్పఁబడినట్టి యియ్యవి తుల్యదేహితుల్యమను దానియందు గల భేదములు అని యెఱుంగునది. అనఁగా దుల్యదేహితుల్యమనెడి అర్థహారణ భేదమునందలి వివిధములగు రూపముల పరిగణన మని యెఱుంగ నగును.

ఇయ్యది ఉల్లేఖవంతమును [కవిజనులకు] ననుగ్రాహ్యము నగు మార్గమని సురానందుఁడు అనెను. అతఁడు చెప్పినమాట ఇది:—

శ్లో. సరస్వతీ సా జయతి ప్రకామం,
దేవీ శ్రుతిః స్వస్త్యయనం కవీనాం,

అస్పృష్టా మానయతి స్వభంగ్యా,
రౌల్లిఖ్య యత్నించి విహార్ష రత్నం.

ఇఁక నిటుపైని పరపురప్రవేశమనెడి విహృతయోనిలోఁగల రెండవయర్థహరణము నుదాహరించెదను. అనఁగాఁ బది రెండవ యధ్యాయమునందు అన్యయోని నిహ్నుతయోని అయోనియనెడి యర్థహరణములలో, అన్యయోనియందుఁగల సర్వభేదములను వివరించి, పిమ్మట నిహ్నుతయోనియనెడి యర్థహరణమును వివరించుచు, నందుఁగల మొదటిభేద మగు తుల్యదేహితుల్యమునందుగల యర్థహరణ భేదముల నన్నిటిని నిరూపించి, ఇప్పుడంతలి రెండవభేద మగు పరపురప్రవేశమనెడి యర్థహారణమునందుఁగల యవాంతరభేదముల వివరించెద మని భావము.

అందు హుండయుద్ధ మనునది మొదటిది. ఇదివఱకే ఒకకవి కూర్చినయర్థమును సయుక్తికముగాఁబరివర్తనము చేసి కూర్చుట హుండయుద్ధ మనంబడును. ఎట్లనఁగా —

శ్లో. కథ మసౌ న భజ త్యశరీరతాం హతవివేకపదో హతమన్మథః,
ప్రహరతః కదళీదళకోమలే భవతి యస్య దయా న వధూజనే.

ఏమన్మథహతకునకు లేఁజూరటాకువలె కోమలమగు వధూజనమును ప్రహరించునప్పుడు దయపుట్టదో, అట్టి మతిహీనుఁడు మన్మథుఁ డెందులకై అశరీరత్వము నొందక యుండును? అని భావము. ఈ యర్థము సయుక్తికముగా నీక్రిందిశ్లోకమున కరివర్తనముచేసి కూర్చియున్నారు. కనుక ఈ క్రిందిది హుండయుద్ధ మనంబడును.

శ్లో. కథ మస్తౌ మదనో న నమస్కృతాంస్థితవివేకపదో మకరధ్వజః,
మృగదృశాం కదళీలలితం వపుః య దభిహంతి శరైః కుసుమోద్భవైః.

[ఏమన్మథుఁడు లేడికటాక్షువలె లలితమగు స్త్రీల శరీరము నంతకంటెను లలితములగు కుసుమోద్భవము లగు నస్త్రములతో గుఱిసేయుచున్నాఁడో, అట్టి (దయా శాలియగు) వివేకవంతుఁడగు మన్మథుఁడు ఏల నమస్క రింపఁదగి యుండుటను—అనఁగా నమస్కార్యత్వము నొందక యుండును? అనఁగాఁ దప్పక నమస్కరింపఁదగి యుండు నని తాత్పర్యము.] పైఁకటి శ్లోకమును బట్టి నింద్యత్వము నొందఁదగిన మన్మథుని చేష్టితము నీ శ్లోకమునందు యుక్తిగా అభివంద్యము కాఁదగిన చేష్టిత ముగా మార్చినారు. కనుక నిది హేతుదయుక్త మను అర్థ హారణము.

ప్రకారాంతరమున విసదృశ మగు వస్తువును కూర్చుట ప్రతికంచుకము ఎట్లనఁగా—

శ్లో. మాద్య చ్చకోరేక్షణ తుల్యధామ్నః
ధారాం దధానా మధునః పతంతీం,
చంచ్వగ్రదష్టోత్పలనాళహృద్యా
హంసీవ రేజే శశిరత్నశాఖీ.

[మత్తచకోరనేత్రదృష్టితోఁ దుల్యమగు [నెఱ్ఱఁదన ముగల] తేనెధారను పైనుండి జాఱుచున్నదానిని ముక్కుఁదెఱచికొని పట్టుకొనుచున్నదై, ఆపక్షి ముక్కుకొ నతోఁ గొఱికిపట్టుకొనిన నెత్తుకలువకాడగల హంసాఁగన వలె ప్రకాశించెనని యర్థము.] దీని నీ క్రిందశ్లోకము

నందు విసదృశమైనదానిని ప్రకారాంతరముగా సదృశ
మునుగా కూర్చిరి గనుక నిక్రిందిది ప్రతికంచుక మనెడి
యుదాహరణము. ఎట్లన—

శ్లో. మసారసారేణ బద్ధా దధానా, కాచి త్స్వరాం విద్రుమనాళకేన,
పల్లూరవల్లీం దధతేవ చంచ్వా కేళీశుకే సాంజలినాదృతేన.

[ఒకానొకస్త్రీ మసారసారమగు పవడంపుగొట్టము
తో మద్యమును పీల్చుకొనుచు, దోసిలితోఁ బట్టుకొని
యున్న క్రీడాశుకముచే వల్లూరవల్లి ధరించినట్లుగాఁ
బ్రకాశించెను.]

ఉపమానమునకు ఉపమానాంతర పరివృత్తి చేయు
ట వస్తుసంచార మనెడి యుదాహరణ మగుచున్నది.
ఎట్లనఁగా.—

శ్లో. అవిరళమివ దామ్నా పౌండరీకేణ బద్ధః
స్నపిత ఇవ చ దుగ్ధస్రోతసా నిర్భరేణ,
కబళిత ఇవ కృత్స్న శ్చక్షుషా స్ఫారితేన
ప్రసభ మమృతమేఘే నేవ సాంద్రేణ సిక్తః.

[నే నానాయికచేఁ బ్రేమతోఁ వీక్షితుఁడను కాఁ
గానే, పౌండరీకదామముతో నెడతెఱపి లేకుండ బంధిం
పఁబడినవానివలెను, మిక్కుటగు పాలవెల్లిచే ముంచి
మొత్తంబడినట్లును (స్నపితఇవ=స్నానముచేయింపంబడిన
వానివలె) విస్ఫారిత నేత్రముచే సాంతముగాఁ గబళింప
బడినట్లును, తలవనితలంపుగా సాంద్రమగు నమృతమేఘ
ముతో సేచనము చేయఁబడినట్లులును నైతిని.]

ఈయర్థమునందు ఉపమానాంతర పరివృత్తి చేసిన ఈ క్రిందిరచనముఁ జూడుఁడు.—

శ్లో. ముక్తానా మివ రజ్జవో హిమరుచే ర్మాలాః కళానా మివ,
క్షీరాబ్ధే రివ వీచయః క్లమముషః పీయూషధారా ఇవ,
దీర్ఘాపాంగనదీం విలంఘ్య సహసా లీలానుభావాంచితాః,
సద్యః ప్రేమభరోల్లసాః మృగదృశో మా మభ్యషించన్ కటాక్షాః.

ఆ నారీణాక్షి యొక్క ప్రేమాతిశయోల్లసితము లగు చూపులు వెన్వెంటనే దీర్ఘములగు నపాంగములనెడి నదిని దాటి, లీలానుభావముతో నొప్పుచు, ముత్తెముల వెగ్గములు వోలెను చంద్రుని కళామాలికలవలెను, పాల ల్లి తరంగముల పగిదిని, క్లమహారము లగు నమృత ధారల భాతిని, నన్నే అభిషేకించినవి.

శబ్దాలంకారమున కర్థాలంకారముతోడ నన్యథా త్వము నొందించుట ధాతువాద మనెడి యర్థహారణ మున్నది. ఉదాహరణ మెట్లనఁగా.—

శ్లో. జయంతి బాణాసురమౌళి లాలితాః
దశాస్య చూడామణి చక్రచుంబినః,
సురాసురాధీశ శిఖాంతశాయినో
భవచ్ఛిద స్త్ర్యంబక పాదపాంసవః.

[బాణాసురుని మౌళిచే లాలనచేయంబడినవియును, రావణుని శిరోరత్నముల చక్రమును ముద్దుగొనినవియు ను, సురలు నసురలు తదధీశులు మున్నగువారి శిఖాంత ముల విశ్రమించినవియు, భవబంధమును ఉచ్ఛేదించునవి

యును అగు త్ర్యంబకుని (యీశ్వరుని) పాదపాంసువులు పరోత్కర్షములై యొప్పుచు నున్నవి యని భావము.]

ఇట్టిగల శబ్దాలంకారమునకు అర్థాలంకారముతో నన్యథాత్వము ఈ క్రిందిశ్లోకమునఁ గల్పించి కూర్పంబడినది. కావున నిత్యాది ధాతువాద మనెడి యర్థహరణ మయ్యెను. ఎట్లనఁగా—

శ్లో. నస్మార్తాలోకన క్రాన్తిపవిరతీకృతజంతవః,
జయా త్ర్యభూర్వ్యాపారాః పురారేః పాదపాంసవః.

పైని చెప్పినట్టులుగా ఆవస్తువునే ఉత్కర్షముతోఁ గూర్చి మఱొకదానినిగాఁ జేయుట సత్కార మనెడి అర్థహరణ మనంబడును. ఎట్లనంగా.—

శ్లో. స్నానార్ద్రార్ద్రైః విధుతకబరీ బంధలోలై రిదానీం,
శ్రోణీభారః కృతపరిచయః పల్లవైః కుంతలానాం,
ఆస్యేతేభ్యో నభసి పతతః పంక్తిశో వారిబిందూన్,
స్థిత్వోద్గ్రీవం కువలయదృశాం కేళిహంసాః పిబంతి.

[కుంతలదేశపు స్త్రీలయొక్క శ్రోణీభారము, స్నానార్ద్రార్ద్రములును విధూతకబరీబంధలోలములు నగు పల్లవములతో పరిచయము కలిగినదై యున్నది. ఇప్పుడు వీని నుండి ఆకసమునందు ధారలుగాఁ బడుచున్న నీటిబొట్టులను మెడలెత్తికొని వారి క్రీడాహంసములు త్రావుచున్నవి.] ఈ యర్థమును గ్రహించి ఉత్కర్షముతో అన్యథాకరణము చేయంబడినది గనుక నీ క్రిందిశ్లోకము సత్కార మను నర్థహరణ మైనది. చూడుఁడు.—

శ్లో. లక్ష్మ్యాః క్షీరనిధేరుదక్తవపుషో వేణీలతాగ్రచ్యుతా,
యే ముక్తాగ్రథనా మవాప్తనుభగాః ప్రాప్తాః పయోబిందవః.
తే వః పాంతు విశేషసస్పృహదృశా దృష్టా శ్చిరం శార్ఙ్గిణా,
హేలోత్క్షిప్తజలేశ హంసవనితా లీఢా స్సుధాస్వాదవః.

[పాలవెల్లినుండి యావిర్భవించిన లక్ష్మీదేవియొక్క వేణీలతాగ్రమునుండి జారినవై ఏపాలబిందువులుదారము గ్రుచ్చుటలేనికతన సుందరములైన ముక్తాహారగ్రథనము నొందినవో, ఆపాల బిందువులు విష్ణువుచే సవిశేషములగు (సాభిప్రాయములగు) చూపులతోఁ జూడంబడినవై విలాసముగా వెడలుజాపినహంసలు మున్నగునాఁడు జల పక్షుల పెట్టలచే నాస్వాదింపంబడుచున్నవై, సుధవోలె స్వాదుత్వము గలవై, మిమ్ముల ను రక్షించుఁ గాక— యని భావము.]

పూర్వము సదృశముగా నుండి పిమ్మటభిన్నముగా నుండునట్టిది జీవంజీవక మనియెడి యర్థహారణ మగుచున్న ది. ఎట్లనంగా—

శ్లో. నయనోదరయోః కపోలభాగే రుచిమద్రత్న గణేషుభూషణేషు,
సకల ప్రతిబింబి తేందుబింబా శతచంద్రాభరణైవ కాచి దాసీత్.

[ఒకానొక స్త్రీ, నేత్రములలోపలి భాగములందును, కపోలప్రదేశములందును ప్రకాశవంతములగు, రత్నముల కుప్పలు గల సొమ్ములందును కళలతోఁగూడ] సంపూర్ణముగాఁ బ్రతిబింబించిన చంద్రబింబము కలదియై, శత చంద్రాభరణయే అయ్యెను. అనఁగా నూరులకొలఁది చంద్రాభరణములు గలదిగా నయ్యె నని తాత్పర్యము

ఈపూర్వార్థమునందు సదృశముగా నున్నయీకల్పనము ఈక్రిందిశ్లోకమున భిన్నముగానుండునట్లు కూర్పంబడినది కావున నిది, అనఁగా నీక్రిందిశ్లోకము జీవంజీవక మను నర్థ హారణమునకు ఉదాహరణముగా నగుచున్నది. ఎట్లనంగా:—

శ్లో. భాస్వత్కపోలతల కుండలహారహార్య
వన్యస్తశిలామణిగణ ప్రతిబింబితేన,
చంద్రేణ భాతి రమణీ రమణీయవక్త్రా
శోభాభిభూత వపుషేవ నిషేవ్యమాణా.

చంద్రుఁడు ఆనాయికయొక్క అందమైన ముఖశోభచే గెల్వఁబడి, ప్రకాశవంతములగు నాయికయొక్క కపోలప్రదేశములు చెక్కిళ్లు అందెలు మొలనూలు మున్నగువానియందు చెక్కియున్న మణిగణములలోఁ బ్రతిబింబించి, [ఓడినవారు గెల్చినవారికి సేవఁజేయుట యర్హము కాఁబట్టి] ఆనాయికను సేవించుచున్నట్టు లుండె నని తాత్పర్యము. అనఁగా నట్టి చంద్రునిచే నామె సేవితురాలివలె ప్రకాశించెను. ఇచ్చట మొదటి శ్లోకమునందు సదృశముగాఁ జెప్పంబడిన యర్థము, రెండవదానిలో నందులకు భిన్నముగాఁ గల్పింపఁ బడెను. గనుక నియ్యది జీవంజీవక మనెడి యర్థహరణ మగుచున్నది.

ప్రాచీనుల వాక్యాభిప్రాయములను కూర్చుట భావముద్ర యనెడి యర్థహరణ మగు చున్నది. ఉదాహరణ మెట్లనఁగా:—

శ్లో. తాంబూలవల్లీ పరిణద్ధపూగా స్వేలాలతాలింగిత చందనాసు,
తమాలపత్రాస్తరణాసు రంతుం ప్రసీద శశ్వన్మలయస్థలీషు.

తాంబూలీలతలచేఁ జుట్టుకొనంబడిన పోఁకచెట్లుగలవియును, ఏలకితీగలచే నాలింగనముఁ జేసికొనంబడిన చందనపు ద్రూఁకులు గలవియును, తమాల పత్రములతో సిద్ధపఱుపఁబడిన ఆస్తరణములు గలవియును నగు మలయపర్వతప్రదేశము లందు (ఈరాజుతోఁగూడి) రమించుటకు ప్రసన్నరాల వగు మని భావము.

ఈ యర్థము ఈక్రిందిశ్లోకమునందు కూర్పంబడినది. గనుక నియ్యది భావముద్ర యనెడి అర్థహరణ మగుచున్న దని యెఱుంగఁగాఁ దగును, ఎట్లనఁగా —

శ్లో. నిశ్చేతనానా మపి యుక్తయోగదో,
నూనం స ఏనం మదనోఽధితిష్ఠతి.
ఏలా య దాశ్లిష్యతి చందనద్రుమం
పూగద్రుమం నాగలతాఽధిరోహతి.

ప్రాణము లేని జడపదార్థములకు సైతము అన్నివిధముల ననురూపమైన సంయోగమును కూర్చునట్టిది ఈమలయపర్వతము. ఈమలయపర్వత మింతటి చాతుర్యము గలది గనుకనే, దీనిని మన్మథుఁడెల్లప్పుడును పీఠక యధిష్ఠించి యున్నవాఁడు. ఎట్లనఁగా చూడుఁడు. ఇందలి ఏలకితీగసైతము చందనద్రుమమును (కన్నెట్టి తనకన్నివిధముల ననురూపుఁడై యుండఁదగిన భర్తకాఁబట్టి తనంతదానే) ఆలింగనము చేసికొనుచున్నది. ఇట్టులనే తాంబూలపు తీవయును పోఁకచెట్టును అధిరోహించుచున్నదని భావము. అనఁగా మలయమునందు ఏలకిలతలు చందన వృక్షములకును తాంబూలపుతీగలు పోఁకచెట్లకు

ను చుట్టుకొని (పైనవైచికొని) అల్లుకొని ఉన్నవనియు, నట్లుండుట, ఏలా నాగలతా అను స్త్రీలింగ సారస్యము చేత నాయిక లనురూపభర్తల నాలింగనము చేసికొను ట మున్నగునట్టి కార్యములను జ్ఞప్తికిఁ దెచ్చుచున్న దనియు, శక్తిపన్ని వేళము కేవల మొక్క మలయము నందు దప్ప మఱెచ్చటను లేకుండుటచే తప్పక నచట మన్మథుఁడు నిత్యనివాసముఁ జేసికొనియున్నాఁడని, చెప్పనొప్పనని యు భావము. ఇందు తొలిశ్లోకమునందు గల ప్రాక్తనవాక్యముయొక్క యర్థమును ఉత్తరశ్లోకమునందు కూర్చి యున్నాఁడు గనుక నియ్యది భావముద్ర యనెడి యర్థహారణ మగుచున్న దని యెఱుంగునది.

పూర్వమునందుఁ జెప్పంబడిన యర్థమునకు విరుద్ధముగాఁ జేయునట్టి వస్తురచనము తద్విరోధి యనెడి యర్థహారణ మగుచున్న దని యెఱుంగఁదగును. దీనికి ఈ క్రింద నుదాహారణము నిచ్చుచున్నాము.—

శ్లో. హారో వక్షసి దంతపత్త్రివిశదం కర్ణే దళం కౌముదం,
మాలా మూర్ధ్ని దుకూలినీ తనులతా, కర్పూరశుక్లా స్తనౌ,
వక్త్రే చందనబిందు బిందుధవళం బాలం మృణాళం కరే,
వేషః కిం సితి ఏవ సుందరి శరశ్చంద్రా త్త్వయా శిక్షితః.

విరహాసంతప్తయై శైత్యోప చారములకు గుఱియైన యొకనాయికను ఆమెచెలికత్తె సాకూతముగాఁ బ్రశ్నించు సందర్భమును ఈశ్లోకము తెల్పుచున్నది. ఎట్లనఁగా; ఓసుందరీ! దంత పత్రమువలె తెల్లనైనహారమిట్లు వక్షస్థలమునను, చెవియందు కుముదళమును (కలువరేకు)

శిరసున పూమాలికయును, చలువవలువంగట్టిన యాత
నులతయును, మొగమున చందనముతోఁ బెట్టికొన్న బిందు
వు(బొట్టు) ను, చందురునివలె తెల్లనైన యీచేతిలోని
బాలమృణాళమును, (అనఁగా, లేఁత తామరతూఁడును,)
కలిగియున్నయీస్థితిని చూడఁగ, నాకు వింతగొల్పుచు
న్నది. (ముత్యాలహారాదు లన్నియుఁ దెల్లనివే గనుక)
ఈ తెల్లని యలంకరణరచనావిధమును శరచ్చంద్రునినుండి
నేర్చితివా యేమి?—యని యర్థము. అనఁగా శర
త్కాలచంద్రుఁడు తెల్లఁగా నుండియుండును గనుక నతని
నాచార్యస్థానముగాఁ గొని ఈవేషభక్కిక నీ వలవరించి
కొంటివి కాఁబోలు నని సాభిప్రాయముతో (నర్మ
గర్భముగా) చెలి పలికె నని తాత్పర్యము.]

ఇందుఁగల యర్థమును ఈక్రిందిశ్లోకమున విరుద్ధ
ముగాఁ గొని కూర్పంబడియున్నది. కావున నియ్యది తద్వి
రోధి యనెడి అర్థహారణ మగుచున్నది.

ఎట్టు లనఁగా చూపుఁడు:—

శ్లో. మూర్తి ర్నీలదుకూలినీ మృగమదైః ప్రత్యంగ పత్త్రక్రియా,
బాహూ మేచకరత్నకంకణ భృతౌ, కంఠే మహారావళీ,
వ్యాలంబాలక వల్లరీకమలికం కాంతాభిసారోత్సవే,
య త్సత్యం తమసా మృగాక్షి! విహితం వేషేతవాఽచార్యకం.

[ఓహరిణాక్షి ! కాంతుఁగోరి నీచేయునీయభిసారికో
త్సవమునందు, నల్లని దుకూలముతోఁ గప్పఁబడిన యీనీ
మూర్తియును, అనఁగా శరీరమును, నల్లనిమృగమదము
(కస్తూరి)తో ప్రత్యవయవమునందును మెదచి సిద్ధము

చేసిన యీయంగపత్త్రక్రియయును, మేచకరత్నములతో (నీలమణులతో) జెక్కిన హస్తకంకణములం దాల్చిన యీ బాహువులును, ప్రౌఢవ్రులగు నల్లనినాఁచుతీవలం బోలిన అళికవల్లరులతో, ముంగురులనెడి తీవలతోడ, నొప్పినయీఫాలప్రదేశమును చూడఁగా, అచ్చెరుపాటు దోఁచుచున్నయది. నీకీయలంకారరచనావిధానమునందు తప్పక తమస్సుచే, [చీఁకటిచేత] నాచార్యత్వము వహింపఁబడె ననుట నిక్కము అని అర్థము. అనఁగా చీఁకటినీవు నీకాంతుంగుఱించి అభిసరించుపట్ల నిట్టిట్టి యలంకారరచనఁ జేసికొన్నచో, నొరులు నిన్ను గుర్తింపఁజాలక యుందురని యుపదేశము చేసినదని నమ్మెదను. లేనిచో, నీవు ఈరీతిగా నలంకారరచనమంతయు నల్లనివస్తువులతోనే (నీలదుకూలమకరికాను లన్నియు నల్లనివే గనుక) ఏల చేసికొందువు? అని భావము.

ఇచ్చట తొలిశ్లోకములో తెల్లనివస్తువులఁ జెప్పంగా, దానికి బదులు ఈమలిశ్లోకమునందు అన్నియు నల్లని వస్తువులనే కూర్చి చక్కని యర్థమును (రచనము, చేయుటం జేసి) యిట్టివి అన్నియు తద్విరోధు లనెడి యర్థహారణము లయ్యెను.

ఈవిధముగా పంద్రెండు పదుమూఁడుప్రకరణములను నీయధ్యాయములందు ముప్పదిరెండు అర్థహారణోపాయములు వివరింపంబడినవి. *ఈ ముప్పదిరెండు హార

* చదువరుల యుపయోగమునకై ముప్పదిరెండు హారణోపాయములను ఇట పరిసంఖ్యానముచేసెదము. అవి ఇట్లు:—౧

ణోపాయములలోను [వేనినివేనిని వదలిపెట్ట వలయునో వేనినివేనిని స్వీకరింపవలెనో] ఎఱింగి కవితఁ జెప్పుచుమేని సారస్వతసిద్ధి తప్పక కలుగును. ఈహరణోపాయములన్నియును ఒకదానికొకటి సప్రతియోగము గలవి. అనఁగా విరుద్ధము లైనవి. ఇందలి ప్రతియోగిత యెట్టిదనఁగా,

---

అన్యయోని, ౨ నిహ్నుతయోని, 3 అయోని యని తొలుత మూఁడుతెఱఁగులు. అందు మొదటిదగు అన్యయోని బింబప్రతిబింబకల్ప మని ఆలేఖ్యప్రఖ్యమని రెండు తెఱఁగులు. రెండవదగు నిహ్నుతయోనియును తుల్యదేహితుల్య మని పరపుర ప్రవేశ సదృశ మని రెండువిధములు. అయోని పరపుర ప్రవేశ మనెడి భేదముచే నొక్కటే యొక్కటియగు భేదము—ఇవి ప్రధానభేదములు 5. పైని యవాంతర భేదములు ఈక్రింద నిచ్చుచున్నాను:— ఈ యైదింటిలోనఁ గూడ, ౧. బింబ ప్రతిబింబకల్పము—౨ ఆలేఖ్య ప్రఖ్యము, 3 తుల్యదేహితుల్యము ౪. పరపుర ప్రవేశము—అను నీనాల్గు అర్థహరణములచేతనే కవులు ముప్పదిరెండు అర్థహరణోపాయములు కన్పెట్టిరి. ఈ నాల్గు ప్రధానములగు భేదములచేతనే కవులలోను నాల్గుతెఱఁగులు ఏర్పడినవి. అందు మొదటితరగతి కవులకు భ్రామకులు అని, చివరవారికి చుంబకులు అని ౩వ వారికి కర్షకు లని ౪ వ వారికి ద్రావకు లని పేర్లు ఏర్పడినవి.

అందు అయోని, లౌకికము అలౌకికము మిశ్రము అని మూఁడుతెఱఁగులు. ఇఁక బింబప్రతి బింబ కల్పవికల్పములు అన్ననో. ౧ వ్యత్యస్తము, ౨. ఖండము, 3 తైలబిందువు, ౪ నటనేపథ్యము, ౫ ఛందోవినిమయము. ౬. హేతువ్యత్యయము, ౭ సంక్రాంతము, ౮. సంపుటకము. అని యెన్మిది విధములు. ఇవియే పంద్రెండవ యధ్యాయము నందు సోదాహరణముగా నిరూపింపఁ బడి యున్నవి.

ఒకరుకూర్చిన యర్థమునే తద్విపరీతతతోఁ గూర్చునట్టిది. అనఁగా సర్వవైపరీత్యమే ప్రతియోగితయనుదానియర్థము.

---

ఇఁక పదునాఱవయధ్యాయములో, ఆలేఖ్యప్రఖ్య భేదములును తుల్యదేహితుల్యములోఁగల భేదములును, పరపుర ప్రవేశ సదృశములోని భేదములును అత్యల్పలక్షణ సహితముగఁ జెప్పఁబడినవి.

వానిలో నాలేఖ్య ప్రఖ్యములోఁగల భేదములు యీక్రిందివి:- ౧ సమక్రమము. ౨ విభూషణ మోషము. ౩ వ్యుత్క్రమము, ౪ విశేషోక్తి, ౫ ఉత్తంసము, ౬ నటనేపథ్యము, ౭ ఏకపరికార్యము, ౮. ప్రత్యాపత్తి, అని యెన్మిది భేదములు.

ఈరీతిగానే, తుల్యదేహితుల్యములోఁగల భేదములు ఈక్రిందివి:—౧ విషయపరివర్తము. ౨. ద్వంద్వవిచ్ఛిత్తి. ౩ రత్నమాలా, ౪ సంఖ్యోల్లేఖము ౫ సంవాదిచూళిక, విసంవాది చూళిక, —అనెడి భేదద్వయము గల చూళిక, ౬. విధానాపహారము, ౭. మాణిక్య పుంజ పుంజము, ౮ కందము,—అని యెన్మిది భేదములు.

శేషించిన పరపుర ప్రవేశమునందు గల భేదములు ఈక్రిందివి:- ౧ హుడ యుద్ధము, ౨ ప్రతికంచుకము, ౩, వస్తు సంచారము, ౪ ధాతువాదము, ౫ సంస్కారము. ౬, జీవంజీవకము ౭ భావముద్ర ౮ తద్విరోధి, అని యెన్మిది భేదములు. ఈరీతిగా ముప్పదిరెండు హరణోపాయము లగుచున్నవి. అనఁగా ప్రధానభేదములను విడచి, చిట్టచివర వ్రాసిన ౧ బింబప్రతిబింబకల్ప వికల్పములు, ౨ ఆలేఖ్య ప్రఖ్యములభేదములు, ౩ తుల్యదేహితుల్యభేదములు, ౪ పరపురప్రవేశభేదములు.— అను నీనాల్గును ఒక్కొక్కటి యెన్మిదేసి భేదముల నొందినచో, నాలుగు ఎన్మిదులు ముప్పదిరెండు భేదము లగు నని తాత్పర్యము. ఇట్లేర్పడిన యీముప్పది రెండు విధములగు భేదములనే ద్వాత్రింశత్ (అనఁగా ముప్పదిరెండు) అర్థహరణోపాయము లని యందురు.)

మఱియును పెద్దలు ఏమనిరో చూడుఁడు.—

శ్లో. శబ్దార్థ హరణోపాయాః ద్వాత్రింశ దుపవర్ణితాః,
హానోపాదాన విజ్ఞానే కవిత్వం తత్రితం ప్రతి.

శ్లో. కిం త్వేతే హరణోపాయాః జ్ఞేయా స్వప్రతియోగినః,
అర్థస్య వైపరీత్యేన విజ్ఞేయా ప్రతియోగితా.

[ప్రాచార్యులగు సాహిత్యద్రష్టలగు పండితులు శబ్దార్థహరణోపాయములను ముప్పదిరెండుగా బ్రదర్శించి యున్నారనియు, ఆ ముప్పదిరెండింటిలో నెవ్వండు ఏంతెంతవఱకు పరిత్యజింపవలెనో, ఎంతవఱకు స్వీకరింపవలెన నెడిహానోపాదానవిజ్ఞానములు కలవాఁడై, త్యజింపఁదగిన వానిని త్యజించియు, స్వీకరింపఁదగిన వానిని స్వీకరించియు గవితఁ గూర్చునో, వానికి కవిత్వము సిద్ధించు నఁయు, ఈ చెప్పిన ముప్పదిరెండు విధము లగు హరణోపాయములును ఒకదానికొకటి సప్రతియోగము గలవనియు, అర్థవైపరీత్యముతోఁ గూడి యుండుటయే యందుఁగల ప్రతియోగిత యని యెఱుంగఁగా వలయు ననియు ననిరి అని ఈశ్లోకములకుఁ గల తాత్పర్యము.]

మఱియును వారే యిట్లును చెప్పి యున్నవారలు ఎట్లనఁగా —

శ్లో. శబ్దార్థ శాసనవిదః కతి నో కవంతే,
యద్వాఙ్మయం శ్రుతిధనస్య చకాస్తి చక్షుః,

కిం త్వస్తి యస్య వచసి యస్తు నవః సదుక్తి
సందర్భిణాం ధురి స తస్య గిరః పవిత్రాః.

లోకమునం దెందఱెందఱు కవులు లేరు? వారిలోఁ గూడ శబ్దార్థశాస్త్రవేత్తలగుసిద్ధహస్తులయిన కవులు ఎందఱెందఱు కవితను చెప్పుట లేదు? కాని ఎవ్వని కవితా వాఙ్మయము శ్రుతిధనులకు (శాస్త్రవిజ్ఞానమే ధనముగా గల సుకృతికి) చక్షువై రాజిల్లుచున్నదో, ఎవ్వని మాటలతీరునందు క్రొంగ్రొత్త ప్రకాశిల్లుచుండునో, అట్టివాఁ డొక్కండే సదుక్తి రచనలంగూర్చుచున్న కవులలో నెల్ల మిన్నగా నెన్నందగినట్టివాఁడు అని చెప్పందగియుండును. అట్టిపుణ్యాత్ముండగు కవియొక్క వాక్యములే పవిత్రములలోఁ నెల్లఁ బవిత్రతమములై యొప్పుచుండును—అని యీశ్లోకమునకుఁ దాత్పర్యము.

ఇది రాజశేఖరకవిరాజకృత మగు కావ్యమీమాంస యను
కవిరహస్యమునందు ప్రథమాధికరణమున
అర్థహారణములోని ఆలేఖ్యప్రఖ్యాదిభేదము లనెడి
త్రయోదశాధ్యాయము.

---

# రాజశేఖరకవి కావ్యమీమాంస.

## చతుర్దశోఽధ్యాయము.

### జాతిద్రవ్యక్రియాసమయవ్యవస్థ,

[ఇందు వచ్చెడివిషయములు.—౧. కవిసమయలక్షణము, ౨. స్వర్గభూమపాతాళీయ భేదములచే నేర్పడిన కవిసమయములందు గల ముత్తెఱఁగులు. 3. అందు భూమకవి సమయమునం గల జాత్యాదులను నాల్గుభేదములు, ౪. అందు మఱల ప్రత్యేకముగా నేర్పడిన ముత్తెఱఁగు లగు భేదములు మొ.]

అశాస్త్రీయమును, (అనఁగా శాస్త్రతః విహితము కానిదియును) అలౌకికమును (అనఁగా లోకానుభవమున నేర్పడినది కానిదియును) పరంపరాగతముగ వచ్చుచున్నదియు నగు నేయర్థమును కవులు తమ గ్రంథములలో నందఱు నొక్కరీతిగాఁ గూర్తురో అదియే కవిసమయము అని అనఁబడును.

అయ్యా! అట్లైన నిది దోషము అగునుకదా! అట్టి స్థితిలో కావ్యములందు గూర్పందగుల కిది (అనఁగా నశాస్త్రీయాలౌకిక పరంపరాయాతార్థము) ఎట్లు అర్హమై యుండును?—అని ఆచార్యులు అడిగిరి. కవుల మార్గము సనుగ్రహించు నిది దోష మెట్లగును? అని

యాయావరీయుండు మఱల నడిగెను. అట్లైన నందులకుఁ
గల కారణము చెప్పందగును కదా? యని యాచార్యు
లు పల్కిరి. ఇదిగో చెప్పంబడుచున్నదని యాయావరీ
యుఁ డనియెను.

ప్రాచీను లగు విద్వాంసులు సహస్రశాఖలు గల్గి, అంగోపాంగసహితమై యొప్పుచు నుండెడి వేదము నవగాహనము చేసికొని, (అనగా, వేదమును అర్థసహితముగా సాంగముగా సాంతముగా చర్చించి యని భావము) ఆయాశాస్త్రముల నెల్లఁ బూర్తిగాఁ దెలిసికొని, దేశదేశాంతరములను ద్వీపద్వీపాంతరములను పరిభ్రమించి యే యర్థముల సేకరించి కూర్చిరో, అయ్యవి దేశము కాలము మున్నగునవి మారుచు దూర మగుచు వచ్చుటంజేసి, అన్యథాత్వము నొందియున్నను, వానిని తొలుత సేకరించి కూర్చినవా రెట్లు కూర్చిరో, ఆరూపముననే తత్కాలికకవులు కూర్చుచు వచ్చుట యెయ్యది గలదో, అదియే కవిసమయ మని చెప్పంబడుచున్నది. ఇట్టి కవిసమయ మను నీమాట లోఁతునకు దిగి మూలార్థమును చర్చింపక యే ప్రయోగమాత్రదర్శు లగు కవులచేతఁ దఱుచుగాఁ బ్రయోగింపఁబడి, చివఱకు అది పైని చెప్పిన యర్థమునందు రూఢము అగుచున్నది.

ఇట్టులు ఏర్పడిన యీ కవిసమయములందుఁగూడ ఒకొక్కటి వెనుకఁ జెప్పినరీతిగా తొట్టతొల్లింటికవిసమయముచే నేర్పడినదై యుండును. మఱొకటి ఇటీవలి ధూర్తులు ఒకరినొకరు సమర్థించుకొని వెల్లడించు

కొనుటకై స్వార్థపరత్వమున ధూర్తులచేఁ గల్పింపబడిన దై, కూడ యుండుట కలదు. ఇట్టులు ఏర్పడిన యాకవి సమయము స్వర్గ్యకవి సమయ మనియు, భౌమ (భూలోక) వికసమయ మనియు పాతాళీయకవిసమయ మనియు, ముత్తెఱఁగులు, ఈ ముత్తెఱఁగులలోను కూడ స్వర్గ్య పాతాళీయకవి సమయములకంటెను, భౌమకవిసమయము ప్రధాన మైనది. ఏల యనఁగా నద్యాది మహా, (గొప్ప, లేక అనేకములైన) విషయములు గలది. ఇట్టి ప్రధానమైన భౌమకవిసమయము జాతిద్రవ్య గుణక్రియా రూపార్థత గలదగుటచేత ననఁగా జాతిరూపార్థములు ద్రవ్యరూపార్థములు గుణరూపార్థములు క్రియారూపార్థములు కలదగుటంబట్టి నాల్గు తెఱఁగులుగా నగుచున్నది. ఇట్లు నాల్గు తెఱఁగులుగా నైనట్టి ఆభేదములుకూడ మఱల నొక్కొక్కటి అసతో నిబంధనము, సతూనిబంధనము, నియమతో నిబంధనము అను భేదముల చేత ముత్తెఱఁగులు. అసతో నిబంధన మనఁగా లేనివానిని ఉన్నట్లు కూర్చుట కలది. సతోఽనిబంధన మనంగా ఉన్నను కూర్పంబడక యుండునది. నియమ పూర్వకముగా కూర్పంబడునది నియమతో నిబంధన మనంబడును. అందు సామాన్యమగు అసతో నిబంధనము ఎట్లనఁగా:—నదియైన ప్రతిదానియందును (లేకున్నను) పద్మోత్పలాదు లున్నట్లు చెప్పుటయు, జలాశయము నీళ్లుగల ఏ కొలఁది పాటి నీటిపట్టు అయిన దానియందెల్లను (లేకున్నను) హంసలు మున్నగునవి

ఉన్నట్లు చెప్పుటయు, ఏ పర్వతములందైనను సరియే (లేకున్నను) స్వర్ణరత్నాదిధాతువర్గ మున్నట్టులు చెప్పుటయు నిందులోఁ జేరును. వీని క్రింద నుదాహరణముల నిచ్చుచున్నాము.

(౧) నదీపద్మము లున్నట్లు చెప్పుట.—

శ్లో. దీర్ఘీకుర్వ౯ పటుమదకలం కూజితం సారసానాం,
ప్రత్యూషేషు స్ఫుటితకమలా మోదమైత్రీ కషాయః,
యత్ర స్త్రీణాం హరతి సురతగ్లాని మంగానుకూలః,
శిప్రావాతః ప్రియతమ ఇవ ప్రార్థనా చాటుకారః.

—కాళిదాసు మేఘసందేశము, ౧-౩౦.

[ఏ ఉజ్జయిని నగరమునందు ప్రాతఃకాల సమయములందు శిప్రానదినుండి బయలువెడలెడి చల్లగాలి, ప్రార్థనా చాటువులం బల్కు ప్రియతముఁడు వోలె సారసపక్షుల పటుకిల మగు కూజితమును హెచ్చుఁ జేయుచున్నదై, అప్పుడప్పుడే విప్పారుచున్న కమలము లందలి ఆమోదమైత్రిచే కషాయము గలదియై స్త్రీల యొక్క సురతగ్లానిని పోఁగొట్టుచున్నదో—అట్టి యుజ్జయిని నగరము—అని తాత్పర్యము. ఇచ్చట సారసములు కమలములు మున్నగునవి లేకున్నను ఉన్నట్లు కూర్పంబడుటచే నిది అసతోనిబంధన మైన కవిసమయము అయినది.]

నదీనీలోత్పలములున్నట్లు చెప్పుట:—

శ్లో. గగనగమన లీలాలంఘితా స్స్వేదబిందూ
మృదునిరనిలవాహైః ఖేచరాణాం హరంతీం,

కువలయవనకాంత్యా జాహ్నవీం సోఽత్యపశ్యత్
దినపతిసుతయేవ వ్యక్తసంగాం ప్రవాహీం.

[ఖేచరులగు గన్ధర్వకిన్నరాదులకు ఆకాశమార్గగ మనమను లీలచే బొడమిన చెమటబిందువులను మెల మెల్లని చిఱుగాడ్పుగుంపులచేతఁ బోగొట్టుచు (సుఖంబుఁజేయుచు) కువలయ (నల్లగల్వల) వనశోభచే యమునా నదిచే స్పష్టముగా నొసంగబడినయుం కపాళిగల దాని వోలె నున్న గంగానది నతండు కాంచెను అని భావము. ఇందు గంగానదియందు కువలయవనము లున్నట్లు చెప్పం బడినది గనుక నిట్టి నదీ నీలోత్పలము లున్నట్టులు చెప్పిన కవి సమయమున కుదాహరణ మైనది ]

ఇట్టులనే నదీకుముదాదులను కూడ నున్నట్టులు జెప్పిన కవిసమయము తెలియంగఁ దగును. ఇఁకను నియున్న చోటుల నెల్లను-అనఁగా సలిలమాత్రమునం దంతటను-హంస లున్న వని చెప్పెడి కవి సమయము నుదాహరించెదము.

శ్లో. ఆసీ దస్తి భవిష్యతీహ స జనో ధన్యో ధనీ ధార్మికః
యశ్శ్రీకేశవ మర్చయిష్యతి పున శ్రీమత్కుడుంగేశ్వరం,
హేలాందోళిత హంససారసకుల క్రేంకారసంమూర్ఛితై
రిత్యాఘోషయతీవ త న్నవనదీ యచ్చేష్టితం వారిభిః,

[ఆనవనది హేలాందోళిత హంససారసకుల క్రేంకారసంమూర్ఛితము లగు మదకములతో నేచేష్టితము నొనర్చెనో, (అనఁగా విలాసముగాఁ దరంగములను య్యేలలూఁగుచున్న హంసలు సారసములు మున్నగు

పక్షుల యొక్క క్రేంకారధ్వనులు నిండిన యుదకముల తో మాఱుమ్రోగుచున్నట్లున్న ఆనదీఘోషము అని భావము.] అటి లోకమునకు శ్రీకేశవునివలెనే శ్రీమత్కూడుంగేశ్వరుని గూర్చి కైంకర్యములు చేసినవాఁడును చేయుచున్న వాఁడును చేయఁగలవాఁడును అగుధార్మికుఁడును ధనికుఁడును ఇది వఱకు నుండెను. ఇప్పుడు నున్నాఁడు, ముందు నుండఁగలఁడు—అని లోకమునకు చాటుచున్నట్లు లున్నదని భావము. ఇందు హంసలు కేవలము నొక్కమానస సరస్సునందు మాత్రమే యుండుట సహజమైనను నదియైన ప్రతిదానియందు నున్నట్లు చెప్పెడి కవిసమయము ననుసరించి ఇచ్చటను కూడ నవియున్నట్లు చెప్పంబడుటచే నిది సలిలమాత్రమున హంసలున్నట్లు చెప్పెడి కవిసమయమున కుదాహరణము.]

ఇట్టులనే పర్వతమాత్రమునందు అనఁగా కొండమైన ప్రతిదానియందును ధాతూపధాతువులున్నట్టులు వర్ణించెడి కవి సమయముల నుదాహరించెదము. బంగారము వెండి రాగి మున్నగునవి ధాతువులు. అందు పర్వత మాత్రమున స్వర్ణమున్నట్లు వర్ణించెడి కవిసమయమున కుదాహరణము:—

శ్లో. నాగావాస శ్చిత్రపోతాభిరామః,
స్వర్ణస్థ్సితి వ్యాప్తదిక్చక్రవాళః,
సామ్యా త్సఖ్యం జగ్మివా నంబురాశేః,
ఏవ ఖ్యాతః తేన జీమూతభర్తా.

[ఈపర్వతము నాగుల కావాసమై చిత్రములగుపోత ములచే నభిరామమై బంగరుకాంతులచే వ్యాపించిన దిక్కులును చక్రవాళములును గలదై [ఇట్టిలక్షణములే గల] యంబురాశితో సఖ్యము నొందినట్టులుగా ప్రకాశించుచు నున్న దని తాత్పర్యము. ఇచ్చట స్వర్ణస్ఫీతి (బంగారు కాంతి) చే దిక్చక్రవాళముల వ్యాపించి నట్లుండుట ఒక్క మేరుపర్వతమునకే యున్నను, పర్వతమాత్రమునం దెల్ల (బంగారు) స్వర్ణాదిధాతువు లున్నట్లు వర్ణించెడి కవిసమయము ననుసరించి, స్వర్ణస్ఫీతివ్యాప్తి దిక్చవాళము అని వర్ణింపంబడినది. కావున నిది పర్వతమాత్రమున స్వర్ణమున్నట్లు వర్ణించు కవిసమయమున కుదాహరణ మైనది.]

ఈరీతిగానే పర్వతమాత్రమున నెల్ల రత్నములున్నట్లు వర్ణించు కవిసమయము కూడ కలదు. అందుల కీ క్రిందిశ్లోకము నుదాహరణముగాఁ గొనందగును. ఎట్లు అనంగా:—

శ్లో. నీలాశ్మరశ్మి పటలాని మహేభముక్త
సూత్కారశీకరవిసృంజి కటాంతశేషు,
ఆలోకయంతి సరళీకృతకంఠనాళాః
సానంద మంబుదధియా ఽత్ర మయూరనార్యః.

[గొప్పగొప్ప మదపుటేనుంగుల సూత్కారశీకరములతో కలసికొన్న (ఈపర్వతములందలి) చరియలయందలి ఇంద్రనీలమణులయొక్క కిరణములగుంపును ఇచ్చటి ఆఁడునెమళ్లు మేఘములను బుద్ధితో సానందముగా

పేక్షించుచున్నవి— అని భావము. ఇందు పర్వతిమాత్రి ముసంజెల్లను రత్నములున్నట్లు వర్ణింపవలసిన కవి సమయము పాటింపంబడుటచే సది పర్వతమాత్రిమున రత్నము లున్నట్లు చెప్పెడి కవిసమయమున కుదాహరణము.]

ఇట్టులనే తక్కినదానిని గూడ నెఱుంగునది. అనఁగా తక్కినధాతూపధాతు వర్ణము కూడ నున్నట్టులు చెప్పెడి కవిసమయముల కుదాహరణముల వెదకి కనుంగొనవలయు నని భావము ఇఁక ను ఉన్నప్పటికిని కూర్పనట్టి—అనఁగా సతోఽప్యనిబంధనమగు - కవిసమయముల నుదాహరించెదను. అయ్యది ఎట్లనంగా, వసంతర్తువునందు మాలతి (జాజిపూవు) యున్నట్లు కూర్పకుండుట, చందనవృక్షములకు పూవులుగాని పండ్లుగాని యున్నట్లు కూర్పకుండుట, అశోకవృక్షములకు ఫలము లున్నట్లు కూర్పకుండుట మున్నగునవి ఈజాతి వగు కవిసమయములందుఁ జేరును. అనఁగా సతోఽప్యనిబంధన కవిసమయమునఁ జేరునని భావము. అందు మొదటిదగు వసంతర్తువునందు మాలతీకుసుమము లుండునట్లు కూర్పకుండుటకు ఈ క్రిందిది యుదాహరణ మని యెఱుంగునది:-

శ్లో. మాలతీవిముఖ శ్చైత్రః వికాసీ సర్వసంపదాం
ఆశ్చర్యం జాతిహీనస్య కథం సుమనసః ప్రియాః?

[సమస్త పుష్పసంపదలకును వికాసము నొడఁగూర్చునదియైన చైత్రము (వసంతకాలము) మాలతీవిముఖమై [అనఁగా కేవల మొక్క జాజివిషయములో మాత్రము వైముఖ్యము గల్గి] యుండుటయును నది, ఆశ్చర్యము. కాని

జాతిహీన మగు[కులము తక్కువది అని యొకయర్థము. జాజిపూవులు లేని దని వేఱొక యర్థము]వానికి సుమనస్సులు, అనఁగా మంచి మనస్సు గలవిద్వాంసులు అని యొకయర్థము. మాలతీకుసుమము లని వేఱొక యర్థము. ఎట్లు ప్రియము లగును? ప్రియములు కాఁజాల దని తాత్పర్యము. ఇచ్చట జాజిపూవులు వసంతమున నుండ వన్న కవిసమయము పాటింపఁబడినది. కనుక నిది సలోప్యనిబంధన మగు కవిసమయమునందు చేరుచున్న దని యెఱుంగవలయును.

ఇఁక నిందే రెండవదగు చందన ద్రుమములందు పుష్పఫలము లున్నట్లు కూర్పకుండెడి దానికి ఈ క్రిందిది యుదాహరణముగాఁ గైకొనఁదగును.

శ్లో॥ యద్యపి చందనవిటపీ విధినా ఫలకుసుమవర్జితో విహితః,
నిజవపుషైవ పరేషాం తథాఽపి సంతాప మపహరతి.

[నిజమునకు, చందనవృక్షము సృష్టికర్తచేత పండ్లు పూవులు లేకుండునట్లుగా సృజింపబడి యున్నయది. అట్లయిన నిది, (అనఁగా నన్ని వృక్షములకు నొసంగిన సాధారణమగు ధర్మము కూడ దీనికి లేకుండునట్లు ఈశ్వరుఁ డిద్దానిని పక్షపాతముగా సృష్టించినాఁడు. అట్లయినను ఇది] తనదగు శరీరమాత్రము చేతనే పరులయొక్క (పరులు—శత్రువులు, పరాయివారు) సంతాపమును పోఁగొట్టఁ గల్గుచున్నదని భావము. అనఁగా విధి తనకు పరోపకారము చేయుఁగల అవకాశము లేకుండఁ దప్పించినను, తన శరీరము నర్పించియైనను పరోపకార మొన

ర్పుచు న్నదని తాత్పర్యము. ఇచ్చట చందన ద్రుమము లందు ఫలకుసుమము లున్నట్లు కూర్పరా దను కవి సమయము పాటింపంబడినది.]

ఈరీతిగానే మూఁడవదగు అశోకవృక్షములందు ఫలోత్పత్తిని కూర్పకుండెడి కవిసమయమును ఉదాహ రించెదము దాని క్రిందిది యుదాహరణము.

శ్లో. దైవాయత్తే హి ఫలే కింక్రియతా మేత దత్ర తు వదామః.
నాఽశోకస్య తు కిసలయై ర్వృక్షాంతరపల్లవా స్తుల్యాః.

(అనఁగా నశోకవృక్షములకు ఫలోత్పత్తి లేకుండు ట గొప్పలోప మని యందురు. కాని దైవాయత్త మగు ఫలము విషయమున మనుజులు ఏమిచేయ గలరు? [అనఁ గా నశోకమునకు ఫలసృష్టి చేయకుంట సృష్టికర్తలోప మే కాని అశోకవుది కా దనుట.] అయినను మేము ఇంతవఱకు గట్టిగా చెప్పుచున్నాము. ఇతర వృక్షముల యొక్క పల్లవము లేవియును అశోకవు పల్లవములతో పాటి కాఁజాలవు అనుమాట నిక్కము. (అనఁగా ఫల సంపద విషయమున దైవము తక్కువపఱచినను అశో కము పల్లవసంపదలో సృష్టికర్త సృష్టించిన వృక్షజాతి నంతను మించునని భావము.) ఇచ్చట నశోకములకు ఫల ము లున్నను లేకుండునట్లు కూర్చు కవిసమయము అనుస రింపం బడినది.

ఇట్లు అసతో నిబంధనము సతోఽవ్యనిబంధనము అను భేదములుగల సామాన్యకవిసమయములను నిరూ పించితిమి. ఇటుపైని నియమతోనిబంధనమగు కవి

సమయమును వివరించెదము. ఎట్లనఁగా—పెక్కు స్థలము లందు గలుచుగా కానవచ్చుచున్న వే యయ్యును, కేవలము ఒక్కచోటమాత్రమే నియమముగా నున్నటు వర్ణించుట యేదిగలదో, అదియే నియమతోనిబంధన మను వికిసమయ మగుచున్నది. అది నీళ్లు లోతుగాఁగల చోట్లంతటను నున్నను కేవలము సముద్రములందుమాత్రమే మకరాదు లున్నట్లు చెప్పుట, ఇతర స్థలములలో గూడ పుట్టునవియే యైనను ముత్తెములు కేవలము తామ్రపర్ణియందు మాత్రమే పుట్టుచున్నట్లు చెప్పుట—అని ద్వివిధముగా నుండును. అందు మొదటిదానికి ఈక్రిందిది యుదాహరణ మగును.

శ్లో, గోత్రాగ్రహారం నయతో గృహత్వం
స్వనామముద్రాంకిత మంబురాశిమ్.
దాయాదవర్గేషు పరిస్ఫురత్సు
దంష్ట్రావలేపో మకరస్య వంద్యః.

[తన జాతిలో జేరిన యితరములగు మకరములు బలశాలులుగా వెలుఁగుచున్నను తాను వాని నన్నింటిని మించి, స్వనామముద్రాంకిత మైన యంబురాశిని,అనంగా సముద్రమునుగా గోత్రాగ్రహారమును (భూమండలమును అగ్రహారముగా చేయుచు దానిని తనకునికి పట్టుగాఁ జేకొనుచున్న యా యాదిమకరము యొక్క దంష్ట్రావలేపము నెల్లరకు నభివంద్యము అగుచున్న దని - ప్రశంస. ఇందు మకరాదులు (మొసళ్లుమున్నగునవి) నీటిపట్టులందు అన్నిచోటుల నుండుట యున్నను కేవలమొక్క

ముద్రమునందే యున్నట్లు చెప్పెడి నియమతోనిబంధన మను కవిసమయము అనుసరింపఁబడి యుండుటచేత ఇట్లు కూర్పంబడిన దని యెఱుంగవలయును.)

ఇఁకను నియమతో నిబంధన మను కవిసమయములలోని రెండవదానికిది యుదాహరణము:—

శ్లో॥ కామం భవంతు సరితో భువి సుప్రతిష్ఠాః
స్వాదూని సంతు సలిలాని చ శుక్తయశ్చ
ఏతాం విహాయ వరవర్ణిని తామ్రపర్ణీం
నాఽన్యత్ర సంభవతి మౌక్తికకామధేనుః॥

[ఓ వరవర్ణినీ!లోకమున (తామ్రపర్ణికంటెను) మించిన పేరు ప్రతిష్ఠలు గల నదు లెన్నెన్నియో యుండిన నుండుఁగాక. ఆనదులయందును, స్వాదువులగు నుదకములును శుక్తులును(ఉత్తమ ముత్యపుచిప్పలు) నుండినచో నుండుఁగాక. కాని మౌక్తిక కామధేనువు ఈ తామ్రపర్ణియందే దొరకినదొరకవలెనే గాని తామ్రపర్ణిని వదలినచో మఱెక్కడను సంభవింపజాలదు అని భావము ఇందు ముత్యములు కేవల మొక్క తామ్రపర్ణియందే లభించు ననెడి నియమతో నిబంధన మను కవిసమయములోని రెండవది కూర్పంబడిన దని యెఱుంగఁగా వలయును.]

ఈవిధముగా జాతిసామాన్యములందు గల ముత్తెఱఁగులగు కవి సమయములును నిరూపింపంబడినవి. ఇఁకను ద్రవ్యసామాన్యమందుగల ముత్తెఱఁగులగుకవిసమయములను ఉదాహరించెదము. అందు లేనివస్తువును [ద్రవ్యమును] ఉన్నట్లుగా కూర్చు కవిసమయమున కుదాహరణము

నిశ్చితము. ఈకవిసమయము చీఁకట్లు ముష్టిగ్రాహ్యములుగా నున్నట్లు చెప్పుటకాని, లేదా సూచీభేద్యము లని చెప్పుట కాని—అని యొకవిధముగాను, వెన్నెలను కుంభోపవాహ్యత్వము గలుగు నట్లు వర్ణించుట—అని మఱొక్కవిధముగాను ఉండును. ముష్టిగ్రాహ్యము లనఁగా పిడికిలితోఁ బట్టుకొనుట కనువైన వని యర్థము. సూచీభేద్యము లనఁగా సూదితోఁ జిల్పొందగిన వని యర్థము. కుంభోపవాహ్యత్వ మనఁగా కుండలతో ముంచిపోయుట యని యర్థము. అందు మొదటిదగు దానికి—చీకట్లు ముష్టిగ్రాహ్యములుగాఁ గూర్చెడి కవిసమయమున కీక్రిందిది యుదాహరణము:—

శ్లో. తనులగ్నా ఇత కకుభః భూవలయం చరణచారమాత్ర మివ
దివ మివ చాళుకదఘ్నం ముష్టి గ్రాహ్యం తమః కురుతే.

[దిక్కులను తనులగ్నముల వోలెను, *భూవలయమును చరణ చారమాత్రము వోలెను, అకసమును పుడిసెడు పరిమితి గలదానిసి వలెను, తమమును ముష్టిగ్రాహ్యమును వోలెను చేయుచున్నదని భావము. ఇందు తమస్సు ముష్టిగ్రాహ్యము అనెడి కవిసమయము ననుసరించి రచన చేయఁబడుటచే నియ్యది ఉదాహరణముగా నయ్యెను.)

మఱొక్క దానికి-అనఁగా తమస్సు (చీఁకటి) సూచీభేద్య మనుటకు నుదాహరణము:—

శ్లో. పిహితే కారాగారే, తమసి చ సూచీముఖాగ్రనిర్భేద్యే
మయి చ నిమీలితనయనే తథాఽపి కాంతాననం వ్యక్తమ్.

[కారాగార (ద్వారము) గట్టిగా మూయఁబడియున్నను, చీఁకటి సూదిమొనచేతనైన యూనింపఁగావీలులేనంత దట్టముగా వ్యాపించి యున్నను నేను గట్టిగా కన్నులను మూసికొని యున్నను, ఇట్లైనను కూడ నా ప్రియురాలి మోము స్పష్టము అగుచునే యున్నదని భావము.( ఇందు తమస్సు సూచీభేద్య మను కవిసమయము గైకొనిరి.)

రెండవదగు దానికి, అనఁగా వెన్నెలలు కుంభోపవాహ్యములు అని చెప్పునట్టి కవిసమయమునకు ఇటుపైని ఉదాహరణము క్రింద నిచ్చుచున్నారము:—

శ్లో. యంత్రద్రావిత కేతకోదరదళ స్రోతశ్శ్రియం బిభ్రతీ
యేయం మౌక్తికదామగుంఫన విధే ర్యోగ్యచ్ఛవిః ప్రాగభూత్.
ఉత్సేక్యా కలశీభి రంజలిపుటై ర్గ్రాహ్యా మృణాళాంకురైః
పాతవ్యా చ శశి న్యముగ్ధవిభవే సా వర్తతే చంద్రికా.

[శంఖములు మున్నగువానిని కఱఁగునట్టి మూసలకు యంత్రము లని పేరు. మూసాయంత్రములచే కఱఁగి ద్రవముగాఁ జేయఁబడి, కేతకి (మొగలి) పువ్వుల రేకుల పొట్టలోఁగల తెలుపుందనము గల కాంతిపూరముయొక్క శోభను ధరించినదియై, ముత్తెముల సరులఁగూర్చినట్లుం (ముత్తెముల జాలరులఁ గూర్చినట్లుం) డెడి రీతితో సమమగు కాంతిగలదిగా ఏ వెన్నెల యింతకు మునుపు ఉండెడిదో, ఆ వెన్నెల యిప్పుడు కుండలతో ముంచి యెత్తఁదగునట్లును దోసిళ్లతోఁ బట్టుకొనందగినట్లును, మృణాళాంకురములతో పీల్చి త్రావఁదగినట్లును

చంద్రుఁడు సంపూర్ణముగా వెలుంగుచున్న యీ కాలము నందు అన్ని యెడల నలముకొనినది — అని తాత్పర్యము ఇందు వెన్నెల కుంభములతో (కడవలు లేక కుండలతో) ముంచి యెత్తఁదగినట్లు కూర్పంబడగు నదియెడి కవిసమయము పాటింపంబడినది.]

ఇఁకను ద్రవ్యసామాన్యమునందుఁ గల సత్త్వని బంధన మగు కవిసమయము నుదాహరించెదము. అందు కృష్ణపక్షమునందు వెన్నెలలున్నను కూర్పకుండుట యొకటి. శుక్లపక్షమునందు సైతము చీఁకటు లున్నను కూర్పకుండుట రెండవది. ఇందు మొదటివానికి ఉదాహరణము.

శ్లో. దదృశాతే జనై స్తత్ర యాత్రాయాం సకుతూహలైః,
బలభద్రప్రలంబఘ్నౌ పక్షావివ సితాసితౌ.

[ఆ యాత్రయందు కుతూహలు లగు జనులచేత తెల్లని నల్లని నీలమేఘములలాంటి శరీరవర్ణములు గల బలరామకృష్ణులు శుక్లకృష్ణపక్షములవలె సితాసిత వర్ణములుగలవారుగాఁ జూడఁబడిరి. ఇచ్చట శుక్లపక్షమునుఁ గృష్ణపక్షమును, అంధకారమును వెన్నెలలును, కొలదిగనో గొప్పగనో కలిగియున్నను, కవిసమయమును పాటించి యచ్చము తెలుపు నలుపులు గలవిగా కూర్పఁబడినవని యెఱుఁగునది.

ఇఁక రెండవదగు దానికి అనఁగా శుక్లపక్షమున చీఁకటులున్నను గూర్పంబడక యుండెడి కవిసమయమునకుదాహరణమును చూడుఁడు.—

శ్లో. మాసి మాసి సమా జ్యోత్స్నా పక్షయోః శుక్లకృష్ణయోః,
తత్రైక శ్శుక్లతాం యాతః, యశః పుణ్యై రవాప్యతే.

[నెలనెలను శుక్లపక్షకృష్ణపక్షములలో వెన్నెలలు ఉండుట సమమైనను, అందొక్కపక్షము శుక్లత్వమును పొందినది. (శుక్లత్వము=తెల్లనగుట, నిర్మలము, పరిశుద్ధము అగుట అని రెండర్థములు.) ఆహా! పూర్వపుణ్యములచేతనే కదా లోకమునందలి జనులు కీర్తి నొందఁగల్గుచున్నారు—అని తాత్పర్యము. ఇందు కేవలము శుక్లపక్షమునం జీఁకటు లుండుట సహజమైనను అయ్యావిభావిత్తిగా లేనట్టులు కవిసమయమును అనుసరించి కూర్పంబడి యున్న దని యెఱుంగగా వలయును.]

ఇంకను ద్రవ్యసామాన్యమునందుఁ గల నియమరూపమున నుండెడి కవిసమయము నుదాహరించెదము. అది మలయమేచందనవృక్షముల కుత్పత్తిస్థాన మని నియమించుట. హిమవత్పర్వతమే భూర్జ (భుజపత్రి) వృక్షముల కుత్పత్తిస్థాన మని నియమించుట—అని యిత్యాది భేదములు గలవి. అందు తొలి నియమముగల కవిసమయమునకు నుదాహరణ మెట్లనంగా.—

శ్లో. తాపాపహారచతురో నాగావాసః సురప్రియః,
నాన్యత్ర మలయా దద్రేః దృశ్యతే చందనద్రుమః.

[తాపములం బాపుటలో మిక్కిలియును చతురమును, నాగములకు (సర్పములకు) సర్వదా ఆవాసమైనదియును, సురలకు (దేవతలకు) ప్రియమైనదియు నగు చందన తరువు మలయపర్వతముకంటె మఱెచ్చటఁ గన్ప

ట్టుట లేదు అని శ్లోకమునకుఁ దాత్పర్యము. ఇంద మల యమునందే చందనతరువులున్నట్లు నియమము చేయు కవి సమయము కూర్పంబడినది అని తెలిసికొనఁగా దగును.]

రెండవదానికి—అనఁగా హిమవత్పర్వతమే భూర్జ వృక్షముల యుత్పత్తిస్థాన మను నియమరూప మగు కవి సమయమున కుదాహరణము.—

శ్లో. న్యస్తాక్షరా ధాతురసేన యత్ర
భూర్జత్వచః కుంజరబిందుశోణాః
వ్రజంతి విద్యాధరసుందరీణాం
అనంగలేఖక్రియయోపయోగమ్.

—కాళిదాసుని కుమారసంభవము. సర్గ. 1-7 శ్లో.

ఏహిమవత్ పర్వతమునందు సిందూరము మున్న గుధాతురసముచేత వ్రాయఁబడిన వర్ణములు గలవియును ఏనుగు గున్నలయొడల పైగల పద్మకాది బిందువులవలె నెఱ్ఱనైనవియును అగు భూర్జ వృక్షములయొక్క పట్టలు ఆపర్వతముపై వసించిన విద్యాధర కామినులకు భావసం సూచకములగు అనంగలేఖలుగా చేయు పనిచే నుపయో గమును పొందినవో, అట్టి హిమవత్పర్వతము కల దని భావము. ఇందు భుజపత్రవృక్షము కేవలము నొక్క హిమవంతమునందే యుండునట్లు కూర్పవలయు నను కవిసమయము పాటింపఁబడిన దని యెఱుంగునది.

ఇటువంటి ప్రకీర్ణక మగు ద్రవ్యమునందుఁగలనియ మరూపమున నుండు కవిసమయము నుదాహరించెదము.

అది యెట్లనఁగా:—పాలసముద్రమునకు నుప్పుసముద్ర మునకు నైక్యము చెప్పుటయును, సముద్రమునకు మహా సముద్రమునకు నైక్యము చెప్పుటయు నను భేదముల నందును. అందు మొదటిదాని కుదాహరణము—

శ్లో. శేతాం హరి ర్భవతు రత్న మనంత మంతః
లక్ష్మీప్రసూతి రితి నో వివదామహే హే!
హా క్షారవారిసరయా తృషితస్య జంతోః
కిం త్వత్ర కూపపయసః పతి మర్ణో ర్జఘన్యః.

[ఆ యొక్క సముద్రమునందు శ్రీహరి యంతవాఁడు శయనించుఁగాక. దానిలోపల ననంతముగా రత్నజాత ముండును గాక. అయ్యది లక్ష్మికి పుట్టినిల్లు అగుగాక. ఆవిషయమున మేము వివదించుట లేదు. మఱేమనఁగా అది దూరముగా వదలి పెట్టఁదగిన దుష్టరసము (ఉప్పు గల నీరు) కలిగి యున్నదగుటచేత, దప్పిగొన్నప్రాణికిఁ గూపో దకము గల మరుభూమికంటెను మిక్కిలియును తక్కు వదే యగు నని భావము సాధారణముగా విష్ణువు శయ నించునది రత్నముల కాకరమైనది లక్ష్మికిఁ బుట్టినిల్లైనది యైన సముద్రము క్షీరసముద్రమే కాని, యుప్పుసముద్ర ము కా దనుట నందఱెఱిఁగియే యున్నారు. అట్లయినను ఇందు మామూలు ఉప్పు సముద్రమునకును క్షీరసముద్ర మునకును, అభేదము పాటింపవలయు ననెడి కవిసమ యము ననుసరించి యిచ్చుట నిట్లు చెప్పఁబడినది.]

ఇంకను రెండవదానికి, నసఁగా మామూలు సముద్రమునకును లవణేక్షుసురాది సప్తసముద్రములకును

(ఇవియే మహాసముద్రము లనంబడును.) ఐక్యము (భేదములేకుండుట) చెప్పెడి కవిసమయము నుదాహరించెదము.

శ్లో. రంగత్తరంగ భ్రూభంగై స్తర్జయంతీ మివాపగాః
స దదర్శ పురో గంగాం సప్తసాగరవల్లభామ్.

[అందము గులుకు తరంగము లనెడి భ్రూభంగములతోఁ దక్కిననదులను బెదరించుచున్నట్లున్న, సప్తసముద్రములకు వల్లభురాలై యున్న, గంగ నాతం డెదుట గనుగొనెను అని భావము. గంగానది వల్లభగా నుండుట కేవలమొక్క లవణసముద్రమునకే యైనను మామూలు లవణసముద్రమునకును దక్కిన మహాసముద్రము లేడింటికిని అభేదముగా(ఐక్యముగా)నే చెప్పవలయు నని యనెడి కవిసమయ మిచట పాటింపంబడిన దని యెఱుంగవలయును.]

ఇఁక క్రియార్థము లేకున్నను ఉన్నట్లు చెప్పెడి కవిసమయము నుదాహరించెదము. అది చక్రవాకదంపతులు రాత్రివేళలందు వేఱ్వేఱు దరులను (ఏటి బద్దులు మున్నగు వానిని) ఆశ్రయించి యుండునట్లు చెప్పుట యొకవిధమును, చకోరములు వెన్నెలలఁ గ్రోలునట్లు చెప్పుట మఱొక్క విధమును, నై రెండుగ నుండును. అందు తొల్లింటి దగువానికి (చక్రవాక దంపతులు భిన్నతటాశ్రయము చేయునట్లు చెప్పెడిదానికి) ఉదాహరణము:—

శ్లో. సంక్షిపతా యామవతీః తటినీనాం తనయతా పయఃపూరాన్,
రథచరణాహ్వయవయసాం కిం నోపకృతం నిదాఘేన?

[రాత్రులందలి కాలమును సంక్షేపించియును నదులందలి ఉదకప్రవాహముల నింకించియును, గ్రీష్మర్తువు చక్రవాకములకు ఏయుపకారము సేయలేదో చెప్పుడు అని భావము. అనఁగా గ్రీష్మర్తువు రాత్రికాలమును తగ్గించుటచే చక్రవాకముల వియోగ కాలమును తగ్గించె ననియు, ఇద్దరి నద్దరిని తన్ని ప్రవహించెడి నీటిప్రవాహము నింకించుట చేత రాత్రులందు ఆదంపతులు వేర్వేరు దరుల నాశ్రయింపవలసిన యవసరము లేకుండ కలసియుండునట్లు అవకాశము గల్పించె ననియు, కావున గ్రీష్మర్తువు చక్రవాకములకు సమస్తోపకారములను చేసినట్లే యైనదనియు భావము ఇందు పైని చక్రవాక దంపతుల భిన్న తటాశ్రయణ మను కవిసమయము కూర్పంబడినది అని తెలియఁగునది.]

రెండవదానికి, అనఁగాఁ చకోరములు వెన్నెలలఁ ద్రావునట్లు చెప్పెడి కవిసమయమునకు ఈ క్రిందిశ్లోకము నుదాహరణముగాఁ గైకొనఁ గును. ఎట్లనంగా:—

శ్లో. ఏతా స్తా మలయోపకంఠ సరితా మేణాక్షి రోధోభువ
శ్చాపాభ్యాసనికేతనం భగవతః ప్రేయో మనోజన్మనః,
యాసు శ్యామనిశాసు పీతతమసో ముక్తామయీ శ్చంద్రికాః
పీయంతే వివృతోర్ధ్వచంచు విచలత్కంఠం చకోరాంగనాః.

[ఇందు చకోరములు వెన్నెలలు త్రావుచున్నట్లు కూర్పంబడినది. దీనియర్థ మిదివఱకు 9 వ యధ్యా

యమున అప్రసిద్ధవర్ణనరసవత్తను ఉదాహరణముగా నిచ్చిన స్థలమునందు వ్రాయంబడినది. కనుక నిక్కడ మఱల వ్రాయలేదు. ]చూ. పే. 176.]

క్రియార్థము ఉన్నను కూర్చకుండునట్టి కవిసమయము నుదాహరించెదము. ఇది పగటిపూట నీలోత్పలాదులు వికసించినను కూర్పకుండుట, నిశానిమిత్తముగ శేఫాలికా కుసుమముల యవిస్రంసనము అని ద్వివిధము. అందు తొలిదానికి ఈక్రిందిది యుదాహరణము:—

శ్లో. ఆలిఖ్య పత్రి మసితాగురుణాభిరామం
రామాముఖే క్షణసభాజిత చంద్రబింబే
జాతః పునర్వికసనావసరోఽయమస్యే
త్యుక్త్వా సఖీ కువలయం శ్రవణే చకార.

[క్షణసభాజిత చంద్రబింబమగు నాస్త్రీయొక్క ముఖమున నామె చెలికత్తె తొలుదొల్త నల్లయగురుతోడి యభిరామముగా నున్న మకరికాపత్రము వ్రాసి దీనికి మఱల వికసింపందగు సమయము మాసన్నమైనదనుచు చెవిని కలువనుంచెను.—అని భావము. ఇందు పగలు నీలోత్పలములకు వికసనము లేదను కవిసమయము కూర్పంబడినది.]

రెండవదానికి నుదాహరణము:—

శ్లో. త్వద్విప్రయోగే కిరణైస్తథోగ్రైః
దగ్ధాఽస్మి కృత్స్నం దివసం త్వయా,
ఇతీవ దుఃఖం శశినే గదంతీ
శేఫాలికా రోదితి పుష్పబాష్పైః.

[చంద్రా! నీతోడి విరహము గలుగగనే పగలంతయును సూర్యునిచే నుగ్రములగు కిరణములం దగుల బెట్టబడినదాన నైతి నను సమాచారమును శేఫాలికాలత తననాయకుఁడగు చంద్రునితోఁ జెప్పుకొనుచు బూఁవుల నెడిబాష్పములతో రోదనము సేయుచున్నట్లు లున్న దని భావము. ఇందు రాత్రివేళల శేఫాలికాకుసుమములు రాలున నెడి కవిసమయము ననుసరించి యిచ్చట నిట్టులు కూర్పంబడినదని యెఱుంగునది.]

ఇఁక నియమము నుదాహరించెదము. అది ఎట్లనఁగా—గ్రీష్మాదులగు తక్కినఋతువులయందు కోకిలరుతములు సంభవించుచు నున్నను, కేవలము ఒక్కవసంతమునందు మాత్రమే యున్నట్టులు చెప్పుట యొకవిధమగు ద్రవ్యసామాన్యమునకుఁ జెందిన నియమరూప మగు కవిసమయము. ఇట్టులనే వర్షర్తువులందు మాత్రమే నెమళ్లకూఁతలును, నృత్త్యమును ఉన్నట్లు చెప్పవలయుననుట రెండవదగు నియమరూప మగు కవిసమయము.

ఇందు తొలిదానికి ఉదాహరణము:—

శ్లో. వసంతే శీతభీతేన కోకిలేన వనే రుతం,
అంతర్జలగతాః పద్మాః శ్రోతుకామా ఇవోత్థితాః.

[శీతము వలని బెదరుగలిగి యున్న కోకిలచేనైన ధ్వనిని (కోకిలధ్వనిని) జలాంతర్గతము లగు పద్మములు వినందలఁచిన వానివలె వసంతము రాఁగానే పైకి ఉబికినవి. అనఁగా వికసించిన వని యర్థము. ఇందు వసంత

కాలమునందు మాత్రమే కోకిలలధ్వని కల్గునట్లు చెప్పెడి నియమరూపమగు క్రియాత్మక కవిసమయము కూర్పంబడి నది ]

రెండవదానికి నుదాహరణము:—

శ్లో. మండలీకృత్య బర్హాణి కంఠై ర్మధురగీతిభిః.
కలాపినః ప్రనృత్యంతి కాలే జీమూతమాలిని.

[నెమళ్లు పురులను మండలాకారముగా విప్పికొని మధురసంగీతకములు గల కంఠములతో జీమూతమాలి యగు నీకాలమునందు (అనఁగా వర్షాకాలమునందు అని అర్థము.) మిక్కుటముగా నృత్యముఁ జేయుచున్న వని తాత్పర్యము. ఇచ్చట వర్షర్తువునందు మాత్రమే నెమళ్లు ధ్వనిచేయుటయును, నృత్యముచేయుటయును కూర్పవల యు ననెడి క్రియాగతనియమరూప మగు కవిసమయము నాధారముగాఁ గొని రచన సేయంబడినది.]

ఈరీతిగా నీకవిసమయము జాతిగతము ద్రవ్యగతము క్రియాగతము ననెడి ముత్తెఱఁగులనున్నదియు, వివరింపం బడినది. ఇఁక నిటుపైని గుణగతమగు కవిసమయమును స్వర్గ్యమర్త్యపాతాళీయము లనెడి కవిసమయములును రాఁగల (తర్వాతి) ప్రకరణమునందు వివరించెదము.

ఇది రాజశేఖర కవిరాజకృతమగు కావ్యమీమాంస యను కవిరహస్యమునఁ బ్రథమాధికరణమునందు జాతిద్రవ్యక్రియాసమయస్థాపన మనునది చతుర్దశాధ్యాయము.

# రాజశేఖరకవి కావ్యమీమాంస.

---

## పంచదశాధ్యాయము.

---

### గుణసమయస్థాపనము.

ఈయధ్యాయమునందు వచ్చెడివిషయములు:—౧, గుణసమయములోఁగల భేదములు. ౨. లేని గుణములను, కూర్చుటలు, వాని యుదాహరణములు, ౩ ఉన్నవానిని కూర్పక యుండుటలు, వానికి నుదాహరణములు. ౪ నియమతో నిబంధనములు, ౫ వానియుదాహరణములు—మొదలగునవి.

ఇటుపైని గుణసమయస్థాపన మను నధ్యాయము నారంభించెదము. అందు అసతో గుణనిబంధనము—అనఁగా లేకున్నను గుణములుఉన్నట్టులు కూర్చుట,యెట్టు లనఁగా, కీర్తి, నవ్వు మున్నగువానికి తెల్లఁదనము లేకున్నను ఉన్నట్లు వర్ణించుటయు, పపకీర్తి, పాపము, దుఃఖము మొదలగువానికి నలుపు లేకున్నను ఉన్నట్లు వర్ణించుటయు కోపము అనురాగము ప్రీతి ప్రేమ మైత్రి స్నేహము మున్నగు వానికి ఎఱుపుఁదనము లేకున్నను ఉన్నట్టులుగా వర్ణించుటయును, ఈ మున్నగునవి యిందులోఁజేరును. అందు కీర్తి తెల్లగానుండునట్లు వర్ణించెడి గుణసమయమున క్రిందిది యుదాహరణము:—

శ్లో. స్త్రైణ స్త్రైణోఽపి నాంగే శ్వసిత మవికలం
చక్షుషాం నైవ వృత్తిః
వక్త్రే క్షీరాబ్ధిమగ్నా స్స్ఫుట మథ చ వయం
కోఽయ మిత్యుక్తిశంకః,
ఇత్థం దిక్పాలలోకః క్షితివిసరతయా
మాంసలై స్త్వద్యశోభిః
స్తోకావస్థానమస్మిం స్త్రిజగతి ధవళే
విస్మయంతే మృగాక్ష్యః.

ఈశ్లోకమునకు ఇందే ఆరవయధ్యాయమునందు 95 వ పేజీయందు అర్థము వ్రాయంబడినది; కావున నిచ్చట మానితిని. ఇందు కీర్తి తెల్లనిదిగా లేకున్నను, ఉండు నట్లు వర్ణింపంబడినది గనుక కీర్తి శౌక్ల్య మనెడి కవుల గుణసమయమున కుదాహరణ మైనది—అని యెఱుంగునది.

ఇంక హాసశౌక్ల్య మనెడి (అనఁగా నవ్వు తెల్లఁగా నుండు ననెడి కవిసమయమున కుదాహరణము నిచ్చెదము.

శ్లో. అట్టహాసచ్ఛలే నాస్యా ద్యస్య ఫేనౌఘపాండురాః,
జగత్క్షయ ఇవాపీతాః క్షరంతి క్షీరసాగరాః,

[నుఱుగులగుంపుచేత పాండురములగు క్షీరసాగరములు జగత్ప్రళయకాలమున నాపీతములైనవానివలె నితనిముఖాస్యమునుండి యట్టహాసము లనెడి మిషతో స్రవించుచు నున్నవి—అని తాత్పర్యము. అట్టహాస మనఁగాఁ బెద్దనవ్వు. ఈనవ్వు యిట తెల్లదిగా నున్నట్లుకూర్చుటవలన క్షీరసాగరములతో నుపమింప వీలు కలిగినది.

కావున నియ్యది హాసము (నవ్వు) శుక్లత్వముఁగాఁ గూర్చెడి హాసశౌక్ల్య మను గుణసమయమున కుదాహరణ మైనది.]

అయశః కృష్ణత్వ మను గుణసమయమునకు- అనఁగా నపకీర్తి నల్లఁగా నుండు నని వర్ణించు కవిసమయము న కుదాహరణము నిచ్చుచున్నాము. ఎట్లనఁగా—

శ్లో. ప్రసరంతి కీర్తయ స్తే
తవ చ రిపూణా మకీర్తయో యుగపత్,
కువలయదళ సంవలితాః
ప్రతిదిన మివ మాలతీమాలాః.

[రాజా! నీయొక్క కీర్తులును నీశత్రువుల యొక్క అపకీర్తులును ఏకకాలమునందే ప్రాతఃకాలమునందు కువలయదళసంవలితములగు మాలతీమాలలవలె రాజిల్లుచున్నవి—అని భావము. ఇందు మాలతీపూవులు తెల్లనివి కాఁబట్టి రాజుగారి కీర్తులవలెను, కువలయదళములు నల్లనివి కాఁబట్టి శత్రువుల అపకీర్తులవలెను ఉండి, రెండు నొక్కమాటె (అనఁగా రాజుకీర్తియును అతని శత్రువుల యపకీర్తియును నొక్కమాటే) ప్రసరించుటం జేసి ఒకదానినొకటి మిక్కిలి యొఱసి కొనునట్లు నడుమనడుమ నల్లకల్వలు గ్రుచ్చిన మాలతీ మాలికలవలె యొప్పుచున్నవని యభిప్రాయము నెఱుంగఁదగును. ఇట అపకీర్తులు నల్లగా నున్నట్లు చెప్పెడి కవులయొక్క గుణసమయము చేకొనఁబడినది.]

పాపకార్ష్ణ్య మను గుణసమయము:—

శ్లో. ఉత్ఖాతనిర్మల మయూఖ కృపాణలేఖా
శ్యామాయితా తవ రథూ ద్వహకంధరస్య,
సద్యః ప్రకోపకృతకేశవ వంశనాశ
సంకల్పసంజనిత పాపమలీమసేవ.

ఆహాయగ్రీవుఁడనెడి దానవునియొక్క తనులతః,సద్యః ప్రకోపముచే జయింపఁబడిన కేశవ వంశనాశ సంకల్పముచేత సద్యః ప్రాదుర్భవించిన పాపమాలిన్యము గల దానివోలె, తెగనఱుకంబడిన నిర్మలకాంతులు గల ఖడ్గలతచే శ్యామాయితముగా నయ్యె నని భావము ఇందు పాపము నల్లనిదని చెప్పెడి కవుల గుణసమయము కైకొనంబడుటచేత నియ్యది పాపకార్ష్ణ్య మనెడి కవిసమయమున కుదాహరణ మయ్యె నని యెఱుంగునది.

అనురాగరక్తత యనెడి గుణసమయమునకు - అనఁగా ననురాగము (ప్రేమ) ఎఱ్ఱగా నుండునట్లులు వర్ణించు కవిసమయమునకు - ఉదాహరణము:—

శ్లో. గుణానురాగమిశ్రేణ యశసా తవసర్పతా,
ద్విగ్వధూనాం ముఖే జాత మకస్మా దర్ధకుంకుమమ్.

స్త్రీ యొక్క సద్గుణములయందైన అనురాగముతోఁగలసి నీ కీర్తి లోకమున నెల్లయెడలను ప్రసరించుచుండఁగా నయ్యది దిగంగనల ముఖమున హఠాత్తుగా నేర్పడిన యర్ధకుంకుమ తిలకమువోలె నయ్యె నని భావము. ఇట అనురాగము ఎఱ్ఱనిదిగా కూర్పంబడినది. గను

కనే కుంకుమసామ్య మొుండంగల్గినది. కావున నీశ్లోకము అనురాగరక్తత యనెడి కవిసమయమున కుదాహరణ మయ్యెను. ఈశ్లోకము, ఆరవయధ్యాయమునం దీగ్రంథముననే 100వ పేజీయందు, కావ్యములు అసద్విషయము లను చెప్పను కాంబట్టి ఉపదేశానర్హములు—అన్నపూర్వపక్షమును ఖండించుచు, అట్టి అసద్విషయములు శ్రుతులలోను శాస్త్రములలోను లోకమునందును కూడ సమముగానే యున్నవని నిరూపించి, యొక్కొక్కదానికి నుదాహరణముల నిచ్చుచు, లౌకికమున కుదాహరణముగా నిచ్చియున్నాండు. అచ్చట పొరపాటున నర్థము వ్రాయంబడ లేదు. ఇచ్చో అష్టమాధ్యాయమునందు (౨౮౫ వ పేజీయందు) సంయోగవిశాఖ మనెడి దాని కుదాహరణముగాను నిది చెప్పంబడినది. గనుక నచ్చటగూడ చదువరులు నర్థము పొరపాటున వదలివేయంబడిన యీ శ్లోకార్థముం గూర్చికొనం బ్రార్థితులు.]

ఇంక గుణములున్నను కూర్పనట్టిదగు - అనంగా నశోభ్యనిబంధన మనెడి - గుణసమయమును వివరించెదము. మల్లె మొగ్గలు, కాముకుల దంతములు- వీనికి రక్తత్వము, కమలపు మొగ్గలు, మొదలగునవి వీనికి హారిత (ఆకుపచ్చ) వర్ణము ప్రియంగు పుష్పములకు పీతత్వము (కనకపుపచ్చరంగు) కూర్పకుండుటలు మున్నగునవి ఈ జాతిలోం జేరును. అనంగా మల్లెమొగ్గలు కొంచెము మెఱుపుంగలసి యున్నను, దానిని చెప్పక అచ్చము తెలుపునే వర్ణించుట, ఇట్లే కాముకుల దంతములు తాంబూలచర్వ

ణాములచే నెఱ్ఱవారియుండుట యున్నను, ఆయెఱుపును చెప్పక తెలుపునే చెప్పుట, కమలపు మొగ్గలు కొసమం త ఆకుపచ్చగా నున్నను దానిని జెప్పకుండుట, ప్రియంగు పుష్పములకు పీతత్వ (పసుపుపచ్చరంగు) మున్నను అట్లు వర్ణింపకుండుట అను మున్నగునవి యీజాతి గుణసమయ ములోఁ జేరునని భావము

అందు కుందకుట్మలాదులకు రక్తత లేనందుల కుదాహరణము:—

శ్లో. ద్యోతితాంతస్సభైః కుందకుట్మలాగ్రదతః స్మితైః,
స్నపితే వాఽభవ త్తస్య శుద్ధవర్ణా సరస్వతీ.
మాఘకవి శిశుపాలవధ—స 2. 7 శ్లో.

[మల్లెమొగ్గల కొనలుగల దంతములు గలదియు, ప్రకాశింపఁ జేయంబడిన సభాంతఃప్రదేశములు గలవియు నగు చిఱునవ్వులచే నతనియొక్క సరస్వతి స్నపితురాలై నట్టులుగా శుద్ధవర్ణ గా [ తెల్లనికాంతి గలది, స్వచ్ఛమైన వర్ణములు గలదిగా నయ్యెను—అని తాత్పర్యము.]

ఇందు దంతములు మల్లెమొగ్గలతోఁ బోల్పంబడు నపుడు వానియందు రక్తత్వము సహజముగా నున్నను కుందకుట్మలాదులకు రక్తత్వముఁ గూర్పరా దనియెడి అసత్తోపి గుణస్యానిబంధన మనెడి కవుల గుణసమయ ము ననుసరించి రక్తత్వము కూర్పలేదు. కావున నిది పైదానికి నుదాహరణముగ నయ్యె నని యెఱుంగునది.

ఇట్లే పద్మముకుళములకు హరితత్వ మున్నను నద్దానిని కూర్పకుండెడి కవుల సతోఽపి గుణానిబంధన కవిసమయమునకును ఈక్రిందిశ్లోకము ఉదాహరణము:—

శ్లో. ఉద్దండోదరపుండరీకముకుళభ్రాంతిస్పృశా దంష్ట్రయా,
మగ్నాం లావణసైంధవేఽంభసి మహీముద్యచ్ఛతో హేలయా,
తత్కాలాకులదేవదానవకులై రుత్తాళకోలాహలం,
శార్ఙ్గే రాదివరాహలీల మవతా దభ్రంలిహాగ్రం వపుః.

ఉద్దండ మగు [అనఁగా కాడ పైకివచ్చునట్లు పట్టుకొనంబడినదగు] నాభికమలపు మొగ్గయా! యనెడిభ్రాంతి కిరవైన కోఱతో, లవణసాగరోదకముల మునింగిపోయిన భూమిని, లీలామాత్రముగా పైకెత్తిపట్టుచున్న శ్రీమన్మహావిష్ణువు యొక్క, ఆదివరాహ లీలలుగల, ఆకాశమున కొఱయుచున్న అగ్రముగల శరీరము-ఆభూమి నుద్ధరించెడి సమయమునఁ దలక్రిందులగుచున్న దేవదానవ సంఘములచే ఉత్తాలకోలాహలముగా నున్న యాశరీరము-మిమ్ము రక్షించుగాక యనిభావము.

ఇందు ఆదివరాహమూర్తి భూమ్యుద్ధరణమును కోరతోఁ జేసినప్పుడు అయ్యది ఉద్దండోదరపుండరీక మను భ్రాంతికల్గించిన దని కూర్పఁబడుటచేత, కోర తెల్లనిది గనుక, తదుపమానార్హ మగు కమలకోరకములు తెల్లగా నున్నట్లులే కూర్పంబడినవి. కావున నిది పద్మముకుళాదులకు సహజముగా హరితత్వము ఉన్నను, అద్దాని కూర్పకయుండెడి, సతోఽపి గుణనిబంధన మనెడి కవిసమయమున కుదాహరణ మయ్యెను.

ఇఁకను ప్రియంగు పుష్పములకు పీతత్వము లేకుం డున్నట్లు చెప్పెడి సతోఽపి గుణానిబంధన మను కవిసమ యమునకు ఉదాహరణము నిచ్చెదము:—ఎట్లనఁగా:—

శ్లో. ప్రియంగుశ్యామ మంభోధి రంధ్రస్త్రీణాం స్తనమండలమ్.
అలంకర్తు మివ స్వచ్ఛా స్సూతే మౌక్తికసంపదః.

ప్రియంగు పుష్పములువోలె శ్యామవర్ణము గల యాం ధ్రదేశపు స్త్రీలయొక్క స్తనమండలమును అలంకరించు టకో యనునట్లులుగా, సింధు రత్నాకరము ముత్తెముల సంప దలను అమిత స్వచ్ఛములగు వానిని ప్రసవించుచున్నది- యని భావము. ఇచ్చట నాంధ్రస్త్రీల స్తనమండలములతోఁ బోల్చుటకుఁ ప్రియంగు పుష్పములువోలె శ్యామవర్ణము గలవియని చెప్పుటంజేసి సహజముగా ప్రియంగు పుష్ప ములకు పసుపుపచ్చని రంగున్నను అద్దానిని గూర్పక, ప్రియంగు పుష్పములకు శ్యామవర్ణమున్నట్లులు జెప్పవ లసిన కవిసమయము ననుసరించినాఁడు. కాఁబట్టి ఇయ్యది సతోఽపి గుణానిబంధన మను కవిసమయములలో - ప్రి యంగు పుష్పాపీతత్వమునకు నుదాహరణమైనది యని యెఱుంగఁగా వలయును.

ఇఁక నిటుపైని గుణనియమము నుదాహరించెదము అది యెట్లనఁగా—సామాన్యముగా జేకొనునప్పుడు, ర మాణిక్యములకు ఎఱుపుఁదనమును, పూవులకు తెలుపు దనమును మేఘములకు నల్పుదనము నున్నట్లు వర్ణించు టలు మున్నగువిధముల నది యొప్పుచు నుండును. అనఁ

గా మాణిక్యములలో, ఎఱుపు నలుపు మున్నగు నానా రంగుల రత్నములు జేరియున్నను, అందలి వైశిష్ట్యము ను పేర్కొనక, మొత్తమున మాణిక్యములను కూర్చి చెప్పినపుడు, అందలి యవాంతరములగు వర్ణములను వదలి సర్వసాధారణమగు ఎఱుపే యున్నట్టులు కూర్ప వలయు ననియు, ఇట్లే పుష్పములలోఁగూడ భిన్నభిన్నము లగు రంగులవ్వాని యున్నను, మొత్తమునఁ జెప్పినప్పుడు తెల్లనివనియే చెప్పవలయు ననియును, మేఘములలోఁ గూడ గ్రీష్మ మేఘములు, వర్షాకాల మేఘములు శరత్కా ల మేఘములు హైమంతపు మేఘములు, శైశిర మేఘ ములు అని పెక్కుజాతులు పెక్కురంగులతో నుండుట యున్నను, వైశిష్ట్యమును చెప్పక, మొత్తమును చెప్పిన ప్పుడు నల్లని (నీలపు) రంగుకలవిగానే చెప్పవలయు నని యు నిత్యాదులు గుణనియమ మనెడి కవిసమయములోఁ జేరిన వనియును తాత్పర్యము.

అందు తొలుదొల్తటిదగు గుణనియమరూప మగు కవిసమయమునకు — అనఁగా సామాన్యోపాదానమున మాణిక్యములు ఎఱ్ఱనివని కూర్పవలసినట్టి కవిసమయము నకు ఈక్రిందిది యుదాహరణము:—

శ్లో. సాంయాత్రికై రవిరతోపరతాని కూలైః
శ్యామాసు తీరవనరాజిషు సంభృతాని,
రత్నాని తే దధతి కచ్చి దహో యతక్షి!
మేఘోదరోదితనదీపతిబింబశంకామ్.

వెడఁదకన్నులు గల యో చిన్నదానా! శ్యామలములగు తీరఘన రాజులయందు సాంయాత్రిక కూటములచేత, ననఁగా సముద్రవర్తకముం జేయు వర్తకబృందము ద్వారా, ఎడతెఱపి లేకుండ దీసికొని రాఁబడి పేర్పఁబడుచున్న యీరత్నరాసులు నల్లని మేఘముల నుండి వెలువడుచున్న సూర్యబింబ మనుభ్రాంతిఁ గలిగించుచున్నవి కదా!-యని భావము. ఇచ్చట రత్నరాశి సూర్యబింబశంకను కలిగించుచున్నదా యనుటచేత (సూర్యబింబ మెఱ్ఱనిది కాఁబట్టి) మాణిక్యములను సామాన్యముగాఁ జెప్పినప్పుడు ఎఱ్ఱనివిగాఁ గూర్పవలెననెడి కవుల గుణసమయమునకియ్యది యుదాహరణముగా నైన దని భావము.

ఇఁకను పూవులను సామాన్యోపాదానమున శుక్లవర్ణము (తెలుపు) కలవిగాఁ గూర్పవలయు ననెడి గుణసమయమున కీక్రిందిది ఉదాహరణము. ఎట్లనఁగా:—

శ్లో. పుష్పం ప్రవాళోపహితం యది స్యాత్
ముక్తాఫలం వా స్ఫుటవిద్రుమస్థం,
తతోఽనుకుర్యా ద్విశదస్య తస్యాః
తామ్రౌష్ఠపర్యస్తరుచః స్మితస్య.

—కుమారసంభవము. స 1-44.

పుష్పము ప్రవాళములతోఁ గలిపి కూర్పంబడినది అగునేని, లేదా స్ఫుటవిద్రుమములందు కూర్పఁబడి ముత్తెము ఉండు నేనియు, అప్పుడు అయ్యది ఆ పార్వతీదేవి యొక్క ఎఱ్ఱని యధరమునందు ప్రసరించిన కిరణా

ములు గలవగవుతో ననుకరణము చేయఁగల్గు నని యర్థము అనఁగా నప్పుడది ఆ కొమ్మ చిఱునగవుతోఁ దుల్యత్వము నొందఁగల దని భావము. ఇందు ప్రవాళము లెఱ్ఱనివి కాబట్టి పుష్పము సామాన్యోపాదానమునఁ దెల్లనిదిగా వర్ణింపఁబడినది. కనుక నియ్యది పుష్పములు సామాన్యోపాదానమున శుక్లత్వము గలవిగా వర్ణింపఁబడవలె ననెడి కవుల గుణసమయమున కుదాహరణము.

ఈరీతిగానే ఈక్రిందిశ్లోకమున సామాన్యోపాదానమున మేఘములు కృష్ణవర్ణము గల్గియున్నట్లు చెప్పెడి కవుల గుణసమయమునందలి మూఁడవదానిం గూర్చియున్నారు. కావున నిది యుదాహరణముగ నెఱుంగునది.

శ్లో. మేఘశ్యామేన రామేణ పూతవేది ర్విమానరాట్,
మధ్యే మహేంద్రనీలేవ రత్నరాశి ర్వ్యభాత్.

మేఘునివలె శ్యామవర్ణముగల శ్రీరామచంద్రమూర్తిచేతఁ బవిత్రమైన పీఠముగల యీవిమానరాజము, నడుమ మహేంద్రనీలములు గల రత్నరాశివలె ప్రకాశించె నని యర్థము.

ఈరీతిగానే కృష్ణనీలములకును, (అనంగా నలుపు మేఘపు వన్నెగల నీలఁపు రంగులకును) కృష్ణహరితములకును (నలుపు. ఆకుపచ్చ రంగులకును), కృష్ణశ్యామలములకును (నలుపు, శ్యామలవర్ణములకును) పీతరక్తములకును (పసుపుపచ్చ, ఎఱుపురంగులకును) శుక్లగౌరములకును (అనఁగా నచ్చంపు తెలుపు, బూడిద రంగులకును)

ఏకత్వము కూర్చుట-అనఁగా భేదము లేనట్లు చెప్పుట-అను నదియుఁ గూడ ఈగుణనిబంధనము అనెడి కవిసమయంపు జాతికే చేరుచున్న దని యెఱుంగ వలెను. వీనికి క్రమముగా నుదాహరణముల నిచ్చుచున్నాము.

అందు కృష్ణవర్ణ నీలవర్ణములకు ఐక్యమును గూర్చెడి కవిసమయమున కీక్రిందిశ్లోకము ఉదాహరణము:—

శ్లో. నవీం తూర్ణం కర్ణో ఽప్యనుసృతపులినాం
దాక్షిణాత్యాంగనాభిః,
సముత్తీర్ణో వర్ణా ముభయతటచలా
బద్ధవానీరహారాం,
తతే పశ్యాస్యైచ్ఛ ప్ర వసలిలనివహో
భాతి నీల స్స తస్యాః,
ప్రియస్యాంసే పీనే లులితఇవ ఘనః
కేశపాశ స్సుకేశ్యాః.

[ఆ కర్ణమహారాజుకూడను దాక్షిణాత్యస్త్రీలచే ననుసృతములగు పులినములు గలదియును, ఇద్దరియందు నద్దరియందుఁ జలించుచున్న నీటి ప్రబ్బలిగుదుముల నెడి తెల్లనిహారములు గలదియును, అగు వరణానదిని అతి శీఘ్రముగా దాఁటెను. ఏ వరణానదియొక్క జలప్రవాహము ప్రియుని పీవరమైన భుజపీఠమున కానుకొని లులితమైన సుకేశియొక్క కేశిపాశమువలె నలరారుచు నున్నదో, అట్టి వరణానది యని వెనుక కన్వయము. ఇందు కేశపాశము (కొప్పు) నకును వరణానదియొక్క జలప్రవాహమునకును సాదృశ్యముఁ జెప్పుటలో, కొప్పు

కేవలము కృష్ణవర్ణము గలదిగాను, జలప్రవాహము నీల వర్ణము గలదిగాను ఉన్నను, కృష్ణనీలముల కైక్యము చెప్పవలయు ననెడి కవిసమయము ననుసరించుటచే నిది పైదాని కుదాహరణ మయ్యెను.

ఇఁకను కృష్ణవర్ణ హరితవర్ణములకు నైక్యముఁ జెప్పెడి కవిసమయమునకు నుదాహరణము.—

శ్లో. మరకతసదృశం చ యామునం,
స్ఫటికశిలావిమలం చ జాహ్నవం,
తదుభయ ముదకం పునాతు వో,
హరిహరయో రివ సంగతం వపుః.

యమునానదియందలి యుదకము, మరకతమణి యొక్క వర్ణముతో, సమముగా నున్నది. (యమున యుదకములు నల్లనివి, మరకతమణులు ఆకుపచ్చరంగు గలవి—అయినను కవిసమయ మిట ననుసరింపఁబడుట చేత రెండింటికి అభేదము చెప్పంబడినది.) ఇట్లులనే గంగానదియందలి యుదకము స్ఫటికమణులవోలె నిర్మల మైనది. అనఁగా మిక్కిలియును తెల్లని దని యర్థము. ఈ రెండును ఒకదానితో నొకటి పెనచుకొన్నట్లులున్న ఆయుభయోదక మెయ్యది గలదో, అది మేఘవర్ణము గల విష్ణువుయొక్కయును, భసితసితవర్ణము గల యీశ్వరునియొక్కయును శరీరములు సంగతములైనట్లులు వోలె ప్రకాశించె నని భావము. ఇది కృష్ణవర్ణ హరిత వర్ణములకు కవిసమయము ననుసరించి యైక్యముఁ జెప్పుటచే నిది యుదాహరణ మైనది.

ఈరీతిగానే కృష్ణవర్ణ శ్యామలవర్ణములకును, అనఁగా నలుపురంగునకును మబ్బువన్నెకును, ఐక్యముఁ జెప్పునట్టిదికూడ కవిసమయమే యగును. దాని క్రిందిది ఉదాహరణముగాఁ గాఁగలదు

శ్లో. ఏత త్సుందరి నందనం శశిమణి స్నిగ్ధాలవాలద్రుమం,
మందాకిన్యభిషిక్తమౌక్తికశిలే మేరో స్తటే నందతి,
యత్ర శ్యామనిశాసు ముంచతి మిలన్మన్దప్రదోషానిలా,
ముద్దామామరమోషితా మభిరతం కల్పద్రుమ శ్చంద్రికామ్.

ఓ సుందరీ! చంద్రకాంతమణులచే స్నిగ్ధములగు పాదులతోఁ జెన్నలారెడి కల్పవృక్షములు గలదియు, నగు నందవనము, ఇదిగో ఆకాశగంగచే నభిషేకింపఁబడు చున్న మౌక్తికశిలలుగల మేరుపర్వతతటమున నొప్పు చున్నది. ఏనందనవనమునందు శ్యామలవర్ణముగల రాత్రులలో, మందమందములగు సాయంకాలపు పిల్లతెమ్మెరలఁ గ్రమ్ముకొనినదై, యున్న వెన్నెలను (జాత్యేకవచనము.) కల్పవృక్షము, పుష్పమాలాలంకృత లగు దేవతాస్త్రీలకు సురతమున కభిముఖ మగునట్లుగా వ్యాపింపఁజేయుచున్నదో—అని పూర్వార్ధమున కన్వయము.

ఇచ్చట నిశలు (రాత్రులు) నల్లనివి. శ్యామలవర్ణమునకును కృష్ణవర్ణమునకును సహజముగా భేద మున్నను, కృష్ణవర్ణశ్యామలవర్ణములకు ఐక్యముం గూర్పం దగు నను కవిసమయము ననుసరించి యైక్యము కూర్పం బడినది. గనుక నిది పైదాని కుదాహరణ మైనది.

పీతరక్తములకు-అనఁగాం బసుపుపచ్చరంగునకును, ఎఱుపురంగునకును- ఐక్యము చెప్పెడి కవిసమయమున క్రిందిది యుదాహరణ మగును-ఎట్లనఁగా.—

శ్లో. శేఖయా విమలవిద్రుమభాసా, సంతతం తిమిర మిందు రుదాసే,
దంష్ట్రయా కనకభంగపిశంగ్యా, మండలం భువ ఇ వాదివరాహః.
—కిరాత. సర్గ-9. శ్లో-22.

బంగరుతునుకవలె పిశంగ (పసుపుపసిమి) వర్ణముగల కోరతో నాదివరాహమూర్తి భూమండలమును వలెనే, స్వచ్ఛమైన పవడంపుకాంతిగల కిరణముచే చంద్రుఁడును తిమిరమును నెత్తి పట్టెను—అని భావము. ఇందు పసపురంగునకును, ఎఱుపురంగునకు నైక్యము.

ఈరీతిగానే శుక్లవర్ణగౌరవర్ణములకును నైక్యముం జెప్పెడి కవిసమయమున క్రిందిశ్లోక ముదాహరణముగాఁ గొనందగును. ఎట్లు లనఁగాఁ జూడుఁడు.—

శ్లో కైలాసగౌరం వృష మారురుక్షోః,
పాదార్పణానుగ్రహపూతపృష్ఠం,
అవేహి మాం కింకర మష్టమూర్తేః,
కుంభోదరం నామ నికుంభతుల్యం.
—రఘువంశము, సర్గ 2-25.

కైలాసపర్వతము (వెండికొండ - తెల్లనిది) పోలె గౌరవర్ణమైన వృషభమును అధిరోహింపఁ దలంపుగొను అష్టమూర్తి యగు నీశ్వరునకు, పాదార్పణానుగ్రహముచేఁ బవిత్రితముగాఁ జేయఁబడిన వెన్నుఁగల కింకరుండ

నగు నన్ను నికుంభునితో సాటిసేయుగు కుంభోదరుఁడను పే రివానికిఁగా నెఱుఁగుము అని భావము. ఇందు శుక్లవర్ణ గౌరవర్ణములకు నైక్యముఁజెప్పవలయు ననెడి కవిసమయము ననుసరించి కూర్చుటచే నిది యుదాహరణము.

ఈ రీతిగానే తక్కుంగలవర్ణములకును కవులు ఉప నిబంధించిన ఆయా యైక్యవర్ణనములంబట్టి తక్కినకవిసమయములను సైతము గుర్తించి యుదాహరణములఁ గూర్చుకొనందగు నని యెఱుంగవలయును.

చక్షురాదులగు కన్నులు కనీనికలు మున్నగువానికి వర్ణనసందర్భములలో, అనేకవర్ణము లుండునట్లు వర్ణించుటయును, ఒకరీతిగ, కవిసమయమే యగుచున్న దని యెఱుంగవలయును. అందు ఒకటి రెండింటిని ఇట సోదాహరణముగా నిరూపించెదము. అందులో—చక్షువులకు—అనఁగా గన్నులకు శుక్లత్వము (తెలుపు) ఉన్నట్లు కూర్చుట యొకరీతి కవిసమయము. అందుల కీక్రింది శ్లోకము ఉదాహరణముగా నగును. ఎట్లనఁగా:—

శ్లో. తిష్ఠంత్యా జనసంకులేఽపి సుదృశా సాయం గృహప్రాంగణే,
తద్ద్వారం మయి నిస్సహాలసతనౌ వీక్షామృదు ప్రేక్షతి,
హ్రీసంభ్రమనమ్రయైవ లోలసరళం నిశ్వస్య తత్రాంతరే,
ప్రేమార్ద్రాః శ్రుతిఖండమండితముషా ముక్తాః కటాక్షచ్ఛటాః.

వచ్చుచుఁ బోవుచున్న జనముచే సంకులముగా నున్న మా నింటి ముంగిలియందు నాప్రియురాలు నిలచియున్నదై ఆద్వారమునే నేను నిస్సహాలసతనుండ నై క్రీగంటిచూపు

నం జూడగనే, సిగ్గుచే వాల్చిన నెమ్మోముతో లోలసరళముగా నిట్టూర్పు పుచ్చి, ఎట్లోసందుచేసికొని అంతలో ప్రేమార్ద్రములును, చంద్రఖండము నెం సెక్కెములాడునవియు (అనఁగా తెల్లని వనట) నగు క్రీగంటి చూపుల తూఁపులు నాపైఁ బఱుపఁబడినవని ఈశ్లోకమునకు తాత్పర్యము. ఇందు కటాక్షములు-కనగొనల చూపుల - తెల్లనివిగ కూర్పంబడుటచేత నిది కన్నులకు (చక్షువులకు) శుక్లత్వముం గూర్చెడి కవిసమయమున కుదాహరణము.

పైనిఁ జెప్పినరీతిగానే చక్షువులకు శ్యామతఁ జెప్పెడి కవిసమయమునకు ఈక్రిందిద యుదాహరణము:—

శ్లో. అథ పథి గమయిత్వా రమ్యక్లప్తోపకార్యా,
కతిచి దవనిపాల శ్శర్వరీః శర్వకల్పః,
పున రవిశ దయోధ్యాం మైథిలీదర్శినీనాం
కువలయితగవాక్షాం లోచనై రంగనానామ్.

—కాళిదాసురఘువంశము. స 9-93

అందముగా నలంకరింపఁబడిన యుపకార్యములు (డేరాలు-రాజులకు వసతికై ఏర్పఱచిన సదనములు)గల మార్గమునందు సాక్షాన్మహేశ్వర తుల్యుండగు నారాజు కొన్నిదినములను గడపి [మిథిలాధిపతి యగు జనకుని కూఁతురు] జానకిని చూచుచున్నవారును, పౌరాంగనాలోచనములచే కువలయిత గవాక్షగాను, నై యొప్పుచున్న యయోధ్యానగరమును మఱలఁ బ్రవేశించె నని భావము. ఇచ్చట "కువలయిత గవాక్షాం లోచనై రంగనానాం-అనుటచేత నేత్రముల చూపులకు శ్యామత్వముఁ

చెప్పిరనియు, గనుకనే కువలయములతోఁ (నల్లగల్వల తోడ)కన్నులకు సాదృశ్యము సంఘటిల్లినదనియును, గనుక నివి చక్షువులకు [అనఁగాఁ కన్నులకు] శ్యామవర్ణము కలదను కవిసమయమున కుదాహరణ మయ్యె ననియు నెఱుంగఁ దగును. ఈరీతిగానే చక్షువులకు కృష్ణత్వము (నలుపుండుటను) చెప్పెడి కవిసమయమున కీక్రింది శ్లోక ముదాహరణము —

శ్లో. పాదన్యాసక్వణితరశనా స్తత్ర లీలావధూతై
రత్నచ్ఛాయాఖచిత వలిభి శ్చామరై రంగనానాం,
వేశ్యా స్త్వత్తో నఖపదసుఖా న్ప్రాప్య వర్షాగ్రబిందూ
నామోక్ష్యంతే త్వయి మధుకరశ్రేణిదీర్ఘాన్ కటాక్షాన్.

ఆనగరమునందు లీలావధూతములును, రత్నచ్ఛాయాఖచితవళులునగుచామరములచేగూడి,క్లాంతహస్తలై, పాదన్యాసక్వణితరశనలు గలవారలై వేశ్యాస్త్రీలు నీవలననఖక్షతస్థానములంబడి సుఖపెట్టుచున్నవర్షాగ్రబిందువులను పొందినవారై, ఓయీ మేఘుఁడా, నీపైని మధుకరశ్రేణులవలె బారులుసాగిన క్రీగంటి చూపులను విసరఁగలరు—అని భావము. ఇచ్చట కటాక్షములను మధుకరశ్రేణీదీర్ఘము లని విశేషణయుతములుగాఁ జేయుటఁ జేసి, మధుకరశ్రేణి-అనఁగాఁ దుమ్మెదల బారు నల్లనిది కావున, ఆ క్రీగంటి చూపులును అట్టివియన్నందున అవియు నల్లనివని చెప్పినట్టు లైనది. కనుక చక్షువులకు శ్యామత్వము కూర్పవలయు ననెడి కవిసమయ మిందు పాటింపఁ

బడుబచే నియ్యది పైఁజెప్పిన కవిసమయమున కుదాహర ణము. ఇది కాళిదాసకవి రచించిన మేఘసందేశము నం దలి ఒకటవసర్గము నందలి శ్లోకము—అని యెఱుఁగ వలయును.

ఈతీరుగానే చక్షువులకు మిశ్రవర్ణత్వము (అనఁ గా నానావిధము లగు వర్ణము లున్నట్లు చెప్పుటయును) కూడ పై కవిసమయములలోనే చేరును. దానికి,అనఁగా చక్షువులకు మిశ్రవర్ణత్వముం జెప్పెడి కవిసమయమున కీక్రింది శ్లోకము ఉదాహరణము. ఎట్లనఁగా:—

శ్లో. తా మనుత్రీర్య వ్రజ పరిచితభ్రూలతావిభ్రమాణాం,
పక్ష్మోత్క్షేపా దుపరి విలసత్కృష్ణశార ప్రభాణాం,
కుందక్షేపానుగమధుకరశ్రీముషా మాత్మబింబం,
పాత్రీకుర్వన్ దశపురవధూ నేత్రకౌతూహలానామ్.

— కాళిదాసుని మేఘసందేశము.

ఇందు చక్షువులకు మిశ్రవర్ణత్వము కూర్పంబడి నది. కావున నిది పైనిచెప్పిన కవిసమయమున కుదా హరణ మని యెఱుంగునది.

ఇది రాజశేఖరకవిరాజకృత మగు కావ్యమీమాంస యనెడి
కవిరహస్యమునందు ప్రథమాధికరణమునందు
గుణసమయస్థాపన మనునది
పంచదశాధ్యాయము.

# రాజశేఖరకవి కావ్యమీమాంస.

---

## షోడశాధ్యాయము.

---

### స్వర్గమర్త్యపాతాళీయ కవిరహస్య స్థాపన.

[ఈ యధ్యాయమునందు వచ్చెడివిషయములు:—౧. భౌమము లగు కవిసమయములవలెనే స్వర్గ్యములగు కవిసమయము లుండుననుట. ౨. కాని స్వర్గసంబద్ధములగు కవిసమయములలోఁ గల భేదములు చంద్రునకు ఐక్యకల్పన ప్రభృతులని రూపించుట. ౩. పాతాళలోక సంబద్ధములగు కవిసమయములును పైవానివలెనే యుండుననుట. ౪. కాని పైవానికి-అనఁగా స్వర్గమర్త్యకవిసమయములకును- దీనికిఁగల భేదము, నాగసర్పములకు దైత్యదానవులకు అభేదమును గూర్చుట ప్రభృతులని రూపించుట. ౫. ఆయా లక్షణములకు లక్ష్యముల జూపుట మొదలగునవి.]

భౌమమగు కవిసమయమువలెనే స్వర్గ్యమగు కవిసమయముకూడ కలదు. కాని అందున్నవానికంటె నిందుఁగల ఆధిక్యము లియ్యవి.

(1) చంద్రునియందలి శశహరిణములకు ఐక్యనిర్దేశము:—

శ్లో. మా భైః శశాంక! మమసీధుని నాస్తి రాహుః
ఖే రోహిణీ వసతి కాతర! కిం బిభేషి,

ప్రాయో విదగ్ధవనితానవసంగమేషు
పుంసాం మనః ప్రచలతీతి కిమత్ర చిత్రమ్ ?

ఓయీ! శశాంకుఁడా! భయపడకుము. నా మద్యమునందు రాహువు లేఁడు. ఆకసమునందు రోహిణి ఒంటరిగఁ గలదు. ఓయీ కాతరుఁడా! (పిఱికిపందా!) ఏల భయపడియెదవు? తెలియుము గాక విదగ్ధ స్త్రీలతోడి నవసంగమములపట్టులలో, పురుషుల చిత్తములు చలనము నొందుననుటలో నాశ్చర్యమేమి కలదు? అని భావము.

మఱియును,

శ్లో. అంకాధిరోపితమృగశ్చంద్రమా మృగలాంఛనః,
కేసరీ నిష్ఠురాక్షిప్తమృగయూథో మృగాధిపః.

జింకను తొడపైని ఎక్కించికొని నందువలన చంద్రుఁడు మృగలాంఛనుఁ డని పేరొందెను. నిష్ఠురముగ (అనఁగా దయాదాక్షిణ్యము లేక) మృగయూథములను విక్షేపము చేయు సింహము మృగాధిపుఁ డని పేరొందెను. కావున మెత్తని వానికిని శూరునకును ప్రఖ్యాతిలోని భేదము వారివారి పనులఁబట్టి వచ్చు నని భావము.

(2) కామకేతనమునందు మకరమత్స్యములకు ఐక్యము చెప్పుట.

శ్లో. చాపం పుష్పమయం గృహాణ మకరః కేతుస్సముచ్ఛ్రీయతాం,
చేతోలక్ష్యభిదశ్చ పంచవిశిఖాః పాణౌ పునస్సంతు తే,
దగ్ధా కాపి తవాకృతేః ప్రతికృతిః, కామోఽపి కింగూహసే,
రూపం దర్శయ నాత్ర శంకరభయం, సర్వే వయం వైష్ణవాః.

ఓయీ! మన్మథా! నీవు శంకరునిచే దగ్ధుండ వైతి వనిరి కాని అది అసత్యము. అట్లు తగులఁబెట్టఁబడిన ది నీ ప్రతికృతియేగాని నీవుకాదు. నీవు చెప్పక కాముఁడవే, నిన్ను గుర్తెఱింగితిమి. మాయొద్ద నింక దాఁచకుము. నీ నిజరూపమును చూపింపుము. పుష్పధనుస్సును, మకరకేతనమును చిత్తలక్ష్యమును గాఁ జేయునట్టి పంచబాణములను గైకొనుము నీకు శంకరుని వలని భయముగూడ నిచ్చట లేదు. ఏల యందువా, మే మందఱమును వైష్ణవులమే! యని భావము.

మఱియు నెట్టులనఁగా—

శ్లో. మీనధ్వజ స్త్వ మసి నో నచ పుష్పధన్వా,
కేళిప్రకాశ తవ మన్మథతా తథాఽపి,
ఇత్థం త్వయా విరహితస్య మయోపలబ్ధాః,
కాన్తాజనస్య జననాథ చిరం విలాపాః.

రాజా! నీచే విరహితులైన ఆస్త్రీలు ఈ క్రిందిరీతి విలపించుచుండఁగా నేను విన్నాఁడను. "ఓయీ! నీవు మీనధ్వజుఁడవు కావా? పుష్పాస్త్రుఁడవు కావా? క్రీడావిషయములఁ బ్రకాశించువాఁడా! ఇట్లయ్యును నా మన్మథత్వ మేల? యనిరని భావము ]

ఇంకను నెట్టు లనఁగా—

శ్లో. ఆపాత మారుత విలోడిత సింధునాథో,
హాహాకారభీత పరివర్తిత మత్స్యకచ్ఛపం,
ఉల్లంఘ్య యాదవమహోదధి భీమవేలాం,
ద్రోణాచలం పవన సూను రి వోద్ధరామి.

[ఆపాతమారుత విలోడిత సింధునాథుఁడ నై, నాదగు హాహాకారములచేత భీతమై పరివర్తితమైన మత్స్యచిహ్నము గలుగునట్లుగ యాదవుల నెడి మహా నిధియొక్క భయంకర మగు ఈ వేలను ఉల్లంఘించి, పవన సూనుఁడు ద్రోణాద్రిని ఉద్ధరించునట్లు ఉద్ధరించెదను.]

(3) అత్రినేత్రజ, సముద్రజులగు చంద్రులకు ఐక్యమును నిర్దేశించు కవిసమయమున కుదాహరణములు.

శ్లో. వంద్యా విశ్వసృజో యుగాదిగురవ స్స్వాయంభువాస్సప్తయే
తత్రాత్రి ర్దివిసందధే నయనజం జ్యోతి స్స చంద్రోభవత్,
ఏకా యస్య శిఖండమండనమణి ర్దేవస్య శంభోః కలా
శేషాభ్యో ఉమృతమాప్నువంతిచ సదా స్వాహాస్వధాజీవినః.

సమస్తవిశ్వమునకును సృష్టికర్తలై యుగాది గురువులై వంద్యులైయున్న ఏడ్గురు ప్రజాపతులలో నొక్కరగు అత్రిముని, తన నయనోత్పన్న మగు తేజమును మింటికి విసరెను. ఆ తేజమే చంద్రుఁడుగా నయ్యెను. ఆ చంద్రుఁడు మిక్కిలియు ధన్యుఁడు! ఏలయనఁగా, ఆతని పదారుకళలలో నొక్కటి, దేవదేవుఁ డగు శంభునికి శిరోభూషణముగను తక్కినవి దేవతలకు జీవనాధార మగు నమృతముగను నైనవి కావున-యని భావము.

(4) చిరకాలముక్రిందనే పుట్టినను, శివ చంద్రునకు అనఁగా శివుని శిరస్థితుఁడగు చంద్రునకు బాల్యత్వమును నిర్దేశించుటయు కవిసమయమగును. ఉదాహరణము.—

శ్లో. మాలాయమానామర సింధుహంసః,
కోటీరవల్లీ కుసుమం భవస్య
దాక్షాయణీ విభ్రమదర్పణ శ్రీః
బాలేందుఖండం భవతః పునీతాత్.

మాలాయమానమగు సమరనదికి హంసను బోలి నదియును, ఈశ్వరునకు తలపువ్వుగ నైనదియును, పార్వతికి విలాసదర్పణముగ నైనదియు, నగు బాలేందుఖండము మిమ్ములను రక్షించునుగాక.

(౮) మన్మథునికి మూర్తామూర్తత్వము:—

శ్లో. అయం స భువనత్రయ ప్రథితసంయమః శంకరో
బిభర్తి వపుషాధునా విరహకాతరః కామినీం,
అనేన కిల నిర్జితా వయ మితి ప్రియాయాః కరం
కరేణ పరితాడయన్ జయతి జాతహాస స్స్మరః.

—ప్రబంధ చింతామణి.

"ముల్లోకములందును విఖ్యాతిమైన సమాధి నియమముగల ఈశ్వరుడు - ఇప్పుడు విరహాకాతరుడై శరీరార్థమున ప్రియురాలిని ధరించుచున్నాడు. ఇట్టి ఇంద్రియ నిగ్రహము లేని వానిచేతనా మనము నిర్జితులమైనది!"— అని తన ప్రియురాలిచేతిని తనచేతితో తట్టుచు మన్మథుడు పకపక నవ్వుచు, విజయుడై యున్నాడు.

మఱియును,

శ్లో. ధనుర్మాలా మౌర్వీ క్వణదళికులం లక్ష్యమబలా
మనోభేద్యం శబ్దప్రభృతి య ఇమే పంచ విశిఖాః,

ఇమాం జేతుం యస్య త్రిభువన మనంగస్య విభవః
స వః కామః కామాన్ దిశతు దయితాపాంగవసతిః.

ఏ కామునకు పువ్వులు ధనుస్సో! అల్లెత్రాఁడు మొ ఆసెడి తుమ్మెదలగుంపో, లక్ష్యము అబలయో, శబ్దప్రభృతియగు మనస్సు భేదింపఁదగినదో, భేదించునట్టి బాణములను కేవలము నైదుమాత్రమో!, పైని పేర్కొన్న ఈపాటివిభవమే ఏమన్మథునకు త్రిలోకవిజయము నార్జింపగల్గియున్నదో, అట్టిలోకోత్తర సామర్థ్యము గల దయితాపాంగవసతి గలవాఁడగు మన్మథుఁడు (కాముఁడు) మీకు మనోరథముల పూర్తి సేయుం గాక—యని భావము. ఇందు మొదటి శ్లోకమున మన్మథునకు మూర్తత్వమును, రెండవదానిలో నమూర్తత్వమును గూర్పంబడినవి. ఈశ్లోకము చంద్రకుఁ డనెడి కవి దని సుభాషితముక్తావళియందు ఉదాహృతము.

(6) ద్వాదశాదిత్యులకు నైక్యముగ నిర్దేశము.-

శ్లో. యస్యాధోధ స్తథోప ర్యుపరినిరవధిః భ్రామ్యతో విశ్వమశ్వైః
ఆవృత్తాలాతలీలాం రచయతి రయతో మండలం చండధామ్నః,
సోవ్యా దుత్తప్తకార్తస్వరసరళశరస్పర్ధిభి ర్ధామదండై
రుద్దండైః ప్రాపయన్వః ప్రచురతమతమస్స్తోమ మస్తంసమస్తమ్.

అమితవేగముతో ప్రపంచమునంతను తిరుగుచు, క్రిందికి క్రిందికి మీఁదికి మీఁదికిఁ జుట్టివచ్చుచు, నిరవధిగా సంచరించుచున్న గుఱ్ఱములతోఁ గూడిన ఏసూర్యుని యొక్క మండలము ఆవృత్తాలాతలీలను కలిగించుచున్నదియో, అట్టిసూర్యుఁడు ఉత్తప్తకార్తస్వరసరళశర

పృథులగు రశ్మిదండములతో, మీసంబంధమైన-సమస్తమైన ప్రచురితమ మగు తమస్తోమము నస్తము నొందించుఁగాక-యని భావము. ఇది రాజశేఖరునిదని కవీంద్రవచన సముచ్చయమున నున్నది.

(7) నారాయణోమాధవుల కైక్యనిర్దేశము:—

శ్లో. యేన ధ్వస్తమనోభవేన బలిజిత్కాయః పురా స్త్రీకృతో
యో గంగాంచ దధేంధకక్షయకరో యో బర్హిపత్రప్రియః
యస్యాహుః శశిమచ్ఛిరోహర ఇతిస్తుత్యం చ నామామరాః
సోవ్యాదష్టభుజంగహారవలయ స్త్వాం సర్వదోమాధవః.

ఇట్లే దామోదర శేషకూర్మవరహాదులకును ఐక్యమును చెప్పవలయును. మఱియును, ఇదేవిధముగా—

(8) కమలాసంపదలకు ఐక్యనిర్దేశము.—

ఏలక్ష్మి దోర్మందీకృతమంథరుఁడగు నీతనిచే క్షీరసాగరమునుండి మున్నుద్ధరింపఁబడినదో, ఏలక్ష్మిని తాను ముక్కి కమఠమై పురాణకకుదన్యస్తనుగా ఉత్తిష్ఠాభనము చేసెనో, ఆ లక్ష్మిని పురుషోత్తముండగు నితఁడు లీలాంచిత భ్రూలతానిర్దేశములచేఁ ప్రణయుల గేహములందును ప్రవేశపెట్టును-అని భావము.

శ్లో. దోర్మందీకృత మంథరేణ జలధే రుత్థాపితా యా స్వయం
యాం భూత్వా కమఠః పురాణకకుదన్యస్తా ముదస్తంభయత్,
తాం లక్ష్మీం పురుషోత్తమః పునరసౌ లీలాంచితభ్రూలతా
నిర్దేశై స్సమవీవిశ త్ప్రణయినాం గేహేషు దోష్ణి క్షితిమ్.

భౌమ స్వర్గ్యములకు నాలవే పాతాళీయకవి సమయము కూడ కలదు కాని అందుగల విశేషము లియ్యవి:—

(1) నాగసర్పముల కైక్యనిర్దేశము.

శ్లో. హే నాగరాజ! బహుమస్య నితంబభాగం
భోగేన గాఢ మభివేష్టయ మందరాద్రేః,
సోఢా విషహ్యావృషవాహన యోగలీలా
పర్యంకబంధనవిధే స్తవ కోఽతి భారః.

[అయ్యా! నాగరాజా! ఈ మందరముయొక్క విశాలమైన నితంబ భాగమును శరీరముతో గట్టిగాఁ జుట్టుకొనియుండుము. అవిషహ్యమగు ఈశ్వరునంతటివాని యోగలీలాపర్యంకబంధనవిధి నోర్చుకొనఁగలిగిన నీకు ఇది ఏపాటిభారము కాఁగలదు? అనఁగా నీకిది యొక లెక్కలోనిది కాదు-అని భావము.]

2. దైత్య దానవాసురులకు ఐక్యనిర్దేశము.—హిరణ్యాక్షుఁడు హిరణ్యకశిపుఁడు ప్రహ్లాదుఁడు విరోచనుఁడు బలి బాణాసురుఁడు మున్నగు వారు దైత్యులనియును, విప్రచిత్తి శంబరుఁడు నముచి పులోముఁడు మున్నగువారు దానవులనియును, బలుఁడు వృత్రాసురుఁడు విక్షురస్తుఁడు వృషపర్వుఁడు మున్నగువారు అసురులనియును అభిజ్ఞుల విద్దేశము—ఇట్టివారి కైక్యనిర్దేశము చెప్పుటయు నిందలి యొక విశేషమే యగును.

ఎట్లందురా? చూడుఁడు.—

శ్లో. జయంతి బాణాసుర మౌళిలాలితాః
దశాస్య చూడామణి చక్రచుంబినః
సురాసురాధీశ శిఖాంతశాయినో
భవచ్ఛిద త్ర్యంబక పాదపాంసవః

బాణాసురుని మౌళిచేత లాలన చేయఁబడినవియును, రావణాసురుని యొక్క శిరోరత్నములయొక్క గుంపుల చేత చుంబనము సేయఁబడినవియును, సురులు అసురులు తదధీశులు మున్నగు వారి శిఖాంతములయందు శయనించినవియును (అనఁగా సురాసురాధీశులు పాదప్రణతులు కాఁగా వారి శిఖాంతములను స్పృశించినవి యని యర్థము.) సంసార తాపమును పోనడంపఁ జాలినవియును, నగు ఈశ్వరుని పాదముల సంబంధములైన పాంసువులు [పరాగములు] సర్వోత్కర్షములై రాజిల్లుచున్నవని భావము.]

ఇందు దైత్యులలోనివాఁడగు బాణుఁడు దానవులలోనివాఁడగు రావణుఁడు అనువారలకు ఐక్యముఁ గూర్చి యుండుటచే నిది యుదాహరణమైనది—అని యెఱుంగఁ దగును.

మఱియును ఈ క్రిందిరీతిగూడ దైత్యదానవాదుల యైక్యనిర్దేశమును ఊహించుకొనవచ్చును:—

శ్లో. అస్తి దైత్యో హయగ్రీవః సుహృద్వేశ్మసు యస్య తాః
ప్రథయంతి బలం బాహ్వోః సితచ్ఛత్రస్మితాః శ్రియః.

హయగ్రీవుఁడను పేరుగల దైత్యుఁ డొక్కరుఁడు కలఁడు. ఏ హయగ్రీవుని బాహువులయందు శ్వేతచ్ఛత్రస్మితములు గల సంపదలు బలమును ప్రకటించుచుండునో, అట్టి హయగ్రీవుఁడు అను పేరుగల దైత్యుఁడుగలఁడని భావము. ఇందు దానవుఁడగు హయగ్రీవుఁడు

విషయము ననుసరించి దైత్యుఁడుగాఁ జేర్కొనఁ బడినాఁడు.

మఱియును,

శ్లో. తం శంబరాసురశరాశనిశల్యసారం
కేయూరరత్నకిరణారుణబాహుదండం,
పీనాంసలగ్న దయితా కుచపత్త్రభంగం
మీనధ్వజమ్ జితజగ త్త్రితయం జయే త్కః?

శంబరాసురుని పిడుగులఁ బోలిన బాణముల యొక్క సారము గలవాఁడును, కేయూరములందలి (భుజకీర్తులయందలి) రత్నకిరణములచేత ఎఱ్ఱనైన భుజదండములు కలవాఁడును, బలిసిన అంసము (భుజశిఖరము) లందు లగ్నమైన దయితాజనముయొక్క కుచములయందలి మకరికాది పత్త్రముల భంగములు కలవాఁడును, జయించిన ముల్లోకములు గలవాఁడును అగు మన్మథుని ఎవ్వాఁడు జయింపఁగా గల్గునని భావము.]

మఱియును హయగ్రీవునిగుఱించి చెప్పిన వాక్యములలోని దగు ఈ క్రిందిశ్లోకమునందును దైత్య దానవాదుల యైక్య నిర్దేశము విస్పష్టముగా కలుగఁ గలదు.

శ్లో, దానవాధిపతే! భూయో భుజోఽయం కిం న నీయతే?
సహాయతాం కృతాం తస్య త్వయాభిప్రాయ సిద్ధిషు.

[అయ్యా! దానవరాజా! మఱల ఈ బాహువును త్వయాభిప్రాయ సిద్ధులుగల కావ్యవిషయములందు, యమునకు సహాయమునుగా ఏల పొందింపఁబడుట లేదు?—

(అనఁగా మీయాజ్ఞయైనచో బాహుబలమున వీరి నంద అను నశింపఁజేయుదును అని యర్థము.)]

మఱియు నిట్లుకూడను:—

శ్లో. మహాసుర సమాజేస్మిన్ నహ్యేకో ప్యస్తి సోఽసురః
యస్య నాశనినిష్పేషనీరాజిత ముర స్థ్సలమ్.

[మహాప్రభూ! ఈ తమయెదుట నిల్వఁబడియున్న మహాసుర సమాజమునందు అశనినిష్పేషముచేత నీరాజితముకాని ఉరస్థ్సలముగల యసురుఁడు, ఒక్కండైనను లేఁడు అని యెఱుంగఁగా వలయును.]

ఇట్లే తక్కిన భేదముల నఱయునది. ఈపైని చెప్పిన కవిసమయగ్రంథమంతయును ఇంతవఱకును కావ్యజాలమునందు స్థూలబుద్ధులకు గోచరింపక, నిద్రించినదానివలె అణఁగియున్నది. అట్టియీకవి సమయము మాచేత యథాబుద్ధిగా, అనఁగా మాశక్తికొలఁదిగా, నిచ్చట విస్తరించి పైనిఁ జెప్పినతీఱుగాఁ గవుల యుపయోగమునకై ప్రతిబోధింపఁబడినది.

విశేషాంశములు:—రాజశేఖరకవికావ్యమీమాంసమునందు 14 15, 16 అధ్యాయములు ఇంతతో ముగియుచు నున్నవి. ఇయ్యవి, కవిసమయములను సంపూర్ణముగా వివరించుచున్నవి కదా! ఇతనితర్వాతి కవులందఱును, దాదాపు ఈఫక్కికనే అవలంబించి కవిసమయములను తమతమ గ్రంథములలోఁ గూర్చుచు వచ్చుచున్నారని నిరూపించుటకై ఈక్రింద గల కొన్నిపంక్తులను

గమనింపఁదగును. ఇచట నుదాహరణార్థమై ఒకటి రెండు గ్రంథములలోని భాగముల నుద్ధరించి చదువరుల సంప్రతిపత్తికొఱకు, కూర్చుచున్నాను.

(1) జినసేనకవి—అలంకార చింతామణి,

శ్లో. కవీనాం సమయ స్త్రిధా నిబంధో౽ప్యసత స్సతః.
అనిబంధ స్సజాత్యాది ర్నియమేన సమాసతః

౧. అసతో౽పి నిబంధో యథా:—

శ్లో, గిరౌ రత్నాది హంసాది స్తోకపద్మాకరాదిషు
నీరేభాద్యం స్వగంగాయాం జలజాద్యం నదీష్వపి,
తమస స్సూచిభేద్యత్వం ముష్టిగ్రాహ్యత్వ ముచ్యతే
అంజలిగ్రాహ్యతా చంద్రత్విషః కుంభోపవాహ్యతా,
ప్రతాపే రక్తతోష్ణత్వే కీర్తౌ హంసాదిశుభ్రతా,
కృష్ణత్వ మపకీర్త్యాదౌ రక్తత్వం కోపరాగయోః
చతుష్టత్వం సముద్రస్య వియోగః కోకయో ర్నిశి,
చకోరాణాం సురాణాం చ జ్యోత్స్నాపానో నిగద్యతే
రమాయాః పద్మవాసిత్వం రాజ్ఞో వక్షసి సంస్థితిః
సముద్రమథనం తత్ర సురేంద్రశ్రీసముద్భవః.

౨. సతో౽ప్యనిబంధో యథా.—

శ్లో. చందనే ఫలపుష్పే చ సురభౌ మాలతీసుమం,
శుక్లే పక్షే తమో౽శుక్లే జ్యోత్స్నా ఫల మశోకకే,
రక్తిమా కామిదంతేషు హరితత్వం చ కుందకే
దివావికోత్పలాబ్జానాం వికాసిత్వం న వర్ణ్యతాం

3. నియమేన నిబంధో యథా:—

శ్లో. సామాన్యేన తు ధావళ్యం పత్రపుష్పాంబురాసపాం
చందనం మలయేష్వేవ మధావేవ పికధ్వనిం,

అంబుదాంబుధి కాకాహికేశ భృంగేషు కృష్ణతాం
బింబ బంధూకనీరేషు మార్త్యబింబే చ రక్తతాం
రవం నాట్యం మయూరాణాం వర్షాస్వేవ వివర్ణయేత్.
నియమస్య విశేషోఽన్యః కశ్చిదత్ర ప్రకాశ్యతే.
శ్రుతి మింద్రద్వీపం బ్రూయా త్రీణి సప్త చతుర్దశ
భువనాని చతస్రోఽష్టౌ దశ వా కకుభో మతాః.

ఈపైనిఁ జెప్పిన శ్లోకముల తాత్పర్య మిది:—కవీశ్వరుల కవిసమయమును అసతోనిబంధనములని, సతోఽనిబంధనములని నియమతో నిబంధములని ముత్తెఱఁగులుగ నుండును.

అందు అసతోఽపి నిబంధనములు ఏవియనఁగా-౧ పర్వతములలో రత్నములు ఉపరత్నములు మున్నగు ధాతువర్గము సర్వము నున్నట్లువర్ణించుట. ౨ చిన్న చిన్న కొలనులు గుంటలు మున్నగువానిలోఁ గూడ హంసాదులగు జలపక్షు లున్నట్టులు వర్ణించుట, ౩ ఆకాశగంగలో నీటియేనుఁగులు సయితము (నీరే జావ్యం—అన్న పాఠములో కమలములూ మె,) మొదలగునవి యున్నట్టులు చెప్పుట, ౪ సాధారణములగు నదులలో సయితము తామరలు మున్నగునవి యున్నట్టులు కూర్చుట, చీఁకటులు సూచీభేద్యములై యున్న వని చెప్పుట, ౬ ఆచీఁకటులనే పిడికిళ్లతోఁ గూర్చందగినట్లున్న వని యనుట, ౭ చంద్రకిరణములు దోసిళ్లతోఁ బట్టుట కనువుపడిన ట్లున్నవనుట ౮ వెన్నెలలు కుండలతో ముంచిపోయఁదగినట్లు చెప్పుట. ౯ ప్రతాపము ఎఱ్ఱగా

ను, వేడిగాను ఉన్నట్లు వర్ణించుట. ౧౦ కీర్తులును హంసా దులును తెల్లగానున్నట్లు చెప్పుట. ౧౧ అపకీర్తి పాపము మున్నగువానిని నల్లగా నున్నట్లు కూర్చుట ౧౨ కోపము అనురాగము—అనునివి ఎఱ్ఱనివిగాఁ జెప్పుట ౧౩ సముద్రములను నాల్గుగా వర్ణించుట, ౧౪ రాత్రులు జక్కవలు వియోగము నొందునట్లుకూర్చుట. ౧౫ చకోరములకు సురలకు వెన్నెలయాహారములం గూర్చుట. ౧౬ లక్ష్మి పద్మములలో వసించుచున్నట్లు చెప్పుట. ౧౭ అట్లే రాజులవక్షస్థలమునందును లక్ష్మి యున్నట్లు కూర్చుట ౧౮ సముద్రమథనమున లక్ష్మి యుదయించినట్లు కూర్చుట—అను నీపదునెనిమిదియును అసతోఽపి నిబంధన నామక కవిసమయములలోనఁ జేరును.

ఇఁకను సతోఽప్యనిబంధము లగుకవిసమయములు ఏవి యనఁగా—౧ మంచిగంధపు మ్రాకులకు పండ్లు పూవులు (ఉన్నను) కూర్పకుండుట ౨ ఇట్లే కల్పవృక్షములకును ఫలపుష్పాదులఁ జెప్పకుండుట. ౩ వసంతమున జాజిపూవు లున్నట్లు చెప్పకుండుట. ౪ శుక్లపక్షములో చీఁకటియున్నను చెప్పకపోవుట ౫ ఇట్లే కృష్ణపక్షమునను వెన్నెలయున్నను కూర్పకుండుట ౬ అశోకవృక్షములకు ఫలము లున్నను కూర్పకుండుట. ౭ కాముకుల దంతములందు ఎఱుపుఁ దనమున్నను కూర్పకుండుట. ౮ మల్లెమొగ్గలందు హరితవర్ణమున్నను కూర్పకుండుట. ౯ పగలు కలువలును, రాత్రులు కమలములును వికసించుట యున్నను, కూర్పక పోవుట—అనునియ్యవి తొమ్మిది

యును అసత్యోపనిబంధము లగు కవిసమయములు అనఁగా నివి ఇందులోఁజేరిన భేదము లని భావము.

ఇట్టులనే నియమతో నిబంధన కవిసమయము లియ్యవి:— ౧ పువ్వులు ఆకులు నీళ్ళు వస్త్రములు మొ॥ సాధారణముగా తెల్లని వనుట. ౨ మలయా ద్రులందే చందన తరువులుండు ననుట ౩ మధుమాసమునందే పికములు ధ్వనిచేయు ననుట, ౪ మేఘములు సముద్రములు కాకులు పాములు తలవెండ్రుకలు, తుమ్మెదలు నల్లని వనుట ౫ దొండపండ్లు, బంధూకపుష్పములు సూర్యబింబము, నెఱ్ఱని వనుట. ౬ నెమళులకు కూఁతలు, నాట్యములు వర్షాకాలములందే యుండుననుట. ౭ ఇంద్రుని ఏనుఁగను అనఁగా నైరావతమును, తెల్లని దనుట. ౮ లోకములను మూఁడని, ఏడని, పదునాల్గని వర్ణించుట. ౯ దిక్కులు నాల్గనియు, నెన్మిదియనియు, పది యనియు, వర్ణించుట-ఇందుఁ జేరునని తాత్పర్యము.

ఇట్టులనే అమరుఁడను కవి కావ్యకల్పలతి యనెడి గ్రంథమునందును ఈరీతినే అనుసరించెను. చూడుఁడు:—

I. అసతోఽపి నిబంధనము.—

శ్లో. రత్నాది యత్రతత్రాద్రౌ హంసాద్యల్పజలాశయే
జలేభాద్యం నభోనద్యా మంభోజాద్యం నదీష్వపి
తిమిరస్య తథా ముష్టిగ్రాహ్యం సూచీభేద్యతాం
అంజలిగ్రాహ్యతా కుంభోపవాహ్యా జ్యోత్స్నయా చ సః,

శుక్లత్వం కీర్తిహంసాదౌ కార్ష్ణ్యం దుష్కీర్త్యఘాదిషు
ప్రతాపే రక్తతోష్ణత్వే రక్తత్వం క్రోధరాగయోః
విభావర్యాం భిన్నతటాశ్రయణం చక్రవాకయోః
జ్యోత్స్నాపానం చకోరాణాం వర్ణయేదసదప్యదః.

అందు—(పరి తానం 2-30-31 పేజీ.)

అనఁగా—౧. ఏయే కొండలలోనైనను రత్నాదు లున్నట్లు చెప్పుట, ౨. ఏపాటి అల్పాల్పములగు నీటి పట్టులలోనైనను హంసాదులనున్నట్లు చెప్పుట, 3. ఆకాశగంగలో నీటియేనుంగు లున్నట్లు కూర్చుట, ౪. చీఁకట్లు ముష్టిగ్రాహ్యము లని, సూచిభేద్యములని యనుట, ౫. వెన్నెలలు అంజలిగ్రాహ్యము లని, కుంభోపవాహ్యము లని యనుటయు, ౬. కీర్తి, హంసలు, సుఖము పుణ్యము మున్నగువానికిఁ తెలుపును వర్ణించుట, ౭. అపకీర్తి, పాపము, దుఃఖము, మొదలయినవానికి నలుపు సెప్పుట, ౮. ప్రతాపమునకు నెఱుపును, వేడిని, కూర్చుట, ౯. కోపము, అనురాగము, వీనిని ఎఱ్ఱదనమునఁ గూర్చుట, ౧౦ రాత్రులు, చక్రవాకములు, ఎడబాసి, భిన్నతటముల నుండుననుట, ౧౧. చకోరములు వెన్నెలఁ ద్రావునట్లు చెప్పుట, ఇత్యాదులు - ఇందుఁ జేరు నని భావము.

2. సతోఽప్య నిబంధనములు:—

శ్లో. వసంతే మాలతీపుష్పం ఫలం పుష్పం చ చందనే,
అశోకే చ ఫలం, జ్యోత్స్నా ధ్వాంతే కృష్ణాన్యపక్షయోః.

కామిదంతేషు కుంజానాం కుట్మలేషు చ రక్తతాం
ప్రియంగుపుష్పే పీతత్వం సరోజముకుళాదిషు
హారితత్వం దివా నీలోత్పలానాం స్మేరతా దివా
శేఫాలికాను మే భ్రంశం వర్ణయే న్న సదపృదః

వాసంతకాలమున మాలతీపుష్పములను, చందనమున ఫలపుష్పములిను, కృష్ణపక్ష శుక్లపక్షములలో క్రమముగా, వెన్నెలయును చీకటి యును, కామిజన దంతములందును, గుంజకుట్మలములందును రక్తత్వమును, ప్రియంగు పుష్పములందు పీతత్వమును, సరోజముకుళాదులయందు హారితత్వమును, నీలోత్పలములకు పగటిపూట విప్పారుటయును. శేఫాలికాకుసుమములందు పవలు, భ్రంశమును ఉన్నను వీనిని ఉన్నట్లు వర్ణింపరాదు. అనగా పైం జెప్పినవిసంభవములయినను కూర్పరాదని కవిసమయము.

3. నియమతో నిబంధనములు:—

శ్లో. ముక్తా స్తామ్రపర్ణ్యా మేవా బ్ధిష్వేవ మకరా నపి
భూర్జద్రూ న్హిమవత్యేవ మలయేష్వేవ చందనం
సామాన్యగ్రహణే వారిముచాం కృష్ణత్వ మేవ హి
రక్తత్వమేవ రత్నానాం పుష్పాణాం శౌక్ల్య యేవ చ,
తథా వసంతఏవా౽న్య భృతానాం ధ్వనిలోద్భవం
వర్షాస్వేవ మయూరాణాం రుతం నృత్తం చ వర్ణయేత్.

తామ్రపర్ణీ నదిలోననే ముత్తెములను, సముద్రములందే మకరములను (మొసళ్లు), హిమవద్గిరియందే

భూర్జవృక్షములను, మలయమునందే చందనతరువులను సామాన్యగ్రహణమున మేఘములకు నలుపుందనమును రత్నములకు ఎఱుపుఁదనమును, పూవులకుఁ దెలుపుఁదనమును. వసంతమునందే కోయిలలకు కూఁతి యుత్పత్తిల్లుటను, వర్షాకాలములందే నెమిళులకు నాట్యమును కేకలును, ఉన్నట్టులు నియమముగాఁ గూర్పవలయు నని భావము

4. నియమ విశేష నిబంధనములు:—

శ్లో. నీలకృష్ణయో ర్హరితకృష్ణయో శ్శ్యామకృష్ణయోః,
పీతపాటలయో శ్శుక్లగౌరయో ర్నాగసర్పయోః
మహార్ణవసాగరయోః క్షీరసాగరసముద్రయోః
కమలాసంపదోః కామధ్వజే మకరమత్స్యయోః
ద్వాదశానా మప్యర్కాణాం వార్ధశ్రీ త్రివృగ్జచంద్రయోః
చంద్రేశశైణయో ర్విష్ణుశేషకూర్మాదికస్య చ
నారాయణదామోదర మాధవ ప్రభృతే రపి
దానవాసురదైత్యానా మైక్య మేవాఽభిసంమతం
దానవా స్తు విప్రచిత్తిః శంబరో నముచి స్తథా
పులోమాదయోఽథ దైత్యా హిరణ్యాక్షో విరోచనః
బాణో హిరణ్యకశిపు ర్బలిః ప్రహ్లాదకాదయః
అథాసురా వృషపర్వబల వృత్రాదయస్స్మృతాః
స్త్రీణాం పక్ష్మః కటాక్షాణాం శుక్లతా కృష్ణతాథవా
కృష్ణఽప్యథ తా వా శుక్లశ్యామతా శుక్లకృష్ణతా
బహుకాలజన్మనోఽపి శివచంద్రస్య బాలతా
మనోభవస్య మూర్తత్వ మమూర్తత్వం చ వర్ణ్యతే

దేవదేహస్థితిం విద్యాత్ నాయికానాయకక్రియః
స్వభావాత్ సర్వజీవానాం వ్యవస్థాదేశకాలయోః

నీల కృష్ణవర్ణములు హరితకృష్ణములు శ్యామల కృష్ణములు పీతపాటలములు శుక్లగౌరములు—అను వీనికిని, నాగజాతి సర్పజాతులకును, మహార్ణవసాగరములకును, క్షీరసముద్ర లవణసముద్రములకును, కమలాసంభవలకును కామధ్వజకేతనములగు మకరమత్స్యములకును, ద్వాదశార్కులకును, సముద్రజుఁడు అత్రినేత్రజుఁడు అగు చంద్రులకును, చంద్రునిలోఁ గల యిఱ్ఱికుందేలులకును విష్ణు శేష కూర్మాదికములకును నారాయణ దామోదర మాధవాదు లగు నవతారమూర్తులకును, దానవాసురదైత్యులకును, ఐక్యమును దప్పక కూర్పవలసి యుండుట కవిసమయసమ్మతము అని యెఱుంగవలయును.

మఱియును దానవాసురదైత్యులు ప్రత్యేకజాతులు. ఈ జాతులలో దానవుల జాతియందు—విప్రచిత్తి శంబర నముచి పులోములు మున్నగువారు చేరుదురు. హిరణ్యకశిపుఁడు విరోచనుడు బాణుఁడు హిరణ్యాక్షుఁడు బలి ప్రహ్లాదుఁడు మొదలయినవారు దైత్యజాతియందుఁ జేరుదురు. ఇట్టులనే అసురజాతిలో, వృషపర్వుఁడు బలాసురుఁడు వృత్రాసురుఁడు మున్నగువారు చేరుదు రని యిట్లు ఇందలిభేదముల నెఱుంగఁగావలయును.

పైని చెప్పినవిధముగానే స్త్రీలకన్నులకుఁగాని, లేక ఆ కన్నులచూపులకుఁగాని, శుక్లత్వముగాని కృష్ణత్వము

గాని, లేనిచో శుక్లకృష్ణత్వముగాని, శుక్ల శ్యామలత్వము గాని, శుక్లకృష్ణత్వముగాని యున్నట్లులు కూర్పవలయు ను. బహుకాలముక్రిందఁ బుట్టినవాఁడైనను శివుని శిర స్థితుండగు చంద్రునకు బాలత్వమే చెప్పందగును. ఇట్లే మన్మథునకు సశరీరితగాని అశరీరితఁగాని చెప్పంబడును. నాయికానాయకులను దేవిదేవరలువోలెఁ జెప్పందగును. ఈరీతిగా ఆయా దేశకాలస్థితుల ననుసరించిన వ్యవస్థ యును, ఆయాజీవుల స్వరూప స్వభావాదుల స్థితులలో గల వ్యవస్థయును కన్పెట్టి తనకుఁ బూర్వులై ప్రఖ్యాతి నొందిన సంస్కృత ప్రాకృతాది భాషలవేర్పడసి యున్న కవుల వర్ణనములను గుర్తించి కవిసమయముల నేర్ప అచు కొనఁదగు నని భావము.

ఇది రాజశేఖర కవిరాజకృత మగు కవిరహస్యమనెడి
కావ్యమీమాంసయందు ప్రథమాధికరణమున
స్వర్గమర్త్య పాతాళీయ కవిరహస్యస్థాపనమనునది
షోడశాధ్యాయము.

---

# రాజశేఖరకవి కావ్యమీమాంస.

## సప్తదశాధ్యాయము.

### దేశవిభాగ (వివరణము.)

[ఈ యధ్యాయపు విశేషములు:—కల్పనాభేదముచే నైన లోకభేదములు. ౧. భూలోకపు ద్వీపములు-సముద్రములు, ౨ జంబూద్వీపములోని వర్షములు-వర్షపర్వతములు. ౩ భారతవర్షములోఁగల నవ (తొమ్మిది) భేదములు. ౪ సమ్రాట్చక్రవర్తి క్షేత్రముల నిరూపించుట ౫ ఆర్యావర్తములోఁగల యైదు విభాగములు, ౬ అందుగల దేశ, పర్వత, నదీనద వివరములు. ౭ అం దుత్పత్తి యయ్యెడి వస్తువులు, ౮ దిగ్విమర్శనము, ౯ తదనుసారముగా జనించిన కవీయుల యాయా దేహవర్ణ పరిధృతి యమాదులు-౧౦ అవు]

దేశమును కాలమును విభజించుకొని కవిత్వముం జెప్పుకవి, అర్థదర్శనవిషయమున దరిద్రుఁడు కాఁజాలడు. అనఁగా అట్టికవికి వర్ణనీయవస్తువు ఎప్పటికిని కొఱవడక(కొఱతలేక)యే యుండును. మన కనులయెదుటను పరోక్షమునను స్థావరజంగమ రూపముగఁ గనఁబడుచున్న ప్రదేశమును, అందలి ఏకదేశమును దేశమని పెద్దలు వ్యవహరించుచున్నారలు. కొందఱు ఈలక్షణమును ఒప్పుకొనక, ద్యావాపృథివ్యాత్మకము(అనఁగా భూమ్యాకాశస్వరూపమున నున్నదంతయు) నగు జగమంతయును

దేశమేయని వివదించుచున్నారు. అట్టివారి యభిప్రాయము, అనఁగా ద్యావాపృథివ్యాత్మకమగు జగమే దేశము అను వారి యభిప్రాయము ననుసరించి ఈక్రిందిశ్లోకము వలన దేశము ఒక్కటే యని స్పష్టము కాఁగలదు.

శ్లో. హాల మగు బలస్యైకోఽనడ్వాన్ హరస్య న లాంగలం
క్రమపరిమితా భూమి ర్విష్ణో ర్నగౌ ర్నచ లాంగలం
ప్రవహతి కృషి ర్నాద్యాపి స్యేషాం ద్వితీయగవం వినా
జగతి సకలే నేదృగ్దృష్టం దరిద్రకుటుంబకమ్.

[ఉన్నచోటినుండి కదలని (మొద్దు) యగునాగలి బలరామస్వామికి కలదు; కాని, అంతమాత్రముననే వ్యవసాయముఁ జేయుటకు వీలు కలుగలేదు. ఏల యనఁగా అతనికి ఆనాగలి తప్ప వేఱె ఎద్దుగాని భూమికాని లేదు. ఇంకను త్రిమూర్తులలో నొక్కఁడగు ఈశ్వరుని జూతమన్న నతనికి ఎద్దు కలదు; కాని నాగలి లేదు. భూమియును లేదు. ఇట్లే ఇంతకన్నను సమర్థుఁ డనియును ఉపాయశాలి యనియును పేరుపొందిన విష్ణుస్థితిని ఆలోచించి చూతమనిన, అతనికి క్రమపరిమితయగు భూమి కలదు; కాని ఎద్దును లేదు. నాగలియును లేదు. ఈకారణముల వలన వీరందఱును కలిసి కృషిచేయుటకు పూనుకొన్నను భూమియును నాగలియును కుదిరెను గాని రెండవయెద్దేది? రెండవ యెద్దులేనిది కృషి యెట్లుసాగును. ఆహా! ఎంతవింత! ఈప్రపంచమంతయును వెదకినను, ఈపైని చెప్పినవారల కుటుంబముతోఁ బోలిన దరిద్ర కుటుంబమును మఱియొక్కటి ఎచ్చటను కన్పట్ట కున్నది.

దివమును పృథివియును అను నీరెండే లోకములని మఱికొందఱి యభిప్రాయము. ఇట్లే యనిరి.

శ్లో. రుణద్ధి రోదసీ చాస్య యావత్కీర్తి రనశ్వరీ,
తావత్కిలాయ మధ్యాస్తే సుకృతీ వైబుధం పదమ్.

[ఈతని యొక్క కీర్తి (నశింపనిదై) అనశ్వరియై ఎంతకాలము రోదస్సులను (దివమును పృథివిని) చుట్టుకొని ప్రకాశించుచుండునో, అంతవఱకును ఈమహారాజుగారు, ఈపుణ్యాత్ముడు దేవతల కావాసస్థానమగు స్వర్గమును అధిష్ఠించియుండఁగలడు. అనఁగా ఈతనికీర్తి అనశ్వరయై సర్వకాల సర్వావస్థలయందును మార్పాటులేని స్వర్గసుఖమును ఇతనికి ఇచ్చునని తాత్పర్యము ఇందు రోదసీ అనుమాటచేత ద్యావాపృథ్వులు రెండు లోకములున్నట్టులు చెప్పంబడినవి

స్వర్గము మర్త్యము పాతాళము అని ప్రసిద్ధిఁజెందిన ఈమూఁడు లోకములే, జగత్తులని మఱికొందఱి వాదము. ఇందులకు నుదాహరణము.—

శ్లో. త్వమేవ దేవ పాతాళం ఆశానాం త్వం నిబంధనం,
త్వం చామరమరుద్భూమి రేకో లోకత్రయాయసే.

మహాప్రభూ! ఆ పాతాళలోకము నిస్వరూపమేయై యున్నది. సమస్తాశావకాశములకు నిబంధన కారణమవును నీవే సుమా! దేవతలు వసించెడి ఆ దివ్యభూమియును నీ స్వరూపముననే రాజిల్లుచున్నది. నీవు చూచుటకు ఒకఁడవే యయ్యును, లోకత్రయ స్వరూపుఁడవుగా నున్నావు అని భావము.]

పైన చెప్పిన స్వర్గ మర్త్య పాతాళములను లోకములు మూఁడే భూర్భువస్స్వర్గము లను పేరితో,— అనఁగా భూలోకమని, భువర్లోకము అని, స్వర్గలోకము అని పేరులు,—వ్యవహృతము లని మఱికొందఱు అభిప్రాయ పడుచున్నారు.

శ్లో. నమస్త్రిభువనాభోగ భృతిస్వేదభరా దివ
నాగనాథాంగ పర్యంక శాయినే శార్ఙ్గధన్వనే.

[త్రిభువనములను మోయుటచేతనైన స్వేద భరమువనో యనునట్లు, నాగశయ్యపైఁ బవళించిన శార్ఙ్గధన్వుని కొఱకు నమస్కరించు చున్నాను.]

పైని చెప్పిన భూలోక భువర్లోక స్వర్గలోకములు మూఁడును, మహాలోక జనలోక తపోలోక సత్యలోకము లగు నాల్గులోకములును కలిసి, ఏఁడు లోకములని ఇంకఁ గొందఱ మతము. ఉదాహరణము.—

శ్లో. సంస్తంభినీ పృథునితంబతటైర్ధరిత్ర్యాః
సంవాహినీ జలముచాం చలకేతుహస్తైః
హర్షస్య సప్తభువన ప్రథితోరుకీర్తేః
ప్రాసాదపంక్తి- రియ ముచ్ఛిఖరా విభాతి.

[గొప్పగొప్పవి అగు నితంబ(పర్వత)తటములచేత భూమిని ఇటునటు కదలనీయక పట్టుకొనినదై, చలించుచున్న టెక్కెము లనెడి చేతులతోటి మేఘములను వహించుచున్నదై (అనఁగా టెక్కెములు మేఘమండలము దాక నొఱసికొని యున్నవని యభిప్రాయము.)

సప్త భువనములందును (ఏడులోకము లందును) ప్రఖ్యాత మగు గొప్పకీర్తిగల హస్తినియొక్క (అనఁగా హస్తివర్ధన మహారాజుగారియొక్క) వాసస్థానమగు ఈ పురియందలి ప్రాసాదముల (మేడల) పంక్తి, ఉచ్ఛిఖరయై ప్రకాశించు చున్నది.]

పైనిచెప్పిన సప్తలోకములే, సప్తవాయు స్కంధ ములతోఁడఁ గూడ కలిసికొనినచో, పదునాల్గు భువన ములు అగునని, మఱియును గొందఱ యభిప్రాయమై యున్నది.

శ్లో. నిరవధి చ నిరాశ్రయం చ యస్య
స్థిత మనువర్తితకౌతుక ప్రపంచం,
ప్రథమ ఇహ భవాన్ స కూర్మమూర్తిః
జయతి చతుర్దశలోకవల్లి కందః.

[ఏ కూర్మావతారుని యొక్క కౌతుక ప్రపం చము—అనఁగా లీలార్థము సృష్టించిన ఈలోకము-నిర వధిగను నిరాశ్రయముగను నున్నదో, అట్టి ప్రథమావ తారుఁడగు కూర్మమూర్తి—ప్రపంచమున కంతకును తొలిదైన చతుర్దశలోకము లనెడి వల్లికి కందభూతమై యుండెడివాఁడు—సర్వోత్కర్షతో నొప్పుచున్నాఁడు- అని భావము ఇందు భువనములు పదునాల్గుగాఁ జేర్కొనంబడినవి.

అట్లయినచో ఏడువిధములగు పాతాళ లోకము లంగూడ జేర్చినచో, వానితోఁ గలసి ఇరువదియొక్క టి యగును. ఎట్టు లనఁగా—

శ్లో. హరహాస హరావాస హరహార నిభప్రభాః,
కీర్తయ స్తం విలింపంతు భువనా న్యేకవింశతిమ్.

ఈశ్వరుని తెల్లని వగు నట్టహాసములతోను, ఈశ్వరుని నివాసస్థానమగు (వెండికొండ) రజతాద్రితోను హరుని హారము లగు నాగరాజములతోను సమమైన ప్రభలు (కాంతులు) గల నీకీర్తిమూర్తులు ఏకవింశతి భువనములను, అనఁగా ఇరువది యొక్క లోకములను లేపనముఁ జేయు గాక.]

పైఁజెప్పిన మతభేదములలో నేదియును విప్రతిపన్నమైన దేదియును లేవనియు, సమస్తమును ఉపపన్నమే యనియును యాయావరీయుఁడు అనెను. అట్లయినచో ఈమతభేదము లెట్లు సమన్వయము నందురా? చూడుఁడు. విశేష వివక్ష లేకుండ, అనఁగా మొత్తముగా నవాంతర భేదములను లెక్కపెట్టకుండ, చూచినచో ఒక్కటిగాను, విశేషవివక్షతోఁ జూచినచో, ననేకములుగాను కన్పట్టుచుండును. ఈ చెప్పిన వానిలో భూలోకమే పృథివి. (మన ముండునట్టి యీభూమి.) ఈ భూమియందు ఏడు మహా ద్వీపము లున్నవందురు. చూడుఁడు:—

శ్లో. జంబూద్వీప స్సర్వమధ్యే తతశ్చ,
ప్లక్షో నామ్నా శాల్మలో౽తః కుశో౽తః,
క్రౌంచ శ్శాకః పుష్కర శ్చే త్యథైషాం,
బాహ్యాబాహ్యసంస్థితి ర్మండలానామ్.

శ్లో. లావణో రసమయ స్సురోదధిః,
సార్పిషో దధిజలః పయఃపయాః,

స్వాదువారి రుదధి శ్చ సప్తమః,
తా స్వర్గేశ్య క ఇమే వ్యవస్థితాః.

[భూమండలమున కంఠాటికిని నట్టనడుమ (1) జంబూద్వీపముగలదు. (2) అటుపైని ప్లక్షద్వీపము, అటుపైని (3) శాల్మలీ ద్వీపము గలదు. అటుపైని (4) కుశద్వీపము కలదు. అటుపైని (5) క్రౌంచద్వీపమును (6) శాకద్వీపమును (7) పుష్కరద్వీపమును, అని ఈ ద్వీపములయొక్క మండలులచేత బాహ్యాబాహ్యస్థితి అనగా ఒకమండలము వెలిగానుండుట, ఉనికి కలిగినది. (8) ఈ సప్తద్వీపములను చుట్టికొని (1) లవణసముద్రమును (2) సురాసముద్రమును (3) సర్పిస్సముద్రమును (4) క్షీరసముద్రమును, (5) మంచినీటి సముద్రమును, (6) రసనముద్రమును (7) సాధారణ సముద్రమును మహోదధియను పేరను వఱగుచున్నయవి.]

ఈపైని చెప్పిన సప్తసముద్రములును లేనేలేవు. లవణ సముద్రము ఒక్కటియే కలదని మఱికొందఱు:—

శ్లో. ద్వీపాన్యా ష్టాద శాత్ర క్షితి రపి నవభిః
విస్తృతా స్వాంగఖండైః,
ఏకోంభోధి ర్దిగంత ప్రవిసృతసలిలః
ప్రాజ్య మేగ త్సురాజ్యం,
కస్మి న్న ప్యాజికేళి వ్యతికర విజయో
పార్జి తే వీరవర్యే,
న్యక్కే పుంజేన దాతుం తదిద మితి ధియా
వేధసే య శ్చకోప.

ఈ భూమండలమునందంతటను కలసి పదునెనిమిది ద్వీపము లున్నవి. అట్టి అష్టద్వీపవిరాజిత యగు నీ భూదేవి కూడ స్వాంతః ఖండములచేత తొమ్మిది ఖండములుగా నొనర్పఁబడి విస్తృతయై యున్నది. దిగంతములవఱకు ప్రసరించిన యుదకములతో నొప్పెడి యొకే సముద్రము గలదు. ఈ రాజ్య మంతయును ప్రాజ్యమై (అనఁగాఁ జక్కని గుణవంతుడైన రాజు గలదై) యున్నయది. యిట్టి భూమండలము నంతను రణకేళివ్యతికరవిజయోపార్జితుఁడగు నెవఁడో ఒక వీరవర్యుని విషయములో ఒక్కమాఱుగాఁ గట్టగట్టి ఈయఁ దలఁచికొనినాఁడు*-అనుబుద్ధితో బ్రహ్మపైని ఏరాజు కుపితుఁడయ్యెనో ఆతఁడు సుమా ఇతఁడు!

మూఁడని కొందఱు:—

శ్లో. ఆకంపితక్షితిభృతా మహతా నికామం
హేలాభిభూతజలధిత్రితయేన యస్య
వీర్యేణ సంహితభిదా విహితోన్నతేన
కల్పాంతకాలవిసృతః పవనేఽనుచక్రే.

ఆకంపితము లగు క్షితిధరములు గలదియును, గొప్పదియును, విలాసమాత్రముగ నభిభూతములైన మూఁడు సముద్రములు గలదియు, నగుచు, ఏరాజువీర్యముచేత-(సంహితభేదియును విహితోన్నతియు, నగు వీర్యముచేత) కల్పాంతకాలవిలసితుఁ డగుతపనుఁడు అనుకరింప

బడియెనో అట్టి రాజచంద్రుఁ డితఁడు అని తాత్పర్యము. అనఁగా ప్రళయకాల తపనునివలె ఈతనిప్రతాపము అడ్డులేక ప్రసరించె నని తాత్పర్యము.

మఱియును ఇట్టిదే మఱియొక వర్ణనముఁగూడ కలదు. చూడుఁడు:—

శ్లో. మాతంగానా మభావే మదమలినముఖై ।
పార్పిత్త మాశాకరీంద్రైః
జాతే రత్నాపహారే దిశిదిశి తతయో
ర్భాంతి చింతామణీనాం;
భిన్నే ష్వాద్యానవాటీతరుషు విరచితాః
కల్పవృక్షా రిపూణాం
యస్యోదంచత్త్రివేలావలయ ఫలభుజాం,
మానసీ సిద్ధి రాసీత్.

ఏరాజునకు మాతంగములు లేకపోఁగా, మదమలిన ముఖములు గల దిగ్గజములచే నాలోటు తీర్పఁబడినదో, రత్నపహారము కలుగఁగా దిక్కుదిక్కునను చింతామణీమణులరాసులు ఆవిర్భవించినవో, ఉద్యానవాటీతరువులు ముక్కలు ముక్కలుగా భిన్నములు చేయఁడఁగానే కల్పవృక్షములు విరచితము లైనవో, ఉదంచత్త్రివేలావలయ ఫలభోక్తలగు నెవ్వని శత్రువులకు ఇవి యన్నియును మనఃపరికల్పితములు అయ్యెనో, అట్టివాఁ డితఁడు. అని భావము.

సముద్రములు పైనిచెప్పంబడిన యట్లుగా ఏడును ఒక్కటియును మూఁడును కాక, నాలుగని మఱికొందఱ భావము.

ఎట్లందురా?—చూడుఁడు:—

శ్లో. చతుస్సముద్ర వేలోర్మిర చితై కావళీలతం,
మేరుమ ప్యద్రి ముల్లంఘ్య యస్య క్వాపి గతం యశః.

చతు స్సముద్రములందలి వేలాంతరంగములచేత ఏకావళీహారలతగాఁ చేయఁబడిన మేరుపర్వతమును గూడ దాఁటి, ఏరాజుయొక్కయశము ఎచ్చటనో (అనఁగా దుర్గ్రాహ్యమైన ప్రదేశమునకు) పోయెను అని తాత్పర్యము.

భిన్న భిన్నములగు నభిప్రాయము లుండుటచేత పైని వివరించినదంతయును నిక్కమే యని యాయావరీయుఁ డనియెను. సప్తసముద్రములని వాదించువారైనను శాస్త్రానుసారులే గాని శాస్త్రమార్గములను ఉల్లంఘించినవారు కారు. ఎట్లందురేని, ఈ చెప్పఁబోవు విషయములను పరికింపుఁడు:—

శ్లో. అగస్త్యచులుకో చ్ఛిష్ట సప్తవారిధి వారిణి,
మహావా ర్ధం కేశవేనాపి తదంతః పూతరాయితమ్.

అగస్త్యమహాముని యొక్క చులుకోచ్ఛిష్టము అగు (పుక్కిట నుంచుకొని ఉమియఁబడినదియగు) సప్త సముద్రముల యుదకములందు కేశవునంతటివాఁడు (సాక్షాత్తు విష్ణువే) ఆయుదకములలో నున్న జలజంతువును బోలి యొకక్షణము కావలసి వచ్చెను.

శ్లో. మధ్యే జంబూద్వీప మాద్యోగిరీణాం,
మేరు ర్నామ్నా కాంచన శ్శైలరాజః,
యో మూర్తానా మౌషధీనాం నిధానం,
య శ్చావాస స్సర్వ బృందారకాణామ్.

జంబూద్వీపమునకు నట్టనడుమ నున్నదై పర్వతముల కన్నింటికిని ఆద్యమై, కాంచనమయమై "మేరు" వను పర్వతరాజము ఒప్పారుచున్నయది. ఏపర్వతరాజము మూర్తములగు నోషధులకు నిధానమై, సమస్తబృందారక బృందమునకును ఆవాసస్థానమై రాజిల్లినదో, అట్టిది మేరుపర్వత మనగా నని భావము.

శ్లో. త మేన మపధీకృత్య దేవే నాంబుజజన్మనా,
తిర్య గూర్ధ్వ యథస్తా చ్చ విశ్వస్య రచనా కృతా.

(3) ఇట్టిమేరువును అవధిగా చేసి బ్రహ్మదేవుడు ప్రపంచమును తిర్యగూర్ధ్వాధోరీతుల రచించి పెంచెను.

ఇట్టిమేరువే ఆద్యమగు వర్షపర్వతము. ఈ మేరుపర్వతమునకు నాల్గుదిక్కులను ఇలావృతమనువర్షము గలదు. దాని కుత్తరముగ నీల మని శ్వేతమని శృంగవంత మని మూడు వర్ష పర్వతములు గలవు. ఆమూడు వర్ష పర్వతములకు రమ్యక మని హిరణ్మయమని ఉత్తరకురుభూము లని మూడు వర్షములు గలవు.

దక్షిణ దిక్కునందుగూడ మూడే వర్ష పర్వతములు కలవు. క్రమముగా అవి నిషధమని హేమకూట మని హిమవంత మని పేరులు గలిగి యున్నవి. ఆమూడువర్ష పర్వతములకును హరివర్షము అని, కింపురుష

వర్షము అని, భారతివర్షము అని మూఁడుభూఖండములు గలవు. ఈమూఁడువర్షములలోను భారతవర్ష మనునది తొమ్మిది ఖేదములతో అనఁగా తొమ్మిదిఖండములతో విలసిల్లుచున్నది. ఇందుఁగల ఒక్కొక్కభాగమునకును ద్వీపము అనిపేరు.

ఈ తొమ్మిది ద్వీపములకు ఈవిధముగా పేరులు గలవు:—(1) ఇంద్రద్వీపము (2) కసేరుమద్ద్వీపము. (3) తామ్రపర్ణద్వీపము. (4) గభస్తిమద్ద్వీపము. (5) నాగద్వీపము. (6) సౌమ్యద్వీపము (7) గంధర్వద్వీపము (8) వరుణద్వీపము. (9) కుమారీద్వీపము—అని. ఈ ద్వీపములు దక్షిణసముద్రము మొదలుకొని హిమవంతము వఱకును గల ప్రదేశములో, ఒక్కొకదానికి నడుమ వేయేసియోజనముల అవధిగలిగి, ఏనూఱు యోజనములు జలప్రదేశము, ఏనూఱు యోజనములు స్థలప్రదేశములతో ప్రత్యేకఖండములుగా నున్నవి. ఈ నవఖండములను తనపరిపాలన క్రిందకు వచ్చునట్లు కూర్చుకొని ఏలఁగలవానిని సమ్రాట్టు (అనఁగా చక్రవర్తి)యని అందురు. కుమారీపురము (కన్యాకుమారియే కాఁబోలును!) మొదలుకొని బిందుసరమువఱకుఁ గల పదివేల యోజనముల ప్రదేశమును చక్రవర్తిక్షేత్ర మని యందురు. ఈ చక్రవర్తిక్షేత్రమును జయించినవాఁడు "చక్రవర్తి" యని పిలువఁబడును.

చక్రవర్తియగు వాని కీక్రిందిచిహ్నము లుండవలయు నని పెద్దలు నిర్దేశించి యున్నారు. ఎట్లనఁగా.—

1, చక్రము 2. రథము. 3. మణులు. 4. భార్యలు. 5. నిధులు. 6. అశ్వములు. 7. ఏనుఁగులు. అనునీ యేడు రత్నములును చక్రవర్తులకు ముఖ్య చిహ్నము లై యుండును. అనఁగా చక్రవర్తి వీనిని అపారముగాఁ గలిగి యుండవలెనని యర్థము.

కుమారీద్వీపమునందు (1) వింధ్యము (2) పారియాత్రము (3) శుక్తిమంతము. (4) ఋక్షపర్వతము (5) మహేంద్రము (6) సహ్యము (7) మలయము అని యేడుకులపర్వతములు గలవు. ఇందు వింధ్య పర్వతాదులు సుప్రసిద్ధములే! మలయపర్వతవిశేషములను కొన్నింటిని ఈక్రిందఁ గ్రమముగా నుదాహరించెదము.

ప్రథమవిశేషము.

శ్లో. ఆమూలయష్టేః ఫణివేష్టితానాం
సచ్చందనానాం జనవందనానామ్
కక్కోలకైలామరిచైర్యుతానామ్
జాతీతరూణాం చ సజన్మభూమిః.

మొదలు మొదలుకొని సర్పములచే చుట్టుకొనఁబడినవై, జనుల కానందమును నిచ్చునవి యై యున్న మంచిగంధపు వృక్షములకును, కక్కోలకపుతీగెలు, ఏలకతీగలు, మిరియపు తీగలు మున్నగువానిచే నల్లుకొనఁబడిన జాతిచెట్లకును, ఆమలయ పర్వతము జన్మభూమి యై యున్నదని ఎఱుంగఁ దగును.

ద్వితీయవిశేషము.

శ్లో. యస్యోత్తమాం మౌక్తికకామధేనుః
ఉపత్యకా మర్ఘతి తామ్రపర్ణీ
రత్నేశ్వరో రత్నమహానిధానమ్
కుంభోద్భవ స్తం మలయం పునాతి.

ఏమలయపర్వతముయొక్క ఉత్తమమగు ఉపత్యక భూమియందు (అనఁగాఁ బర్వతప్రాంతప్రదేశమును) మౌక్తికకామధేను వని ప్రసిద్ధిగాంచిన తామ్రపర్ణినదియును, రత్నములకు నిధాన మనఁదగిన రత్నేశ్వరస్వామియును రాజిల్లుచున్నారో అట్టి యగస్త్యమహర్షియు అట్టి మలయపర్వతమును పవిత్రీకరించుచున్నాఁడు.

మఱియును—అచ్చట —

శ్లో. తత్ర ద్రుమా విద్రుమనామధేయాః
వంశేషు ముక్తాఫలజన్మ తత్ర
మదోత్కటైః కేసరికంఠనాదైః
స్ఫుటంతి తస్మిన్ ఘనసారవృక్షాః.

ఆమలయపర్వతమునందు, విద్రుమములు (పొగడవృక్షములు) అని ప్రసిద్ధి గాంచినవృక్షము లనేకములు గలవు. అచ్చటి వంశములలో (అనఁగా బొంగువెదుళ్ళలో) ముక్తాఫలములు—అనఁగా ముత్తెములు జనించుచుండును అచ్చటి ఘనసారవృక్షములు, మదోత్కటము లగు కేసరిగర్జితములచేత విస్ఫుటములు అగుచుండును అని భావము.

మూఁడవ విశేషము.—

శ్లో. విలాసభూమి స్సకలామరాణాం,
పదం నృణాం గౌ ర్మునిపుంగవస్య,
సదా ఫలైః పుష్పలతాప్రవాళైః,
ఆశ్చర్యమూలం మలయ స్సతత్ర.

[అచ్చటి మలయపర్వతప్రదేశము సమస్తదేశము విహారస్థానము, మనుజులకు, ఉనికిపట్టు, మునిపుంగవుఁడగు అగస్త్యునికిఁ గామధేనువు. ఎల్లప్పుడు ఎడతెగకుండ పూచుచు కాచుచునున్న పుష్పలతా ప్రవాళములచేతను ఒప్పుచున్న ఫలవృక్షములచేత విరాజిల్లుచు, సమస్తైశ్వర్యములకు పుట్టినిల్లై ప్రేక్షకులను రజింపఁజేయుచుండును.

నాల్గవ విశేషము:—

శ్లో. సాత్ర చామీకరరత్నచిత్రైః ప్రాసాదమాలా వలభీవిటంకైః,
ద్వారార్గళాబద్ధ సురేశ్వరాంకా లంకేతి యా రావణరాజధానీ.

[వింజామరలయందు చెక్కఁబడి రత్నములచేత చిత్రవర్ణములు గలవైన ప్రాసాదమాలికలయందలి వలభీవిటంకములచేత విలసిల్లుచు, ద్వారార్గళముల యందు ఆబద్ధమగు సురేశ్వరు చిహ్నముగల లంకయను రావణుని రాజధానీనగరము అచ్చట కలదు.]

మఱియు నచ్చట:—

శ్లో. ప్రవర్తతే కోకిలనాద హేతుః,
పుష్పప్రమాః పంచమజన్మదాయీ,
తేభ్య శ్చతుర్భ్యోఽపి వసంత మిత్ర
ముదఙ్ముఖో దక్షిణమాతరిశ్వా.

[కోకిలనాదములకు కారణుఁడగు వసంతుఁడచ్చట గలఁడు. మన్మథుఁడచ్చటఁ గలఁడు. పంచమస్వరముఁ బలుకు పికము లచ్చటఁ గలవు. ఈకోకిలవసంత మన్మథ శుకము లను నల్వురు మిత్రులకును, తోడుగ దక్షిణానిలము ఉత్తరాభిముఖమై ప్రయాణోన్ముఖమై యుండును]

తూర్పుసముద్రమునకును పశ్చిమసముద్రమునకును, హిమవత్పర్వతమునకును వింధ్యపర్వతమునకు నడుమ నుండు ప్రదేశము ఆర్యావర్తము. ఈయార్యావర్తమునందు చాతుర్వర్ణ్యమునుచాతురాశ్రమ్యమును నుండును. కావునను, ఆచాతుర్వర్ణచాతురాశ్రమ్యమూలక మైనది కావునను అచ్చటియాచారము సదాచారము. అచటి సంభాషణాది వ్యవహారము తెలుచుగ కవుల వ్యవహారమే అయియుండును. ఇట్టి ఆర్యావర్తమునకే పురోభాగమున పూర్వదేశమున్నది.

పూర్వదేశమునందు-(1) అంగము (2) కళింగము (3) కోసలము (4) తోసలము (5) ఉత్కలము (6) మగధము (7) ముద్గరము (8) విదేహము (9) నేపాళము (11) ప్రాగ్జ్యోతిషము (12) తామ్రలిప్తకము (13) మలదము (14) మల్లము (15) మల్లివర్తము (16) సుహ్మము (17) బ్రహ్మదేశము (18) ఉత్తరదేశము, మున్నగు దేశములు కలవు. (1) బృహద్గృహ (2) లోహితగిరి (3) చకోరము (4) దర్దురము (5) నేపాళము (6) కామరూపము మున్నగు పర్వతములు నచ్చట కలవు శోణాలోహిత

మను పురుషనదములును, గంగానది, సింధునది, కపిశ మున్నగు నదులును అచ్చట గలవు ఆదేశములలో, ఏల కులు గ్రంధివర్గములు అగురు ద్రాక్ష, కస్తూరి మున్నగు వస్తువులు ఉండును.

మాహిష్మతిపట్టణమునకు తర్వాతనున్న ప్రదేశమంత యును దక్షిణాపథమునందలిదే (1)మహారాష్ట్రము, (2) మాహిషకము (3)అశ్మకము (4) విదర్భము (5)కుంతల ము(6) క్రథకైశికము (7) సూర్పారకము (8)కాంచీ దేశము (9)కేరలము (10) కావేరము (11) మరళము (12)వానవాసకము (13) సింహళము(14) చోడదేశము (15) దండకము (16) పాండ్యరాజ్యము (17) పల్లవక ము, 18గాంగదేశము, (19)నాసిక్యము (20) కొంక ణము (21) కొల్లాగిరిదేశము (22) వల్లరదేశము మున్న గు దేశములు కలవు వింధ్యపర్వతపు దక్షిణపు కొన, మ హేంద్ర మలయపర్వతములు, మేఖలపర్వతము, పాల మంజరము; సహ్యాము. శ్రీశైలము, మున్నగుపర్వతము లిచ్చటఁగలవు. నర్మద, తపతి, (తాపీ—అని యున్నది) పయోష్ణి, గోదావరి, కావేరి, భీమరథి వేణి. (కృష్ణవేణి) వంజుర, తుంగభద్ర, తామ్రపర్ణి, ఉత్పలావతి, ఇరా వతి, మున్నగు నదులు ఇచ్చట ముఖ్యములైనవి. ఈదేశ మునందు ఉత్పత్తి అయ్యెడి వస్తువుల నిదివరకే మల యపర్వతవర్ణన సందర్భమునందు విశదముగా చెప్పితిమి.

దేవసభకు పిమ్మట ప్రదేశమంతయును పశ్చిమదేశ ము. ఇందున్న దేశములలో, దేవసభ సురాష్ట్ర దశే

రక త్రవణ భృగుకచ్ఛ కచ్ఛీయ ఆనర్త అర్బుద బ్రాహ్మణవాహయవన దేశాదులు ముఖ్యములు. సరస్వతీ శ్వభ్రవతీ వార్త్రఘ్నీ మహీ హిడింబాదినదులు ఇచ్చటఁ గలవు. గోవర్ధనము, గిరినగరము, దేవసభ, మాల్యశిఖరము, అర్బుదపర్వతము, మున్నగుపర్వతము లిందు ప్రధానములు. కరీరములు, పీలువు, గుగ్గిలము, ఖర్జూరము మున్నగునవి ఈదేశములందు ఉత్పాద్యములగు వస్తువులలోఁ బ్రముఖములుగఁ బరిగణింపఁ దగి యున్నయవి.

పృథూదకమునుండి పైనిఁగల దేశము ఉత్తరాపథము అనఁబడును. శకదేశము బొక్కాణదేశము హూణము వానాయుజము కాంభోజము బాహ్లీకము వల్లవము లింపాకము కులూతము కీరతంగణము తుషారము తురుష్కము బర్బరము హారహూరవ హూహుక సహుడహంసమార్గర దేశములు మఠకరకంఠదేశము, మున్నగునవి ఈ ప్రాంతమునందలి ముఖ్యదేశములలో కొన్ని యగును. హిమాలయము కళిందము ఇంద్రకీలము చంద్రాచలము మున్నగునవి ఇచ్చటి పర్వతములు. గంగ సింధు సరస్వతి శతద్రువు చంద్రభాగ యమున ఇరావతి వితస్త విపాశ కుహూ దేవికాదులు ఇచ్చటి నదులలో ముఖ్యములు. సరళరసము, దేవదేవదారుబంక, ద్రాక్ష కుంకుమము చమరీమృగచర్మములు సౌవీరాంజనము స్రోతోంజనము సైంధవలవణము వైడూర్యమణులు గుఱ్ఱములు మున్నగునవి ఇచ్చట నుత్పాద్యములగు వస్తువులలో నెల్ల ముఖ్యములైనవి.

ఈ చెప్పిన పూర్వదక్షిణ పశ్చిమోత్తర దేశముల నడుమ నుండుదేశము మధ్యదేశము అని చెప్పఁబడు చున్నది. కవులు వర్ణించినరీతియుఁగూడ నిదియే. ఈరీతిన శాస్త్రములలో చెప్పఁబడిన ధోరణిని అనుసరింపదనియు ను తెలియంగఁదగును. ఏలయనఁగా అన్నారుగదా పెద్దలు ఇట్లు:—హిమవద్వింధ్యపర్వతములకునడుమ నున్నదియు ను, వినశనమునకు. అనఁగా ప్రాగ్జ్యోతిషము కాఁబోలు? తూర్పున నున్నదియును, ప్రయాగకుఁ బశ్చిమమున నున్న దియు, నగుదేశము మధ్యదేశమని ప్రకీర్తితము. ఈమధ్య దేశమునందుగల ఖండదేశములును పర్వతములును నదు లును, ఉత్పాద్యద్రవ్యములును సుప్రసిద్ధములై యుండు టచేత, నిచ్చట వానినిఁ బ్రత్యేకముగాఁ జెప్పలేదు. ఇట్లే ద్వీపాంతరములందున్న, దేశములను పర్వతముల ను నదులనుకూడ కవిప్రయోగానర్హములనెడి బుద్ధితో నిందు చర్చించి యుండలేదనియు తెలియంగవలయును.

"వినశనప్రయాగములకును గంగాయమునలకును నడుమ నుండుప్రదేశము అంతర్వేది యనియు, దానిని (అంతర్వేదిని) ఆధారముగా చేసికొని దిగ్విభాగము నేర్పవలయు ననియును ఆచార్యులనిరి. ఇట్లు నిర్ణయిం చుటలోఁగూడ, మహోదయమును మొదలుగా నేర్పఱ చుకొనవలయు" నని యాయావరీయుఁడు అనెను. "ఈ దిక్కు, ఇది మొదలుకొని ఇంతవఱకు—"అని నిశ్చయింప వీలులేకున్నందున దిగ్విభాగము నేర్పరుపఁబడలే"దని మఱి కొందఱు. ఉదాహరణముగా ఒక్కసంగతిని చెప్పెదము.

వామనస్వామికి పూర్వమైన (తూర్పు అయిన) దేశము, బ్రహ్మశిలకు పశ్చిమముగా నుండును. గాధిపురమునకు దక్షిణము అని చెప్పినదేశము కాలప్రియున కుత్తర మగును కాబట్టి. "అవధినిబంధనమగు నీ రూపము ఇతరత్వనియతమే యగును." అని యాయావరీయుఁ డనెను.

"ప్రాచ్యవాచీప్రతీచ్యుదీచ్య లని నాల్గే దిక్కులు" అని కొందఱు అనిరి. ఈక్రిందిరీతిగ నిందులకు వక్రోక్తియుఁ గలదు.

శ్లో. చతసృష్వపి దిక్షు రణే ద్విషతః ప్రతి యేన చిత్రచరితేన!,
విహిత మపూర్వ్య మదక్షిణ మపశ్చిమ మనుత్తరం కర్మ.

[చిత్రచరిత్రుఁడగు నీరాజుచేత నాల్గుదిశలందైన యుద్ధములలో శత్రువులను గుఱించిచేసినపని యేది కలదో, అది అపూర్వమును (క్రొత్తదిగను-తూర్పు కానిదియును) అదక్షిణముగను (దాక్షిణ్యము లేనిదియును-దక్షిణముకానిదియును) అపశ్చిమగమును, (విజ్ఞానరహితముగను—పశ్చిమముకానిదిగను) అనుత్తరముగను (జవాబుదారీ లేనిదిగాను-ఉత్తర దిక్కు కానిదిగను) అయియుండెను.] అని ప్రతిపదార్థము.

ఐంద్రి యని, ఆగ్నేయియని, యామ్యయని, నైర్ఋతి యని వారుణి యని, వాయవ్య యని, కౌబేరి యని, ఐశాని యని, ఇట్టులు ఎనిమిది దిక్కు లని మఱి కొందఱు అనిరి. ఇట్లు కూడ కలదు. ఉదాహరణము:—

శ్లో. ఏకం జ్యోతి ర్ద్విశా ద్వే త్రిజగతి గదితా
న్యబ్జజాస్యై శ్చతుర్భిః,
భూతానాం పంచమం యా న్యల మృతుషు తథా
షట్సు నానావిధాని,
యుష్మాకం తాని సప్త త్రిదశ మునినుతా
న్యష్టదిగ్భాంజి భానోః,
యాంతి ప్రాహ్ణే నవత్వం దశ దధతు
శివం దీధితీనాం శతాని.

బ్రాహ్మి యని, నాగిరియని అనురెండుభేదములతో గూడ కలసి,అవి (ఆదిక్కులు) పదియని కొందఱు పల్కి-రి. పది యను వ్యవహారమునకు ఈక్రిందిశ్లోకము నిదర్శనముగా నుండఁగలదు.

శ్లో. దశదిక్తట పర్యంతసీమ సంకట భూమికే,
విషమా స్థూలలక్ష్యస్య బ్రహ్మాండ గ్రామకే స్థితిః.

స్థూలలక్షుఁడు (చాల ఎక్కువగా దానముచేయు స్వభావముగలవాని నీ పేరుతో వ్యవహరించుచుందురు.) అగువానికి, పదిదిక్కుల చివరవఱకు హద్దుగాగలభూమి ఇమిడియుండు ఈబ్రహ్మాండ మను గ్రామమున ఉనికి విషమమై యున్నది. అనఁగా దశదిశావ్యాప్త మగు నీబ్రహ్మాండమునంతను దాఁటి యీదానవీరుని కీర్తిజాలము నిరంతరముగాఁ ప్రకాశించుచుండు ననుట.)

పైనిచెప్పిన వివిధవిషయబృంద మంతయును యథార్థమై నదియే కాని, వేఱు కాదు. అట్లయినచో ఈ విధముగ మతభేద మేల? యని యడిగెదరా! దిక్పరిణామము

వక్త్రయొక్క వివక్షను అనుసరించిగదా యుండును. మఱి యును ఆకాశమునందలి, చిత్రా స్వాతీ నక్షత్రముల మధ్యంగల భూమ్యవకాశము ప్రాచీ దిక్కు అనియును, దానిననుసరించియే దానికెదుర నున్నది ప్రతీచీదిక్కును, ధ్రువనక్షత్రము వఱకుంగల భూమ్యవకాశము ఉత్తర దిక్కు అనియును, తదనుసారముగ దానికెదురుగ నుండునది దక్షిణదిక్కు అనియును, వాని నడుమ నున్నవి విదిక్కులనియును, పైభాగమున నున్నదిక్కు బ్రాహ్మీదిక్కనియును క్రిందిభాగమున నున్నదిక్కు పాతాళీయ మని యును, పూర్వులు నేర్పఱచి రని నిర్ణయముగా నెఱుంగవలయును. కవులనిర్ణయమును ఈ రెండు విధములుగా నున్నట్లు నెఱుంగవలయును.

ఈ రెండు విధములలోను ప్రాక్సిద్ధవ్యవహారమునం గల ప్రాచీనిర్దేశమున కుదాహరణమునుగా ఈ క్రింది శ్లోకమును చూడుండు:—

శ్లో. ద్విత్రైర్ వ్యోమ్ని పురాణమౌక్తికమణి
చ్ఛాయైః స్థితం తారకైః,
జ్యోత్స్నాపాన భరాలసేన వపుషా
సుప్తా శ్చకోరాంగనాః,
యాతో ఽస్తాచలచూళ ముద్వసమధు
చ్ఛత్రచ్ఛవి శ్చంద్రమాః,
ప్రాచీబాల బిడాలలోచన రుచాం
జాతా చ పాత్రం కకుప్.

ఆ సమయమందు పురాణములగు మౌక్తికములల యొక్క నీడలవలె, రెండుమూడు తారక లున్నయవి. జ్యోత్స్నాపానభరాలసములగు శరీరములతో చకోరాంగ నలు నిద్రించుచునున్నవి. చంద్రుడు ఉచ్ఛ్వాసమధుచ్ఛవియై అస్తాచలమును గురించి వెడలిపోయినాడు. తూర్పు దిక్కు పిల్లికూనయొక్క కన్నుల కాంతులవంటి కాంతు లకు పాత్రమును నయ్యెనని భావము]

దక్షిణదిఙ్నిర్దేశము:—

శ్లో. దక్షిణో దక్షిణా మాశాం యియాను స్సోఽధికం బభౌ,
జిహాసు ర్దక్షిణా మాశాం భగవా నివ భాస్కరః.

ఆరాజు దక్షిణదిక్కును గురించి దండయాత్రను చేయదలంచినవాడై మిక్కిలియును ప్రకాశించెను. దక్షిణదిక్కును వదలిపెట్ట దలంచిన భగవానుడు అగు భాస్కరుని (సూర్యుని) ఎలె-అని భావము.

పశ్చిమదిఙ్నిర్దేశమున కుదాహరణము:—

శ్లో. పశ్య పశ్చిమదిగంతలంబినా, నిర్మితం మితకథే వివస్వతా,
దీర్ఘయా ప్రతిమయా సరోంభసః తాపనీయ మివ సేతుబంధనమ్.

[చూడుము. పశ్చిమదిగంతలంబియైన సూర్యుని చేత సుదీర్ఘమగు ప్రతిమచేత (ప్రతికల్పముచేత) సరోజ లములుబంగారువికారమైన యానకట్టకట్టబడినటులుగ ప్రకాశించుచున్న దని తాత్పర్యము.]

ఉత్తరదిఙ్నిర్దేశము:—

శ్లో. అస్త్యుత్తరస్యాం దిశి దేవతాత్మా,
హిమాలయో నామ నగాధిరాజః,

పూర్వాపరౌ వారినిధీ విగాహ్య
స్థితః పృథివ్యా ఇవ మానదండః.

ఉత్తరపుదిక్కునందు దేవతాత్మయైన హిమాచలమను పర్వతరాజముపూర్వపశ్చిమసముద్రములనుచొచ్చుకొనియున్నభూమియొక్కమానదండముబోలియున్నాఁడు.

విశిష్టస్థానావధియగు దిగ్విభాగమునందు పూర్వపశ్చిమదిక్కుల నిరూపణములు:—

శ్లో. యాదాంసి హే చరత సంగతగోత్రతంత్రం
పూర్వేణ చందనగిరే రుత పశ్చిమేన,
నో చే ద్విరంతర ధరాధర సేతునాలి,
రాకల్ప మేష న విరంస్యతి వో వియోగః.

[ఓజలజంతువులారా! అటునుండి కదలి చందనగిరితూర్పుననైనఁగాని,పశ్చిమముననైనఁగానియున్నగోత్రతంత్రమును ఆశ్రయింపుఁడు. ఇట్లు వెంటనే చేయరైతిరేని ఎడతెగక పర్వతిసేతుప్రసువగు - అనఁగాఁ గొండలతో సేతువును కట్టుటమూలమున నేర్పడు, ఈయడ్డుచేతకలుగఁగల—ఈవియోగము కల్పాంతమును మిమ్ము వదలిపెట్టదు.]

దక్షిణోత్తరదిఙ్నిర్దేశము:—

శ్లో. కాంచ్యాః పురో దక్షిణ దిగ్విభాగే
తథోత్తరస్యాం దిశి వారిరాశేః,
కర్ణాంతచక్రీకృతచారుచాపో
రత్యా సమం సాధు వస త్వనంగః.

[కాంచీనగరపు దక్షిణదిగ్విభాగమునందును, దక్షిణసముద్రమునకు ఉత్తరముగనున్న ప్రదేశములందును,

మన్మథుఁడు కర్ణాంతాకృష్టచాపుఁడై రతీదేవితోఁ గూడి యెల్లప్పుడును మన్మథుఁడు నివసించుచున్నాఁ డని తా.]

ఉత్తరము మున్నగువానిని చెప్పుటలోఁగూడ అనుత్తరదిగభిధానమును, అనుత్తరాదులయందు ఉత్తరదిగభిధానముఁగూడ ఒక విధముగా దిక్ప్రదేశమునకు ఉపకరింపఁ గల దందురు. ఎట్లందురా? చూడుఁడు.

తొలిదానికి ఉదాహరణము:—

శ్లో. తత్రాగారం ధనపతిగృహా నుత్తరే ణాస్మదీయం,
దూరా ల్లక్ష్యం సురపతిధనుశ్చారుణా తోరణేన,
యస్యోద్యానే కృతకతనయః కాంతయా వర్ధితో మే,
హస్తప్రాప్యః స్తబకనమితో బాలమందారవృక్షః.

[అయలకాపురియందు కుబేరునియింటికి నుత్తరముగా మాయిల్లు,దూరమునకుఁ గన్పట్టుచు, ఇంద్రధనస్సుఁ బోలినతోరణములతో రాజిల్లుచుండును. ఆయింటియొక్క ఉద్యానమునందు నాప్రియురాలిచేత పుత్రప్రేమతోఁ బెంపఁబడిన బాలమందారవృక్షము స్తబకనమితమై చేతి కందునట్లుగ రాజిల్లుచు నుండును.]

రెండవదానికి ఉదాహరణము:—

శ్లో. సహ్యాద్రే రుత్తరే భాగే యత్ర గోదావరీ నదీ,
పృథివ్యా మిహ కృత్స్నాయాం స ప్రదేశో మనోహరః.

[సహ్యపర్వతపు టుత్తరదిగ్భాగమునందలి గోదావరీనదీప్లావితమగు ప్రదేశమే, ఈసమస్త భూమండలములో నెల్ల మిక్కిలియును, మనోహర మైన ప్రదేశము.]

ఈపైనిచెప్పిన విధముననే దిగంతరవిషయములలోఁ గూడ నెఱుంగవలయును. అందు కూడ దేశపర్వతనద్యాదులకును దిక్కులకును ఏవరుసఁబట్టి నిర్దేశము కలదో ఆవరుసయే కూర్పఁదగి యుండును. ఇఁక సాధారణమైనది రెండిఁటియందును లోక ప్రసిద్ధిని బట్టి యుండుననుట యిటఁగల మర్యాద.

దిఙ్నియమమువలెనే వర్ణనియమముగూడ పాటింపఁదగి యున్నది. ఈవర్ణనియమములోఁ గూడ, పౌరస్త్యులకు శ్యామవర్ణమును, దాక్షిణాత్యులకు కృష్ణవర్ణమును, పాశ్చాత్త్యులకు పాండువర్ణమును, ఉదీచ్యులకు గౌరవర్ణమును, మధ్య దేశవాసులకు కృష్ణశ్యామ గౌరవర్ణములును కూర్పఁదగినవై యున్న వందురు.

పౌరస్త్యులకు శ్యామవర్ణము:—

శ్లో. శ్యామే ష్వంగేషు గౌడీనాం సూత్రహారై కహారిషు,
చక్రీకృత్య ధనుః పౌష్ప మనంగో వల్గు వల్గతి.

[గౌడదేశపుస్త్రీలయొక్క సూత్రహారమనోహరములగు శ్యామలాంగముల యందు వేయుటకై, మన్మథుఁడు పుష్పధనుస్సును చక్రాకారముగాఁ జేసి, అనఁగా వంచి, బాణములను తొడుగుచు నున్నాఁ డని భావము.]

దాక్షిణాత్త్యుల కృష్ణత్వమున కుదాహరణము:—

శ్లో. ఇదం భాసాం భర్తుర్ద్రవిడకవకగోళ ప్రతికృతి,
ర్విమానం దత్త్వోత్యో ద్గలతి నభసో బింబవలయం,
అ థైవ ప్రాచీన త్సరళ మురళీగండ మలిన
స్తరచ్ఛాయా చక్రైః స్తబకిత మివ ధ్వాంతవిసరైః.

[సూర్యుని యొక్క, కనకగోళప్రతికృతియగు ఉబింబవలయము, క్రమక్రమముగ మందప్రకాశము గలదియై ఆకసమునుండి జాఱుచున్నది. తరువాత ప్రాచీనముగు చీఁకటుల మంద, మఱల్ని గండమలినమైనదై వృక్షముల నీడలచేత స్తబకితమైన దానివలె, ప్రసరించుచు వచ్చుచున్నది.

ఉదీచ్యల గౌరవర్ణత కుదాహరణము:—

శ్లో. పుష్పైస్సంప్రతి కాంచనారతరవః ప్రత్యంగ మాలింగితాః,
బాహ్లీకీదశన ప్రభారుణతరైః పత్రై రశోకోఽర్చితః,
జాతం చంపకమ ప్యుదీచ్యలలనాలావణ్యచౌర్యక్షమం,
మాంజిష్ఠై ర్ముకులై శ్చ పాటలతరో రన్యైవ కాచి ల్లిపిః.

[ఇప్పుడిచ్చటనున్న కాంచనారవృక్షములు ప్రత్యంగమునను పూవులచేత నాలింగింపఁబడినవి. అశోకవృక్షము బాహ్లీకస్త్రీలదంతక్షతమును బోలి, ఎఱ్ఱనైన ఆకులతోడ నొప్పుచున్నయది. ఇఁకను చంపకకుసుమము గూడ ఉదీచ్యస్త్రీల లావణ్యచౌర్యమున సమర్థముగా నైనది. పాటలవృక్షమునకు మాంజిష్ఠవర్ణము లగు మొగ్గలచేత నొకవిధ మగు రంగు ఏర్పడినది అని భావము ]

పాశ్చాత్త్యుల పాండుత కుదాహరణము:—

శ్లో. శాఖాన్తరం మధుకబలనాకేళిలోలేక్షణానాం,
భృంగస్త్రీణాం వకుళముకుళం కుంతలీభావ మేతి,
కించేదానీం యవనతరుణీ పాండుగండస్థలీభ్యః,
కాంతిస్తోకం రచయతి పదం నాగవల్లీదళేషు.

శ్లో. కాశ్మీరీ గాత్రలేఖాసు లోలల్లావణ్య వీచిషు,
దాత్రవయిత్వేవ విన్యస్తం స్వర్ణం షోడశవర్ణకమ్.

మధ్యదేశమువారి కృష్ణత్వమున కుదాహరణము.-

శ్లో. యుధిష్ఠిర క్రోధవహ్నేః కురువంశైక దాహినః,
పాంచాలీం దదృశుః సర్వే కృష్ణాం ధూమ శిఖామివ.

ఆమధ్యదేశమునకు మధ్యదేశమునందు శ్యామత్వము కలదు. కవిజనుల్లలోనను పరీక్షించినచో, శ్యామ కృష్ణవర్ణములకుఁగాని, పాండు గౌరవర్ణములకుఁ గాని ఏమంతఁగాఁ జాలభేదముండదని కవిసమయములను నిర్దేశించు ప్రకరణ సందర్భమునందు చెప్పియున్నారము. దానిని కవివరులు జ్ఞప్తినుంచికొని, పిమ్మట యథోచితముగా మెలఁగఁదగును. ఇఁకను మధ్యదేశీయ మగు గౌరత్వము నకు ఉదాహరణము నిచ్చెదము.

శ్లో. తవ నవనీత పిండగౌరే ప్రతిఫల దుత్తరకోసలేంద్రపుత్ర్యాః,
అవగత మలికే మృగాంకబింబం మృగమదపత్రనిభేన లాంఛనేన.

[వెన్నముద్దవలె గౌరవర్ణముగల నీయళికము నందు ఉత్తర కోసలాధీశుని ముఖచంద్రబింబము ప్రతిఫలించి నదిగా మృగమద పత్రనిభ మగు లాంఛనముచేతఁ దెలిసి కొనఁబడినది.]

విశేషముగా పూర్వదేశమునందలి రాజపుత్రికల వర్ణనము చేయునపుడు, గౌరము అనిగాని పాండువు అని గాని నిర్దేశించుటయును కలదు అని ఎఱుంగవలయును.

ప్రథమమున కుదాహరణము—

శ్లో, కపోలే జానక్యాః కరికలభదంత ద్యుతిముషి
స్మరస్మేర స్ఫారోడ్డమరపులకే వక్త్రకమలం,
ముహుః పశ్యన్ శృణ్వన్ రజనిచరసేనాకలకలం
జటాజూటగ్రంథిం ద్రఢయతి రఘూణాం పరివృఢః.

ద్వితీయమున కుదాహరణము:—

శ్లో. తాసాం మాధవ పత్నీనాం సర్వాసాం చంద్రవర్చసామ్,
శబ్దవిద్యేవ విద్యానాం మధ్యే జజ్వాల రుక్మిణీ.

ఇట్లు తక్కినవిషయమును గూడ యథాసంభవముగ నూహించునది. పండితులు పైఁ జెప్పిన శాస్త్రమర్యాదకును దేశములకును విరుద్ధముగ నొక్కొక్కప్పుడు చెప్పుట గలదు. అట్టివానిని పరిహరించుకొని దోషవిషయములలో వానిని ఉదాహరణములుగాఁ గైకొనఁదగు. ఇట్లు ఈ ప్రకరణమునందు దేశవిభాగము దిక్ప్రదర్శన న్యాయమున సూచింపఁబడినది. ఇంతకంటెను మించిన వివరములను తెలిసికొనఁ దలఁచువారు నేను వ్రాసినట్టి [అనఁగా రాజశేఖరకవిరాజు వ్రాసిన భువనకోశమును చూచెదరు గాక.

ఇది రాజశేఖర కవిరాజకృత మగు కావ్యమీమాంసయనెడి
కవిరహస్యమునందు ప్రథమాధికరణమునందు
దేశవిభాగ మనునది సప్తదశాధ్యాయము.

---

# రాజశేఖరకవి కావ్యమీమాంస.

---

## అష్టాదశాధ్యాయము.

---

### కాలవిభాగ నిరూపణము.

[ఈ యధ్యాయమునందు వచ్చెడి విషయములు.—౧ సౌర చాంద్రమానములు. ౨. ఋతువులందలి వాయుదిగ్విచారణ. ౩. వర్షర్తుధర్మవర్ణనము. ౪. గ్రీష్మర్తుధర్మవర్ణనము. ౫. సంధి శైశవాదు లగు ఋత్వవస్థల నాల్గింటిని రూపించుట. ౬. వాని యుదాహరణములు. ౭. పుష్పమాలఁగల పదునారు విధము లగు నుపయోగములు. ౮. అంతర్వ్యాజాదు లగు ఫలభేదములు మొదలగునవి.]

---

పదియు నైదు నిమేషము లయినచో నొక కాష్ఠ యనియు, ముప్పదికాష్ఠలయినచో నొక కళ యని, అట్టి కళలు ముప్పదియైన నొక ముహూర్తమని, అట్టిముహూర్తములు ముప్పదియైన నహర్దివంబు లగుననియును నందురు.

పైనిచెప్పినట్టి ప్రమాణముగల రాత్రింబవళులు చైత్ర మాసాశ్వయుజమాసములం దుండును. చైత్రమునకుఁ బిమ్మట ఒక్కొక్కనెలయందును ముహూర్తప్రమాణ మగు దివసవృద్ధియును, అంతియే ప్రమాణముగల రాత్రి తఱుఁగుదలయును, మూఁడునెలలదనుక నుండును. ఆతరువాత ముహూర్తప్రమాణముగల రాత్రిపెఱుఁగుదలయును

వస్థ్రే దినముయొక్క తఱుగుదలయును నుండును. ఇట్టులనే ఆశ్వయుజమాసమునకుఁ బిమ్మట ఈపైనిచెప్పిన విధమే విపరీతముగా, అనఁగా వ్యత్యస్తముగా నుండును. ఒకరాశినుండి వేఱొకరాశికి సంక్రమించుకాలము (సూర్యుఁడని భావము.) ఒకమాసమనఁబడును. వర్షాదిగా దక్షిణాయనమును, శిశిరాదిగానుత్తరాయణము నుండును. ఇట్టిఅయనములు రెండును గలది ఒక సంవత్సరమగును. ఇది సౌరమాన మనంబడును.

పదునే నహోరాత్రములు గలది ఒకపక్షము. వర్ధమానుఁడగు చంద్రుఁడు గలది శుక్లపక్ష మనియు, వర్ధమాన మగు చీకటి గలది కృష్ణపక్ష మనియు ననఁబడును. ఇది పితృసంబద్ధ మగు మాసముఁ గూర్చినట్టి మానము. దీని ననుసరించియే వేదచోదితములగు సమస్తక్రియాకల్పమును జరుగుచు నుండును. పైనిఁజెప్పిన పిత్ర్యమైన మానమే వ్యత్యయితపక్షమైనచో, చాంద్రమాన మగుచున్నది. ఈమానమునే ఆర్యావర్తవాసు లగు కవిజనములు ఆశ్రయించినారు.

ఏతావతా, రెండుపక్షము లయిన నొక్కమాసమని చెప్పినట్టులైనది. రెండునెల లయిన నొక్క ఋతువగును. ఆరుఋతువులయొక్క పరివర్తనమే సంవత్సరము అగును. ఆసంవత్సరము చైత్రాదిగ నుండు నని జ్యోతిషికులును, శ్రావణాదిగా నుండఁదగును, అని లోకయాత్రావేత్తలు నందురు. అందు శ్రావణభాద్రపదమాసములు వర్షర్తువు అని, ఆశ్వయుజకార్తికమాసములు శర

ద్ఋతువని, మార్గశీర్ష పుష్యమాసములు హేమంతర్తువని, మాఘఫాల్గుణమాసములు శిశిరర్తువనియు, చైత్రవైశాఖమాసములు వసంతర్తువనియు, జ్యేష్ఠాషాఢమాసములు గ్రీష్మర్తువనియు నందురు.

ఈ ఋతువుల యాదింటిలోను వర్షర్తువునందు పూర్వవాయువు [తూర్పుగాలి] వీచు నని కవు లందురు. అట్లు గాక పశ్చిమవు వాయువే వీచు ననియు, తూర్పది ప్రతిహంత యని ఆచార్యులు పల్కిరి. ఎట్లనఁగా—

శ్లో. పురోవాతా వాతా ప్రావృషి ట్పశ్చాద్వాతా వాతా శరత్.
ప్రావృష్యంభోభృతాం భోదభరనిర్భర మంబరం,
కాదంబకుసుమామోదా వాయవో వాంతి వారుణాః.

వస్తువృత్తి అతంత్ర మనియుఁ గాన నీవిషయము నఁ గవుల సమయమునే ప్రమాణముగాఁ గైకొనందగు ననియును యాయావరీయుఁ డనెను. ఎట్లనఁగా.—

శ్లో. పాక స్తస్య స్తోయదర్తోః పవనఇవ పత స్పావకస్యేవ ధూమో,
విశ్వ స్యేవాదిసర్గో ప్రణవ ఇవ పరం పావనం వేదరాశేః,
సంధ్యానృత్తోత్స వేచ్ఛోరివ మదనరిపో ర్నందినాందీనినాదః.
సారస్వత్యగ్రే సుఖంవో వితరతు వినతానందన స్స్యందనస్య.

[వర్షర్తువునకు తూర్పుదిక్కుదగు గాలివలెను, పావకునకు ననఁగా నగ్నికి ముందుగా పొగవలెను, సమస్త ప్రపంచరాశికెల్లను తొలుదొల్తటి సృష్టివోలెను, వేదరాశి కంతటికిని మిక్కిలియును పావన మగు నోంకారమువలెను, సంధ్యాకాలమునందు తాండవనృత్యము నుస్సఁగోరిన యీశ్వరునకు నందీశ్వరుని నాందీ

ధ్వనివోలెను, సూర్యుని రథమున కగ్రభాగమున నిలచి యున్న వినతాదేవి కుమారుఁడగు నరుణుఁడు మీకు (మాకును) సుఖము నొసంగుగాక—యని భావము.]

ఈపైని చెప్పినదానిలో పౌరస్త్యవాయువు (వర్షర్తువునకు) విరుద్ధముగా గాక యనుకూలమై యున్నట్టులు వర్ణింపఁబడినది. కావునఁ బురోవాతముచే (అనఁగా దూర్పుగాలిచే) వర్షర్తువు బాధింపఁబడు ననుట గాని, పాశ్చాత్త్యవాయువు చేత ననుకూలింపఁబడుట కాని ఇది మిత్థమ్మని నిర్ణయింప వీలు లేదు. వస్తుస్థితి అతంత్ర మై యుండును కాఁబట్టి, కవుల సమయమునే ఇటఁ బ్రమాణముగాఁ గొనఁదగునని చెప్పెడి యాయావరీయుని మత ముపపన్న మని భావము.

ఇఁకను శరత్కాలమునందు గాలి ఈదిక్కుది ఆదిక్కుది యని నియమము నేర్పఱచుటకు వీలు లేని దిగా, అనఁగా అనియతదిక్కముగా, నుండును. అందుల కీ క్రిందిశ్లోకము నుదాహరణముగాఁ గొనందగును.

శ్లో. ఊవన్సు వవు రాశ్లిష్ట జడావశ్యాయ శీకరాః,
శేఫాలీకళికా కోశకషాయామోదినోఽనిలాః.

[అనఁగాఁ బ్రాతఃకాలములయందు ముద్దగట్టిన (ఘనీభవించిన లేక జడమైన) మంచుతుంపురుల నాకర్షించినవై సేఫాలికాకుసుమముల మొగ్గల కోశములందలి వగరువాసనలఁ బరిమళించుచు నున్నయావి యై గాడ్పులు వీచినవి—యని యర్థము. ఇందు అని యతదిక్కత వాయువునకు స్పష్ట మగుచున్నదే కదా!]

మఱియును హేమంత ఋతువునందుఁ బాశ్చాత్త్యమగు వాయువు నుండు నని కొందఱును నుదీచ్యమగు వాయువు ఉండునని తక్కినవారు ననిరి. రెండును నుండు నని యాయావరీయుఁ డనియెను. అందు తొలుదొల్తటిది యగు పాశ్చాత్త్యవాయువు (పడమటిదిక్కునఁ బుట్టినఁ గాలి) యున్నదనుటకు ఈక్రిందిశ్లోకమును చిత్తగింపుఁడు.

శ్లో. భంజన్ భూర్జద్రుమాళీ స్తుహినగిరితటే
ఘూర్ణతా స్త్వక్కరాళాః,
రేవాంభస్స్థూలవీచీ చయచకితచలత్
చాతకాన్ వ్యాధునానః,
పాశ్చాత్త్యో వాతి వేగా ద్దళితతుహినశిలా
శీకరాసారవర్షీ
మాతంగక్షుణ్ణసాంద్ర స్రుతసరళతరత్
పారసాకీ సమీరః.

అనఁగా హిమవత్పర్వతమునందలి (దరులలోఁ గల త్వక్కరాళములగు భుజపత్రవృక్షముల చాలులను విఱిచి వేయుచున్నదై, రేవా (నర్మదా) నదియందలి పెద్దపెద్ద అలలగుంపులచే చకితములై చలించుచున్న చాతకములను వణఁకించుచు నున్నదియై, అతిశీఘ్రముగా వడగండ్లతోడి ధారావర్షమును వర్షించుచు నున్నదియై, మాతంగక్షుణ్ణ సాంద్రస్రుత సరళతరత్పారసారియై పాశ్చాత్త్యమగు వాయువు అతివేగముగా వీచుచు నున్న దని తాత్పర్యము.

ఇందు హేమంతర్తువునందు పాశ్చాత్త్యవాయువు (పడమటిగాలి) వీచుచున్నట్లులు వర్ణింపఁబడినది. ఇఁకను రెండవది యగు ఉదీచ్యవాయువు, అనఁగా నుత్తరపు దిక్కు గాలి, హేమంతర్తువునందు ఉన్నట్లులు వర్ణించుట కీక్రింది శ్లోకము నుదాహరణముగాఁ గొనఁదగును.

శ్లో. లంపాకీనాం కిరంతః చికురవిరచనాం
ఝల్లకాన్ లాసయంతః,
చుంబంత శ్చంద్రభాగాసలిల మవికలం
భూర్జకాండైక చండః,
ఏ తే కస్తూరికాణాం ప్రణయసురభయో
వల్లభా బాహ్లీకీనాం,
కౌలూతీకేళికారాః పరిచయిత హిమం
వాయవో వాంత్యుదీచ్యాః.

[ఈయుత్తరపుదిక్కు గాడ్పులు లంపాకదేశపుస్త్రీల కుచికురవిరచనమును వెదఁజల్లుచు, ఝల్లకములను నర్తింపఁ జేయుచు, భూర్జకాండైకచండములై అవికలమగు చంద్రభాగానదీసలిలమును ముద్దుఁగొనుచు, కస్తూరి(కస్తూరి జింకలు) మృగముల ప్రణయముచేఁ (ప్రేమచే) బరిమళించుచు, బాహ్లీవదేశాంగనల కత్యంతమును ప్రియములైనవై, కౌలూతదేశాంగనలయొక్క క్రీడలకుఁ బ్రధానకారణములైన ఉదీచ్యములగు వాయువులు, పరిచయతహిమముగా వీచుచు నున్న వని భావము.

ఇట్లులనే శిశిరర్తువునందుఁగూడ హేమంతర్తువునందు వలెనే ఉదీచ్యమగు వాయువు గాని, పాశ్చాత్త్య మగు

వాయువు గాని యుండునట్లు వర్ణింపఁగా వలయును. ఇఁక మిగిలినది వసంతర్తువు. ఈవసంతఋతువునందు దక్షిణ వాయు వున్నట్లు చెప్పఁబడవలయును. ఎట్లనఁగా:—

శ్లో. ధున్వన్ లంకావనాళీః ముహురలకలతా
లాసయన్ కేరళీనాం,
ఆంధ్రీధమ్మిల్లబంధాన్ సపది శిథిలయన్
వేల్లయ న్నాగవల్లీః,
ఉద్దామం దాక్షిణాత్యో మలితమలయజః
సారథి ర్మీనకేతోః,
ప్రాప్త స్సీమంతినీనాం మధుసమయసుహృ
న్మానచౌర స్సమీరః.

[లంకావనపంక్తుల నఱ్ఱూత లూగించుచు, కేరళ దేశపు స్త్రీలయొక్క లతలఁబోని యలకములను నర్తింపఁ జేయుచు, ఆంధ్రదేశపు స్త్రీలయొక్క ధమ్మిల్లబంధములను (కొప్పులను) విడివడఁ జేయుచు, నాగవల్లీ(తాంబూలపు) తీగలను వేల్లితములఁ జేయుచు, మిక్కిలియు నారభటి తో, మలితమలయజమును, మీనకేతుని సారథియును వసంతునికి నెచ్చెలియును, ప్రణయకుపితలగు నంగనల మానమును దొంగలించువాఁడు నగు వాయువు (అనఁగా మలయమారుత మనెడి దక్షిణవాయువు) ఇదిగో ప్రాపించినది అని తాత్పర్యము.]

ఇందు వసంతఋతువునందు దక్షిణవాయువు ఉన్నట్టులు వర్ణితము అని యెఱుంగవలయును.

గ్రీష్మర్తువునందు వాయువు, అనియతదిక్కమై, అనఁగా నీదిక్కునఁబుట్టినగాలియే యుండు నను నియమము లేనిదై, యుండుననని కొందఱును, నైఋతమగు (నిర్ఋతిదిక్కునుండివీచు) గాలి యుండు నని కొందఱు నందురు. రెండు నుండుట కల దని, యాయావరీయుఁడని యెను. అందు తొలిదానికి-అనఁగా గ్రీష్మమున వాయువు అనియతదిక్కమై యుండు ననుదానికి- ఈక్రిందిది ఉదాహరణము ఎట్లనఁగా.—

శ్లో. వాత్యాచక్రకచుంబితాంబరభువః
స్థూలా రజోదండకాః,
సంగ్రథ్నంతి భవిష్యదభ్రపటల
స్థూణావితర్కం నభః,
కిం చాస్య న్మృగతృష్ణికాంబు విసరైః
పాత్రాణి వీతార్ణసాం,
సింధూనా మిహ స్మారయంతి జవనీ
ర్భావిప్రావృషీం సంపదమ్.

[స్థూలములగు రజోదండకములు వాత్యాచక్రకచుంబితాంబర ప్రదేశములు గలవై, ఆకసమును ముమ్ముందు రాఁబోవు నభ్రపటలములయొక్క స్థూణమగునా? యేమి యనెడి వితర్కము గల దానినిఁగా, కూర్చుచు నున్నయవి. మఱియును, మృగతృష్ణికాంబువిసరములతో వట్టిపోయిన నీళ్లుగల నదులకు మున్ముందు, రాఁబోవు వార్షికసంపదకు పాత్రములను కూర్చుచున్నట్టు లున్నవియనియు భావము.]

ఇందు వాత్యాచక్రకచుంబితాంబరభువః - అనిన మాటచేత [ఇది వర్షాకాలమునకు వెనుకనున్న గ్రీష్మవర్ణనము కాఁబట్టి] అనేకములగు గాడ్పులు గుంపులై సుడిగాని, ఆకసమునంటుకొనుచున్నవి యని వర్ణించుటను బట్టి ఇందు [గ్రీష్మమునందు] వాయువు అని యతదిక్కువై యున్నట్టులుగా వర్ణిత మని తెలిసికొనవలయును.

ఇఁక రెండవదానికి ఈక్రిందిది యుదాహరణము.—

శ్లో. సోఽయం కరైస్తపతి వహ్నిమయైరివార్కః
సాంగారవిస్తరభరేవ ధరా సమగ్రా,
వాయుః కుకూల మివ వర్షతి నైరృతశ్చ
కార్శానవైరివ శరైర్మదనశ్చ హంతి!

[అయినసూర్యుఁడు! ఈకాలమునందు, అనఁగా గ్రీష్మకాలమునందు] వహ్నిమయము లగుకిరణములతో తపించుచున్నాఁడు. సమస్తభూమండలమును నిప్పులయేళ్లతో నిండించినట్టు లున్నయది. నైరృతవాయువు దుమ్ములను నిప్పులనుగలిపి వర్షించుచు నున్నట్టు లున్నది. మన్మథుఁడు అగ్నిమయము లగు బాణములతో చురుక్కున గ్రాడ సేయుచున్నట్టు లున్నవాఁడు - అని ఈశ్లోకమునకు భావము.]

ఈశ్లోకమునందు గ్రీష్మర్తువువర్ణమునుఁ జేయుచునందు, నైరృతవాయువు వీచుచున్నట్టులు వర్ణింపఁబడుటఁచేత, నిది పై దాని కుదాహరణము.

ఇట్టు లీవిధముగా వదృతువులందుఁ గల వాయుస్థితినిఁ గూర్చి వివరించుట యైనది. ఇఁక నర్యావ్యరుబుతువు

లందు వర్ణించవలసినవర్ణనసందర్భముల నిటుపైని యుదాహరించెదము. వాయువును వర్ణించునప్పుడే గ్రీష్మవర్ణనరీతియును, వసంతవర్ణనరీతియును, నొకరీతిగాచెప్పినట్లైనది. కావుననిక వర్షర్తువువర్ణనము చేయఁదగిన పద్ధతిని ఇచ్చట సూచించెదము

## 1. వర్షర్తు వర్ణనము.

శ్లో. గర్భా న్బలాకాసు నివేశయంతో
వంశాంకురా న్స్వైర్ధ్వనితై స్సృజంతః,
రజోంబుదాః ప్రావృషి ముద్రయంతో
యాత్రోద్యమం భూమిభృతాం హరంతి,

శ్లో. స సల్లకీపాలశిలీంధ్రయాతే
ప్రసూనదః పుష్పితలాంగలీకః,
దగ్ధోర్వరా సుందరగంధబంధుః
అర్ఘ్యత్వయం వారిముచా మనేహా.

శ్లో. వనాని నీపీదళ మేచకాని
ధారాంబుధౌతా గిరయ స్స్ఫురంతి,
పురాంభసా భిన్నతటా స్తటిన్యః
సాంద్రేంద్రగోపానిచ శాద్వలాని.
చకోరహర్షి ర్యతిచారచోరో
వియోగినీవీక్షితనాథవర్త్మా,
గృహా న్వ్రజతి ప్రస్థితపాంథసార్థః
కాలోఽయ మాధ్మాతనభాః పయోదైః.

వర్షాకాలమందలి యీనల్లని మేఘములు, బలాక పిట్టలందు గర్భముల నుంచుచు, తమ సినాదములచే

వెదుళ్లను మొలక నెత్తించుచు. రాజులజైత్రయాత్రల నుపసంహారింపఁజేయుచు సర్వోత్కర్షతో నొప్పుచున్నవి. వర్షాకాలమునల్లకీ సాల శిలీంధ్రయూ ధిలతలనుపుష్పింపఁ జేయుచు, లాంగలులను మొగ్గఁ దొడిగించుచు, కాలినవే లలనుండి వెలువడిన అందమైనవాసనల నొప్పారుచు,నున్న ది. అరణ్యము లన్నియును నీ పీదళ మేచకములును, పర్వ తములు, ధారోదకశ్యాతములును,నదులు ప్రవాహోదక ముచే నిర్ఝరములును, ఇంద్రగోపసంభరితములగు పచ్చిక బయళ్లును, గలదియై యిది యొప్పుచున్నది. ఈఋతువు చకోరములకు సంతోషమును గొల్పుచున్నది. యతిచా రమునకు చోరుఁడగుచున్నది. వియోగినీవీక్షితనాథవ ర్త్మ యగుచున్నది. ప్రవాసులనిండ్లకు ప్రయాణము చే యున దగుచున్నది. మేఘములచే నాకసమును మాఱు [మోయించుచు నున్నది.—అని తాత్పర్యము.]

శ్లో. యా కేళియాత్రా కరికామినీభిః
యా తుంగహార్మ్యాగ్రవిలాసశయ్యా,
చతుస్సమం యన్మృగనాభిగర్భం
సా వారిదర్తోః ప్రథమాతిథేయీ.

ఆఁడుఏనుఁగులతోఁ గలసి (మగఏనుఁగులు) నిర్వ ర్తించుక్రీడాయాత్రయును, తుంగహార్మ్యాగ్రవిలాసశయ్య యును, చతుస్సమ మగు మృగనాభిగర్భమును నీవర్షర్తు వునకుఁ దొలుదొల్తటి దగు నాతిథేయి యగుచున్న దని తాత్పర్యము నెఱుంగునది.

శ్లో. చలచ్చటులచాతకః కృతకురంగరాగోదయః
సదర్దురరవోద్యమో మదభరప్రగల్భోరగః,
శిఖండికులతాండవో ముదితమద్గుకంకాహ్వయో
వియోగిషు ఘనాగమః స్మరవిషం విషం ముంచతి.

శ్లో. దళత్కుటజకుట్మలః స్ఫుటితనీపపుష్పోత్కరో
ధవప్రసవబాంధవః ప్రచితమంజరీకార్జునః,
కదంబకలుషాంబరః కలితకేతకీకోరకః
చలన్నిచుళసంచయో హరతి హంత ఘర్మాత్యయః.

చలించుచున్న చటులములగు చాతకములు గలదియై, కురంగరాగోదయము నొనర్చినదై, దర్దురముల (గోదురుకప్పలు) ధ్వనుల యుద్యమముతో నొప్పుచున్నదియై, మదభరములైన ప్రగల్భములగు ఫణిరాజులు గలదియై, నెమళ్ళనృత్యక్రియలు గలదియై, మద్గుకంకాహ్వయముల సంతసపెట్టుచున్నదై, యీవర్షాకాలము విరహిజనులయందు మన్మథవిషము అనఁదగిన విషమును (విషము, నీరును) వర్షించుచు నున్నది. కుటజపు మొగ్గలనువిరియించుచు, కడిమిమొగ్గలను విప్పారఁజేయుచు, కదిరిపూవులకుఁజుట్టమై, అర్జునవృక్షములనుపూగుత్తులతో నిండించి, మేఘకలుషముగా నాకసము నొనర్చి, కేతకికి మొగ్గలు దొడిగించి, నిచుళముల నల్లార్చుచు, నీవర్షాకాలము మనస్సుల నాకర్షించుచు నున్నదని భావము. ఇది వర్షర్తువర్ణనము చేయందగిన రీతి. ఇటుపైని శరద్వర్ణనము చేయు తెఱఁగును చెప్పెదము.

# 2. శరదృతువర్ణనము.

శ్లో. ప్రా గ్గర్జయంతీ విమదా న్మయూరా
న్ప్రాగల్భయంతీ కురరీర్ద్విరేఫాన్,
శర త్ప్రమత్యేతి వికాశపద్మా
న్నున్మీలయంతీ కమలోత్పలాని.
సా భాతి పుష్ణాతి నివేశయంతీ
బంధూకబాణాసనకుంకుమేషు,
శేఫాలికాసప్తపలాశకాశ
భాండీరనాగంధికమాలతీషు.
సఖంజరీటా సపయః ప్రసాదా
సా కస్య నో మానస మాచ్ఛినత్తి?
కాదంబకారండవచక్రవాక
ససారసక్రౌంచకులానుయాతా.
ఉపానయంతీ కలహంసయూథం,
అగ స్త్యదృష్ట్యా పునతీ పయాంసి,
ముక్తాసు శుభ్రం దధతీ చ గర్భం
శర ద్విచిత్రై శ్చరితై శ్చకాస్తి.
క్షితిం ఖనంతో వృషభాః ఖురాగ్రైః
ఉక్షో విషాణై ర్ద్విరదా రటన్తః,
శృంగం త్యజంతో హరిణ శ్చ జీర్ణం
కుర్వంతి లోకా నవలోకనోత్కాన్.

(అనఁగా విమదము లగు నెమళులను అతిత్వరితముగా గర్జిల్లఁజేయుచు, కురరీద్విరేఫములను ప్రౌఢతనము కలవానిఁగా నొనర్చుచు కమలములను వికసింప జే

యుచు, కలువలును ఉన్మీలనమొనర్చుచు, శరత్కాలము చనుదెంచుచు నున్నది. బంధూకబాణాసనకుంకుమ శేఫాలికాసప్తపలాశకాశభాండీర సౌగంధికమాలతులకు పుష్పవికసనము నిచ్చుచు, ఆవర్షఋతువు బిగ్గుచున్నయది. కలహంసల గుంపును తనవెంటఁ గొనితెచ్చుచు, అగస్త్యోదయముచే నీటిని నిర్మలనములనుగాఁ జేయుచు, ముత్తెంపుఁ జిప్పలందు గర్భములఁ గూర్చుచు, చిత్రవిచిత్రములగు చరిత్రములతో నీశరదృతువు రాజిల్లుచు నున్నది. ఎద్దులు మదించినవై ఈశరత్కాలమున ఖురాగ్రములతో, వనఁగా గిట్టలతో, భూమిని కోరాడుచున్నవి. ఏనుఁగులు దరులను కొమ్ములతో కోరాడుచు వఱచుచున్నవి. రురుమృగములు ప్రాఁతగిలిన కొమ్ములను దుల్లించుచున్నవి. [అనఁగా ప్రాఁతకొమ్ములను రాల్చి క్రొత్తవాని నొందుచున్నవని భావము.] మఱియు నీవర్షాకాలశోభలు సర్వలోకముల నవలోకనోత్కంఠగలవానినిఁగాఁ జేయుచు నున్నవి యని తాత్పర్యము.]

శ్లో. అభ్రావదాతద్యుతి చంద్రికాంబు
నీలావభాసం చ నభస్సమంతాత్,
సుశేభపీఠీ దివసావతారో
జీర్ణాభ్రఖండాని చ పాండురాణి.

శ్లో. మహానవమ్యాం నిఖిలాస్త్రపూజా
నీరాజనా వాజిభటద్విపానాం.
దీపాళికాయాం వివిధా విలాసాః
యాంతోన్ముఖై రత్ర నృపై ర్విధేయాః.

శ్లో. వ్యోమ్ని తారతర తారకోత్కరః
స్యందన ప్రసరణక్షమా మహీ,
భాస్కర స్ఫురదతిక్షిప్రదీధితిః
బుధ్యతే చ సహ మాధవై స్సురైః.

ఈ శరదృతువునందు చంద్రికాంబు వనదాత ద్యుతి యై యొప్పుచు నున్నది. ఆకసము అంతటను నీలావభాసమై యొప్పుచున్నయది. సురేభ వీథియును దివసావతారకము నై యున్నది. పాండురములై జీర్ణాభ్రఖండము లొప్పుచు నున్నయవి. ఈ శరదృతువునందే (ఆశ్వయుజ శుద్ధమున) మహానవమినాఁడు సమస్తశస్త్రాస్త్రములను పూజించుట జరుగును. రాజులు తమ గుఱ్ఱములు పదాతులు మున్నగుసేనకు నీరాజనోత్సవము జరుపుచు నుందురు. దీపావళీ యుత్సవమునందు వివిధములగు విలాసములును. ఒప్పుచు నుండును. రాజులు ఈ శరదృతువునందే యాత్రోన్ముఖులైనట్లులు వర్ణింపఁ దగి యుండును. ఆకసమునందు తారతర తారకోత్కరము ఈ ఋతువుననే కన్పట్టును. సమస్తభూమియును (బురదఆరి నిర్మలమై యుండుటంజేసి) రథసంచరణ యోగ్యమై యొప్పుచు నుండును. మఱియు నీ శరదృతువునందే సూర్యుఁడు ప్రకాశమానములగు కిరణములు గలవాఁడై విలసిల్లుచు నుండును. ఇందే క్షీరాబ్ధిశాయియైన శ్రీమహావిష్ణువు సమస్తసురలతోఁడఁ గలసి యుత్థానము నొందుచున్నాఁడు—అని భావము.

శ్లో. కేదారఏవ కలమాః పరిణామనమ్రాః,
ప్రాచీన మామలక మర్ఘతి పాకనీలం,
ఏర్వారుకం స్ఫుటన నిర్గత గర్భగంధం,
అమ్లీభవంతి చ జరత్త్రపుసీఫలాని.

[అనఁగా. కేదారములలోని కలమసస్యములు పాకమునకు వచ్చి నమ్రముగ నున్నవి. ప్రాచీనామలకమును పాకనీలతను కోరుచున్నది. ఏర్వారుకము వికసించుటం జేసి బయలువెడలిన మాపివాసన కల దగుచున్నది. ముదిసిన త్రపుసీఫలములు పుల్లవడినవి. అని భావము. అనఁగా శరత్కాలమునందు వరిపైరులు [కేదారములు] వెన్నుదీసి గింజబట్టి వెన్నుముదురుటచే, కోతకు సిద్ధమై వంగియుండుననియు, నుసిరికలు పండి కొంచెము నలుపు రంగునకు దిఱిగి యుండు ననియును. కూతురుబుడమ చెట్లు, పూచి వాసనల వెదఁజల్లుచుండుననియును, మలు దోసపండ్లు ముదిరి పుల్లఁబాఱు ననియు భావము.]

శ్లో. గేహాజిరేషు నవశాలికణావపాత,
గంధానుభావ సుభగేషు కృషీవలానాం,
ఆనందయంతి ముసలోల్లసనావధూత,
పాణిస్థల ద్వలయపద్ధతయో వధూట్యః.

[అనఁగా నిండ్ల ముంగిళ్లు (కృషీవలుల ఇండ్ల ముంగిళులు) నవశాలికణముల యవపాతముచేత నైనగంధముచే మనోహరములై యొప్పుచున్నవి. స్త్రీలు ముసలోల్లసనముచే (రోఁకటిని పట్టుకొని దంచుటచేత)

కదలుచున్న చేతులు గలవా రై యున్నారు. అనఁగా ధాన్యాదులను దంచుచున్నా రని భావము.

శ్లో. తీక్ష్ణం రవి స్తపతి నీచ ఇవా చిరాఢ్యః,
శృంగం రురు స్త్యజతి మిత్ర మివాకృతజ్ఞః,
తోయం ప్రసీదతి మునే రివ ధర్మచింతా,
కామీ దరిద్ర ఇవ శోష ముపైతి పంకం

[అనఁగా నచిరాఢ్యుఁడైన నీచునివలె, రవి తాప పెట్టుచున్నాఁడు కృతజ్ఞత లేనిమిత్రునివలె దుప్పి కొమ్ములను విడుచుచున్నది. మునియొక్క ధర్మచింతవలెనే ఉదకమును నిర్మలమైన దగుచున్నయది. దరిద్రు డగు కాముకుని బోలి, బురదయును ఎండిపోవుచున్నది. [అనఁగా సూర్యుని యెండవేడిమియును, దుప్పులకుఁ బ్రాఁతకొమ్ములు రాలి క్రొత్తవి మొలచుటయును, బురదలు ఆరి పోయి భూమి యెండుటయును, నీరు కలఁతదేరి నిర్మలములై యుండుటయును—అను నివి, శరదృతువుయొక్క చిహ్నాము లని యెఱుఁగఁదగు నని భావము.

శ్లో. నద్యో వహంతి కుటిలక్రమ యుక్తి శుక్తి,
రేఖాంకబాలపులినోదరసుప్తకూర్మాః,
అస్యాం తరంగితసు తోయపలాయమాన,
మీనానుసారి బకదత్త కరాళఫాలాః.

[అనఁగా నదులు, కుటిలక్రమయుక్తము లగు రేఖలచే నంకితము లైన యిసుక తిన్నెలలో నిద్రించుచున్న తాఁబేళ్లు కల వై, ఈ శరదృతువునందు తరంగితనుతో యపలాయమానమీనాను సారిబకదంత కరాళఫాలము

లు గల వై, ఒప్పుచున్నవి అని భావము. అనఁగా సన్నని వన్నెవన్నె గీరలుగల వెన్నెలుగల తాఁబేటిపిల్లలు నదులలోని ఇసుకతిన్నెలపైఁ బరుండి, నిశ్శంకముగా నిద్రించుచున్న వనియును, చిన్నచిన్న మీలు నీటిజాలు ననుసరించి పరుగెత్తుటను గాంచి, కొంగలు వానినిం బట్టుకొనుటకై, వానిననుసరించి నోళ్లను తెఱచికొని తిరుగుచున్నవనియును భావము. ఇవియును శరదృతులక్షణములే యగును.

శ్లో॥ ఆపంకితటాంతటాః శఫరతతిక్షాల ఘాంటోజ్జ్వలాః,
పతత్కురర కాతర భ్రమదవభ్రమీనార్భకాః,
లుఠత్కమఠ సైకతాః చలబకోట వాచాటితాః,
సరిత్సలిలసంచయాః, శరది మేదుర స్సీదతి.

అనఁగాఁ బంకిలముగాని తటములందలి వటవృక్షములతోను, శఫరముల ఘాంటఘాటములతోను, కురరకాతరములై, ఇటు నటు దుముకుచున్న చిన్నచిన్న మీలతోను, పొర్లాడుచున్న తాఁబేళ్లుగల ఇసుకతిన్నెలతోను, ఒప్పుచు, చలబకోట వాచాటితమై, ఈశరదృతువునందలి సలిల సంచయము, మేదురమై కృశించుచున్నది అని భావము.

విశేషాంశము:—ప్రాచీనులగు పెద్దలు శరదృతువునందు వర్ణ్యావర్ణ్యములగు—అనఁగా వర్ణింపఁదగినవియును, వర్ణింపరానివియును అగు విషయముల నిట్లు లేఖించిరి.

శ్లో. శరది సూర్యసుధాకర పాటవం,
విమలితాంభసి హంసవృషస్మయాః,
కమలశారద సైకత విస్తృతిః,
శిఖి పక్షమదాప గమాదయః.

# 3. హేమంతర్తు వర్ణనము.

శ్లో. ద్విత్రిమాచుకుందకలికః, త్రిచతురముకుళః క్రమేణ లవలీషు, పంచమ ఫలినీకుసుమో, జయతి హిమర్తు ర్నవావతారః.

అనఁగా, రెండు మూఁడు ముచికుందపు మొగ్గలు గలదై, లవలీలతలయందు క్రమముగా ముకుళింపఁ జేసినది యై, అయిదారు ఫలినీ కుసుమములు గల దై హిమర్తువు,నవావతారమున రాజిల్లుచున్న దని తాత్పర్యము.

శ్లో. పున్నాగలోధ్ర ప్రసవావతంసాః,
వామభ్రువః కంచుకకుంచితాంగ్యః,
వక్త్రోల్లసత్కుంకుమసిక్తకాంక్షాః,
సుగంధతైలాః కబరీ ర్వహంతి.

శ్లో. యథా యథా పుష్యతి శీతకాలః,
తుషార చూర్ణోత్కర కీర్ణవాతః,
తథాతథా యౌవన శాలినీనాం,
కవోష్ణతా మత్ర కుచా లభంతే.

అనఁగా, పున్నాగలోధ్ర పుష్పము లవతంసములుగ నుంచికొని, స్త్రీలు కంచుకకుంచితాంగు లై, వక్త్రము లం దుల్లసిలుచున్న చాదుతోను, అంచితము లైన వాసనసూనెలను రాచినకొప్పులను వహించుచున్నారు. శీత

కాలము తుషారకీర్ణోత్కర చూర్ణవాతమై, బలపడుకొలఁది యువతుల కుచములు చిఱువెచ్చనను నొందసాగిన వని భావము.

శ్లో. వరాహవధ్రాణి నవోదనాని,
దధీని సన్నద్ధశరాణి చాఽత్ర,
సుకోమలాః సర్షపకాండశాకాః,
భుక్త్వా జనో నిందతి వైద్యవిద్యామ్.

శ్లో. అత్రోపచారైః సలిలైః కవోష్ణై,
ర్యస్మిన్ దత్తే స్వదతేఽన్నపానం,
సుదుర్భగా యత్ర నిపీడ్య శేతే,
స్వ స్త్యస్తు తస్మై తుహినర్తవేఽస్మై.

వరాహవధ్రము లగు నవోదనములను సన్నద్ధశరావము లగు దధులను (పెరుఁగును), సుకోమలములగు సర్షపమూలములను సేవించి, ఈ హిమవత్కాలము నందు జనులు వైద్యవిద్యను నిందించు చున్నారు. అనఁగా నివి యున్నచో హేమంతర్తువునం దెట్టిబాధయు నుండ దని తాత్పర్యముగా తెలియంగఁదగును. ఈ హేమంతఋతువునందే, గోరువెచ్చని నీళ్లతోడివగు నుపచారములచేత నన్నపానము, లంతో ఇంతో రుచించు చుండును. సుదుర్భగయగు వనితను గట్టిగాఁ గౌఁగిలించుకొని, అనఁగా భార్యను ప్రక్క నుంచికొని, నిద్రించు చుందురు ఇట్టి తుహినర్తువునకు స్వస్తి యగునుగాక యని భావము. అనఁగా గోరువెచ్చని నీళ్లు,అట్టివే యగు

నాహారము, ప్రక్కను వెచ్చగా భార్య యున్నచో హిమ వర్తువునందు లాంటి సుఖము మఱి లేదు. గనుక, అట్టి ఋతువునకు, అనఁగా సౌఖ్యదాయి యగునా ఋతువునకు శుభమగుఁ గాక యని భావము.

శ్లో. విముక్తబర్హా విమదా మయూరాః,
ప్రరూఢగోధూమ యవా చ సీమా.
వ్యాఘ్రీప్రసూతి స్సలిలం సబాష్పం,
హేమంతలింగాని జయం త్యమూని.

శ్లో. సశమీధాన్యపాకాభిః క్షేత్రా ణ్యత్ర జయంతి చ,
త్రిశంకుతిలకా రాత్ర్యః పచ్యంతే లవణాని చ. ౧౫

మయూరములు విముక్తబర్హములును వీత మదములునై యున్నవి. ప్రరూఢగోధూమయవ లై సీమా (గ్రామకంఠము) ప్రదేశములు రాజిల్లుచున్నవి. వ్యాఘ్రి అనఁగా నాఁడుపులి, శిశువుతో నొప్పుచున్నది. కొందఱు వ్యాఘ్రి యనఁగా వాకుడుచెట్టు అనియు, వ్యాఘ్రీప్రసూతిః - అనఁగా వాకుళ్లు మొలచుచున్నవి. లేక కాయలు కాయుచున్నవి యని యందురు. నీరు ఆవిరితో, ననఁగా సబాష్పముగ నున్నది. ఈయవి జయదాయకము లగు హేమంతర్తువునందలి చిహ్నములు. మఱియును నీ హేమంతర్తువునఁదు శమీధాన్య పాకములచేత రాజిలుచున్న క్షేత్రములును (శమీధాన్యము లనఁగా కందులు, శమీధాన్యపాకములతో, అనఁగా కాపునకు వచ్చిన కంది పైరులతోఁ గూడిన పొలములని, శమీధాన్యపాక సహిత క్షేత్రము లనుమాట కర్థము.) త్రిశంకుతిలకములై రా

త్రులును లవణద్రవ్యములును పాకమునకు వచ్చిన సమస్తవిధములగు నుప్పులును, పరోత్కర్షముతో నొప్పుచున్నయవి.

శ్లో॥ ఉద్యానానాం మూకపుంస్కోకిలత్వం
భృంగస్త్రీణాం మౌనముద్రా ముఖేషు,
మందోద్యోగాః పత్త్రిణాం వోమయాత్రాః
హేమంతే స్యాత్సర్పదర్పక్షయశ్చ.

అనఁగా నీహేమంతఋతువునందే—ఉద్యానములలోని పుంస్కోకిలలకు మూకత్వమును, భృంగస్త్రీలకు మౌనముద్రయును, పక్షుల వ్యోమయాత్రకు మాంద్యమును, సర్పములకు దర్పక్షయమును, ఈ ఋతువునందు కలుగుచున్నవి అని తాత్పర్యము.

శ్లో॥ కర్కంధూనాం నాగరంగీఫలానాం
పాకోద్రేకః ఖాండవోఽప్యావిరస్తి,
కృష్ణేక్షూణాం పుండ్రకాణాం చ గర్భే
మాధుర్యశ్రీ రాయతే చాఽప్యపూర్వా.

శ్లో॥ యేషాం మధ్యేమందిరం తల్పసంప
త్త్యాశ్చర్య్య దారాః స్ఫారతారుణ్యతారాః,
లీలావహ్ని ర్నిహ్నుతోద్దామధూమః
తే హేమంతం గ్రీష్మశేషం విదంతి.

అనఁగా, కర్కంధూ ఫలములకును [రేఁగుపండ్లు] నారంగీఫలములకును [అనఁగా నారింజపండ్లు] ఈఋతువునందే పాకము వచ్చుచున్నది. వల్లచెఱుకు గడలకు

ను పుండ్రకములకును (పుండ్రక మనునది చెఱకులో నొక భేదముని కొందఱును, పూలగురువింద యని యింక కొందఱును, సాధారణమగు చెఱకు అని కొందఱును తెల్లచెఱకు అని మఱికొందఱు, పెక్కువిధముల చెప్పుదురు. తెల్ల చెఱకు అని నాభావము.) అపూర్వ మగు మాధుర్యము కలుగుచున్నది. ఎవరికి—ఇంటినడుమ పడకటింట, పఱుపుపైఁ బ్రక్కలో స్ఫారతారుణ్యతార లగు దారలును (రమణార్హలగు భార్యాజనము—అని యర్థము.) నిహ్నుతోద్ధామధూమము గల లీలావహ్నియును, అనఁగాఁ గృత్రిమముగాఁ జలిపోవుట కేర్పఱచుకొనిన కుంపట్లు నెగళ్లు మున్నగువాని యొక్క చలిమంటయును, కలవారలో, అట్టి యదృష్టవంతులు ఈ హేమంతమును గ్రీష్మఋతుశేషమునుగా వర్ణింతురు. అనఁగాఁ జలిబాధ నిసుమంతయేని నెఱుఁగనివారలై గ్రీష్మర్తువునందువలె సుఖముగా నానందముతోఁ గాలము వెడలఁగడపుదు రని తాత్పర్యము. ఇది హేమంతర్తువర్ణన [illegible]తి. ఇఁక నిటుపై శిశిరర్తువును వర్ణించు పద్ధతిఁ జెప్పెదము.

మహాకవి శ్రీకృషభట్టు తాను రచించిన మందారమరంద మనెడి గ్రంథమునందు హేమంతర్తువునందలి వర్ణ్యావర్ణ్యములగు—అనఁగా వర్ణింపఁ దగినవియును వర్ణింపరానివియు నగు—విషయముల నిట్లు పేర్కొనెను.

శ్లో. హేమంతే రజనీదైర్ఘ్యం నళినీకుసుమక్షతిః,
దివాల్పత్వం హిమప్రాప్తిః బకానందయవోద్భవాః.

# 4 శిశిరర్తు వర్ణనము.

శిశిరఋతువులో చాలవఱకును హేమంతఋతు ధర్మములే యుండును. కాని, దానికంటె దీనియందుఁ గల విశేషములు ఈక్రిందివి మాత్రమే: —

శ్లో. రాత్రిర్విచిత్రసురతోచితయామదైర్ఘ్యా
చండో మరుద్వహతి కుంకుమపంకసాధ్యః
తల్పస్థితిర్ద్విగుణతూలపటా, కిమన్యః?
దఘ్యంతి చాత్ర వితతాగురుధూపధూమాః.

శ్లో. ఆశ్లేషిణః పృథురతక్లమపీతశీత
మాయామినీం ఘనమదో రజనీం యువానః,
ఊరోర్వ్యత్మహు ర్వలనబంధన సంధిలోల
పాదాంతసంవలితతూలపటాః స్వపంతి.

విచిత్రసురతోత్సవయామదైర్ఘ్యాయై, అనఁగా నానా విధములగు సురతక్రీడలచే విలసిల్లెడి దీర్ఘదీర్ఘము లగు జాములు గలదియై రాత్రి ప్రకాశించు చుండును. కుంకుమపంకసాధ్యమై (అనఁగాఁ కుంకుమపూఁవుగలసిన చందనంపుపూఁత యున్ననే ఆగాలికి నెగ్గగల్గుదురని భావము.] చండవాయువు వీచు చుండును. ద్విగుణముగ, అనఁగా రెట్టింపుగా జోడించిన తూలపటము లను, (అనఁగా నడుమ దూదిపెట్టి కుట్టిన సన్నని బొంతలను, రెట్టింపుగా చుట్టఁ బెట్టుకొన్ననే శయనమున చలిఁ లేకుండఁ బరుండఁగల స్థితి, ఆ కాలమున లభించు నని భావము )గలట్టిదితల్పస్థితి. ఇఁక నిందు లేని దేమి? వితతము లైన అగరుధూపధూమ

ములు వ్యాపించు చుండును. కావున శిశిరర్తువునందలి పైఁ జెప్పినస్థితి సమస్తసౌఖ్యదాయక మని భావము. పృథురతిక్లమపీతశీతము కలుగునటులుగా, అనఁగా విరివియైన సురతమునందలి గ్లానిచే (గాఢరతి చేయుటచే కలిగిన ఆయాసము చేత) శీతబాధఁ ద్రావివేసినట్లు లని భావము, యువతులు తీరని సంతోషము కలవారై రాత్రియంతయును అంగనాజనాలింగనములను చేసికొనుచు ఒకళ్లొకళ్ల తొడలను మాటిమాటికి పెనచుకొనుటలు, బిగ్గఁజట్టుటలు—మున్నగువానియందు లోలురై, కాళ్ళ చివరవఱకును బిగియఁగప్పుకొనినవి యగు తూలపటములు (రజాయీలు) కలవారలై, ఈ శిశిరర్తువునందు దంపతులు నిద్రించుచు సుఖతరంగముల నుయ్యేలలూగుచు విలసిల్లుచుందురు అని తాత్పర్యము.

శ్లో. పాకోఽభసో న్నరసనీరసయో ర్న భాతి
స్పర్శక్రియాను తుహినానలయో ర్న చాత్ర.
నో, దర్భగానుభగయోః పరిరంభణే చ
నో సేవనే చ శశిభాస్కరయో ర్విశేషః.

శ్లో. ప్రమ్నక్రియా మరువకే జలకేళినిందా,
కుందా న్యశేషకుసుమేషు ధురి స్థితాని
సౌభాగ్య మేణతిలకా ద్విజకేఽర్కబింబం
కాలే తుషారిణి దహంతి చ చందనాని.

ఈశిశిరఋతువునందు ఉదకమును [నీటిని] త్రావువేళల, అందుఁ గల స్వాదుత్వాస్వాదుత్వములు గోచరించుట లేదు. ఇట్లులనే స్పర్శవిషయికము లగు కార్యము

లందును, తుహినమునకును అనలమునకును (మంచునకును నిప్పునకును) భేదము కన్పట్టుటలేదు. కరిరంభణములందు, అనఁగా ఆలింగనములందు, ఈకాంత సుభగ, ఈవిడ దుర్భగ యనుభేదము సయితము పొడగట్టక యున్నది. శశిభాస్కరుల సేవనములోను, అనఁగా శీతకిరణుఁడగు చంద్రుని సేవించుటలోను, ఉష్ణకిరణుఁ డగు సూర్యుని సేవించుటలోను, ఎట్టితారతమ్యమును, అనఁగా విశేషమును, గోచరించుట లేదని భావము. ఈశిశిరఋతువునందు స్త్రీలు అలంకరించుకొనుట కొఱకు మరువకమునందు పుష్పక్రియ (పుష్పకార్యము) అగుచున్నది. జలకేళి యన్నచో నసహ్యము పుట్టుచున్నది. మల్లెలు (కుందము) పూవులన్నింటిలోను తొలుత నెన్నఁదగినవై యున్నవి. మఱియును చంద్రునికంటె నర్కబింబమే సౌభాగ్యమును భజించుచు నున్నది అని భావము.

మఱియును ఈ హేమంతకాలమునఁ జందనములు, అనఁగాఁ జందనంపు పూఁతలు, మనజులఁ గాల్చివేయు నట్లు చుఱుకు వనుచున్నవి యని తాత్పర్యము.

శ్లో. సిద్ధార్థయష్టిషు యథోత్తరహీయమాన
సంతానభిన్న ఘన మాంచిపకంపరాను,
ద్విత్రావశేషకుసుమాను జనిక్రమేణ
పాకక్రమః కపిశిమాన మపోఢధాతి.

శ్లో. ఉదీచ్యచండానిలతాడితాను
నలీనమీనాను జలస్య మాలే,

నాళావశేషాబ్జలతా స్వీదానీం
విలాసవాపీషు న యాతి దృష్టిః
శ్లో. మాద్యన్మతంగః పృషతైకతోషీ
పృషద్వరాహో ధృతిమల్లిలాయః,
దరిద్రనింద్యః సధనైకవంద్యః
ఏ ఏష కాలః శిశిరః కరాళః!

యథోత్తరముగా హీయమానము లగుచున్న సంతానభిన్న ఘన సూచీపరంపరలు గల, ద్విత్రావశేష ములగు కుసుమములు గలసిద్ధార్థయష్టులయందు జని క్రమము ననుసరించి పాకక్రమము కపిళవర్ణమును నొం దుచు మనోహరత నిచ్చుచు న్నది. మఱియును ఈ ఋతువునందు ఉత్తరపు గాడ్పులవలన తాడితములై, సులీనములగు మీనములు గలవై, నాళావశేషము గల కమలలతలచే ఒప్పినవై, యున్న యీ విలాస వాపికలు, విలాసవతీవిలాసవంతుల దృష్టిపథమునకే వచ్చుట లేదు, అనఁగా విలాసవంతులు ఈకాలమున వానిపై రైన నెత్తుట లే దని భావము. మాద్యన్మతంగ మును పృష తైకతోషియును పృష్యద్వరాహమును ధృతిమల్లి లాయ మును దరిద్రజననింద్యమును ధనికవంద్యమును నై కరాళమగు నిశిశిరము విరాజిల్లుచున్న దని తాత్పర్యము.

శ్లో. అభినవవధూరోషస్వాదుః కరీషతనూనపాత్
అసరళజనాశ్లేషక్రూర స్తుషారసమీరణః,
గళితవిభవ స్యాజ్ఞేవాఽద్య ద్యుతి ర్మసృణా రవేః
విరహివనితావక్త్రౌపమ్యం బిభర్తి నిశాకరః.

శ్లో. స్త్రియః ప్రకృతిపీ_త్తలాః, క్ష్ణాతకుంకుమాలేపనైః
నితంబఫలక స్తనస్థలభుజోరుమూలాద్రిభిః
ఇహాభినవయౌవనాః సకలరాత్రిసంశ్లేషితైః
హరంతి శిశిరజ్వరాఽకతిమ తీవ పృథ్వీ మపి.

అభినవవధూరోపస్వాదువును, భాగ్యవాఱఁ జేయఁబడిన యగ్నిగలదియును, అపరశజనాశ్లేషక్రూరమును, తుపారముగల వాయువుగలదియునై ఈశిశిరము ఒప్పుచున్నది. మఱియు నిందు నిశాకరుఁడు-అనఁగాఁ జంద్రుఁడు,గలితవిభవుఁడగు వానియాజ్ఞవోలె, సూర్యునియొక్క మసృణధృతి యై యొప్పుచున్న విరహిజనవధూవదనౌపమ్యమును చంద్రుఁడు వహించుచున్నాఁడు. క్ష్ణితకుంకుమాలేపనములు గల నితంబ_స్తన భుజోరుమూలాదులచేత స్త్రీలు, ప్రకృతిపి_త్తలై, అభినవయౌవనలై, సకల రాత్రి సంశ్లేషితములచేత శిశిరజ్వర బాధను అంతను ఊచముట్టుగా వారించుచు నున్నారని భావము. ఇది శిశిరవర్ణన పద్ధతి. ఇటుపైని వసంతఋవును వర్ణించు పద్ధతిని జెప్పెదము.

ప్రాచీను లగు నాలంకారికులు శిశిరమునందు వర్ణింపఁ దగినవానిని ఈ క్రిందిరీతిగ సంగ్రహముగఁ జేర్కొనినారు —శ్లో. శిశిరే వేణుకుందాబ్జదాహ శ్శిఖిరతోత్సవాః,

## 5 వసంతర్తు వర్ణనము.

శ్లో. చైత్రే మదర్ధి శుకసారికాణాం
హారీతదాత్యూహమధువ్రతానాం,

పుంస్కోకిలానాం సహకారబంధుః
మదస్య కాలః పున రేష ఏవ.

శ్లో. మనోధికం చాఽత్ర విలాసలాస్యే
ప్రేంఖాసు దోలాసు చ సుందరీణాం,
గీతే చ గౌరీచరితావతంసే
పూజాప్రపంచే చ మహోథవస్య.

శ్లో. పుంస్కోకిలః కూజతి పంచమేన
బలా ద్విలాసా యువతీ స్స్పృశంతి,
స్మరో వసంతేఽత్ర నవైః ప్రసూనైః
స్వచాపయష్టేః ఘటనాం కరోతి.

శ్లో. సీమంతసిందూరజుషాం వసంతే
పినద్ధమాహారజనాంశుకానాం,
స్మరీకృతే ప్రేయసి భక్తిభాజాం
విశేషవేషః స్వదతే వధూనాం.

శ్లో. అయం ప్రసూనోద్ధురకర్ణికారః
పుష్పప్రపంచార్చిత కాంచనారః,
విజృంభణాకోవిద కోవిదారః
కాలో వికాసోద్యతసింధువారః.

(౧) శుకములు శారికలు హారీతములు కలవింకలు తుమ్మెదలు మున్నగువాని మదసంపద కల దై, పుంస్కోకిలములకును సహకారములకును చుట్టమై, ఇదిగో వసంతకాలము చైత్రమాసము రాఁగనే, మరల వచ్చినది. (౨) ఈవసంతమునందు అంగనల విలాసహాస్యములు, డోలికా విహారములు, పాటలు, గౌరీచరితావతంసము లగు గీత

ములు, మన్మథ సమర్చనలు, అను సీమున్న గువానియందు మిక్కిలి మనస్సు లగ్నమైయుండును. (౩) పుంస్కోకిలము పంచమధ్వనితోఁ గూయుచున్నది. యువతులయందు విలాసములు ప్రస్ఫురించు చున్నవి. నూత్నకుసుమములను బాణములుగా నేర్పఱచికొని మన్మథుఁడు వి జృంభించు చున్నాఁడు. (౪) పినద్ధమహారాజనాంశుకములు గలవారలును, సీమంతముల సిందూరములబొట్టులు గలవారును, స్మరీకృతుఁ డగు ప్రియుని యెడల భక్తిభావములు గలవారు నగువధువులు ధరించుకొనిన వేషాతిశయము చూపరులకు మనోహరమై రమణమునకు రుచిఁగొల్పుచున్నయది. (౫) ప్రసూనోద్ధురమైన కర్ణికారము గల వసంత మిదియే! పుష్పప్రపంచముచే సర్చిమైన కాంచనారములు గలదియు నిదియే! విజృంభణాకోవిద కోవిదారమును వికాసోద్వృత సింధువారమును నగు వసంతముకూడ నిదియే సుమా!

శ్లో. రోహీతకామ్రాతక కింకిరాతాః
మధూకమోచాః సహ మాధవీభిః,
జయంతి శోభాంజనకా శ్చ శాఖీ
సకేసరః పుష్పభరై ర్వసంతే.

రోహీతకామ్రాతక కింకిరాతములును మధూకమోచాలతలును శోభాంజనకములును పొగడలును మాధవీలతలతో సహా ఈకాలమున సుత్కృష్టము లై యొప్పుచు నున్నవి.

శ్లో. దోలా మాధవీముకుళదృష్టిషు వేణిబంధో,
యః కోకిలాకలరుతే కథనే చ లాభః,
పూజావిధి ర్దమనకేన చ య స్స్మరస్య
తస్మి న్మధు స్స భగవా న్గురు రంగనానామ్.

శ్లో. నాఽలింగితః కురవక స్తిలకో న దృష్టః
నో తాడిత శ్చ చరణై స్సుదృశా మశోకః,
సిక్తో న వక్త్రమధునా వకుళ శ్చ చైత్రే
చిత్రం తథాపి భవతి ప్రసవాఽవకీర్ణః.

శ్లో. చైత్రే చిత్రౌ రక్తనీలా వశోకౌ
స్వర్ణాశోక స్త త్తృతీయ శ్చ పీతః,
జైత్రం తంత్రం తత్త్రిమానాంతకేభ్యః
చేతోయోనే ర్భూర్భువస్స్వస్త్రయేఽపి.

శ్లో. గూవాకానాం నారికేళద్రుమాణాం
హింతాలానాం పాటలీకింశుకానాం,
ఖర్జూరాణాం శాలతాళీతమూనాం
పుష్పాపీడవ్యాపహేతు ర్వసంతః.

(౧) మాధవీముకుళ దృష్టులవిషయమున వేణిబంధముగను, కోకిలా కలకలధ్వనికి ఫలముగ నున్నదియున్నూ, దమనకకృత మగు స్మరపూజావిధి కలదియు నై యున్న ఈ కాలము నందు అంగనలకు భగవానుఁడు అగు వసంతుఁడే గురువు! (౨) దోహదమునకు కారణములనా బడుచున్న స్త్రీలయొక్క ఆలింగన దర్శన తాడన సేచనాదులు అక్కఱలేకయే, కురవక తిలకాశోక వకుళములు తమంతఁ దామే ప్రసవావకీర్ణములతో నొప్పుచున్న వె

వసంతమున రాజిల్లుచున్నవి, ఎంత ఆశ్చర్యము! (౩) చైత్రమునందు రక్త నీలాశోకములు చిత్రవర్ణము లైనవి. మూఁడవది యగు స్వర్ణాశోకము పచ్చని దైనది. మన్మథసంబంధ మగు చైత్రితంత్రము అంతయును ఈఋతుకాలమునందు ఈ పుష్పాలలోనే కలదు గదా! (౪) గూవాకములు నారికేళములు హింతాలములు పాటలీకింశుకములు ఖర్జూరములు తాళతాళీతరువులు మున్నగువానికి పుష్పా పీడన్యాయ కారణమై, ఈవసంత ఋతుప్రరాజిల్లుచున్న దని భావము. ఇది వసంతమును వర్ణించు పద్ధతి. ఇటుపైని గ్రీష్మమును వర్ణించు పద్ధతిఁ జెప్పెదము.

వసంతర్తువునందు వర్ణింపఁదగినవానిని పూర్వులగు మనగ్రంథకర్త లితరగ్రంథములలో నిట్లు సుబోధముగా సంగ్రహించి యున్నారు.

శ్లో॥ వసంతే పికగానామ్రమంజరీమంద మారుతాః
పుష్పాణి ద్రుదళోద్భేదపలాశ భ్రమరాదయః.

## 6 గ్రీష్మర్తు వర్ణనము.

శ్లో॥ వికాసకారీ నవమల్లికానాం
దళచ్ఛిరీష ప్రసవాభిరామః,
పుష్పప్రదః కాంచన కేతకీనాం
గ్రీష్మోయ ముల్లాసితధాతకీకః

శ్లో॥ ఖర్జూరజంబూపనసామ్రమోచ
ప్రియాళుపూగీఫలనారికేళైః

ద్వంద్వాని ఖేదాలసతా ముపాస్య
రతానుసంధాన మిహాఽఽద్రియంతే

శ్లో. స్రోతాం స్యనంభాంసి సకూపకాని
ప్రపాః కరోరేఽహాని పాంథపూర్ణాః,
ఉష్ణా సమభ్యర్థితసక్తుపానే
ప్రగే చ సాయం చ వహంతి మార్గాః.

శ్లో. యత్రాఽఽయమానేషు దివార్ధనిద్రా
యత్స్నానకేళి ర్దివసావసానే,
యద్రాత్రిశేషే సురతావతారః
సముష్టిరాగో ఘన ఘర్మగామీ.

శ్లో. యా చంద్రికా చందనపంకహృద్యా
యా జాలమార్గానిలవీచిమాలా,
యా తాళవృంతైః కణబిందువృష్టి
ర్జలాంజలిం సా శుచయే దదాతి.

(౧) నవమల్లికలకు వికాసకారి యై దళచ్ఛిరీష ప్రసూనాభిరామ మై కాంచనకేతకులకు పుష్పప్రద మై ఉల్లాసిత ధాతకీవృక్ష మై ఈగ్రీష్మర్తువు విలసిల్లుచున్నది. (౨) ఖర్జూరములు నేరేళ్లు పనసలు మామిళ్లు మోచములు మిరియపుతీగలు ప్రియాళములు పూగీఫలములు నారికేళములు మున్నగువానిచేత మిథునములు ఖేదాలసత్వము నొంది, ఈగ్రీష్మర్తువునందు రతానుసంధానముఁ జేయుచున్నవి. (3) నదీప్రవాహము లన్నియును బావులు మున్నగు జలాధారములు సమస్తము నీళ్ళులేక ఎండి పోవుచున్నవి. చలివేంద్రలు పాంథులతో నిండియున్నవి.

సక్తుపానము అభిలషిత మగుచున్నది. (౮) దినార్ధనిద్రయును దివసావసానమునందు అయ్యేడి స్నానమును, రాత్రిశేషమునందలి సురతావతారమును, ఘనఘర్మమాధియగు ముష్టియోగమును, నిందు రుచికరములుగా వరిణమించు చున్నవి. (౫) చందనపంకమువలె హృద్యమైన చంద్రికయును, జాల మార్గానిల వీచిమాలికయును తాళవృంతములచేనైన యుదక బిందుసృష్టియును గ్రీష్మమునకు జలాంజలి నొసఁగుచున్నది.

శ్లో. కర్పూరచూర్ణం సహకార భంగ
స్తాంబూల మార్ద్రక్రముకోపక్లప్తం,
హారా శ్చ తారా స్తనువస్త్ర మేత
న్మహారహస్యం శిశిరక్రియాయాః.

శ్లో. ముక్తాలతా శ్చందనపంకదిగ్ధాః
మృణాళహారానుసృతా జలార్ద్రాః,
స్రజ శ్చ మాళా స్మితచంపకానాం
గ్రీష్మే౽పి సో౽యం శిశిరావతారః.

అనఁగా కర్పూరచూర్ణమును సహకారభంగమును ఆర్ద్రక్రముకములతో నుపక్లప్త మగు తాంబూలమును తారహారములును సన్నని జిలుగు దువ్వలువలును—అనునియ్యవి గ్రీష్మబాధను పోనడంచి చలువనిచ్చుట కతిరహస్యక్రియ లగుచున్నవి.

చందనపంకదిగ్ధము లైన ముక్తాలతలును, జలార్ద్రము లై మృణాళహారములతో పెనచుకొని యున్న స్మితచంపక ప్రసూనముల యొక్క మాలికలును, ఈ గ్రీష్మ

ఋతువునందు శిశిరావతారమును (అనఁగా శిశిరర్తువు నందలి సౌఖ్యము నవతరింపఁజేయుటకు తగినవిగా) చేయుచున్నది అని భావము.

శ్లో. పచ్యంత ఇవ భూతాని తాప్యంతఇవ పాంసవః,
క్వథ్యంత ఇవ తోయాని ధ్మాయంత ఇవ చాద్రయః,
శ్లో. ఏణా స్థలీషు మృగతృష్ణికయా హ్రియంతే,
స్రోతః స్తనుత్వజనితా జలవేణిబంధాః,
తామ్యంతి మీని చ సరాంసి జలస్య శోషా
ద్భృక్త్వారఘట్టఘటికావలయాశ్చ కూపాః.
శ్లో. కరభాశ్శరభా స్సరాసభా మద మాయాంతి భజంతి విక్రియాం,
వనవీరకకీరపుష్పిణీః స్థలభూమీ రధిరుహ్య చాపశే,
శ్లో. సహకారరసార్చితా రసాలాః జలధి క్తంఫలపాకాని మంథాః,
మృగలాపరసా శ్శృతం చ దుగ్ధం స్మరసంజీవన మౌషధం నిదాఘే,

మఱియును ఈ గ్రీష్మర్తువునందు, ప్రాణు లన్నియును పచనము అగుచున్నవానివలెను, పాంసువు లన్నియును తపించుచున్నవానివలెను, తోయము లన్నియును క్వాథము లగుచున్న వానివలెను, అద్రులు పొగలు వెడలుచున్న వానివలెను ఉన్నవి. లేళ్ళు అటవీస్థలులయందు మృగతృష్ణికలచే నాకర్షింపఁబడుచున్నయవి. జలవేణిబంధములు స్రోతస్తనుత్వశోభితములుగా నున్నయవి. నీరెండిపోవుటచేత సరస్సు లన్నియును తామ్యంత్తిములై యున్నవి. కూపములు ఉద్ధారఘట్ట ఘటికావలయుములై యున్నవి కరభములు శరభములు రాసభములు మత్తతను పొందుచుచున్నవి. వికృతి, అనఁగా నెండవలనఁ

గల్గు వికారమును నొందు చున్నవి. మఱియు నయ్యవి చలువ నపేక్షించినవై గన్నేరుపొదలు గల స్థలభూము ల నధిష్ఠించి నివసించు చున్నవి. సహకార (తియ్యమామిడి) రసార్పితములు అగు రసాలములును, నీటిలో నూర వేసిన చలిది యన్నమును (దీనిని గుంటూరు నెల్లూరు జిల్లాలవారు పుల్లనీటి యన్నమనియు, కృష్ణాగోదావరుల వారు తరవాణి యన్నమనియు నందురు) ఫలములు పానకములు రసములు నీరుమజ్జిగలు పాలు మున్నగునవి. యన్నియును, ఈగ్రీష్మకాలమునందు స్మరజీవనౌషధము లుగా (అనఁగా మన్మథుని నుజ్జీవింపఁజేయఁగల సిద్ధౌషధములువోలె నని భావము.) నున్నవి అని తాత్పర్యము.

శ్లో. జడచందనచారవ స్తరుణ్యాః
సజలార్ద్రాః స్పృహ తారహారమాలాః,
కదళీదళతల్పకల్పనస్థాః
స్మర మాహూయ నివేశయంతి పార్శ్వే.

శ్లో. గ్రీష్మే చీకినాదవంతో వనాంతాః
పాకాభివ్యక్తాః నైరిభాః స్నిగ్ధకోలాః.
లోలజ్జిహ్వాః స్సర్పసారంగవర్గాః
మూలస్రస్తైః పత్రిణ శ్ఛాంతదేశైః.

శ్లో. హర్మ్యం రమ్యం చంద్రికాధౌతపృష్ఠం
కాంతోచ్ఛిష్టా వారుణీ వారిమిశ్రా,
మాలాః కంఠే పాటలా మల్లికానాం
సర్వో గ్రీష్మం హంతి హేమంతయంతి.

అనఁగా, జలచందన సుందరు లగు తరుణులును, జలార్ద్రిము లగు తారహారమాలికలును అరటియాకుల పాన్పులును, మన్మథుని పిలిచి తమపార్శ్వమునఁ గూర్చుం డఁబెట్టుకొనఁజాలి యున్నవి. గ్రీష్మర్తువునందు వనాంత ములు చీరీనాదవంతములై విరాజిల్లుచున్నవి. సైరిభములు (కారెనుములు, ఎనుములు లేక దున్నపోతులు) ఏనుఁ గులు పందులు బురదలలో పొర్లాడుచు నున్నవి. సర్ప సారంగాది బృందము (ఎండకు నిలువఁ జాలక నాలుక తడియార్చుకొని పోకుండుటకుగాను) లోలజిహ్వ మై యున్నది. పక్షిబృందములు మూలప్రసక్తములగు అంస దేశములతో నొప్పుచున్నవి. మఱియు నీగ్రీష్మర్తువునం దు—చంద్రికాధౌతపృష్ఠ మగు రమ్యహర్మ్యమును, వారి మిశ్రమై, కాంతోచ్ఛిష్ట మైన వారుణియును, (అనఁగా మద్యము] మల్లికామాలికలును అను నియ్యవిపీని సేవిం చువారికి, తత్క్షణమే సంతాపకరము నసహ్యము నగు నీ గ్రీష్మమును, హేమంతముగా మార్చి వేయఁగల్గుచు నున్నవని భావము.

గ్రీష్మర్తువునందు వర్ణింపఁదగినవానిం గూర్చి మన పూర్వగ్రంథకర్తలు ఈక్రిందిరీతిని సంగ్రహనిర్దేశముఁ జేసి యున్నారలు.

శ్లో. గ్రీష్మే పాటలమల్లీ తాపసరః పథిక శోషామ్రిఫలపాకాః,
మృగతృష్ణాల్ప సమీరః కాంతాపానీయశాలికా ముఖ్యాః.

ఇది గ్రీష్మమును వర్ణించునట్టి తెఱఁగు—అని తెలి సికొనఁగా వలయు నని భావము.

సాధారణముగా ఋతువర్ణనము చతురవస్థలుగ నుండునట్లులు, అనఁగా నొక్కొక్క ఋతువును నాల్గుగా భాగించికొని, వర్ణింపవలయును. అట్లు చేసినఁగాని అది సంపూర్ణమగు ఋతువర్ణన మనిపించి కొనదు. అట్లైన మఱి ఆనాల్గు అవస్థలు నేవి? యందు రేని చెప్పెదము:-

(1) ఋతుసంధి (2) ఋతుశైశవము (4) ఋతుప్రౌఢి (4) ఋతుపులయనువృత్తి అని యీ నాల్గవస్థలకు ను పేరులు. భిన్నభిన్నము లగు రెండు ఋతువుల మధ్య ను ఋతుసంధి యని యందురు.

ఇఁక నిచట క్రమముగా ఋతుసంధుల కుదాహరణములఁ బ్రదర్శించెదము. అందు శిశిరవసంతసంధికి ఈ క్రింది శ్లోకము ఉదాహరణము:—

శ్లో. చ్యుతసుమనసః కుందాః పుష్పోద్గమే ష్వలసా ద్రుమాః,
మనసిజగిరం గృహ్ణంతీమే గిరంతి న కోకిలాః,
అథ చ సవితుః శీతోల్లాసం లునంతి మరీచయో
న చ జరఠతా మాలంబంతే క్లమోదయదాయినీం

అనఁగా, కుందము లన్నియును పువ్వులను రాల్చివైచినవి. వృక్షములు పూయుటలో ఆలసించుచున్నవి. కోకిలములు మనస్సులోని మాటను స్వీకరించుట లేదు. అనఁగా వినుట లేదని భావము. మరీచలతలు, అనఁగా—మిరియంపుతీగలు, సూర్యునియొక్క శీతోల్లాసమును హానముచేయుచున్నవియే గాని, క్లమదాయిని యగు జరఠతను అవలంభించుట లేదు—అని భావము. ఇందు శిశిరర్తువు యొక్కయును వసంతఋతువు యొక్కయును

సంధికాలము వర్ణిత మైనది. కావున నిది శిశిరవసంత సంధి యనెడి ఋతుసంధి కుదాహరణ మైనది.

ఇట్టులనే ఈక్రిందిశ్లోకము వసంత శైశవమునకు ఉదాహరణముగాఁ గొనఁదగును.—

శ్లో. గర్భే గ్రంథిషు వీరుధాం సుమనసో
మధ్యేంకురం పల్లవాః
వాంఛామాత్రపరిగ్రహః పికవధూ
కంఠోదరే పంచమః,
కించ త్రీణి జగంతి జిష్ణు దివసై
ర్ద్వి.త్రై ర్మనోజన్మనో,
దేవస్యాపి చిరోజ్ఝితం యది భవే
దభ్యాసవశ్యం ధనుః,

వసంతప్రౌఢికి ఉదాహరణము:—

శ్లో. సామ్యం సంప్రతి సేవతే విచికిలం
షాణ్మాసికై ర్మౌక్తికైః
కాంతిం కర్షతి కాంచనారకుసుమం
మాంజిష్ఠధౌతా త్పటాత్
హూణీనాం కురుతే మధూకముకులం
లావణ్యలుంటాకతాం
లాటీనాభివిభం చకాస్తి చ పత
ద్వృంతాగ్రతః కేసరమ్.

విచికలకుసుమము ఈ వసంతమునందు షాణ్మాసికము లగు ముత్తెములతో సామ్యమును పొందుచున్నది. కాంచనారకుసుమము మాంజిష్ఠధౌత మగు పటమునుండి

కాంతిని ఆకర్షించుచున్నది మధూకముకులము హూణాంగనల లావణ్యముయొక్క లుంటాకతను (దొంగిలించుటను) చేయుచున్నది. తొడిమనుండి వీడి క్రిందఁబడుచున్న కేసరకుసుమము లాటదేశాంగనల నాభీప్రదేశములతో సమానముగఁ బ్రకాశించుచున్నది—అని భావము.

శ్లో. అతిక్రాంతర్తులింగం యత్కుసుమాద్యనువర్తతే,
లింగానువృత్తిం తా మాహుః సా జ్ఞేయా కావ్యలోకతః

అతిక్రాంతములైన ఋతువుల చిహ్నములైన కుసుమాదులను ప్రస్తుతఋతువునందు అనువర్తించుట లింగానువృత్తి యని చెప్పుదురు. దీనిని కావ్యములనుండి కవులు స్వయముగనే, గుర్తింపవలయును (1) వర్షర్తువునందు గ్రీష్మచిహ్నము లగుఅబ్జవికాసాదు లను వర్ణించుటకూడ, మఱియు నొకవిధమగు అనువృత్తియే యగు నందురు.

ఉదా:—

శ్లో. ఖం వస్తే కలవింకకంఠమలినం కాదంబినీకంబలం
చర్చాం పారయతీవ దర్దురకులం కోలాహలై రున్మదం
గంధం ముంచతి సిక్తలాజసదృశం వర్షేణ దగ్ధా స్థలీ
దుర్లక్ష్యాపి విభావ్యతే కమలినీహాసేన భాసాంపతిః.

అనఁగా, కాదంబినీక మగుబలము కలవింకకంఠమలినమై, ఆకసమును వసించుచున్నది. దర్దురబృందము కోలాహలముల చేత నధికముగా చర్చను సాగించుచున్న దానివలె నున్నది. దగ్ధమగు భూస్థలి సిక్తలాజసదృశ మగు గంధమును వదలిపెట్టుచున్నది. సూర్యుఁడు దుర్ల

త్యుఁడైనను, కమలినీహాసముచేత, నున్నట్టులు గనే, విభావింపఁబడుచున్నాఁడు—అని భావము.

ఇట్టులనే తక్కినవానిని కూడ కవులు ప్రాచీనుల గ్రంథముల శోధించి స్వయముగా నెఱుంగవలయును.

మఱియును:—

శ్లో. గ్రైష్మిక సమయవికాసీ
కథితో ధూళీకదంబ ఇతి లోకే,
జలధరసమయప్రాప్తౌ
స ఏవ ధారాకదంబ స్స్యాత్.

ఏది గ్రైష్మికసమయవికాసియై, ధూళీకదంబ మని లోకముచేతఁ జెప్పఁబడెనో, అదియే, అనఁగా ఆధూళీకదంబమే, వర్షాకాలము రాఁగానే ధారాకదంబముగా నగును గదా అని భావము. ఎట్లనఁగా—

శ్లో. ధూళీకదంబపరిధూసరదిఙ్ముఖస్య
రక్తచ్ఛటాసురశరాసనమండనస్య,
దీప్తాయుధాళనముచో నను నీలకంఠ!
నోత్కంఠసే సమరవారిధరాగమస్య.

అనఁగా ధూళీకదంబపరిధూసరదిఙ్ముఖమును, రక్తచ్ఛటాసురశరాసనమండమును, దీప్తాయుధము లను పిడుగులను వర్షించునదియు నగు యుద్ధ మనెడి మేఘోదయమునకు, ఓనీలకంఠమా ! ఏల నీవుత్సుకురాలవు కావు ? అని భావము.

శ్లో. జలసమయ జాయమానాం
జాతింయాం కార్ద మీతి నిగదంతి;

సా శరది మహోత్సవినీ
గంధాన్వితషట్పదా భవతి.

అనఁగా [వర్షర్తువునం దుదయించు నేజాతిని (జాజితీఁగను) "కాద్రమి" యని లోకులు పరిహాసోక్తులచేఁ జెప్పుచున్నారో, అదియే శరదృతువు ప్రవేశింపఁగానే గంధాన్వితషట్పది యై, మహోత్సవము గలదిగ నగుచున్నయది—యని తాత్పర్యము.]

శ్లో. స్థూలావశ్యాయబిందు ద్యుతిదళితబృహ
త్కోరక గ్రంథిభాజాం,
జాత్యా జాలం లతానాం జరఠపరిమళ
ప్లావితానాం జజృంభే,
నానాహంసోపధానం సపది జలనిధే
శ్చోత్స సర్పాపరస్య
జ్యోత్స్నాశుక్లోపధానం శయన మివ శశీ
నాగభోగాంక మంభః.

అనఁగా పెద్దపెద్దవియగు మంచునీటి బిందువులయొక్క కాంతులచే కోసికుప్పవేయఁబడిన మొగ్గలనుసూహనుకలిగిన వియును, జరఠపరిమళప్లావితములును అగు తెలయొక్క గుంపు జాజితోసహా ఇందు విజృంభించుచు నున్నది. చ్యోత్స్నా శుక్లోపధాన మగు శయనమును చంద్రుఁడువోలె నానాహంసోపధానమును నాగభోగాంకమును నగు పపరసముద్రముయొక్క యుదకము ప్రవరించెను అని భావము]

కేతకియొక్క స్తోకానువృత్తి కూడ అనువృత్తియే యగును అని మఱికొందఱ మతము అని యందురు.

శ్లో. అమాచ్యత శరత్కాలః కేతకీధూళిధూసరైః,
పద్మాత్తామైస్త్రివాయాత శ్చరణై రివ వాసరైః,

అనఁగా శరత్కాలము కేతకిధూళిచేత ధూసరితములై నవియును, పద్మాత్తామములును అయిన వాసరములతో చరణములతో వచ్చినరీతిగ సూచింపఁబడెను అని తాత్పర్యము.

శ్లో. శరద్భవానా మనువృత్తి రత్ర
బాణాసనానాం కురంట కానాం,
హేమంతవక్త్రే యది దృశ్యతేఽపి
న దృశ్యతే బంధవిధిః కవీనామ్.

అనఁగా ఈ హేమంతవక్త్రమునందు శరత్కాలజనితము లగు బాణాసనముల యొక్కయు కురంటకముల యొక్కయు అనువృత్తి కాన్పించినను, కవులద్దాని నుపనిబంధించెడి విధి మాత్రము కానరాదు అని భావము.

హేమంతర్తువునకు శిశిర్తువునకును ఐక్యమును ఏకత్వమును, నిర్దేశించుటలో సమస్తము లగు ఋతులింగముల యనువృత్తులను చేసికొనవచ్చును. ఇట్లే పెద్దలు కూడఁ బల్కి యుండిరి గదా:—

శ్రు. ద్వాదశమాస స్సంవత్సరః
పంచర్తవో హేమంతశిశిరయో స్సమాసేన.

అనఁగాద్వాదశమాసములు గలది ఒక సంవత్సరము. హేమంతశిశిరుతుఃవులను రెండింటిని ఒక్కటిగ

సంక్షేపము చేయుటచేత, నైదే ఋతువు లగు నని పై శ్రుతికిఁ గల తాత్పర్యము.

శ్లో. మరవక దమనక పున్నాగ
పుష్పలింగాను వృత్తిభిః సురభిః
రచనీయ శ్చిత్రశ్రీః
కించి త్కుందాను వృత్త్యా చ.

అనఁగా మరువకదమనకములు పున్నాగపుష్పములు మొదలగుహాని లింగముల ననువర్తించుటచేతను కుందానువృత్తిచేతను, అనఁగా మల్లెమొగ్గ లున్నట్టులు అనువృత్తిచేయుటచేతను మధుమాసమును చిత్రశోభగల దానినిగా రచింపవలయు నని యందు రని తాత్పర్యము.

శ్లో. గేహే వాహీక యూనాం
వహతి దమనకో మంజరీకర్ణపూరాన్,
సున్మాదః పామరీణాం
మరుతి మరువ కామోదిని వ్యక్తిమేతి,
సద్యోభంగానుసార
స్రుతసురభిశిరాః శీకర స్సాహకారః
సర్పన్ స్తంభ శ్శరావే
రచయతి చ రసో కేచకీచంద్రకాణి

అనఁగా వాహీక యువకులకు గేహమునందు దమనకము మంజరీకర్ణపూరములను వహించుచున్నది. మరువకామోదము గల వాయువునందు పామరస్త్రీలకు ఉన్మాదము వ్యక్తి నొందుచున్నది. సాహకారము, అనఁగా తియ్యమామిడి సంబంధ మగు అగు పూత, సద్యోభంగా

నుసారస్రుతసురభి శిరాశీకరమై యొప్పుచు - నున్నది—అని తాత్పర్యము.

మఱియును:—

శ్లో, కుందే మందస్తమాలే
ముకుళిని వికలః కాతరః కింకిరాతే
రక్తాశోకే సశోక
శ్చిరమితి వికచే చంపకే కుంచితాక్షః.
పాంథః ఖేదాలసోపి
శ్రవణకటురటచ్చక్ర మభ్యేతి ధున్వ౯
సోత్కంఠ షట్పదానాం
నవమధుపటలీ లంపటం కర్పటేన.

అనఁగా, కుందము విషయమై మందుఁడుగను, ముకుళములు గలతమాలము విషయమై వికలుఁడుగను, కింకిరాతవిషయమందు కాతరుఁడుగను, రక్తాశోకవిషయమునందు నశోకుఁడుగను, వికచ మగు చంపకవిషయమునందు కుంచితాక్షుఁడుగను, ఖేదాలసుఁ డయ్యును-నాపాంథుఁడు నవమధుపటలీలంపట మగు షట్పదములబృందమును ఉత్కంఠుఁ డై విదల్చుకొనుచు నెదుర్కొనెను అని భావము.

శ్లో. ధునానః కావేరీపరిసరభువశ్చందనతరూ౯
మరున్మందః కుందప్రకరమకరందా నవకిర౯;
ప్రియక్రీడాకర్షచ్యుతకుసుమ మామూలిసరళం
అలాటే లాటీనాం లుఠిత మలకం తాండవయతి.

అనఁగా వాయుదేవుఁడు కావేరీపరిసరప్రదేశములందుఁ గల చందన తరువులను కదల్చుచు, కుందప్రకర

ములందు గల మకరందమును వెదఁజల్లుచు, ప్రియక్రీడాకర్షణముచేత చ్యుత మైన కుసుమబృందము గలదియును, ఆమ్రాలసరళమును, అగు లాటదేశపు యువతీ మణుల్లల యొక్క లాలాటికము అగు అలకజాలమును తాండవింపఁజేయుచున్నాఁడు అని భావము ఇట్టులే తక్కిన యును వృత్తులఁ గూడ నెఱుంగవలయును.

శ్లో॥ విచికిల కేసర పాటల
చంపక పుష్పానువృత్తయో గ్రీష్మే
తత్ర చ తుహినర్తుభవం
మరువక మపి కేచి దిచ్ఛంతి.

గ్రీష్మర్తువునందు విచకిల, కేసర పాటల, చంపక కుసుమాను వర్తనములను, అందుఁగూడ హిమవంతర్తు జనితములగు విషయముల యనువృత్తిని గూడఁ గూర్పఁదగు నని కొందఱ యభిప్రాయము.

శ్లో॥ కర్ణే స్మేరం శిరీషం
శిరసి విచకిలస్రగ్లతాః పాటలివ్యః
కంఠే మార్ణాలహారో
వలయితమసితాంభోజనాళం కళాచ్యోః
సాహాదం చందనాంభ
స్తనభువి నయనే మ్లానమాంజిష్ఠపృష్ఠే
గాత్రం లోలజ్జలార్ద్రం
జయతి మృగదృశాం గ్రైష్మికోవేష ఏషః.

[అనఁగా, కర్ణమున స్మేర మగు దిరిసెనపూవును శిరమునందు విచకిల పుష్పమాలికలను, కంఠమునందు మృ

ణాలవాహరమును కర్ణాగము లందు నల్లకలువతీగలతో నల్లినకంకణములను, స్తనప్రదేశము లందు పరిమళవంత మగుచందనోదకమును, మ్లానమాంజిష్ఠస్పృష్ఠములగు నేత్రములును, లోలజ్జలార్ద్ర మగు గాత్రమును, అను వీనితోఁ గూడిన స్త్రీలయొక్క గ్రైష్మిక మగు వేషము, అనఁగా గ్రీష్మఋతుసమయము లందు చేసికొనెడిఅలంకారరచనావిధానము సర్వోత్కృష్టమై వర్తించుచున్న దని తాత్పర్యము.

మఱియును—

శ్లో. అభినవకుశసూచిస్పర్థి కర్ణే శిరీషం,
మరువక పరివారం పాటలాదామ కంఠే,
స తు సరసజలార్ద్రోన్మీలిత స్సుందరీణాం
దినపరిణ జన్మా కోఽపి వేష శ్చకాస్తి.

అనఁగాఁ జెవియందు అభినవకుశసూచిస్పర్థి యగు శిరీషకుసుమమును, కంఠమునందు మరువకపరివార మగు పాటలాదామమును, అగు, అంగములయొక్క గ్రీష్మర్తు సంబంధమైన సరసజలార్ద్రోన్మీలిత మగు నంగనల సాయంకాలవేషము మిక్కిలియుఁ బ్రకాశించుచున్న దని భావము.

మఱియును ఈరీతిని ననుసరించియే తక్కిన యుదాహరణము లను గూడ ఊహించునది.

శ్లో. ఋతుభవవ్యావృత్త్యైవ వృత్తి
దిజ్మాత్రేణాత్ర సూచితే శంతః
శేషం స్వధియా పశ్యేత
సామగ్రాహం కియ ద్బ్రువః?

పండుట, ౬ దేవతలు మున్నగువారి నర్పించుట—అను నీ యా రుపయోగములు. సాధారణముగా వీనిలో దేనికో యొకదానికై పూవుల నుపయోగింతు రని భావము. మనకు పుష్ప[పూవు]ము నుపయోగింతురని భావము.] మన పుష్పములు ఆఱువిధములుగా నుపయోగించు నని ప్రదర్శితముకదా! ఈ ఆఱును గాక ఏడవ మార్గమును అనుసరింపరాదు. అది అనుపయోగి నై యున్నది అని భావము.

ఎట్టు లనఁగా.—

శ్లో. యత్రాపి మాసే కుసుమం నిబద్ధం
తదుత్తరే బాలఫలంవిధేయం,
తదగ్రిమే ప్రౌఢిధరం చ కార్యం
తదగ్రిమే పాక పరిష్కృతం చ.

శ్లో. ద్రుమోద్భవానాం విధిరేష దృష్టో
వల్లీలతానాం న మహో న నేహః,
తేషాం ద్విమాసావధి రేవ కార్యః
పుష్పే ఫలే పాకవిధౌ చ కాలః.

శ్లో. అంతర్వ్యాజం బహిర్వ్యాజం
బాహ్యాంతర్వ్యాజ మేవ చ,
సర్వవ్యాజం బహువ్యాజం
నిర్వ్యాజం చ తథా ఫలం.

పూవులుగాని కాయలుగాని పరిపాకము నొందు నట్లువర్ణించుటకై ఈక్రింది కాలనియమమును అనుసరింపవలయును.

శ్లో. దేశేషు పదార్థానాం
వ్యత్యాసో దృశ్యతే స్వరూపస్య
చ న్న తథా జర్జ్నయా
త్కవిబద్ధ మిహ ప్రమాణం నః

శ్లో. శోభాంధో గంధరసైః
ఫలార్చనాభ్యాం చ పుష్పముపయోగి
షోఢా దర్శిత మేత
త్సాన్య త్స్పష్టమ మనుపయోగి.

ఋతుజనితము లగు వృత్త్యనువృత్తులు దిఙ్మాత్రము గా నిందు ప్రదర్శితములు. మిగిలినవి బుద్ధిమంతులగు వారు తమంతఁ దాము స్వబుద్ధిచే నూహించుకొనఁదగును. పేరు పేరునఁ జెప్పఁగా వానినెల్ల మేము ఎంతవఱకని చెప్పఁగలము? దేశ దేశములందు పదార్థస్వరూపములు వ్యత్యస్తము లగుచుండును. అవ్యస్తము లగువాని నట్లేవ్యత్యస్తముగాఁ గూర్చక, కవినిబద్ధమార్గముఎట్లున్నదో చూచికొని, తదను సారముగాఁ గూర్పఁదగును. ఏలయనఁగా కవినిబద్ధ మగునట్టి మార్గమే [పెద్దలమాట] వృద్ధానుసారుల మగుమాకు ఈవిషయమునఁ బ్రమాణము గదా! అని ౧-వ, ౨-వ శ్లోకములకు అర్థము.

శోభాంధో గంధరసముల మూలమునను ఫలార్చనముల మూలమునను [అనఁగాఁ, బూవులయొక్క యుపయోగములు ౧ సొగసు నిచ్చుట, ౨ భక్షణమగుట, ౩ వాసనఁజూచుట, ౪ రసము గ్రహించుట, ౫ పండ్లు

ఏయది తొలిమాసమునందు కుసుమమును (పూవు-ను) తొడిగినదో, అయ్యది దానితర్వాతవచ్చు నెలలో చిన్న చిన్న కాయలు గలదిగాఁ జేయఁబడవలయును. [అనఁగా తొలిమాసమునఁ బూఁతవట్టినట్లు వర్ణించినవానిని ఆమలిమాసమునందు కాపునకు వచ్చుచున్నట్లువర్ణింపవలయు నని తాత్పర్యము.] ఆపిమ్మటిమాసమునందు ప్రౌఢినొక్కింత దాల్చినట్లును, ఆతరువాత పాకమునకువచ్చుట చేత నలంకరింపబడినట్టులుగను కూర్పందగును. [ఇఁక ఫలవర్ణమును చేయుటలో గమనింపవలసిన రీతులు.] ఈపైనిఁ జెప్పినట్టి పుష్పఫలవిషయక మగు నియమము కేవలము ఒక్క ద్రుమోద్భవములకు [అనఁగాఁ జెట్టునఁ బండువానికి మాత్రమే] అనియును, తీగలు మున్నగువానికి ఇంత కాలవ్యవధి అక్కఱలేదనియు, వానికి పుష్పములు ఫలములు మున్నగువాని పాకవిధానమునందు రెండు నెలలకాలము వ్యవధి యున్నట్లు చెప్పినఁ జాలు ననియు [ద్రుమోద్భవానాం-అనుశ్లోకమునకు] తాత్పర్య మని యెఱుంగునది.

ఫలము అంతర్వ్యాజ మనియు బహిర్వ్యాజ మనిబాహ్యాంతర్వ్యాజమనియు, సర్వవ్యాజ మనియు బహువ్యాజ మనియు, నిర్వ్యాజ మనియు, ఇట్లుభిన్నములుగానున్నట్టులుగా వర్ణింపఁగా వలయును.

శ్లో. లకుచా ద్యంతర్వ్యాజం
తథా బహిర్వ్యాజ మత్ర మోచాది,

అత్రామ్రో హ్యుభయవ్యాజం
సర్వవ్యాజం చ కకుభాది.

శ్లో. పనసాది బహువ్యాజం
నీలకపిత్థాది భవతి నిర్వ్యాజం
సకల ఫలానాం షోఢా
జ్ఞాతవ్యః కవిభి రితి భేదః

నిమ్మపండ్లు మున్నగునవి అంతర్వ్యాజములలోను, మోచాదిఫలములు బహిర్వ్యాజములలోను, మామిడి పండ్లుమున్నగునవి ఉభయవ్యాజములలోను, కకుభాదులు సర్వవ్యాజములలోను, పనసపండ్లు మున్నగునవి బహువ్యాజములలోను, నీలకపిత్థాదులు నిర్వ్యాజములలోను, ఉదాహరణములుగాఁ గైకొని, అందుఁగల నారు తెఱంగులగు భేదములు కవులచేతఁ దెలియందగి యుండును.

శ్లో. ఏకద్విత్ర్యాదిభేదేన సామస్త్యేనాఽథవా ఋతూన్,
ప్రబంధేషు నిబధ్నీయా త్క్రమేణ వ్యుత్క్రమేణ వా

శ్లో. న చ వ్యుత్క్రమదోషోఽస్తి కవే రర్థపథస్పృశః
తథా కథా కాఽపి భవేత్ వ్యుత్క్రమే భూషణం యథా.

ప్రబంధముల ఋతువర్ణములను కూర్చునప్పుడు ఏక ద్విత్రాదిభేదముచేతఁ గాని మొత్తముగఁ గానివ్యుత్క్రమముగఁగాని కూర్పఁగా వచ్చును. అర్థమార్గమున సంచరించునట్టి కవికి వ్యుత్క్రమ దోషము కలుగనే కలుఁగకపోవుట యట్లుండగ, పైపెచ్చుఅట్టి వ్యుత్క్రమము అలంకారముగాఁ గూడ నతనికి నగును అని భావము.

శ్లో. అనుసంధానశూన్యస్య భూషణం దూషణాయతే
సావధానస్య చ కవే ర్దూషణం భూషణాయతే.
శ్లో. ఇతి కాలవిభాగస్య దర్శితా వృత్తి రీదృశీ
కవే రిహ మహా న్మోహః ఇహ సిద్ధో మహాకవిః,

అనుసంధానశూన్యుఁడగు కవికి ఆతఁడు కూర్చు భూషణము సైతము దూషణ మగును. సావధానుఁడై పూర్వాపరగ్రంథసందర్భములననుసరించి లోపములను సవరించికొనుచు, కవితఁ గూర్చుకవికి అన్ననో, ఇఁక ఆదూషణము గూడ భూషణమే యగును. ఇట్లు కాలవిభాగముయొక్క రీతియును వృత్తియును సోదాహరణముగ మాచే నిరూపింపఁ బడినవి. ఈసందర్భముననే (అనఁగా కాలవిభాగరీతులు వృత్తులు ననుసరించుటలోనే యని భావము.) జాగ్రత్తవహింపనిచో కవి యగువానికి సాధారణముగా గొప్పవ్యామోహము కలుగుచు నుండును. కాని సావధానుఁడై యుండు నేని, అట్టిసుకవి ఈసందర్భమునందు ఆరితేరుట గలిగి, లోకోత్తరుండగు మహాకవియై, కృతార్థత నొందఁ గలుగును. అని భావము.

ఇది రాజశేఖరకవిరాజకృత మగు కావ్యమీమాంస యనెడి
కవిరహస్యమునందు ప్రథమాధికరణమునందు
కాలవిభాగము—అనునది
అష్టాదశాధ్యాయము.

---

ఇది భారద్వాజగోత్ర పవిత్రుఁడును యజుశ్శాఖాధ్యాయియును, ఆపస్తంబసూత్రుఁడును అధిగతకావ్యతీర్థబిరుదుఁడును, పంచాగ్నివంశ్యుఁడును అలమేల్మంగా వేంకటేశ్వరులపుత్త్రుఁడును అగు ఆదినారాయణశాస్త్రి కూర్చిన రాజశేఖరమహాకవికృత కావ్యమీమాంసాంధ్రవివరణము సర్వమును సమాప్తము. ఓం తత్సత్.

## సమర్పణము.

తే. కాయవాఙ్మానసంబుల • గలిగినవియు,
నాత్మ బుద్ధీంద్రియాంబుల • నలరినవియు
ప్రకృతి స్వాభావికాదులఁ • బఱఁగినవియు
నన్ని యీశునిసన్నిధి • నర్పితములు.

తే. కరచరణకర్మజములు వా•క్కాయజములు
శ్రవణనయనజములు మాన•సము, విహితము,
అవిహిత మ్మగు సర్వదో•షాళి నెల్ల
శివ ! క్షమింపఁ బ్రార్థింతు నిన్ • చిత్స్వరూప.



# రాజశేఖర కావ్యమీమాంస

## (అకారాది శ్లోకాను క్రమణికా)


| | |
|---|---|
| **అ** | |
| అంకాధిరోపిత | 316 |
| అంగణే | 250 |
| అంతర్వ్యాజం | 411 |
| అట్టహాస | 297 |
| అతిక్రాంత | 403 |
| అతితూర్ణ | 125 |
| అత్రావదాత | 377 |
| అత్రోపచార | 383 |
| అత్రోపవర్ష | 206 |
| అధ పథి | 312 |
| అథాగాదేకదా | 89 |
| అనుసంధాన | 415 |
| అనేన | 53 |
| అపంకిల | 381 |
| అపాం | 173 |
| అభినవకుశ | 410 |
| అభినవవధూ | 390 |
| అభిముఖే | 93 |
| అభిలాషం | 184 |
| అయంకాకు | 122 |
| అయం ప్రసూనో | 392 |
| అయం సః | 319 |
| అరణ్యే | 217 |
| అర్థిజనార్థ | 183 |
| అలస | 184 |
| అల్పాక్షర | 20 |
| అవికల | 219 |
| అవిరళ | 260 |
| అవిస్పష్ట | 108 |
| అవ్యాఘ్రజేంద్ర | 243 |
| అవ్యుత్పత్తి | 66 |
| అసూచ్యత | 406 |
| అస్త్యద్రి | 236 |
| అస్తిచిత్ర | 158 |
| అస్తిదైత్యో | 323 |
| అస్తుశిత్తర | 367 |
| **ఆ** | |
| ఆకంపిత | 353 |
| ఆకాశ | 168 |
| ఆగస్త్యే | 354 |
| ఆగోపాలక | 127 |
| ఆత్మారామా | 78 |
| ఆనన్దేందు | 242 |
| ఆపః | 97 |
| ఆపాత | 317 |
| ఆమూలతో | 38 |
| ఆమూలయష్టేః | 357 |
| ఆర్ద్రావలేప | 171 |
| ఆర్ద్రార్ద్ర | 34 |
| ఆలిఖ్య | 293 |
| ఆశ్లేషిణః | 387 |
| ఆసీదస్తి | 277 |
| ఆస్తిక్యో | 172 |
| **ఇ** | |
| ఇతి కాల | 415 |
| ఇతివికసతి | 167 |
| ఇత్థంకవిః | 122 |
| ఇత్థంతే | 217 |
| ఇత్యేవంలో | 22 |
| ఇత్యేనస్య | 201 |
| ఇత్యుక్త్వా – రమ్యం మనః | 215 |
| ఇత్యుక్త్వా రమ్యంరమా | 215 |
| ఇత్యుద్గతే | 239 |
| ఇదంభోసాం | 370 |
| ఇదంహి | 196 |
| ఇహ | 205 |

ఇక్షు 154

ఉ

ఉచ్చైస్తరాం 73
ఉచ్యతాం 121
ఉత్క్లేశం 247
ఉత్ఖాత 299
ఉదయతి నవ 254
ఉదయతిపశ్య 253
ఉదరమిద 75
ఉదీచ్య 339
ఉద్దండోదర 302
ఉద్యానానాం 385
ఉన్మాద్యత్యేంబు 166
ఉపానయంతీ 373
ఉపోప (క్రు) 105
ఉభా 163
ఉష్ట్రైకపాదా 250
ఉషస్సు 377

ఊ

ఊర్వశీ (క్రు) 134

ఋ

ఋతు 410

ఏ

ఏకం 365
ఏకద్విత్ర్యాది 414
ఏకస్య 57
ఏకోర్థః 185
ఏణాః 398
ఏతత్కాం 67
ఏతత్సుందరి 309
ఏతద్వ్యత్ 136
ఏతాం 76, 176
ఏతాః 176, 292
ఏవం 151

క

కంఠ 88
కథమసౌ న 258
కథమసౌమద 259
కపోలే 248, 373
కరభాః 398
కరోతి కార్శ్యం 122
కర్ణాంధూనాం 385
కర్కోటః 170
కర్ణే 409
కర్పూర 397
కలి 149
కవీనాం 326
కవేః 68
కశ్చిత్ 59
కస్త్వం 61
కాంచ్యాః 368
కాంతే 230
కామంభవతు 284
కామంవిప్రణుతే 122
కాశ్మీరీ 372
కింకరోతి 213
కించైతే 271
కిమిహ 218
కిమీహాః 145
కియన్మాత్రం 94
కుండే 408
కుముద 218
కురవక 251
కుర్వత్యా 183
కుర్వన్త్విః 133
కువలయ 237
కుత్ర 218
కృతః 68
కేదారఏవ 379
కోపాత్ 211
కైలాస 310
క్రోధం 184
క్షయవ్యయ 151
క్షితం 376

ఖ

ఖంవస్తే 403
ఖర్జూర 395
ఖ్యాతా 103

గ

గంభీరత్వం 125
గగన 276
గతస్సకాలః 118
గద్యే 128
గర్భే 402
గర్భిణీ 303
గిరా 326
గుణానురాగ 101, 163, 299

గూవాకానాం 394
గేహాజిరే 379
గేహే 407
గోత్రాగ్రహారం 283
గాఢాద్యాః 193
గ్రీష్మ 399,400
గ్రైష్మిక 404

ఘ

ఘోరఘోర 148

చ

చంద్ర 250
చంద్రాత్ 134
చకార 239
చకోర 373
చక్రందహా 214
చతస్పృవ్యపి 364
చతుస్సముద్ర 354
చత్వారి (శ్రు) 28
చరంతి 92
చలచ్చటుల 375
చాపం 316
చైత్రే చిత్రా 394
చైత్రే మదర్ధిః 391
చ్యుత 401

జ

జంఘాకాం 69
జంబూ 350
జయతే 218
జయత్యమల 90
జయత్యేక 89
జయంతి 261, 322
జల 399,404
జానీయాత్ 194
జ్యోత్స్నాం 159
జ్యోత్స్నాజల 251
జ్యోత్స్నాపూర 168
జ్యోత్స్నాభిః 249

త

తింశంబరాసుర 324
తతఃపురస్తాత్ 128
తత స్తమః 241
తత్తోరణ 231
తత్రావదేవ 217
తత్రద్రుమా 358
తత్రాగారం 369
తథాగతాయాం 54
త దేవ 173
తను 285
తన్వంగి 217
తమోనం 355
తవ 272
తస్యాః 244
తాంబూలి 264
తాటంక 36
తాపాపహార 288
తా ము త్రీర్య 314
తాసాం 373
తిష్ఠంత్యా 311
తీక్ష్ణం 380
త్యాగాధికాః 216
త్యాగో ,,
త్వద్విప్రయోగే 293
త్వంపాసి 90
త్వమేవ 337

ద

దత్తం 230
దత్వా 181
దదృశాతే 287
దళత్కుటజ 575
దళసుతా 212
దశ 365
దక్షిణో 367
దానవాధిపతే 324
దిశ్యాత్ 247
దీపయుగ్ 240
దీర్ఘీకుర్వ 276
దుఃఖేంధనైక 113
దూరాక్రాంత 209
దూరాత్ 181
దృష్టం 96
దృష్ట్వా 22
దృష్ట్వైకాసన 182
దేవాసురాః 90
దేవీపుత్ర 73-226
దేశేషు 412
దైవాయత్తే 282
దోర్దండ 93
దోర్గ్రందీకృత 32
ద్యోతితా 301

| | | | | | |
|---|---|---|---|---|---|
| ద్రాక్ | 376 | నస | 138 | పాండ్యోః | 167 |
| ద్రుమోద్భవానాం | 411 | నాగావాసః | 278 | పాండ్యోయ | 162 |
| దష్టంగోష్ఠ్యస్మి | 86 | నాతిస్పష్ట | 127 | పాక | 229 |
| ద్వాదశ (శ్రు) | 406 | నాద్యంత | 149 | పాదన్యాస | 313 |
| ద్వాసయోజా (శ్రు) | 10 | నాభీ | 233 | పాదాస్తే | 216 |
| ద్విత్రి | 382 | నాలింగితః | 394 | పానే | 388 |
| ద్విత్రైః | 366 | నాశ్చర్యంత్వయి | 152 | పిబంతి | 156 |
| ద్విపాని | 351 | నాశ్చర్యంయత్ | 210 | పిహితే | 285 |
| ద్వీపజ్రవర్ణా | 160 | నాసతోవిద్య | 173 | పుంస్కోకిలః | 392 |
| **ధ** | | నిత్యం | 104 | పున్నాగ | 332 |
| | | నిరవధి | 349 | పురా | 228 |
| ధత్తే | 177 | నిర్వివేక | 228 | పురోవాతా | 276 |
| ధనుః | 319 | నిశ్చితనా | 265 | పుష్పం | 305 |
| ధన్యాస్తు | 231 | నీలాశ్మ | 279 | పుష్పక్రియా | 388 |
| ధునానః | 402 | నేచ్ఛ ఇ | 230 | పుష్పిణ్యా (శ్రు) | 97 |
| ధున్వ్యన్ | 370 | నేపాళో | 157 | పుష్పైః | 371 |
| ధూళీ | 404 | నైగమైః | 108 | పృథక్త్వేన | 2 3 |
| **న** | | న్యస్తాక్షరా | 289 | పౌరస్త్యైః | 376 |
| నదీం | 307 | **ప** | | ప్రతిభా | 58 |
| నద్యో | 380 | పంచ | 128 | ప్రతీచ్ఛత్యా | 76 |
| నప్రాప్తం | 74 | పచ్యంతేఇవ | 398 | ప్రణతి | 111 |
| నమన్నారాయ | 249 | పఠంతిచటభిం | 128 | ప్రథయతి | 47 |
| నమశ్శివాయ | 112 | పఠంతిసంస్కృతః | 127 | ప్రవర్తతే | 359 |
| నమస్సంసార | 215 | పత్యుః | 184 | ప్రశాంత | 174 |
| నమస్తస్మై | 86 | పదవాక్యవిదాం | 121 | ప్రసన్న | 114 |
| నమస్త్రిభువన | 348 | పనసాది | 414 | ప్రసన్నే | 125 |
| నమోఽస్తు | 136 | పరిక్రియా | 14 | ప్రసరతి | 66 |
| నయనమోదకమోః | 263 | పరిగ్రహా | 92 | ప్రసరద్బిందు | 216 |
| నవజలధర | 119 | పశ్య | 367 | ప్రసర్పంతి | 298 |
| నవ్యస్త | 126 | పాంచాల | 37 | ప్రసూనా | 104 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| ప్రాగ్దిశః | 233 | మహానవమ్యాం | 377 | యత్ప్రాచీ | 411 |
| ప్రాణానాం | 52 | మహాసుర | 325 | యథాజన్మ | 123 |
| ప్రియంగు | 303 | మహాకోశకార | 226 | యథాయథా | 382 |
| ప్రోషితైకేందు | 254 | మహాగాః పాతాళ | 169 | యథావ్యాఘ్రే | 123 |
| ఫుల్లాతిముక్త | 253 | మహాగాః పాంథ | 210 | యదిమే | 117 |
| | | మాతంగానాం | 353 | యదేతత్ | 27 |
| **బ** | | మాద్యచ్చకోర | 259 | యదేతన్న (ప్ర) | 135 |
| బహ్వాగ్రేషు | 137 | మాద్యన్మతంగ | 390 | యద్యపి | 281 |
| బహ్వాపి | 201 | మా నిషాద | 31 | యదుదుంబర | 100 |
| బుద్ధిమత్వం | 57 | మాభైష్ట | 315 | యద్వర్గ్యాభిః | 233 |
| బ్రహ్మణ | 127 | మాలతీ | 280 | యః సర్వేషాం | 161 |
| **భ** | | మాలాయమాన | 319 | యస్తుప్రయుంక్తే | 98 |
| భంజన | 378 | మాసి | 288 | యస్యకేశేషు | 218 |
| భవతి | 20 | మార్గానుగేన | 128 | యస్యతంత్ర | 229 |
| భవతు | 146 | మిథ్యా | 158 | యస్యాః | 105 |
| భాస్వత్ | 264 | మీనధ్వజ | 317 | యస్యాం | 212 |
| భ్రమతి | 111 | ముక్తానాం | 261 | యస్యాబోధః | 320 |
| భ్రశ్యత్. | 96 | ముక్తాలతాః | 397 | యస్యోత్తమాం | 355 |
| భ్రాంత | 75 | ముఖ | 252 | యాకేళి | 374 |
| **మ** | | మూర్తి | 267 | యాచంద్రికా | 396 |
| మండలీకృత్య | 2 5 | మూలం వాలుక | 77 | యాదాంపి | 368 |
| మజ్జః | 174 | మేఘ | 205 | యాదుగ్ధాపి | 30 |
| మధ్నామి | 120 | | | యావ్యాపారవతీ | 219 |
| మదం | 139 | **య** | | యుధిష్ఠిర | 372 |
| మధ్యే | 355 | యదితే | 144 | యుష్మచ్ఛాసన | 119 |
| మనాక్ | 238 | యత్కాయమా | 396 | యేఒపి | 127 |
| మనోధికం | 392 | యత్కించిత్ | 107 | యేకీర్ణ | 246 |
| మరకత | 308 | యచ్చంద్ర | 110 | యేన | 321 |
| మరువక | 407 | యత్తంత్రా | 229 | యేషాంమధ్యే | 385 |
| మసార | 260 | యత్రద్రావిత | 286 | యేషాంవల్లభ | 178 |

యేసీమంతిత 216
యౌరా నిరుగూ(త్రు) 105
యోమాధవీ 394

ర

రింగత్ 291
రజని 255
రవి 244
రసః 128
రాత్రిః 387
రీతిరూపం 116
రీతిం 201
రుణద్ధి 337
రోహితక 393

ల

లంపాకీనాం 379
లకుచాద్యంత 413
లలత్ 128
లలితం 124
లక్ష్మ్యాత్ర్యైః 263
లావణ్యో 350
లీడాభిధోప 201
లేఖితా 310
లోలల్లాంగూలా 71

వ

వంద్యా 319
వధూః 170
వనాని 373
వయం 101
వరదాయ 213
వరాహా 383
వల్మీక 108
వసంతే 294,395
వస్తు 179
వాత్స్య 371
వికాస 395
విచికిల 409
విత్రస్త 88
విదిశా 255
విద్యాస్థానా 15
విద్యేవ 71
విధర్మిణో 177
విన్ధ్యస్య 232
విధిక్రయః 126
విముక్తి 384
వియతి 256
విరమ 156
విలాస 359
వైదర్భీ 116
వ్యుత్క్రమ 107
వ్యోమ్ని 378

శ

శబ్దానాం 62
శబ్దార్థ 271
శమ 150
శరత్ 406
శరది 382
శరీర 147
శాఖా 371
శారదా 128
శీతాం 290
శైల 252
శోకాశ్రు 242
శోభాంధో 411
శ్రియః 166
శ్రీకంతి 102
శ్యామం 239
శ్యామేషు 370

స

సంక్షిపతా 292
సంవిధాతు 253,257
సంస్తంభినీ 348
సకాకు 128
సకింపామగ్రికః 144
సఖంజరీటా 376
సఖ్యావా 121
సచ 414
సదక్షిణాపాంగ 161
సదేవః 92
సద్యః 232
సన్మార్గా 262
సపాతువో 214
సపాతువో 172
సపాతువో 215
సమం 251
సమాసరూపక 113
సమాసవ్యా 109
సరశక 243

| | | | | | |
|---|---|---|---|---|---|
| సరస్వతీ | 257 | సితమణి | 257 | స్ఫటిక | 256 |
| సరితాం | 19 | సిద్ధార | 389 | స్ఫటిత | 154 |
| సర్గః | 13 | సిద్ధి | 201 | స్మృత్వా | 165 |
| సర్వభూతా | 107 | సీమంత | 392 | స్వాతాంసి | 396 |
| సళమా | 384 | సుభ్రు | 220 | హ | |
| ససంచరి | 340 | సురాష్ట్రి | 128 | హంస | 137 |
| ససంస్కృత | 124 | సుసర్జితా | 114 | హతత్విషో | 72 |
| ససల్లకీ | 373 | సేయం | 120 | హరహాస | 350 |
| సహకార | 398 | సోయంకర్త్రైః | 372 | హరోపి | 55 |
| సహ్యాద్రేః | 369 | సోయంఫణితి | 245 | హస్త్ర్యం | 399 |
| సాపత్న్యాః | 180 | సోస్మిన్ | 91 | హాలమగు | 336 |
| సాత్ర | 359 | స్తిమిత | 183 | హాలమహార | 232 |
| సాభాతి | 376 | స్తేమ | 95,297 | హాక్షో | 266 |
| సామాన్య | 142 | స్తోకానుప్రాస | 110 | హిరణ్య | 139 |
| సామ్యం | 402 | స్త్రియః | 391 | హృవ్యతి | 91 |
| సాయం | 304 | స్థితే | 227 | హేనాగరాజ | 322 |
| సారస్వతః | 56 | స్థూలావళ్యాయ | 405 | హేమంతే | 186 |
| సారస్వతం | 49 | స్థాస్వా | 231,262 | ప్రహాస్యైః | 112 |


అకారాది శ్లోకానుక్రమణికా సమాప్తా.

# రాజశేఖరకవికావ్యమీమాంస.

## (పీఠిక)

కవిరా జనియును మహాకవి యనియుఁ బేర్గాంచిన రాజశేఖరమహాకవి *కావ్యమీమాంసయనెడి పేరున నత్యద్భుత మగు సాహిత్యవిమర్శకగ్రంథమును సంస్కృత భాషయందు రచించియున్నాఁడు. అద్దానిని బయలునకుఁ దీసి ప్రచురించి లోకమునకు మహోపకృతి నొనర్పఁగల యదృష్టము తొలుదొల్త భారతీయులకు-అందునను బరోడాప్రభుత్వమువారి ప్రాచ్యగ్రంథాలయ గ్రంథమాలికా ప్రకాశకులకును-లభించినది. ఈ గ్రంథమును వారు ప్రకటించునంతవఱకును సాధారణముగా మన యాంధ్రదేశపు సంస్కృతాంధ్ర పండితులలో మాత్రమే గాక, యావద్భారతవర్షీయు లగు సంస్కృత పండితుల లోను చాలమంది దీని నెఱుఁగనే యెఱుంగ రనుట సాహసోక్తి కొంచెమేని కాఁజాలదు.

రాజశేఖరకవి యనినంతనే ఎవ్వరో ఏమో యన్న సందియమున కావంతయేని చోటు లేకుండ, సంస్కృత

---

* చూడుము. బరోడా గైక్వాడు సంస్కృతసిరీసు. నం 1. ఇది ఇప్పటికి మూఁడుముద్రణము లయినది. వెల రూ 2-0-0 లు. నా చేసిన యీ అనువాదము ఆంధ్రపాఠకుల సౌకర్యమునకై రూ 1.8-0 వెల. దీనిని చదువరులు గమనింత్రుగాక. (పం. ఆ)

వాఙ్మయమునందలి సుప్రసిద్ధము లగు బాలరామాయణము విద్ధసాలభంజిక కర్పూరమంజరి బాలభారతము అను నాల్గునాటకములే ఆమహానుభావుని జగద్విఖ్యాతకీర్తిని మనకు చాటుటకుఁ జాలి యున్నవి. ఈనాల్గునాటకములలో, బాలరామాయణము నింతదనుక నాంధ్రదేశమున కింకవీంద్రఘటాపంచానను లని పే రెన్నికఁ గాంచిన, బ్రహ్మశ్రీలును పూజ్యపాదులు నగు తిరుపతి వేంకటేశ్వరకవులు బహుకాలముక్రిందటనే ఆంధ్రీకరించి వెలయించి యున్నారు. తక్కినవాని నెవ్వరేని యాంధ్రీకరించిరో లేదో నే నెఱుఁగఁజాలను.

రాజశేఖరకవిప్రశంస - కులము, మతము.

ప్రాచీను లగు సంస్కృతభాషామహాకవులు ఈ రాజశేఖరమహాకవినిగూర్చి యీక్రిందఁ జెప్పఁబడువట్టి చాటుశ్లోకములను రచించినట్లు శార్ఙ్గధరపండితుని సుభాషితావళియందును, ఇటీవల నిర్ణయసాగరముద్రణాలయమువారు వెలువరచిన సుభాషితరత్నభాండాగారమను ప్రాస్తావికశ్లోకకోశమునందును నుద్ధరించినారు.

† శ్లో. బభూవ వల్మీకభవః కవిః పురా
తతః ప్రపేదే భువి భర్తృమేంఠతాం,

† తొలుదొల్త వల్మీకమునుండిపుట్టినవాఁ డొక్కఁడే (అనఁగా వాల్మీకియే) కవిగా నుండెను. ఆపిమ్మట ఆకవిబిరుదము భర్తృమేంఠకను (కవిరూపమును) పొందినది. (అనఁగా వాల్మీకితరువాత

స్థితః పున ర్యో భవభూతిరేఖయా
స వర్తతే సంప్రతి రాజశేఖరః. ౧.

* శ్లో. పాతుం శ్రోత్రరసాయనం రచయితుం
వాచ స్సతాం సమ్మతాః.
వ్యుత్పత్తిం పరమా మవాప్తు మవధిం
లబ్ధుం రసస్రోతసః
భోక్తుం స్వాదు ఫలం చ జీవితతరో
ర్య ద్యస్తి తే కౌతుకం,
త ద్భ్రాత శ్శృణు రాజశేఖరకవేః
సూక్తీ స్సుధాస్యందినీః. ౨.

పైని బేర్కొన్నసందర్భములను బట్టి, రాజశేఖర మహాకవి ప్రాచీనసంస్కృతకవులలో మిక్కిలియుఁ బ్రసిద్ధి నొందినవాఁ డనియును, ఆతని సుమధురము లగు కవితారచనలను శాస్త్రపరిష్కృతులను ఆకాలమునం

---

కవియనఁదగినవాఁ డొక్కఁ భర్తృమేంఠుఁడే యని భావము.)
ఆపిమ్మట నాకవిబిరుదము మహాకవి భవభూతిరూపున విలసిల్లినది. అయ్యది యిప్పుడు రాజశేఖరుని రూపున సర్వోత్కర్షముతో నొప్పుచున్న దని ౧-వ శ్లోకమునకు భావము.

* చెవులు దనివియార కవితామృతమును గ్రోలఁదలఁచినను, సజ్జనసమ్మతము లగు లలితలలితము లగు కవితారచనలఁ జేయందలంచినను, ఉత్తమోత్తమ మగు సాహిత్యవ్యుత్పత్తి నొందఁ దలఁచినను, రసప్రవాహాపుటంచు నెఱుంగఁగోరినను, జీవితవృక్షముయొక్క మళ్ళు రమధురము లగు ఫలముల నారఁగింపఁగా వేడుక గల్గినను-అన్నా! (అందుల కొక్కటే యుపాయము గలదు. చెప్పెదను వినుము.) రాజశేఖరకవిరాజుయొక్క అమృతము లొలుకుపలుకులను ఆలింపుము— అని రెండవదానికిఁ దాత్పర్యము.

దలి యెల్లవారును గౌరవించెడివా రనియును, మనము స్పష్టముగా నెఱుంగఁ గలుగుదుము.

రాజశేఖరమహాకవి కావ్యమీమాంసయందు తన్ను దాను [1]యాయావరీయుఁడ నని చెప్పుకొనుచున్నాఁడు. అనఁగా దాను యాయావరవంశము నందు పుట్టినవాఁడ నని యభిప్రాయమై యుండనోపును. ఇతనిని మఱి యితర కవులుగూడ యాయావరీయుఁడని యే పేర్కొన్నవారును గలరు. [2]రాజశేఖరకవి చాల ప్రౌఢుఁడగు మహాకవి.

---

1. యాయావరీయ స్సంక్షిప్య మునీనాం మతవిస్తరం, (తెల్గు పే 7.) సకలవిద్యాస్థానైకాయతనం పంచదశం కావ్యం విద్యాస్థానం — ఇతి యాయావరీయః. (తెల్గు పే 15. 18 పం.) ఇట్లెక్కుచోటుల కలదు.

2. తిలకమంజరిలో-సమాధిగుణశాలిన్యః ప్రసన్నపరిపక్త్రిమాః, యాయావరకవే ర్వాచో మునీనా మివ వృత్తయః, అనియును, ఉదయసుందరి—యనెడి చంపూకావ్యములో- యాయావరః ప్రాజ్ఞవరో గుణజ్ఞై రాశంసితః సూరిసమాజవర్యైః, నృత్య త్యుదారం భణితే రసస్థా నటీవ యస్యోఢరసా పదశ్రీః-అని సోడ్ఢలుఁడును ప్రశంసించి యున్నారు. ఈయుదయసుందరీకథలో మొదట్యుచ్ఛ్వాసమునందు కేవలము ఒక్క రాజశేఖరకవిని మాత్రమే గాక—విక్రమార్కుఁడు, హాలుఁడు, శ్రీహర్షుఁడు, యువరాజు, బాణుఁడు కాళిదాసు, వాల్మీకి, వ్యాసుఁడు, బృహత్కథాకర్త, గుణాఢ్యి, భర్తృమేంఠుడు, భవభూతి వాక్పతిరాజసూరి, అభినందుఁడు, కుమారదాసుఁడు, భాసుఁడు మున్నగు పెక్కురు కవులను గూడ సోడ్ఢలుఁడు చాల సరసముగా నుతించి యున్నాఁడు.

ఇతఁడు తనతాత యగు అకాలజలదుఁడు గొప్పకవి యని బాలరామాయణములో ఇట్లు చెప్పికొన్నాఁడు.

శ్లో. స మూర్త్తో యత్రాఽఽసీ ద్గుణగణ ఇ వాఽకాలజలదః,
సురానంద స్సోఽపి శ్రవణపుటపేయేన వచసా
నచాఽన్యే గణ్యంతే తరళకవిరాజప్రభృతయో
మహాభాగ స్తస్మి న్నయ మజని యాయావరకులే—అని.

అకాలజలదుఁడు మహాకవి యనుటకు కాదంబరీరాముఁ డనుకవి యతనిశ్లోకముల నుదాహరించుటయును ప్రమాణము కాఁగలదు. లోకమునందును—శ్లో. అకాలజలదశ్లోకై శ్చిత్ర మాత్మకృతై రివ, జాతః కాదంబరీరామో నాటకే ప్రవరః కవిః—యను ఆభాణకమును కలదు. సూక్తిముక్తావళియందు రాజశేఖరుఁడు చెప్పినట్లుగా—శ్లో. అకాలజలదేందో స్సా హృద్యా వచనచంద్రికా, నిత్యం కవిచకోరై ర్యా పీయతే న తు హీయతే—అని యొకశ్లోకము అకాలజలదుని పాండిత్యస్ఫోరకముగా నుట్టంకితము. పైనిఁజెప్పినశ్లోకములలోఁ గల తరళుఁడు,సురానందుఁడు, అన్నకవులఁగూర్చి వీరు ప్రాచీనులగు కవులనుటకన్న విశేషించి వివరములు ఏవియు నేఁడు లభింపవు. ఇట్లే కవిరాజును గుఱించియును కూడ నని యెఱుంగునది. రాజశేఖరునితండ్రి దుర్దుకుఁడు లేదా దుహికుఁడు మహామంత్రిగా నుండెననియు, ఆయన తల్లి పేరు శీలవతి యనియును, తెలియవచ్చును.

రాజశేఖరమహాకవి మహేంద్రపాలునకు ఉపాధ్యాయుఁడనని చెప్పుకొనుటంబట్టి బ్రాహ్మణుఁడని చెప్ప

నొప్పును. కాని ఈతనిభార్య యగు అవంతిసుందరి చౌహాణవంశపురాజకుమారి యని కర్పూరమంజరిలో నుండుటంబట్టియును [3]రాజకుమారి రాజునకే భార్యగా నుండుట తఱచు సంప్రదాయముగా నుండుటచేతను ఈ కవి క్షత్రియుఁడు (రాజు) అగునేమో యనియు సంశయింపవలసి వచ్చునందురు. హరవిలాసకావ్యరచనము నొనర్చుటచే రాజశేఖరుఁడు శైవమతపువాఁ డని కొందఱందురు. కాని యిది ప్రామాదికము. తఱచుగ కవులు తమ గ్రంథములలో త్రిమూర్తుల నయ్యై సందర్భముల ననుసరించి స్తుతించుటయు, వారికథలను వర్ణించుటయు, సంభవించుచునే యుండును. రాజశేఖరుని గ్రంథములలో అన్నిమతముల ప్రస్తుతియును,కలదు. కనుక నితనిని సర్వమతములయందు సమబుద్ధి గలవానినిగానే గ్రహింపవలయుఁగాని, ఏదో కించిత్తును బట్టి యామతము వాఁ డని నిర్ణయించుటకు వీలు లేదు.

రాజశేఖరునిభార్య విదుషి. కావ్యమీమాంసయందు ఈమె యభిప్రాయమును ప్రత్యేకముగా 2 లేక 3 మారులు నితఁ డుదాహరించుటయే ఈవిషయమునకుఁ జాలియుండును. [4]రాజశేఖరునివలెనే మంగళుఁడను కవి,

3. చాహుయాణకులమోళిమాలియా, రాయసేహరకయిందగేహిణీ. భత్తుణో కయి మవంతిసుందరీ, సా పవుజ్జయిదు మేవ మిచ్ఛయి. కర్పూ. 1-11.

4. చూడు 81 వ పేజి 16 పంక్తి. 179 పేజి 7 పంక్తులు 274-వ పేజి. 2-వ పేరా.

సోమదేవసూరి (యశస్తిలకచంపూగ్రంథకర్త) మున్నగువా రెల్లరును త్రిమూర్తులను సంస్తుతించినారు. కనుక వీరందఱును సర్వమతసామరస్యము నెఱపినవారలే యగుదు రని మనము గ్రహించుట యుక్తము. రాజశేఖరుని భార్యయగు అవంతిసుందరి తొలిసారి కర్పూరమంజరిని ప్రదర్శించినపుడు స్వయముగా నీమె తానందు భూమికను గైకొని యుండెననియుఁ దెలియుచున్నది.

రాజశేఖరకవిరాజు కాలనిర్ణయము
సమకాలికు లగు కవులు.

మహేంద్రపాలునకు (కనోజురాజు) ఉపాధ్యాయుఁడైనందునను, ఆమహేంద్రపాలుఁడు క్రీ. శ. 903, 907 లో కనోజును పరిపాలించుచున్నట్టులు [ఎపిగ్రాఫికా ఇండికాలోని సం. 171 శాసనము] సైషనీశాసనము తెలుపుచుండుటచేతను, కావ్యమీమాంసలో ఉదాహృతులయిన వాక్పతిరాజు ఉద్భటుఁడు 857-884 లోఁగాశ్మీరము నేలిన అనంతవర్మకాలమువా రగుటచేతను, ప్రతిభావ్యుత్పత్త్యోః ప్రతిభా శ్రేయసీ-అని ఆనందవర్ధనాచార్యుల మతముఁ జేర్కొనియుండుట వలనను, 960 లోని యశస్తిలకచంపూకర్త యితనిఁజేర్కొనుటచేతను, రాజశేఖరకవిరాజు క్రీ. శ. 880-920 సంవత్సరముల మధ్య బ్రతికి యుండు నని మన మూహింప వచ్చును. రాజశేఖరుఁడు కావ్యమీమాంసయందు దెల్పఱచిన పదితెరగతుల కవులలో నితఁడు తన్ను కవిరాజుతరగతివానిఁగాఁ జేర్కొనియున్నాఁడు.

ఈరాజశేఖరకవి బాల్యముననే కవితఁ జెప్ప నారంభించె ననియు, అందుననే బాలరామాయణము బాలభారతము అని తననాటకములకు పేర్లు పెట్టె ననియు, ప్రౌఢకవియు, విమర్శకుఁడు నైన పిమ్మట, విద్ధసాలభంజికను కావ్యమీమాంసను రచించె ననియుఁ గొంద అందురు. ఏది యెట్లున్నను ఇతఁడు తననాటకము లన్నింటినుండికూడ కావ్యమీమాంసలో నుదాహరణముల నిచ్చుటంబట్టి కావ్యమీమాంస యితనిరచనలలోఁ గడపటి దనుటకు సందియము లేదు. ఆచార్యహేమచంద్రుఁడు ఉజ్జ్వలదత్తుఁడు ఇతనిం బేర్కొనియు నితనిగ్రంథమునుండి కొన్నిభాగములను ఉద్ధరించి గైకొనుటం జేసియు, వీరు సమకాలికు లని కొందఱును కా దని కొందఱు వివదించుచున్నారు.

## కావ్యమీమాంసప్రశంస.

ప్రకృతగ్రంథ మగు కావ్యమీమాంస సాహిత్యవిమర్శనగ్రంథకోటిలోఁ జేరినది. దీని నితఁడు పదునెన్మిదియధికరణములుగా వ్రాయఁబూనుకొన్నట్టులు శాస్త్రసంగ్రహాధ్యాయములో సూచించినదానింబట్టి తెలియుచున్నది. సాధారణముగ సూత్రవాఙ్మయమునకుఁ జెందిన గ్రంథకర్త లందఱివలెనే మనయీకవియును సూత్రపద్ధతి ననుసరించి, అష్టాదశాధికరణిఁగా దీనిని రచింపఁబూనినట్టులు తెలియును. (చూడుము పేజి 2, 2-వ పేరా మొదలుకొని 4 వ పేజీపటుకు,) ఇంతియగాక, "క్షితయ స్తు తిస్రః, తా స్తు పురస్తాత్." (ఇఁక రీతు

లన్నవో మూఁడు వానిని మున్ముందు వివరించెదము. పేజి 41) అనినవాక్యముఁ బట్టియును "త మావని వదికే వక్ష్యామః - [దానిని ఔపనిషదికాధికరణము నందు చెప్పెదము.] అని చెప్పిన వాక్యమును బట్టియును ఈయంశము దృఢమగుచునే యున్నయది. కాని దుర దృష్టవశమున మన కిపుడు ఆపదునెన్మిదధికరణములుఁ గల కావ్యమీమాంసా గ్రంథము పూర్ణముగా లభించుట లేదు. కేవలము అందులో నొక్కభాగము మాత్రమే చిక్కినది. రాజశేఖరకవి అసలుగ్రంథమునంతను చేయనే లేదో, లేక రచితమయ్యును కాలవశమున నశించియే పోయినదో, తగిన యాధార మేదియు లేదు.

ఆర్యులవాఙ్మయమునందు అనఁగా సంస్కృతమున, సాధారణముగా సాహిత్యవిమర్శనము లుపనిబంధింపఁ బడిన గ్రంధముల నలంకారశాస్త్ర మనుపేరున వ్యవహరించుచుందురు. మన కుపలబ్ధములయిన యలంకార శాస్త్రసంబద్ధము లగు గ్రంథములలో తఱచు ప్రతిదాని యందును విషయమును పదివిభాగములుగాఁ గూర్చుట సాధారణ మగు సంప్రదాయ మై యున్నయది. ఆపది విభాగములు నేవి యనఁగా—1: కావ్యస్వరూపము, 2 వృత్తిలక్షణము, 3 గుణదోషప్రకరణము. 4 శబ్దాలంకారార్థాలంకారవివేచనములు, 5 రసభావాదినిరూపణము లు, 6 నాయికానాయక గుణవిమర్శనము, 7 దృశ్యశ్రవ్యాది కావ్యభేదపరిగణనాదులు, 8 రూపకతద్దంగలక్షణములు, తత్పరిభాషాదులు, 9 కథాశరీరసంవిధానవిమర్శనములు,

10 కవులు, ప్రేక్షకులు, నటులు మున్నగువారి లక్షణములను తత్సమయములు మున్నగు ప్రకీర్ణ కాంశములను వివరించుటలు—అని. ఇది స్థూలదృష్టిని చేసిన విషయ విభాగము. ఇందు ఆనుపూర్విగాని వ్యత్యయముగాని అయ్యె గ్రంథములలో నాయాకవులు యథౌచిత్యముగా నిర్ణయించుకొని వ్రాసియు నున్నారు. కనుక నిది లక్షణము కా దని యెఱుంగునది. సంస్కృతాలంకారగ్రంథములలో మొదటి నాల్గువిభాగములను చర్చించునవి కొన్నియును, తక్కిననాల్గు విభాగములను చర్చించునవి కొన్నియును నై యున్నవి. బ్ర. శ్రీ. మానవల్లి రామకృష్ణకవి, యం. ఏ. గారు కావ్యాదర్శగ్రంథపు పీఠికలో నీ రెండు తెగలకుం జేరినగ్రంథకర్త లెవ్వరెవ్వరో, వారివారి గ్రంథము లెవ్వియో వారికాలము ఏదియో చక్కని పట్టిక నిచ్చి యున్నారు. దానినే యిచ్చట పొందుపఱచితిని.

అందు మొదటివిభాగపు గ్రంథములు గ్రంథకర్తలు, అనఁగా కావ్యస్వరూప వృత్తిలక్షణ గుణదోషప్రకరణశబ్దాలంకారార్థాలంకారవివేచనములు గల గ్రంథములును వానిని రచించినగ్రంథకర్తలు నిట్టు లుదాహరింపఁబడినారు.

| గ్రంథముపేరు. | గ్రంథకర్త | కాలము. క్రీ. శ. |
|---|---|---|
| 1 భామహాలంకారము | భామహుఁడు | 620 |
| 2 కావ్యాదర్శము | దండికవి | 640 |

| గ్రంథము పేరు. | గ్రంథకర్త | కాలము. |
|---|---|---|
| | | క్రీ. శ. |
| 3 కావ్యాలంకారము | రుద్రటకవి | 700 |
| 4 కావ్యాలంకారసూత్రవృత్తి | వామనాచార్యుఁడు | 800 |
| 5 ధ్వన్యాలోకము | ఆనందవర్ధనుఁడు | 840 |
| 6 కావ్యాలంకారసంగ్రహము | ఉద్భటకవి | ,, |
| 7 కావ్యాలంకారము | వాగ్భటుఁడు | 900 |
| 8 కావ్యమీమాంస (ఇదే) | రాజశేఖరుఁడు | 930 |
| 9 హృదయదర్పణము. | భట్టనాయకుఁడు | 950 |
| 10 వక్రోక్తిజీవితము | కుంతలకుఁడు | 960 |
| 11 వ్యక్తివివేకము | మహిమభట్టు | 1000 |
| 12 సరస్వతీకంఠాభరణము | భోజదేవుఁడు | 1059 |
| 13 కావ్యప్రకాశము | మమ్మటభట్టు | 1150 |
| 14 కావ్యానుశాసనము | హేమచంద్రుఁడు | ,, |
| 15 సహృదయలీల<br>16 అలంకారసూత్రములు | ఆచార్యరుయ్యకకవి | 1180 |
| 17 అలంకారసర్వస్వము<br>18 సాహిత్యమీమాంస | మంఖుకుఁడు | ,, |
| 19 ప్రతాపరుద్రీయము | విద్యానాథకవి | 1320 |
| 20 ఏకావళి | విద్యాధరకవి | 1350 |
| 21 సాహిత్యదర్పణము | విశ్వనాథకవిరాజు | 1850 |
| 22 చమత్కారచంద్రిక | ? | ,, |
| 23 అలంకారసుధానిధి | ? | 185 |

ఈ మొదలయిన గ్రంథము లన్నియు మొదటివిభాగవుగ్రంథము లని వారు నిర్ణయించిరి. ఇఁక రెండవ

విభాగమునకుఁ జెందినగ్రంథము లేవి యనఁగా, (అనఁగా రసభావనిరూపణప్రముఖము లగు గ్రంథములు.)

| గ్రంథముపేరు. | గ్రంథకర్త | కాలము. క్రీ. శ. |
|---|---|---|
| 1 నాట్యశాస్త్రము | ఆచార్యభరతుఁడు లేక భరతముని | ? |

(ఇందులో 6,7, 18, 19, 20, 21, 22, 23, 24, అధ్యాయములు మాత్రము.)

| | | |
|---|---|---|
| 2 శృంగారతిలకము | రుద్రకవి | 700 |
| 3 కావ్యకౌతుకము | తోతాచార్యుఁడు | 970 |
| 4 అభినవభారతి<br>5 నాట్యలోచనము | అభినవ గుప్తపాదాచార్యుఁడు | 1000 |
| 6 దశరూపకము | ధనంజయుఁడు | 1000 |
| 7 శృంగారప్రకాశము | భోజదేవుఁడు | 1060 |
| 8 భావప్రకాశము | శారదాతనయుఁడు | 1150 |
| 9 నాట్యసర్వస్వము<br>10 నాట్యదర్పణము | జగద్ధరుఁడు<br>రామచంద్రకవి | 1180 |
| 11 నాట్యలోచనము<br>12 రసార్ణవసుధాకరము | త్రిలోచనుఁడు<br>సర్వజ్ఞుఁడు | 1350 |
| 13 సంగీతమీమాంస | కుంభకర్ణకవి | 1450 |
| 14 రసవివేకము | | |
| 15 రాజరాజీయము | N. B. చివర అయిదింటికాలము నియతలేదు. | |
| 16 రసమీమాంస | | |
| 17 రసకల్పద్రుమము | | |
| 18 శృంగారమంజరి మున్నగునవి. | | |

ఈ చేసిన ద్వివిధము లగు విభాగముల గ్రంథములను రచించిన గ్రంథకర్తలలో భామహుఁడు ఆచార్యదండి ఆనందవర్ధనాచార్యుఁడు భట్టనాయకుఁడు కుంతలకుఁడు మహిమభట్టు భోజదేవుఁడు మొదటివిభాగమునను, భరతాచార్యుఁడు నంది రుద్రకవి అభినవగుప్తాచార్యుఁడు భోజుఁడు మున్నగువారు రెండవవిభాగములోను శ్రోత్రి మార్గములఁగన్పెట్టి, తక్కినవారికి మార్గదర్శకులైరని యును, ఇందు కొందఱిగ్రంథములలో రెండువిభాగముల లోని యంశములును కలసికాని, లేదా యానుషంగికముగ సూచింపఁబడి కాని, యుండునవియును శ్రీకళ గారు వ్రాసి యున్నారు చదువరుల యుపయోగమునకై నేనిట దా నినే యుద్ధరించినాఁడను.

## సాహిత్యశాస్త్రోత్పత్తికథ

వెనుకఁ జెప్పిన సందర్భములఁ బట్టి రాజశేఖరుని కావ్యమీమాంస సాహిత్యశాస్త్రమునకు సంబంధించిన విమర్శనలను నెఱవు నలంకారగ్రంథ మనియు నందునను నయ్యది కావ్య స్వరూపవృత్తి లక్షణగుణదోష వివేచన శబ్దార్థాలంకారవివరములను చర్చించు మొదటివిభాగము నకుఁ జెందిన గ్రంథకోటిలోఁ జేరిన దనియు గుర్తించి యున్నాము. ఇటుపైని అట్టి కావ్యమీమాంసయందుఁగల ఒక్కొక్క ప్రకరణమునకుఁ జెందినవిషయములను స్థూలరీతినో, లేక సూక్ష్మరీతినో, మనము విమర్శించుకొనఁ దగును. కాని ఆ కార్యము నొనర్చుటకు మున్ముందుగా

నొక్క విషయమును, మిక్కిలియు నపూర్వమును, ఒక్క కావ్యమీమాంసయందు తప్ప, వేఱలంకారగ్రంథలం దెందును లేనిదియు, నగు దానిని చదువరుల సన్నిధికిఁ దెచ్చుట తప్పనిసరి యని నమ్మెదను. అది యే దనఁగా-రాజశేఖరకవి చెప్పిన సాహిత్యశాస్త్రోత్పత్తిని గుఱించినట్టి కథయే! కనుక నే యుద్దానిఁగుఱించి చదువరులో క్షణము శ్రీఁగన్ను నిఁ పఱపెదరుగాక. రాజశేఖరకవి కావ్యమీమాంసయందు శాస్త్రసంగ్రహ మనెడి ప్రథమాధ్యాయమునందు సాహిత్యశాస్త్రోత్పత్తి నిట్లు చెప్పినాఁడు.

"శ్రీకంఠుఁడు పరమేష్ఠి వైకుంఠాదు లగు అరువదినల్వురు శిష్యులకును దేని నుపదేశించెనో, అట్టి కావ్యమును ఇటుపైని మీమాంస చేయుదుము. ఆ భగవానుఁడు-స్వయంభువునైనవాఁడు - తన యిచ్ఛామాత్రమున నావిర్భవించిన స్వశిష్యుల కిద్దాని నుపదేశించెను- ఆ శిష్యులయందు సరస్వతీపుత్రుఁడు - బృందారకులకు సైతము వంద్యుఁడు నైన కావ్యపురుషుఁడు నుండెను. అట్లుండిన ఆ కావ్యపురుషుని-సర్వసమయముల నెఱిఁగినవానిని - దివ్యచక్షువుతో ముమ్మందు జరుగఁబోవు విషయముల నెఱుంగఁగలవానిని - భూర్భువస్స్వరము లను ముల్లోకములయందుఁ గల జనుల విషయమై గల హితకామనతో, ప్రజాపతియగు బ్రహ్మ కావ్యవిద్యను ప్రవర్తింపఁ జేయుటకై నియమించెను."

"ఆ కావ్యపురుషుఁడు కావ్యవిద్యాస్నాతకులగు నా దివ్యులకు పదునెన్మిది అధికరణములుగల కావ్యమీ

మాంసను సవిస్తరముగాఁ జెప్పెను. అపుడందు కవిరహస్యమును సహస్రాక్షుఁడు అధ్యయనము చేసెను. ఉక్తిగర్భుఁ డనువాఁడు ఔక్తికమును, సువర్ణనాభుఁడు రీతినిర్ణయమును, ప్రచేతాయనుఁ డానుప్రాసికమును. చిత్రాంగదుఁడు యమకము లను చిత్రప్రకరణమును, శేషుఁడు శబ్దశ్లేషమును, పులస్త్యుఁడు వాస్తవమును, ఔపకాయనుఁ డౌపమ్యమును, పరాశరుఁడు అతిశయమును, ఉతథ్యుఁడు అర్థశ్లేషమును, కుబేరుఁడు ఉభయాలంకారికమును, కామదేవుఁడు వైనోదికమును, భరతుఁడు రూపకనిరూపణీయమును, నందికేశ్వరుఁడు రసాధికారికమును, ధిషణుఁడు దోషాధికరణమును, ఉపమన్యువు గుణోపాదానికమును, కుచుమారుఁడు ఔపనిషదికమును అధ్యయనముఁ జేసిరి. అటుతరువాత వారు వేర్వేరుగా తమతమ చదివిన శాస్త్రభాగములను ప్రత్యేకముగా విస్తరించి రచించిరి. ఇట్లు చేయుటంజేసి ప్రకీర్ణకమగుటచేత, అనఁగా నొకదానితో నొకటి కలిసికొనిపోవుటచేత, ఆకావ్యమీమాంస కొంచెము (అచ్చటచ్చట) ఉచ్ఛేదము నొందెను. ఈకారణమును బట్టి ప్రయోజకాంగపతియైన ఈ కావ్యమీమాంస, సంక్షేపింపఁబడి, మూలమున దలి యర్థమంతయు వచ్చునట్లు పరిమితాకృతి గల గ్రంథముగా, నియ్యది పదునెన్మిదధికరణములు కలదిగాఁ మాచేఁ జేయఁబడినది."

రాజశేఖరుఁడు చెప్పిన యీ సాహిత్యశాస్త్రోత్పత్తిగాథకు ఆకరము ఏదియో తెలియదు. కాని ప్రాచీన

కాలమునుండి సూత్రగ్రంథకర్తలందఱును తెలుచుఁగా నిట్టులనే చెప్పుచున్నారు. కామసూత్రములను రచించిన వాత్స్యాయనమహర్షియును అర్థసూత్రములను రచించిన కౌటిల్యుఁడును శిల్పసూత్రములను రచించినశిలాలుఁడును మున్నగువారు ఎవ్వరికి వారు ఈకథను తమతమ శాస్త్రప్రవర్తనమున కనుకూలము లగు మార్పులతో చెప్పుచునే యున్నారు. కావున నిదిరాజశేఖరుఁడు కల్పించినకథ యనుటకుఁ గాని, ఆతనికి సమకాలికులుగఁగాని పూర్వులుగఁగాని తర్వాతివారుగఁ గాని ఉన్నఆలంకారికులగు గ్రంథకర్తలెవ్వరును దీఁ బేర్కొనకుంటచేత నిజమని చెప్పుటకుఁ గాని, వీలుపడక యున్నది. వాత్స్యాయనమహర్షి చెప్పిన కామశాస్త్రోత్పత్తిగాథను చదువరులు రాజశేఖరుని కథతో పోల్చి చర్చించుకొనుటకై యాతనిగ్రంథమునుండి అభాగములు గల దానిని ఎత్తి ఇచటఁ బ్రకటించుచున్నాను. - వాత్స్యాయనుఁడు —

"ప్రజాపతిర్హి ప్రజాః సృష్ట్వా తాసాం స్థితినిబంధనం త్రివర్గస్యసాధనం అధ్యాయానాం శతసహస్రేణ అగ్రే ప్రోవాచ. [౧. ౧. ౫] తస్యైకదేశం స్వాయంభువో మనుర్ధర్మాధికారికం పృథక్చకార. [౧. ౧. ౬] బృహస్పతిరర్థాధికారికం [౧. ౧. ౭] మహాదేవానుచరశ్చ నందీ సహస్రేణ అధ్యాయానాం పృథక్కామసూత్రం ప్రోవాచ. [౧. ౧. ౮] తదేవతు పంచభిరధ్యాయశతై రౌద్దాలకిః శ్వేతకేతుస్సంచిక్షేప[౧. ౧. ౯] దేవతతు పునరధ్యర్ధశతేన సాధారణ సాంప్రయోగిక

కన్యాసంప్రయుక్తక భార్యాధికారిక పారదారిక వైశికౌపనిషదికైః స్సప్తభి రధికరణై ర్బాభ్రవ్యః పాంచాల స్సంచిక్షేప. [౧. ౧. ౧౦.] తస్య షష్ఠం వైశిక మధికరణం పాటలిపుత్రికాణాం గణికానాం నియోగా ద్దత్తకః పృథక్చకార. [౧. ౧ ౧౧.] తత్ప్రసంగాచ్చారాయణ స్సాధారణ మధికరణం పృథ క్ప్రోవాచ. సువర్ణనాభ స్సాంప్రయోగికం, ఘోటకముఖః కన్యాసంప్రయుక్తకం, గోనర్దీయో భార్యాధికారికం, గోణికాపుత్రః పారదారికం, కుచుమార ఔపనిషదికం, [౧. ౧. ౧౨.] ఏవం బహుభిరాచార్యై స్తచ్ఛాస్త్రం ఖండశః ప్రణీతం ఉత్సన్నకల్పమభూత్. [౧. ౧. ౧౩] తత్ర దత్తకాదిభిః ప్రణీతానాం శాస్త్రావయవానాం ఏకదేశత్వాత్, మహదితి చ బాభ్రవీయస్య దురధ్యేయత్వాత్, సంక్షిప్య సర్వ మర్థ మల్పేన గ్రంథేన కామసూత్ర మిదం ప్రణీతవాన్. [౧. ౧. ౧౪] అని చెప్పినాఁడు. [చూడుము. నాగ్ర చురణము వాత్స్యాయనుని కామసూత్రములు.]

కనుక సూత్రగ్రంథకర్త లందఱును ఇట్లు చెప్పుట సాధారణమై యున్నది. అయినను వీ రందఱు ఇట్లు చెప్పుటకు ఏదో యొక అసలు ఆధారము ఉండవలయును కాదా? అట్టి దే దైనను కలదా? లేదా?, ఉన్నచో నెచ్చట?—అని యన్వేషింపఁగా నన్వేషింపఁగా సదరు వాత్స్యాయనాదులకు నీ రాజశేఖరునకుఁ బ్రాచీనదికగా నుండవచ్చు నని మన మూహించుటకు ననువగు కొంత యాధారము మహాభారతములో మనకు గానవచ్చును.

అది శాంతిపర్వములోని సూత్రాధ్యాయములోనిది. అం దుండి కొన్ని శ్లోకముల నిచ్చట నుద్ధరించుచున్నాను.

శ్లో. తా నువాచ సురా న్సర్వా న్స్వయంభూ ర్భగవాం స్తతః
శ్రేయోఽహం చింతయిష్యామి వ్యేతు వో భీ స్సురర్షభాః
తతోఽధ్యాయసహస్రాణాం శతం చక్రే స్వబుద్ధిజం
యత్ర ధర్మ స్తథై వార్థః కామ శ్చైవాఽభివర్ణితః
త్రివర్గ ఇతి విఖ్యాతో గణ ఏవ స్వయంభువా.

ఇచ్చట సందర్భము ఇది!—శరశయ్యాగతుఁడగు భీష్మునిం జేరి లోకపరిపాలనాదుల యానుపూర్విని దెల్పు మని ధర్మరా జడుగఁగా నతఁడు త్రివర్గ (ధర్మార్థకామ) శాస్త్రోత్పత్తిని: గూర్చిన పూర్వవృత్తాంతమును చెప్పఁ దలంచి, బ్రహ్మ దేవతలచే బ్రార్థితుఁడై మున్ను వేయి యధ్యాయములు గల గ్రంథము నొకదానిని రచించె ననియు, నదియే త్రివర్గశాస్త్ర మనుపేరఁ బఱగె ననియుఁ జెప్పుచున్నాఁడు. ఇఁకఁ దర్వాతి శ్లోకములు సులభముగా త్రివర్గశాస్త్రముల పరిణతిని వివరించునని తెలియఁగలరు.

శ్లో. ఏత త్తె రాజధర్మాణాం నవనీతం యుధిష్ఠిర,
బృహస్పతి ర్హి భగవా న్నాన్యం ధర్మం ప్రశంసతి
విశాలాక్ష శ్చ భగవా న్కావ్య శ్చైవ మహాతపాః
సహస్రాక్షో మహేంద్ర శ్చ తథా ప్రాచేతసో మనుః
భారద్వాజ శ్చ భగవాం స్తథా గౌరశిరా మునిః,
రాజశాస్త్రప్రణేతారో బ్రహ్మణ్యా బ్రహ్మవాదినః

* * *

యై శ్చైవ రుపాయై శ్లోక స్తు న చతే వార్యవర్తని,
త త్సర్వం రాజశార్దూల నీతిశా స్త్రేభివర్ణితం

*　　*　　*

తత స్తాం భగవా న్నీతిం పూర్వాం జగ్రాహ శంకరః
బహురూపో విశాలాక్ష శ్శివ స్థాణు రుమాపతిః
ప్రజానా మాయుషో హ్రస్వం విజ్ఞాయ భగవా ఞ్ఛివః.
సంచిక్షేప తత శ్శాస్త్రం మహార్థం బ్రహ్మణా కృతం
వైశాలక్ష మితి ప్రోక్తం త దింద్ర స్సముపద్యత
దశాధ్యాయసహస్రాణి సుబ్రహ్మణ్యో మహాతపాః
భగవా నపి త చ్ఛాస్త్రం సంచిక్షేప పురందరః.

*　　*　　*

అని యిత్యాదిగా నందు బ్రహ్మ శివుఁడు ఇంద్రుఁడు బృహస్పతి శుక్రుఁడు మున్నగువా రెల్ల రు సంగ్రహించి ప్రత్యేక శాస్త్ర గ్రంథములఁ గూర్చి రనియు, వానికి అందుచే విశేషసంజ్ఞలు కలిగిన వనియును చెప్పఁబడినది. కౌటిల్యుఁడు ఈకథను సమగ్రముగా నెత్తికొనక యున్నను, సూచనగాఁ జెప్పియు నాయాయి సందర్భములలోఁ బైనిపేర్కొన్నవారి యభిప్రాయములను నచ్చటచ్చట నుద్ధరించియు నున్నాఁడు. ఇట్లే వాత్స్యాయనుఁడును రాజశేఖరుఁడును కూడ పూర్వాచార్యులను వారొనర్చిన గ్రంథభాగములను తదభిప్రాయములను ఉద్ధరించి యున్నారు. ఈక్రింది పట్టికఁ జూచినచో సూత్రగంథము లయును, తద్గ్రంథకర్తలయును, వివరములు విస్పష్టము కాఁగలవు.

## సూత్రకర్తృతద్గ్రంథాదివివరములఁ దెల్పుపట్టిక.

### (౧. భారతము ప్రకారము)

| నంబరు. | సూత్రకర్త. | గ్రంథముపేరు. | శ్లోకసంఖ్య. |
|---|---|---|---|
| 1 | బ్రహ్మ | త్రివర్గశాస్త్రము | 100000 |
| 2 | శంకరుఁడు | వైశాలాక్షము | 10000 |
| 3 | ఇంద్రుఁడు | బాహుదంతికము | 5000 |
| 4 | బృహస్పతి | బార్హస్పత్యము | 300 |
| 4 | శుక్రుఁడు | భార్గవీయము | 1000 |

### (౨. వాత్స్యాయనసూత్రముల ప్రకారము.)

| నంబరు. | సూత్రకర్త. | గ్రంథముపేరు. | శ్లోకసంఖ్య. |
|---|---|---|---|
| 1 | బ్రహ్మ | త్రివర్గసాధనము | 100000 |
| 2 | మనువు, (స్వాయంభువ) | ధర్మాధికారికము | |
| 3 | బృహస్పతి | అర్థాధికారికము | |
| 4 | నంది | కామసూత్రము | 1000 |
| 5 | శ్వేతకేతువు | ,, | 500 |
| 6 | పాంచాల బాభ్రవ్యుఁడు | ,, | 15 |
| 7 | దత్తకుఁడు | వైశికాధికరణము | |
| 8 | చారాయణుఁడు | సాధారణాధికరణము | |
| 9 | సువర్ణనాభుఁడు | సాంప్రయోగికాధికరణము | |
| 10 | ఘోటకముఖుఁడు | కన్యాసంప్రయుక్తకము | |
| 11 | గోనర్దీయుఁడు | భార్యాధికారికము | |
| 12 | గోణికాపుత్రుఁడు | పారదారికము | |
| 13 | కుచుమారుఁడు | ఔపనిషదికాధికరణము | |

## (3. కావ్యమీమాంస ననుసరించి.)

| నెం. | సూత్రకర్త. | గ్రంథము పేరు. | అధ్యాయ సంఖ్య. |
|---|---|---|---|
| 1 | బ్రహ్మ | కావ్యవిద్య | 18 అధి |
| 2 | కావ్యపురుషుఁడు | కావ్యమీమాంస | కరణ |
| 3 | సహస్రాక్షుఁడు | కవిరహస్యము | ములు |
| 4 | ఉక్తిగర్భుఁడు | ఔక్తికము | |
| 5 | సువర్ణనాభుఁడు | రీతినిర్ణయము | |
| 6 | ప్రచేతాయనుఁడు | అనుప్రాసికమును | |
| 7 | చిత్రాంగదుఁడు | చిత్రప్రకరణము | |
| 8 | శేషుఁడు | శబ్దశ్లేషము | |
| 9 | పులస్త్యుఁడు | వాస్తవము | |
| 10 | ఔపకాయనుఁడు | ఔపమ్యము | |
| 11 | పరాశరుఁడు | అతిశయము | |
| 12 | ఉతథ్యుఁడు | అర్థశ్లేషము | |
| 13 | కుబేరుఁడు | ఉభయాలంకారికము | |
| 14 | కామదేవుఁడు | వైనోదికము | |
| 15 | భరతుఁడు | రూపకనిరూపణీయము | |
| 16 | నందికేశ్వరుఁడు | రసాధికారికము | |
| 17 | ధిషణుఁడు | దోషాధికరణము | |
| 18 | ఉపమన్యువు | గుణోపాదానికము | |
| 19 | కుచుమారుఁడు | ఔపనిషదికము | |

వ. రా:— రాజశేఖరుని పట్టికలో గ్రంథసంఖ్య నీయలేదు. ఇంక కాటిల్యుఁడు యుక్తిగా గ్రంథకర్తల పేర్లనే చేర్పక మారు పేర్లు పెట్టి దాట్లు వైచినాఁడు. రాజశేఖరుని పట్టికలో సువర్ణనాభకుచుమారులను పేర్లు వాత్స్యాయనుని పట్టికలో గూడ కనిపించుచు నున్నవి. వారు వీరగుదురో కారో నిరూపింపవలసినది చారిత్రకులుగదా?

కావ్యమీమాంసశైలి-తర్వాతిగ్రంథకర్తలు.

సంస్కృతవాఙ్మయమున సూత్రయుగపుశైలి మిక్కిలియు మనోహరమై జీవకళతో విలసిల్లుచునుండును. మధ్యకాలపు ఎగుడుదిగుడు చేద్రాళ్లవంటి సమాసములు గాని, చివఱియుగపు కర్తవ్యభోక్తవ్యాది పేలవ మగు చప్పు చుప్పుసంస్కృతపదరచనము గాని, అం దుండదు. కమ్మియచ్చున బంగారుతీగను లాగునపుడు గంభీరమై సమమై పరపుగలిగి విశదమై ఆకర్షక మగునట్టి తేజశ్శక్తి ఎట్లు కలిగియుండునో, ఇదియు నట్టి గుణములు గలదియై, ఆకాలపు (అనఁగా సూత్రయుగపు) వాఙ్మయము విలసిల్లుచు, చదువరులకు నేఁడును జీవద్భాషయే సంస్కృత మనిపించుచు నుండును. ఈవిషయమును నిర్ధారణ సేయుటకు ఆపస్తంబబోధాయనగౌతముల ధర్మసూత్రములను గాని, లేక గృహ్యసూత్రములు మున్నగువానిని గాని, వాత్స్యాయనుని కామసూత్రములు కౌటిల్యుని అర్థసూత్రములు మున్నగువానిని గాని, ఏమాత్రమైనను సావకాశబుద్ధితోఁ బరికించినఁ జాలును. రాజశేఖరుని కావ్యమీమాంస సూత్రవాఙ్మయపు యుగమునాటిది కాకపోయినను, శైలివిషయమునఁ బైవాని కేమాత్రము దీసిపోవఁగాఁ జాలదనుట నిస్సందిగ్ధము.

రాజశేఖరుని కావ్యమీమాంస యాతనితర్వాతి కవులకును నాలంకారికులకును మార్గదర్శక మనుట కెట్టి సందియమును లేదు. హేమచంద్రుఁడు తన కావ్యానుశాసనమునందు 17,18 అధ్యాయములను ఇందుండి ఆశ్లేచేర్చికొ

ని యున్నాఁడు. ఇట్లే నేమికుమారుఁడగు వాగ్భటుఁడును ఆకావ్యానుశాసనమునుండి 1, ౫, అధ్యాయముల నచ్లోఁ గైకొన్నాఁడు. కవిశిక్షవ్రాసినగ్రంథకర్త, క్షేమేంద్రుఁడు అమరుఁడు (కవికల్పలత) వినయచంద్రుఁడు దేవేశ్వరుఁడు నట్లే చేసినారు. సరస్వతీకంఠాభరణమునందు కావ్యమీమాంసయందలి 5, 6, శ్లోకము లుపలబ్ధము లగుచున్నవి. వ్యాఖ్యాతయగు రత్నేశ్వరుఁడు అందొకటి కావ్యమీమాంసలోని దని తెల్పుచున్నాఁడు. ఇట్లే రసచంద్రి కావ్యాఖ్యానము నందును కూడఁ గల వఁట.

వేదాంగములలోఁ గావ్యవిద్య నేడవదిగా రాజశేఖరుఁడు పరిగణించుచున్నాఁడు. ఇట్టులనే విద్యాస్థానములఁ బరిగణించునపుడును, కావ్యమును పదునైదవవిద్యాస్థానముగాఁ బరిగణింపవలె ననుచున్నాఁడు. కావ్యమీమాంసయందుఁగల అద్భుతములలో కావ్యపురుషోత్పత్తినిగుఱించియును, రీతిబోధకముగా సాహిత్యవధువు అతనినను సరించుటఁ గుఱించియును జెప్పినకథ యొక్కటి. దీని కసలు ఆధార మెయ్యదియో చదువరులు నిర్ణయింపఁ దగుదురు.

రాజకవుల కవితాగోష్ఠిని రాజశేఖరుఁడు నిరూపించినంత విపులముగా మఱియే యాలంకారికులును వివరింపఁగా లేదు. (చూడుము-202 వ పేజిలో రాజు కవిస్యాత్ అనునది మొదలుకొని ఆయధ్యాయము చివఱవఱకు.) ఈవర్ణనము వాత్స్యాయనుఁడు వర్ణించిన నాగరకవృత్తములోని ఘటాగోష్ఠినిబంధనాదుల వివరించుగ్రంథముల

డాదాపు తులఁదూగుచున్నది. తెలుగుకవులలో పెద్దన చాటు విట్టివిధానమును జ్ఞప్తి చేయుచున్నయది-ఈ కవి. కావ్యమీమాంసలోని వర్ణనఁబట్టి ఆకాలపు కవిత్వపరీక్షమున్నగువృత్తాంతములు అందు తీర్ణు లగువారి కేర్పఱచినట్టి బిరుదములందు త్తీర్ణులయిన సుప్రసిద్ధకవులు మొ॥ మనకు విశదమగుచున్నవి. ఇట్టి కవితాగోష్ఠులు ఆకాలముననుజ్జయినిలో జరిగెడివనియు,అందు కాళిదాసమేంఠులు అమరరూప సూర భారవులును, హరిచంద్రగుప్తాదులుఁ బరీక్షితులైయు త్తీర్ణత నొందిరనియు, రాజశేఖరుఁడు తెల్పుచున్నాఁడు. మగధదేశములో శిశునాగుఁడను రాజును,కుంతలములలో శాతవాహనుఁడనురాజును, ఉజ్జయినియందు సాహసాంకుఁడు నిట్టిపరీక్షాస్థానముల నెలకొల్పుటయేగాక వారు సంస్కృతప్రాకృతాది భాషలఁ బోషించిరనియుఁ దెల్పుచున్నాఁడు.

ఇవిగాక, కొందఱు కవులు మున్నగువారి వృత్తాంతములఁగూడ నితఁడు తెల్పుచున్నాఁడు. మేధావిరుద్రుఁడు కుమారదాసు మున్నగుకవులయును శిశునాగుఁడు కువిందుఁడు మున్నగురాజుల వృత్తాంతములను మాత్రమేగాక, ఆకాలపు లేఖనసామగ్రిమున్నగు ననేకాపూర్వవిషయములను కూడ ఇతఁడు పేర్కొనుచున్నాఁడు.

### రాజశేఖరుని బహుజ్ఞత.

రాజశేఖరకవి బహుగ్రంథనిష్ణాతుఁ డనుటకు ఇందు చక్కని యవకాశములు గలవు. రామాయణము

మహాభారతము, భగవద్గీత, రఘువంశ కుమారసంభవ ములు, విక్రమోర్వశీయము, శాకుంతలము, కిరాతార్జునీయము, జానకీహరణము, కాదంబరి,హయగ్రీవవధ,మాలతీమాధవము, మయూరకవి సూర్యశతకము, వేణీసంహారము, శిశుపాలవధ, మహానాటకము, మహిమ్నస్తోత్రము, ఈ మొదలగు పెక్కుగ్రంథములనుండి యీకవియుద్ధరించి యుదాహరించిన యిందలి శ్లోకము లీవిషయమును నిరూపింపఁగలవు. ఇవిమాత్రమేగాక, ఆలంకారికులలోనుసురానందసోమదేవ వామనోద్భటులవియును, అపరాజితి, గ్రాహిణి, రుద్రట కాళిదాసవాక్పతిరాజులవియును అవంతిసుందర్యానందవర్ధనాదులవియును, పెక్కుసిద్ధాంతములను రచనలను ఈయన తన యీగ్రంథమునం దుద్ధరించి ప్రదర్శించినాఁడు. వీ రందఱు తొమ్మిదవ శతాబ్దికిఁబూర్వులే యనుట నిస్సంశయము. రాజశేఖరకవి తన జన్మస్థలమగు కనౌజుప్రాంతము నిందు పలుసారులు స్మరించి బహూకరించుచున్నాఁడు ఇట్లే బాలరామాయణాదులందును గలవు. అన్యోన్యఘట్టముల సమీకరించినచో ఇది స్పష్టము కాఁగలదు.

కావ్యమీమాంస-భూగోళపరిచయము.

ఈమహాకవి ఆర్యావర్తమును పూర్వదేశము దక్షిణాపథము పశ్చాద్దేశము ఉత్తరాపథము మధ్యదేశ మని

విభజించి, అందొక్కొక్క దేశములోని ఇతర దేశములను నదులను పర్వతములను అచ్చటనుత్పత్తియగువస్తువులను పేర్కొన్నాఁడు. దీనివలన నాకాలపు భూగోళవిషయములు నెఱుకపడఁగలవు. (చూడుము 360 పేజి మొదలు 363 వఱకు) రాజశేఖరుని కావ్యమీమాంసయం దివ్విధముగా ననేకములగు నపూర్వవిషయములఁ జదువరులు చూడవచ్చును. ఇఁకను ఈ కావ్యమీమాంసయందలి యొక్కొక్క ప్రకరణమునుగూర్చి విరివిగాఁ జర్చించవనిది యీపీఠికను ముగింపఁ జాలము. కాని చాలినంత వ్యవధియును ప్రజ్ఞాపారమితత్వము నాకు లేనందున నిట సూక్ష్మముగఁ బ్రస్తావింతును.

## కావ్యమీమాంస - ప్రకరణపరామర్శ.

ఈకావ్యమీమాంసయందు ఆయా యధ్యాయముల ప్రారంభమునందే అధ్యాయవిషయములు సంగ్రహరీతిని వ్రాసియున్నాను. దానినే చదువరులు నాయాయధ్యాయవిషయముల నెఱుంగఁ గల్గుదురు. అయినను సంగ్రహపద్ధతి నిచట దిఙ్మాత్రముగఁ బ్రకరణపరామర్శఁ గావించుకొందము. ౧ వ యధ్యాయమునందలి విషయములు ఈవఱకే ప్రస్తావింపఁ బడినవి. రెండవయధ్యాయమున శాస్త్రనిర్దేశ మనెడి పేరున, వాఙ్మయవిభా

గములు చాలఁ జక్కఁగ నిరూపితములై యుదాహరింపఁ బడినవి. ఇందు ద్రౌహిణి, ఆచార్యులు యాయావరీయుఁడు, ఔశనసులు, బార్హస్పత్యులు, కౌటిల్యుఁడు, మున్నగువారి మతభేదములును, సూత్రభాష్యాంతర్భాష్య సమీక్షాటీకాదుల నిర్వచనములును, చక్కఁగా నుట్టంకింపఁ బడినవి. మూఁడవది కావ్యపురుషోత్పత్తినిఁ గూర్చినది. ఇదియు నీవఱకే చర్చింపఁబడినది.

నాలవది పదవాక్యవివేకముం గూర్చినట్టిది. ఇందు కావ్యవిద్యాభ్యాసమున కనుశాస్యులు కాఁదగిన వారి లక్షణములు, ప్రతిభావ్యుత్పత్త్యాది నిర్వచనములు తద్భేదములు వాని ననుసరించిన కవిభేదములు భావుకత్వాది నిర్వచనములు, విమర్శకులును పండితులును విద్యాసక్తులగు నితరులును మననము చేయఁదగిన ఘట్టములు. ఆయిదవదానియందు వ్యుత్పత్తిప్రతిభల తారతమ్యములు మున్నగునవి మనోరంజకములు. ఆరవదానిలోఁ గల కావ్యపాకకల్పములు నేటి యాంధ్రదేశపుకవు లెల్లరును ముఖ్యముగాఁ జదివి విమర్శించుకొనఁదగినవి. 7 వ దాని లోఁగల కావ్యార్థయోనులును తదుదాహరణములును వానిపైఁగలచర్చలును,ఆనాఁటి విద్వద్గ్రంథకర్తలయొక్క బహుగ్రంథనిష్ణాతృత్వమును విపుల మగు వాఙ్మయపరి

శోధనమును నిష్కాశ్శికములగు సిద్ధాంతములను వెల్ల డించుచున్నవి.

తొమ్మిదవదానిఁ గవులలోఁగల దివ్యమానుషా దు లగు భేదములు, తత్కారణములు, సోదాహరణము గా నిరూపింపఁ బడుటయే గాక, ఆయాకవుల వర్ణనముల లోఁగల సరిత్సాగరాదివర్ణనల రసవత్తలు సయితము చ క్కగా నుదాహృతము లయి చర్చింపఁబడినవి. పదియవ యధ్యాయము ఈగ్రంథమున కంతటికిని ఒకవిధముగా నాయకమణి యనఁ దగును. కావ్యవిద్యల పరిసంఖ్యాన మును కావ్యమాతృకల పరిగణనమును మిక్కిలి యుదా రములుగా నిందు రూపించుటయే గాక, కవియొక్క ఆధ్యాత్మాధిభౌతిక స్థానములు, త్రికరణవిశుద్ధి, సహాయ సంపద, గృహనివాసప్రదేశాదుల యుజ్జ్వలత్వము, భాషా నియమములు, తాత్కాలికములగు వివిధదేశాచారవ్యవహా రాదులు మున్నగునవి నిరూపింపఁ బడినవి. ఇందు స్త్రీ రత్నములకును గూడ మహోన్నతస్థాన మొసంగఁబడి నది. కవిత్వము చెప్పినంతమాత్రాననే గాక అది సఖ్యా తుండుటకును వ్యాప్తినందుటకును నిందు చర్చింపబడిన రీతులు చాల నానందజనకములును, నేటిగ్రంథకర్తలకుఁ బరిశీలనార్హములు నై యున్నవి. మఱియు నప్పటికవి సమాజములు కావ్యశాస్త్రపరీక్షకసభలు సన్మానముల

రీతులు, ఆనాఁటి ఆర్యజాతీయతను చక్కఁగా నుద్బోధిం చి, నేఁడును దేశారాధకులను వాఙ్మయారాధకులను నందుల కై ప్రోత్సహింపఁ జాలి యున్నవి.

పదియవ యధ్యాయము వలెనే 11, 12, 13 అధ్యాయములును మిక్కిలియును ముఖ్యములు. అందు నను నేఁ డన్ని విధములను పతితదశలోఁ బడి కొట్టుకొను చు నౌచిత్యమును గాని రసభావాదిసంపదను గాని యెఱుఁగు కొనఁజాలక తొట్టుపాట్టాడుచు నున్న గ్రంథకర్తల మగు మాబోంట్లకు, సర్వథా ఇది పాఠ్యముగను మన నార్హము నై యున్నయది. ఇందులో నేఁటికాలమున మనలో ననేకులము నిర్వచించి సిద్ధాంతీకరింపఁగా జాలని శబ్దహరణము, అర్థహరణము, వృత్తహరణము, అందలి భేదములు మున్నగువివయము లత్యంతము మనోరంజకములుగా సోదాహరణముగా సుసిద్ధాంతముగా నిరూపింపఁబడినవి. 12 దానిలో అర్థహారణముఁ గూర్చినచర్చలును తద్వివరములును బింబప్రతిబింబకల్పాదులును వాఙ్మయారాధకుల కుపాస్యము లగు నిత్యఘట్టము లనుట నిస్సంశయము. ఇట్టులనే ఆలేఖ్యప్రఖ్యాదివిషయముల వివరించు 13 వ యధ్యాయమును నసామాన్యప్రసిద్ధి నొందవలసినట్టి దనుట నిక్కము.

ఇఁకఁ బదునాల్గవది కవిసమయలక్షణములను నందలి భేదములను వివరముగా రూపించునది. ఇట్లే 15, 16, అధ్యాయములును కవిసమయములలోఁగల గుణభేదములు తదుదాహరణములు తద్వివరములు మున్నగువానితో నిండి,చదువరులను సులువుగా వాఙ్మయమహోదధిను త్తరించుటకు కర్ణధారత్వమును వహించుచు నున్నవి. 17 వ యధ్యాయము లోకములు లోకాంతరములు ద్వీపసముద్రాదులు వర్షములు వర్షపర్వతాదులు నవద్వీపములు ఆర్యావర్తము తద్భేదములు తద్గత నదీనదపర్వతవివరణములు, అందందు నుత్పత్తియయ్యెడి వస్తువిశేషములు,మున్నగువానిని వివరించుచుఁ బ్రాచీనకవులయు,గ్రంథకర్తలయును, భూగోళవిజ్ఞానమును లోకజ్ఞతను వేయినోళ్లఁ జాటుచు, నిప్పటికాలమునంగల కొందఱు మాలోఁటి కూపకూర్మములాంటి గ్రంథకర్తలకుఁజక్షూన్మీలమును బ్రాచీనవిజ్ఞానాభిమానమును కల్గింపఁజాలియున్న దనుట నిస్సంశయము.

ఇఁక బదునెన్మిదవ యధ్యాయము మిగిలినది. ఇందుఁ గల సౌరచాంద్రమానాది కాలములయు, ఋతువులయు విచారణమును దిగ్విదిగాదుల విమర్శలును ఆయా ఋతువుల స్వరూపస్వభావాదులును తదనుసారములుగా కవు లనుసరింపఁ దగినట్టి ఋత్వవస్థావర్ణనాదులును వాని

యుదాహరణములును పుష్పోపయోగాదులును అంత ర్వ్యాజాదు లగు ఫలభేదనిరూపణములును బ్రతియొక్క గ్రంథకర్తయుఁ గవియు, నాజన్మము మనఃపథమున నెల కొల్పఁ దగినట్టివి. ఇట్టి గ్రంథము బహుగుణము కలదియై యున్నది. దీనిని ఆంధ్రుల యుపయోగమునకై నావంటి యప్రాజ్ఞుఁడు గాక ప్రాజ్ఞశేఖరు లితరు లెవరైన నైన చో, అనంతవిషయరత్నములతో నలంకరించి ఆంధ్రవా ఙ్మయమున కనిర్వాచ్యమగు శోభను తెచ్చి యుండెడి వారు. కాని ఆంధ్రవాఙ్మయమున కట్టి యదృష్టపు రోజు లు రాలే దనుకొనవలసి వచ్చుచున్నది. ఏల యనఁగా ప్రజ్ఞాధికులు గాఢమగు నుపేక్షాభావము వహించి యుం టయు, మాధ్యమికులు సాహసింపజాలకయు, కడజాతి వా రికి శక్తిచాలని ఉత్త ఉత్సాహము౦డియుఁ బ్రయోజనము లేక యుంటయు, నిందులకుఁ బ్రధానము లగు కారణము లని నాయభిప్రాయము.

## కృతజ్ఞతాభివందనములు.

ఈ గ్రంథమును ముద్రించుటలోఁ దగినంత స్వాస్థ్య ము తోడ్పాటు ప్రజ్ఞావిభవము లేనందుచేత ననేకములగు అచ్చుతప్పులును ఆంధ్రీకరణవ్యత్యయములును దొరవిన వనుట నిక్కము. వానిని చదువరులు కరుణతో సవరిం

చుకొన్నచోఁ బెక్కు కృతజ్ఞతాభివందనముల నొనర్పఁ గలను. నానియమము ననుసరించి మూలగ్రంథమును కూడ ముద్రింపవలసి యున్నది. అయినను కాపీరైటు హక్కులకై కాట్లాడు నీకాలమున గైక్వాడ్సు ఓరియంటల్ సిరీసు వారి యనుమతి లేకుండ ముద్రించుటకు సాహసము చాల దయ్యెను. పైఁగా సేకరించుకొన్న బత్తెము కూడ నై పోయినది. కనుక రిక్తహస్తుఁడనై చేయునది లేక యింతతో మన్నింపుఁడని పాఠకుల కంజలిపట్టుచున్నాఁడను.

గ్రంథముద్రణకాలములో నాకుఁ దోడ్పడిన గ్రంథకర్తలకును హితచింతకు లగు సోదరులకును ముద్రణాలయమునందలి కార్యకర్తలకును అనేకముగఁ గృతజ్ఞతాభివందనములు. గ్రంథము ననువదించుటలోను పీఠికను వ్రాయుటలోను బరోడావారిపరిశ్రమమే నాకుఁ బ్రధాన సాధనముః గనుక వారియెడఁ గృతజ్ఞుఁడను. విమర్శకులగు విద్వాంసులు నాయీ ప్రయత్నము కేవలోత్సాహపూరితమగు నాంధ్రభాషాభివృద్ధిప్రయోజకమని తలంచి, నా చేసినతప్పులను నిస్సందేహముగ వెల్లడించి యాంధ్రవాఙ్మయమునకు మేలు సేయుదు రని, దోషోద్ఘాటనము చేయుటలో వెనదీయక యుందు రని. నాయాశ వారు దీని నొనర్చి నా కొక్కింత ఆనందముఁగూర్చుటకై అభ

్ధ్ర దేశపు విద్వద్విమర్శకబృందమునకు వేఁడికోలు. కనుక గుణజ్ఞు లగు పాఠకులే స్వయముగా నిందుఁగలగుణదోష ములను చర్చించి నిరూపింపఁగల రను తలంపుతో పూర్తి యగు విషయవిమర్శనము చదువరులకు వదలి ఈపీఠికను నింతతో నుజ్జగించుచున్నాఁడను.

మద్రాసు. }
30 ఏప్రెలు 1930. }

విధేయుఁడు,
పం॥ ఆదినారాయణశాస్త్రి.

# ప్రకటన

## ఆర్యభారతీగ్రంథమాలిక.

పరశువాకం, మద్రాసు.

### నియమములు - నిబంధనములు.

ఈగ్రంథమాలికయందు—సంస్కృతాదులగు వాఙ్మయములనుండి సాహిత్యశాస్త్రీయసంబంధములగు గ్రంథములు ప్రకటింపబడును. ప్రతిగ్రంథమును సమూలముగ సవ్యాఖ్యగను, విశేషాంశములను చేర్చి తేటతెల్లమగు నాంధ్రవివరణములతో డబుల్ క్రౌను ౮ పేజీల సైజున గ్లేజుపేపరులో, ౫౦౦ పేజీలకు తగ్గని వాల్యూములుగా విలసిల్లుచుండును. గ్రంథములకు ఏర్పరచిన అసలువెలలో చందాదారులు మున్నగువారికి సగముఖరీదునకే ఇవ్వఁబడు చందాదారులుగాని, పోషకులుగాని, సహాయకులుగాని మాగ్రంథమాలికకు ఉండనివారి కెవ్వరికైనను పూర్తిఖరీదునకుఁ గాని ఈయము.

### చందాపద్ధతులు.

మా యీగ్రంథమాలికయందు ప్రచురింపబడునట్టి యావత్తు గ్రంథములను కొనుటకు బద్ధులై యుండు

వారినే మేము చందాదారులనుగా పరిగణించెదము. మా చందాదారులు నాలుగు తెఱగులుగా నుందురు.

1. మహారాజపోషకులు:—మా గ్రంథ మాలను స్థిరిక్రై ఒక్కొమారుగా నూఱురూప్యములకు తక్కువగా కుండనిచ్చువారు మహారాజపోషకులు. వీరికి మా గ్రంథములలో నొక్కొక్క ప్రతిని చక్కని గిల్టుబైండు జేసి శాశ్వతముగా మేమే పోస్టేజీభరించి పంపుచుందుము. 2 పోషకులు:—మేము ప్రచురించునట్టి గ్రంథములలో ఒక్కొక్క దానికుందును అయిదేసి ప్రతులచొప్పున కొనువారు పోషకులు. 3. సాహాయ్యకులు:—మూఁడేసి ప్రతులచొప్పున కొనువారు సాహాయ్యకులు. 4. చందాదారులు:—ఒక్కొక్కప్రతి కొనువారు, పోషకులుగా గాని సాహాయ్యకులుగా గాని, లేక స్వాధారణ చందాదారులుగాగాని, అందఱును ఈక్రింది నియమములకు బద్ధులు కావలయును.

## చందాదారుల నియమములు.

౧. ఒక్కొక్క చందాదారును తాను గ్రంథమాలికకు శాశ్వతముగా చందాదారులుగా నుండెద మని యును అప్లికేషన్ ఫారముద్వారా తెల్పుచు, ప్రవేశ రుసుమును [అనఁగా సాధారణచందాదారులు 2 రూ; సాహాయ్యకులు 6 రూ; పోషకులు 10 రూ] ముందుగా చెల్లించి తమ పేరులను రిజిస్టరు చేయించుకొనవలెను. పోషకులుగాని సాహాయ్యకులు గాని చందా

దారులుగాని ఇచ్చు ప్రవేశరుసుము వాపసు ఈయబడదు. ౨. ప్రతిగ్రంథమును తయారుకాగానే చందాదారులకు 20 రోజులు ముందుగా తెలుపబడును. తెలుపగానే ఆయాగ్రంథములకు క్రయమును ముందుగానే మనిఆర్డరు ద్వారా పంపవలయును. అట్లు పంపినవారికి రిజిస్టర్డు పోస్టు ద్వారా గ్రంథములు అందచేయబడును. 3. ఈ గ్రంథమాలికయందు ప్రకటింపబడెడి గ్రంథము లన్నియును తాము కొనుటకు బద్ధులై యున్నామని చందాదారులు స్పష్టముగా ఎఱుంగవలయును. ర. గ్రంథములన్నియును తఱుచుగా డబుల్ క్రౌను 8 పేజీలసైజున డబుల్ కాలముగా ముద్రింపబడుచుండును. అన్నియును కాలికో బైండు చేయబడును. ౫. ప్రతిచందాదారును ప్రత్యేకమగు అప్లికేషన్ ఫారముపై చేవ్రాలుచేసి పంపవలయును.

---

[ఇంతవరకు సిద్ధములైన గ్రంథములు.]

## ౧. గౌతమధర్మసూత్రములు.

[వెల రూ 9—చందాదారులకు రూ 4-8-0.]

ఇత్యాది సూత్రరూపముననున్న ఆర్యులధర్మ సూత్రగ్రంథములలో నెల్ల మొట్టమొదటిది. చతుర్విధములగు పురుషార్థములలో మొట్టమొదటిదగు ధర్మమును చక్కగా బోధించునట్టి యుత్తమోత్తమ మగుగ్రంథము. ఆర్యులయొక్క సాంఘికవ్యవస్థలను ఆచారవ్యవహారములను

విద్యోపార్జనాదు లగు వ్యవస్థలను రాజ్యపాలనాది చారిత్రిక విషయములను గురుశిష్య ప్రవర్తనములు మున్నగు సనాతనములగు విషయముల నియ్యది వివరించును

ఈగ్రంధమును గౌతమమహర్షియొక్క మూలసూత్రములతోను, హారదత్తాచార్యుని రచించిన మితాక్షర వ్యాఖ్యతోను, లలితమగు శైలిలో సంపూర్ణముగా నాంధ్రీకరించిన ఆంధ్రవివరణముతోనుచేర్చి ముద్రించుటయేగాక, 40 అపూర్వగ్రంధములనుండి విశేషాంశములు సయితము ప్రత్యేకించి పిరివిగాఁ గూర్పబడినవి. డబుల్ క్రౌన్ 8 పేజీల సైజులో 600 పేజీలకు పైఁబడి చక్కనిబైండును విపులమగు పీఠికయును గలిగియున్నది.

# 2. వాత్స్యాయన కామసూత్రములు.

ద్వితీయముద్రణము. వెలకు సిద్ధముగా నున్నది. అసలువెల 20 చందాదారుల కైనచో 10 రూ.

అనేకులు—పండితులును, వాఙ్మయపారిశ్రామికులగు పెద్దలు పదేపదే గ్రంథములు పంపు మని నిర్బంధించుటచేత వారి ప్రార్థనకు వశులమై ఈద్వితీయముద్రణమును ముద్రించినాము. గ్రంథము విలువయును యోగ్యతయును ఆంధ్రదేశమునందలి ప్రతియొక్కరును ఎఱింగియుండుటచేతను దీనిని గుఱించి విశేషించి వ్రాయు నవసర ముండదు. కనుక భాషాభిమానులగు పండితులును తదితరులగు భాషాపారిశ్రా

విఃషులను అన్వేషకులను యథాశక్తి మాగ్రంథమాలికకు చందాదారులై తోడ్పడఁ గోరుచున్నాము. 500 పుస్తకములే ముద్రింపఁబడినవి. విద్వాంసులు భాషాపారిశ్రామికులు చారిత్రికాన్వేషణముచేయు సజ్జనులు తప్ప ఇతరుల కెవ్వరికిని ఎంతమూల్యము నొసగినను ఈ గ్రంథమును విక్రయించుటగాని, మఱిఇతరవిధములగాని ఈయము. గ్రంథమును చక్కగాసంరక్షించుకొని దుర్వినియోగమునకు తావీయ మని వ్రాతమూలకముగా వ్రాచి యిచ్చినవారుమాత్రమే ఈగ్రంథము కొఱకై అర్డరులను బుక్కుచేసికొనవలెను. ఆర్డరులను బుక్కుచేసికొనుటకై వారు వ్రాఁచీపత్రముతోఁగూడ ముందుగానే పూర్తిసొమ్మును మనిఆర్డరుద్వారా, పంపవలసియుందురు. అట్టి ఆర్డరులకే తావీయఁబడును.

## ౨. కావ్యశేఖరుని కావ్యమీమాంస.

వెల రూ 3. చందాదారులకు రూ 1-౮-0

ఇది అత్యద్భుతమగు సాహిత్యవిమర్శన గ్రంథము. ఇంతవఱకు ఏదేశభాషలలోను ప్రచురింపఁ బడలేదు. కవులు, గాయకులు, విమర్శకులు, వ్యాసకర్తలు, అష్టావధానులు, శతావధానులు, ఇంతయేల ? గ్రంథకర్తలు కాఁగోరువా రెల్లరును చదువదగిన మహోత్తమ మగు గ్రంథము. దీనినిఁగుఱించి మేమై విస్తరించి చెప్పుటకంటె చదువరులే స్వయముగా తెప్పించి చదువుట మంచిది.

పాఠశాలలు కళాశాలలు మొదలైనవాటిలో చదువు విద్యార్థులును, స్త్రీలును, గ్రంథమునుగాని గ్రంథస్థములగు విషయములనుగాని సంరక్షణచేసికోఁ జాలని ఇతరులును, ఈగ్రంథమునకు ఆర్డర్లు పంపవలదు.

గొప్ప తగ్గింపు ధర:—

ఈ మేనెల ఆఖరులోఁగా మాయీ ఆర్యభారతీగ్రంథమాలికకు చందాదారులుగా చేరువారికి మాగ్రంథములన్నియు గొప్ప తగ్గింపుధర కీయబడును. గౌతమధర్మసూత్రములు రూ 4-8-0లు, కావ్యమీమాంస రూ 1-8-0 లు, ప్రవేశకుసుమ రూ 2-0-0 లు, వాత్స్యాయనము రూ 10-0-0 లు, మొత్తము 18-0-0 లయినను సదరు అన్ని గ్రంథములను కలిపి మొత్తముగా రూ 15-0-0 లకే పోస్టేజీ మేమే భరించి పంపెదము. కనుక క్రొత్తగా చందాదారులగువారి కిదిచాల సౌకర్యము. దీనిని దాటిపోనీయకుండ మీరును మీమిత్రులును వెంటనే చందాదారులుగా చేరుఁడు.

అన్నివిధము లగు నుత్తరప్రత్యుత్తరములకు అడ్రెస్—

పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి,
ఆర్య భారతీ గ్రంథ మాలిక.
పరశువాకం, మద్రాసు.